

గానూ మాట్లాడుతున్నాను. ఆయన అన్నమాటలన్నింటికి సూటిగా సమాధానాలుకూడా చెపుతున్నా. ఆయన మనస్సుకు ఎంతో సంతోషంగావుంది. అదే నా సంతోషము. నిజంచెప్పి ఆయన్ను కష్టపెట్టటంలో అర్థంలేదు. అసలు అలాంటి నిజం చెప్పనుకూడా చెప్పకూడదు. ఒకసత్యాన్ని బయటపెడితే నలుగురికీ ఉపయోగంగానూ సంతోషంగానూ వుండాలి. అందరూ హర్షించేటట్లుండాలి. అంతేగాని కేవలం నిజంగాబట్టి చెప్పితీరాలి అని నేను అనుకోను.

ఇప్పుడు నా మనస్సులో యే కోరికాలేదు. ఏ తాపమూలేదు. ఏ ఆరాటమూ లేదు. శ్రీధర్ అంటే ప్రత్యేకంగా నాకు మక్కువేంలేదు, ద్వేషమూలేదు. నా రహస్యాలన్నీ తెలుసుకుని నన్ను చులకనచేసిన మనిషితో నా కేసంబంధమూ లేదు. అతన్ని నేను పెళ్ళిచేసుకోవటంలో యేమీ 'థ్రిల్' లేదు. మళ్ళీ అతను నాకు ఫోన్ చెయ్యనూలేదు, నేనూ చెయ్యలేదు. నాకు అవసరంలేదు, అవసరం వుందీ అని అనుకున్ననాడు అతను దొరకనూలేదు. ఇప్పుడతనెవరో నేనెవరో?

డాడీ నా బర్త్‌డేనాడు అట్టహాసంగా నలుగుర్నీ పిలిచాడు, ఎంతోమంది నన్ను ఆశీర్వదించారు, బహుమతులు తెచ్చిపెట్టారు. నేనే రెండుపాటలు పాడాను. నా గొంతుక బాగుందని అందరూ మెచ్చుకున్నారు. ఆనాడు కట్టుకున్న చీరె నాకు చాలా అందంగా కనిపించింది. నేను చీరకట్టుకుంటేనే అందంగా వుంటాను. మిగతా డ్రస్సుల్లో అంత బ్యూటీఫుల్‌గా కనిపించను. ఈ విషయము అద్దమే చెపుతుంది. ఇప్పుడిప్పుడే నాకు మంచిచీరలు కట్టుకోవాలని, నలుగురిలో తిరగాలని ఉత్సాహం కలుగుతోంది. అంత పెద్దఇంట్లో నాకు వుండాలని

పించటం లేదు. అసలు ఆ యింట్లోనే నాకు వుండబుద్ధిపుట్టటం లేదు. నాయింటికి నేను వెళ్ళిపోవాలి ! నా యిల్లెక్కడుందో ఏమో! అది మా నాన్నకు తెలుసు. అందుకనే ఆయన నా పెళ్లివిషయం మాట్లాడితే డాడీ అంతా నీ యిష్టం. నువ్వే సంబంధం తెస్తే అదే నా యిష్టం, నీమీద చెప్పలేనంత విశ్వాసంవుంది. నువ్వు తెచ్చిన సంబంధం కాదంటానా అని నా మనస్సులోమాట చెప్పేశాను. నిజాని క్కూడా అంతే. డాడీ చాలామంచివాడు. ఆయన కన్నీ తెలుసు. అందులో నా మనస్సు బాగా తెలుసు. నాకు తగినసంబంధం తెస్తాడనే నమ్మకం నాకు యెప్పుడూ వుంది. ఈవిషయం చెప్పటం తేలికేకాక యిన్నాళ్ళబట్టి యిట్లా వుండి పోయాను. ఏ సంబంధం చేసుకున్నా మా అమ్మ పోలిక నాకు రాకూడదు. మా అమ్మ మాదిరి నేను సంసారాన్ని పాడుచేసుకోను. అంతవరకు నాకు ధైర్యం వుంది.

డాడీ ఎనౌన్స్ చేసాడు రేపే పెళ్ళిచూపులకు వస్తున్నారు అని, నేను చలించ లేదు, నేను మాట్లాడలేదు, ఆశ్చర్యపోలేదు, సిగ్గుపడలేదు, భయం అంతకంటే లేదు. మామూలుగా ముస్తాబయి కూర్చున్నాను వాళ్లెవరో వచ్చారు. ఎవరొచ్చారో కూడా నేను పట్టించుకోలేదు. తలయెత్తనుకూడా లేదు. కాని నాలో అప్పుడు యెన్నెన్నో వూహాలోచనలు చెలరేగినాయి. గతమంతా ఒక్కసారిగా కళ్లల్లోకి వచ్చి యిట్టే అదృశ్యమైపోతున్నాయి. నేను చదివిన పుస్తకాల్లో నాయికా నాయకలు నన్ను పలకరించి పోతున్నారు. అందరూ తలొకతీరూను. అందులో నేనొకతీరు. నాలాంటి నాయిక ఏ నవల్లోనూ, ఏ కథల్లోనూ యింతవరకూరాలేదు. ఇలాంటి ఆడది వుంటుందని వూహించటం కష్టమే. నిజానికి కొన్నికొన్నికథల్లో యింకా వింత ప్రకృతులు చూశాను కాని అవి అసహజంగా వున్నాయని కొట్టి పారేశాను కాని నా జీవితం చూస్తుంటే అవి చాలా సహజంగా కనిపిస్తాయి. నా జీవితమంతా యెవ్వరితోనైనా చెప్పినా యెవ్వరూ నమ్మేటట్లుండదు. అయినా నేను యెవ్వరితోనూ, చెప్పను, గత జీవితమంతా నాలోనే యిముడ్చుకుని కొత్త జీవితాన్ని కొత్త కాపురాన్ని సాగిస్తాను, నావిషయం యెవ్వరికీ తెలియకూడదు, తెలియనివ్వను అయితే శ్రీధర్ నామీద కసికొద్దీ పగపడితే నేను చెప్పలేను. అప్పుడుకూడా నేను కాదని అబద్ధం ఆడే ధైర్యం నాకు వుంది. దాఖలాలు లేవు ఆధారాలు లేవు. అతను నామీద పగబట్టి సాధించేదేమీకూడా వుండదు. అతను మగవాడు అతనికి ఎక్కడో యేదో మంచిసంబంధం దొరుకుతుంది. వాళ్లు సుఖంగా వుంటారు. ఈ విశాల ప్రపంచంలో యెప్పుడైనా ఎక్కడైనా కనిపిస్తే

కనిపించొచ్చు, నేను భయపడాల్సిన పనేమీవుండదు. నాకు అండవుంటుంది, రక్షణవుంటుంది. నా ప్రక్కన నిలబడేవ్యక్తినాకు అన్నివిధాల సహకారంగానూ సహాయంగానూ వుంటాడు. ఆయన విశ్వాసం నమ్మకం చలించే పనులు ఏమీ చెయ్యను. నా యింటిని నేను చక్కబెట్టుకోగలను, ఏవోవే మనస్సులో మెదులుతున్నాయి.

ఇంతలోకి డాడీ వచ్చి నన్ను ప్రక్కగదిలోకి తీసుకుపోయాడు. వాళ్ల నిన్ను పాడమంటున్నారు అని నన్ను ప్రాధేయపడుతున్నట్లుగా అడిగాడు. నాకు యితరులముందు పాడటమంటే చెడ్డమంట. నా యిష్టమైతే నేను ఎన్నైనా పాడతాను. అందుకనే నన్ను లోపలికివెళ్ళి నాతో చెప్పటం. నాకు చెడ్డనవ్వొచ్చింది. నేను ఎవ్వరినైనా పెళ్లి చేసుకుంటాను అని చెప్పినతర్వాత యీ పాటపాడటంలో నాకు అభ్యంతరం యేముంటుంది వాళ్ళు పూర్వకాలంవాళ్ళు అందులో నీకు కాబోయే అత్తగారు మరీను, ఆవిడకు సంగీతమంటే మహా యిష్టం, నువ్వు బాగా పాడతావనికూడా చెప్పాను. నీ యిష్టం అంటూ డాడీ ఆపేసాడు.

నాదేం లేదు, మీరు పాడమంటే పాడతాను, మీరు చెప్పటం ఆలస్యం నేను చేస్తాను అన్నాను. మా నాన్న ఆనందానికి హద్దులేదు. ఆయనకు ఆ రోజు మరవలేనిది. నువ్వు పాటపాడుతూవుంటే అతను రానేవస్తాడు. అదిగో వాకిట్లో కారాగింది, వచ్చేశాడు, అతనుకూడ అంటూనే మానాన్న చప్పున అటు వెళ్ళాడు, నేనుకూడా వచ్చేసి నలుగురి ముందరకూర్చున్నా, ఇదంతా యేదో కథగా వుంది. అయితే కథల్లో ఇలాంటి పరిస్థితుల్లో ఆదివరకు అనుకున్న వరుడే సాక్షాత్కరిస్తాడు. అప్పటికిగాని ముగింపు సార్థకంకాదు. అటు రచయితకూ యిటు పాఠకులకుకూడా సంతృప్తి ఉండదు. ఓ వ్యక్తి తప్పుచేసినతర్వాత పశ్చాత్తాపపడి సక్రమంగా నడచుకోవటానికి ప్రయత్నంచేస్తే నలుగురూ సంతోషిస్తారు. సపోర్ట్ చేస్తారు. నిజంగా సంతోషించాలి, సపోర్ట్ చేయాలి అందుకనే కథల్లో అట్లా ముగింపు వుంటుంది. కాని యిది జీవితం, కథకాదు. నాది అంతా తమాషా జీవితం కాని చిత్రంగా నా జీవితంలోకూడ కథమాదిరి ముగింపే వచ్చింది. ఆ వచ్చినవరుడు శ్రీధరే! ఇదే నా అదృష్టం!





# రెండో పిచ్చివాడి కథ

## అరేబియన్ నైట్స్

(గత సంచిక తరువాయి)

మర్నాడు రాత్రి మంత్రి కుమార్తె తిరిగి కథ చెప్పసాగింది

రెండో పిచ్చివాడు సుల్తానుకు తన కథ ఇలా చెప్ప నారంభించాడు:

"మీరు లోగడ విన్న కథలో కంటె కూడా నేను ఇక్కడికి రావటానికి గల కారణాలు మరింత విచిత్రమైనవి. అతను స్త్రీలపట్ల అలక్ష్యంతో చెడితే, నేను అమిత లక్ష్యంవల్ల చెడ్డాను. నా కథ వింటే ఈసంగతి మీకే బోధపడుతుంది.

నా తండ్రిలాగే నేనూ వర్తకుణ్ణి. నాకు పెద్ద బజారులో ఒక దుకాణం ఉండేది. అందులో నేను స్త్రీలకు పనికి వచ్చే ఖరీదైన కంకణాలూ ఇతర ఆభర

జాలూ అమ్మేవాణ్ణి నా ఈ కథ ఆరంభమయేనాటికి నా వయసు పదహారేళ్ళు మాత్రమే. అయితే అప్పటికే నాకు నిజాయితీపరుణ్ణి అన్న ఖ్యాతి ఉండేది బేరానికి వచ్చిన స్త్రీలతో నేను మాట్లాడేవాణ్ణికాను, వాళ్ళను కన్నెత్తి చూసేవాణ్ణి కాను ముస్లిమ్ స్త్రీలకట్ల "గ్రంథం"లో చెప్పినట్టు నడుచుకునేవాణ్ణి. మిగిలిన వర్తకులు తమ కొడుకులను నన్ను చూసి నేర్చుకోమనేవారు. ఎందరో స్త్రీలు తమ కుమార్తెలను నాకిస్తామన్నారు. అయితే నేసింకా చిన్నవాణ్ణనీ, ఒక్కడే కొడుకుననీ చెప్పి మా అమ్మ దాట వేస్తూ వచ్చింది.

నేను ఒకనాడు నా వద్ద పుస్తకాలు తణిఖీ చేసుకుంటూ ఉండగా ఒక నీగ్రో పడుచు వచ్చి నన్ను గౌరవంగా పలకరించింది, "ఫలానా వారి దుకాణం ఇదేనా?" అని అడిగింది.

నేను ఔనన్న మీదట అతి జాగ్రత్తగా అటూ ఇటూ చూస్తూ, తన వక్షం నుంచి ఒక కాగితం మడత పైకి తీసి నాకిచ్చి, ''దీన్ని మా దొరసానిగారు ఇమ్మన్నారు. వారు జవాబుకోసం ఎదురుచూస్తూంటారు." అని చెప్పి, ఎడంగా నిలబడింది.

నేను దాన్ని విప్పి చదువుకున్నాను. అందులో నామీద ప్రగాఢమైన కవిత ఉన్నది చివరి పద్యంలో రాసిన వ్యక్తి పేరు శ్లేషించి ఉన్నది.

ఆ ఉత్తరం రాసిన మనిషి ఉద్దేశం నా నీతికి భంగం కలిగించడమేనని భావించి చాలా ఆవేశపడి, ఆ ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చించి, నా కాళ్ళక్రింద తొక్కేశాను. తరువాత ఆ నీగ్రో పడుచు చెవిపట్టుకుని, దవడ పగలగొట్టి, ఒక్కతన్ను తన్ని దుకాణం బయటికి నెట్టేశాను. బయట పడిపోయి ఉన్న ఆ మనిషిమీద పదే పదే ఉమ్మేసి, నా యిరుగు పొరుగు వాళ్లందరూ నా నైతిక వర్తనను కొనియాడటానికి విశ్వప్రయత్నం చేశాను.

"నీతి లేని ముండా, నీతీ జాతిలేని నీ యజమానురాలితో చెప్పుకో!" అంటూ నేను తిరుగుతుండగా, ఇరుగు పొరుగులు నన్ను మెచ్చుకుంటూ, తమ కొడుకులతో, "అల్లా అలాటివాణ్ణి దీవిస్తాడు. దిక్కుమాలిన ప్రణయ కలాపాలను ఎలా దూరంగా ఉంచాలో, అతన్ని చూసి నేర్చుకోండిరా!" అనటం నాకు వినిపించింది.

అయ్యాల్లారా, ఇది జరిగినది నా పదహారో ఏట. ఆనాటి నా ప్రవర్తన ఎంత మొరటుగానూ, అహంభావం గలదిగానూ, కపటంగానూ, బుద్ధి తక్కువగానూ ఉండినదీ. నాకు తరవాత తెలిసి వచ్చింది. ఆనాటి నాప్రవర్తనకే ఈనాడు నాకీ సంకెళ్ళు పడ్డాయనుకోవచ్చు. అయితే ఈ సంకెళ్లకు ప్రత్యేక కారణం

ఉన్న సంగతి మీకే తెలుస్తుంది. శాజాన్ వేరు, రమజాన్ వేరుకదా!

నెలలూ, సంవత్సరాలూ గడిచాయి. నేను యుక్తవయస్కుణ్ణి అయినాను. కాని నాకింకా పెళ్లికాలేదు. ప్రణయానుభవం మటుకు పుష్కలంగా సంపాదించాను. అల్లా సాక్షిగా ఒక భార్యను కట్టుకుందామన్న కోరిక కలిగింది. కలగటమేమిటి? కట్టుకున్నాను కూడా!

ఒకనాటి అపరాహ్ణం, ఒక ప్రేమించదగిన అమ్మాయి అయిదారుగురు తెల్లబానిసలను వెంటబెట్టుకొని, గోళ్ళకు గోరింటాకు పెట్టుకుని, జుట్టు భుజాలమీద పడుతూ, నడ్డి తిప్పుకుంటూ, మహారాణీలాగా నా దుకాణంలోకి వచ్చి, నన్ను ఆప్యాయంగా పలకరించి, "యువకుడా, నీవద్ద మంచి బంగారు, వెండి ఆభరణాలున్నాయా?" అని అడిగింది.

నేను తగినవిధంగా సమాధానం చెప్పిన మీదట ఆమె నన్ను బంగారు అందె కడియాలు చూపమన్నది. దుకాణంలో ఉన్నవాటిలోకెల్లా బరువైనవీ, మంచి పనితనంగలవీ తెచ్చి నేను ఆమెకు చూపాను.

ఆమె దాన్ని తన కాలికి పెట్టిచూడ మనేసరికి, ఒక పరిచారిక వంగి ఆమె పావడ కొంచెం పైకి ఎత్తి, అతి చిన్నదీ, తెల్లనిదీ అయిన మడమను నా కంట పడేటట్టుచేసింది. నేను అందెను ఆమె కాలికి పెట్టాలని చూశాను. కాని నాదగ్గర ఉన్న అందెల్లో ఏవీ అంత చిన్నకాలికి అమరక పోయేసరికి నాకు చాలా చిన్నతనమయింది.

ఆమె నవ్వుతూ, "ఫరవాలేదులే, ఇంకేమైనా చూపించుదువుగాని ముందు చెప్పు! మా ఇంట్లోవాళ్లు నావి ఏనుగు కాళ్లంటారు, నిజమా?" అని అడిగింది.

"నిన్ను, నీ చక్కదనాన్ని అల్లా రక్షించాలి! నీ కాళ్లు చూసి లేళ్లు అసూయతో చావవా?" అన్నాను.

"నేను మరోవిధంగా అనుకున్నాను సుమా! .. మంచి కంకణాలేవైనా ఉంటే చూపించు," అన్నదామె.

నేను ఆమెకోసం చిన్నసైజు కంకణాలనుచూస్తున్న ఇంత సేపూ ఆమెమడమలే నాకళ్ళ ముందు మెదిలాయి.

"ఇవాళ నేను చాలాఅలిసిపోయాను. ఏదీ? చేతికి తొడిగి చూపించు!" అన్నదామె.

ఆమె పరిచారిక చేతులమీది చొక్కా పైకి తీసింది. అది చెయ్యా? హంసమెడ స్ఫటికకంకన్న తెల్లనిది, సున్ననిది! చిన్నచెయ్యి! ముద్దొచ్చే మణికట్టు! ఏం వేళ్ళు! చక్కెర ఖర్జూరపాకం, కల్తీలేని మహదానందం!

నా కంకణాలను. ఆమెచేతికి తొడగాలని చూశాను కాని పిల్లలకోసం చేసినవి కూడా ఆమెకు వదులయాయి. వాటితో ఆమె సుకుమారమైన చేతులు ఎక్కడ కందిపోతాయోనని, వాటిని తీయబోతుంటే, ఆమె మళ్లీనవ్వి,"నీకేం




కనిపించిందోయ్? నా చేతులు అవిటిగాను జాల పాదాల్లాగాను లేవూ? నీటి గుర్రం కాళ్లలాగా ఉన్నాయి కదూ!" అన్నది.

"అల్లా నీ తెల్లని ఒంపులనూ, ఋల్లి మణికట్లనూ, అప్సరసల వేళ్ళ లాంటి ఈ వేళ్ళనూ కాపాడుగాక!" అన్నాడు.

"అయితే, వాళ్ళనేది అబద్ధమేనా? అలా అయితే నాకు మెదగొలుసుల్నూ, స్తనకవచాలూ చూపించు," అని ఆమె అన్నది.

నేను తాగినవాడిలా తూలాతూ నా వద్ద ఉన్న మేలైన గొలుసులూ, స్తన కవచాలూ తీసుకొచ్చాను దాసీది అతి జాగ్రత్తగా ఆమె మెడచుట్టూఉన్న బట్ట తొలగించి, స్తనాలు కనపడేలా చేసింది. ఆహా, ఏమిస్తనాలూ! గులాబీ రంగుగల బంతులజత! నేను ముఖం ప్రక్కకు తిప్పుకొని, "అల్లా! వాటిని కప్పు! కప్పు! నాచు?" అని కేక పెట్టాను.

"ఏమిటది? దండలూ, స్తన కవచాలూ పెట్టిచూడవా? పోనీలే, ఇంతే మైనా తీసుకుంటాను. నేను నల్లగా తొప్పవిట్టలా ఉంటానుగదూ? నా చర్మం గొడ్డు చర్మంలా ఉంటుంది కదూ? లేక మరికొందరు అన్నట్లు, ఎముకల గూడు లాగా, ఎండుచేపలాగా, బల్లపరుపుగా ఉంటావా!" అని ఆమె అడిగింది.

'అల్లా, నీ అందాన్ని, గుప్త సౌంద ర్యాన్ని కాపాడాలి!" అన్నాను.

"నేను పరమ అనాకారినని చెప్పి అందరూ నన్ను మోసం చేస్తున్నారన్న మాట! నీ దగ్గర వడ్డాణా లేమైనా ఉన్నాయా?"

నేను నావద్ద ఉండిన ఉత్తమమైన వడ్డాణాలు - చాలా నాజూకైనవీ, నగిషీ

గలపీ — తెచ్చి, ఆమె పాదాలవద్ద పెటాను.

అలా కాదు, నా నడుముకు పెట్టి చూడు," అన్నదామె.

ఉన్నవాటన్నిటిలోకి చిన్నది తీసి, ఆమె దుస్తులమీదుగా నడుమునకు పెట్ట యత్నించాను. పిల్ల రాజకుమార్తె కోసం చేసిన ఆ వడ్డాణం ఆమెకు వదులయింది! అసలు నడుమంటూ ఉంటేగద! దానికి నాడ పడదే. దాన్ని వర్ణించలేక కవిగాడు కలం కింద పెట్టేస్తాడే! దాన్ని చూసి లేత లోటకూర కాడలు అసూయతో కమిలిపోతాయే!

ఆమె నడుముకు సరిపడే వడ్డాణం చూపలేక నేను హతాశుణ్ణి అయిఉండగా ఆమె, "నేను అష్టావక్రకననీ, నాకు వెనక రెండుగూనిలూ, ముందు రెండుగూనిలూ ఉన్నాయనీ, రెండు మూపురాల ఒంటె లాగా ఉంటాననీ అంటారు, నిజమేనా?" అని అడిగింది.

"అల్లా నీ నడుమునూ, నీ ముందు వెనకలనూ చల్లగా చూడాలి!"అన్నాను.

"యువకుడా, నీ మాటలు నాకు ఆశ్చర్యంగా ఉన్నాయి. మా ఇంట్లో నా నడుము గురించి ఎన్నడూ మంచిగా మాట్లాడరు. నీ దగ్గిర కర్ణాభరణాలూ, పాపటబొట్లూ ఉన్నాయేమో?" అన్నదామె.

ఆమె తన ముఖంమీది వల్లె పైకి ఎత్తింది. ఆ ముఖం పౌర్ణమినాటి చంద్రుడిలాగా ఉన్నది. నాకు ఆమె కళ్ళలో బావిలోనియా వజ్రాలూ, చెక్కిళ్ళలో రత్నభోగి పుష్పాలూ, పెదవులలో నగడాలూ, వాటి సందున ముత్యాలూ కనిపించాయి.

నా శ్వాస నిలిచిపోవటం చూసి ఆమె చిరునవ్వు నవ్వి, "నా అందవికారం నిన్ను కూడా బాధిస్తున్నట్టున్నదే, పాపం! ఎన్నోసార్లు విన్నాను నా ముఖం తోలులాగా ఉంటుందిట! ముఖం నిండా స్ఫోటకం మచ్చలట! కుడి కన్ను పువ్వేసిందిట! ఎడమ కన్ను పొరచేసిందిట! ముక్కు ఉండ చుట్టు మున్నదిట! గొగ్గి పళ్ళుకుట! చెవులు డొప్పలుట! నా చర్మం పొలుసులుకట్టి ఉంటుందనీ, వెంట్రుకలు చింపిరిగా ఉంటాయనీ చెబుతారు'', అన్నది.

నేను దేన్నయినా పట్టుకోందే నిలబడ నేని స్థితిలో "లేండి, రాణీ, నిన్నూ, నీ అందాన్నీ అల్లా కాపాడుతాక! నువు సౌందర్యరాణివి! కలువలంత స్వచ్ఛమైన దానివి! గులాబీల సువాసనా, మల్లెపూల తెల్లదనమూ గలదానివి!" అన్నాను.

ఆమె నవ్వే కళ్ళతో నన్ను చూస్తూ, "మరి మా నాన్నకు నేనంటే అంత ద్వేషం దేనికో! నన్ను నిలువునా భయంకరంగా వర్ణించేది ఆయనే! నేను అంత కురూపిని కానని నీ చేత చెప్పించినా అల్లాకు నా కృతజ్ఞతలు.

మా నాన్న కావాలని నన్ను మోసం చేస్తున్నాడనుకోను. ఏది చూసినా వికారంగా కనిపించే భ్రమ ఏదో ఆయనకు ఉండి ఉంటుంది. కారణం ఏద్తైనా కానీగాక, ఆయనకు నన్ను చూస్తే ఎంత అసహ్యమంటే, ఆయన నన్ను పనికి మాలిన బానిసలను కొనేవాడికి అమ్ముదామనుకుంటున్నాడు", అన్నది

"సుందరీమణీ, నీ తండ్రి ఎవరు ?" అని అడిగాను,

"ఇంకెవరు ? షేక్ అల్ ఇస్లామే!"

"నిన్ను ఎవరికో అమ్మే బదులు నన్ను పెళ్ళాడనియ్య గూడదూ ?" అన్నాను.

"ఆయన చాలా నిజాయితీ మనిషి తన కూతురు భయంకరమైన అనాకారి అని నమ్ముతున్నాడేమో, నీలాటి ఉత్తముడికి ఆమె నిచ్చి చెయ్యటానికి ఇచ్చి. ఒకంతట పెళ్ళి చెయ్యడు. అయినా ప్రయత్నించి చూస్తే నష్టంలేదు. ఆయనను ఒప్పించటానికి ఒక ఉపాయం కూడా చెప్పగలను", అని ఒక్క క్షణం ఆలోచించి ఇలా అన్నది :

"నువు మా తండ్రిగారి దర్శనం చేసుకుని నన్ను పెళ్ళాడ గోరుతున్నట్టు చెప్పగానే ఆయన, 'బాబూ, నీకు నిజం తెలియటం మంచిది. నా కూతురు కురూపి, గూనిది, అష్టావక్రి ...' అంటూ ప్రారంభిస్తాడు. నువు ఆయన మాటకు అడ్డుతగిలి, 'నాకు అభ్యంతరంలేదు ! అభ్యంతరంలేదు !" అనాలి. కాని ఆయన అంతటితో వదలడు; నన్ను ఇంకా, ఇంకా భయంకరంగా వర్ణిస్తాడు. నువు ఆయనకు అడుగడుగునా అడ్డుతగిలి, నీకు అభ్యంతరంలేదని చెప్పాలి." —

అలాటి ప్రణయదేవతను ఎవడు గాని అంత దారుణంగా వర్ణిస్తాడంటేనే నా రక్తం ఉడికిపోయింది. నేను ఆమెతో, "తట్టుకోవటం కష్టమే. కాని అల్లా నాకు తగిన దార్ఢ్యం ఇయ్యక పోడు నేను షేక్ అల్ ఇస్లాంగారి దర్శనం ఎప్పుడు చేసుకోను ?'' అన్నాను.

"రేపు ఝామువొద్దెక్కి— మరిచి పోవద్దు", అంటూ ఆమెలేచి, వెళ్ళిపోతూ నన్ను తన మందహాసపు ఉచ్చులో పట్టి, అగాధపు సముద్రంలో ముంచింది.

మర్నాడు ఉదయం, అనుకున్న వేళకు, నేను షేక్ అల్ ఇస్లాం గారింటికి వెళ్ళి, ముఖ్యమైన పనిమీద వారిని చూడాలని కబురుచేశాను.

ఆయన నన్ను దయతో ఆహ్వానించి, కూర్చోమన్నాడు. నేను ఆయన గాంభీర్యాన్నీ, వంక పెట్టటానికి లేని ఆయన తెల్లగడ్డాన్నీ, ఆయన కళ్ళలో విషాదాన్నీ గమనించాను.

"అదే ఆయనను బాధిస్తున్న భ్రమ. అల్లా దాన్ని తొలగించుగాక !" అను

కుంటూ నేను రెండుసార్లు లేచి నిలబడి ఆయనకు సలాంచేసి, కూర్చుని, సంభాషణ ఆరంభించే అవకాశం ఆయనకే వదిలాను.

నౌకరు ఒకడు లాంఛనంగా ఆహారం తెచ్చిపెట్టాడు. ఆయన ఎండలు మండిపోతున్నాయనీ, గాలి పొడిగా ఉన్నదనీ ఏవో ఒకటి రెండు మాటలు అని, నేను వచ్చిన పని అడిగాడు.

"అయ్యా, నేను తమ కుమార్తెను నాకిచ్చి వివాహం చెయ్యమని అర్థించటానికి వచ్చాను", అన్నాను.

ఆయన ముఖం ఒక్కసారిగా కమిలిపోయి, అంతలో పాలిపోయింది. ఆయన చాలాసేపు నేలకేసి చూసి, తరవాత తలఎత్తి ఇలా అన్నాడు :

"నాయనా, అల్లా నిన్ను సదా కాపాడుతూ సన్మార్గాన నడపాలి ! నా కుమార్తె ఎందుకూ పనికిరాదు. ఆమెను గురించి చేసేది ఏమీలేదు. ఆమె-" ...

నేను అడ్డుతగిలి, "నాకు అభ్యంతరంలేదు! అభ్యంతరంలేదు!" అన్నాను.

"ఆమె నీలాటి దార్ఢ్యమూ, అందమూ గలవాణ్ణి చేసుకోదగినదికాదు. అగ్నిభయం కారణంగా ఆమె తల్లి నెలలు నిండకముందే ప్రసవించటంచేత ఆమె ఆజన్మ రోగిష్ఠి అయింది. నువు ఎంత నిటారుగానూ, అందంగానూ ఉన్నావో ఆమె అంత వక్రశరీరంగలదీ, కురూపీనూ. నేను పెళ్ళికి ఎందుకు అభ్యంతరం చెబుతున్నానో నీకు తెలియాలి గనక, ఆమెను వర్ణిస్తాను..."

"కాని నాకు ఆమె ఆ లోపాలన్నిటితోనూ కావాలి ! నాకు అభ్యంతరం లేదు !" అన్నాను.

నా మాట వినిపించుకోకుండా ఆయన తన కుమార్తె అంగవైకల్యాలను పూసగుచ్చినట్టు వర్ణించసాగాడు. అవన్నీ నేను విన్నవే. నేను ఆయనకు అడ్డుతగులుతూ, "సరే ! ...అలాగే ! ... నాకు సమ్మతమే !" అంటూ వచ్చాను.

ఇట్టచివరకు ఆయన, నా దృఢనిశ్చయంమీద నమ్మకం కుదిరి, చేతులు జోడించి, "నా అంతరాత్మశుద్ధిగా చెప్పవలసిందంతా చెప్పేశాను. నీ అవివేకానికి నువే అనుభవిస్తావు. సవ్యమైన కోరికను నిరాదరణ చెయ్యటం ధర్మవిరుద్ధం. అందుచేత నేను తప్పనిసరిగా సమ్మతిస్తున్నాను", అన్నాడు.

నేను ఆయన చేతులు ముద్దుపెట్టుకుని, ఆ రోజే వివాహం జరిపించవలసిందిగా కోరాను.

ఆయన దీర్ఘనిశ్వాసంతో సరేనన్నాడు.

సాక్షుల ఎదుట వివాహపత్రం తయారయింది నేను నా భార్యను సకలమైన అంగవైకల్యాలతోనూ, దౌర్బల్యాలతోనూ, లోపాలతోనూ, వ్యాధులతోనూ, రుగ్మతలతోనూ, వికారాలతోనూ స్వీకరిస్తున్నట్టు అందులో




పేర్కొనబడింది. నేను ఆమెకు విడాకులు ఇయ్యగోరేవక్షంలో ఇరవై వేల బంగారు దీనారాలు పరిహారం ఇవ్వవలసి ఉంటుందని కూడా అందులో చేర్చబడింది. ఆ షరతులన్నింటినీ నేను ఆమోదించాను అలాటి షరతులు మరొక వెయ్యింటిని కూడా నేను ఆమోదించి ఉందును.

వివాహపత్రం ఖరారుకాగానే నా మామగారు నాతో, "నువ్వు ఇక్కడే గర్భాధానం చేసుకుని, ఇక్కడే కాపరం చెయ్యాలి. నీ భార్యను మరో చోటికి కదిలించే స్థితిలేదు," అన్నాడు.

నేను అందుకు సమ్మతించాను. నావంటి ఊరూ పేరూలేని వర్తకుడికి ఇంత సుఖమూ, ఉన్నదే ఎలా కలిగాయో, ఇంత అందం నాపాల ఎలా పడిందో ఊహించలేక ఉబ్బితబ్బిబ్బయాను.

రాత్రి అయినదాకా నేను ముళ్ల మీద ఉండి, అవకాశం దొరకగానే నా భార్య గదికి పరుగుతీసి, ఆమె ముఖంమీది మేలిముసుగు తొలగించి, ఒళ్లంతా కళ్లు చేసుకుని చూశాను

ఏం చెప్పను, మహారాజా ! అలాటి దృశ్యం ఎన్నడూ మీ కళ్లబడకుండుగాక ! నేను చూసిన మనిషిలాటి వక్రశరీరిణి, వికారాకారిణి, జుగుప్స కలిగించేది పీడకలల్లో కూడా కానరాదు. ఆ దురాత్మురాలైన సుందరి వర్ణించిన దానికన్నా కూడా ఈమె ఘోరంగా ఉన్నది. ఆమె అంగవైకల్యం వర్ణనాతీతం ! భయంకరమైన దిష్టిబొమ్మ !

ఆమెను వర్ణించాలంటే వాంతి అవుతుంది. ఆమెలో లేని లోపంలేదు. నేను చటుక్కున మేలిముసుగు జారవిడిచాను. తరవాత నేను వెళ్లి ఒక మూల కూర్చున్నాను. నేను మొసళ్లను పీక్కుతినే వాణ్ణి అయినా ఆ మనిషిని తాకి ఉండను.

నేను అలా కూర్చుని తెల్లవార్లూ విలపించాను నాకేది దారి. మూఢుడిలాగా, మొద్దుపందిలాగా, బుద్ధిలేని దున్నపోతులాగా, "నాకు అభ్యంతరంలేదు! సమ్మతమే!" అని అన్నాను ముసలాడి హెచ్చరికలు వినిపించుకోలేదు. వివాహపత్రంతో చేతులూ, కాళ్లూ కట్టేయించుకుని, నిలువులోతు కూరుకుపోయాను గోళ్లు కొరుక్కుంటూ నామీద నేనే మండిపడ్డాను. తెల్లవారినదాకా నాకు నరక యాతన అనుభవిస్తున్నట్టే ఉన్నది.

తూర్పు తెల్లబడగానే నేను స్నానశాలకు పరిగెత్తి, శౌచస్నానం చేసి, తిన్నగా దుకాణానికి వెళ్లి, తాగకుండానే మత్తులో ఉన్నవాడిలా కూర్చున్నాను.

త్వరలోనే నా మిత్రులూ, హితైషులూ అయిన వర్తకులు ఒంటరిగానూ, జంటలుగానూ, ముగ్గురేసీ, నలుగురేసీగానూ వచ్చి నాకు శుభాకాంక్షలు తెలిపారు. కొందరు నన్ను, "శుభం! శుభం! శుభం! చిరసౌఖ్యం కలుగుగాక!' అని దీవించారు. మరి కొందరు 'ఎంత పిసినారివి! షర్బతులేవి? మిఠాయి ఏది? హల్వా ఏది? ఈ కొత్త సుఖంలో మేం మిత్రులం నీకు కనిపిస్తామా? సుఖీభవ! సుఖీభవ!' అన్నారు.

వాళ్లు నా మంచి కోరుతున్నదీ, నన్ను వెటకారం చేస్తున్నదీ తెలియక ఏదో నోటికి వచ్చినది గొణిగాను. మధ్యాన్నం ప్రార్థనలవేళ అయినదాకా ఏకపుపర్యంతమవుతూ ఈ బాధను ఎలాగో సహించాను.

నా స్నేహితులంతా ప్రార్థనలకు అలా వెళ్లారో లేదో, నన్ను మహా నరకంలోకి తోసిన ప్రణయ స్వరూపిణి, తన బానిసలను వెంటబెట్టుకుని, నవ్వుతూ నా దగ్గరికి వచ్చింది. అద్భుతమైన ఆమె సోయగమూ, వయ్యారమూ చూసి ప్రార్థనలకు పోతున్నవాళ్లు గుంపులు గుంపులుగా నిలిచిపోయి ఆమెను చూడసాగారు.

అమాయకంగా, అర్భకపు పిల్లలాగా, ఆమె నా దుకాణంలోకి వచ్చి, కూర్చుంటూ, "పెళ్లికొడుకా శుభం కలగాలి! శుభం కలగాలి! అల్లా నీ ఆనందాన్ని పరిపూర్ణం చెయ్యాలి! సుఖీభవ! సుఖీభవ!'' అన్నది.

చేసినది చాలక ఆమె ఇలా అనేసరికి, నాకు నిగ్రహంపోయి, ఆమెను నోటి కొచ్చినట్టు తిట్టేశాను! "ఎంగిలి బొచ్చా! సున్నంపిడతా! పాపాత్మురాలా! నువు నాకు కనిపించిన

క్షణాన్ని అల్లా క్షమించుగాక! విడిచేసినదానా! నీ ఆత్మ నరకానికి ఆహుతికావాలి!"

ఆమె ప్రశాంతమందహాసంతో, "ఏమిటి నీ వదరుడు? నేను నీ మీద చదివిన పద్యాన్ని, నా నీగ్రో బానిస యువతినీ, నీ గొప్ప శీలాన్ని మరిచావా?" అంటూ, తన మేలిముసుగు సరిచేసుకుని, లేచిపోబోయింది.

నాకు ఆకస్మాత్తుగా స్ఫురించింది. నేను చెట్టు నాటానుగాని ఫలం పొందలేదు. నా మహోన్నతమైన నీతి నా మెడకు గుదిబండ అయింది. అందుచేత నేను ఆమె కాళ్లమీదపడి క్షమాపణ చెప్పుకున్నాను."

"నేను నిజంగా పశ్చాత్తాపంతో దహించుకుపోతున్నాను"

కాలిన ఇసుకమీద వర్షం కురిసినట్టుగా నేను ఎన్నో అనునయాలు పలికాను చివరకు ఆమె మెత్తబడి, "ఈ సారికి నిన్ను క్షమించాను. మరెన్నడూ అలా ప్రవర్తించకు!" అన్నది.

నేనామె చెంగు ముద్దుపెట్టుకుని, దాన్ని నా ముఖాన కప్పుకుని, "నన్ను నువే రక్షించాలి!" అన్నాను.

"దాన్ని గురించి ఆలోచించాను. నిన్ను నేనే గోతిలోకి తోశాను, నేనే మళ్లీ నిన్ను పైకి లాగాలి!" అన్నదామె చిరునవ్వుతో.

"త్వరగా! త్వరగా!" అని ఆక్రోశించాను.

జాగ్రత్తగా విను. నువ్వు త్వరలోనే ఆ మనిషినుంచి విమోచన పొందుతావు. కోట దగ్గిరికి వెళ్లి, అక్కడ ఉండే వాళ్లనూ, చిట్కాలమ్మే వాళ్లనూ, దొంగవేషగారిడీలనూ, హాస్యగాళ్లనూ, నాట్యాలాడేవాళ్లనూ, తాళ్లమీద నడిచే వాళ్లనూ, పాడేవాళ్లనూ, కోతులనూ, ఎలుగ్గొడ్లను ఆడించేవాళ్లనూ, రకరకాల వాద్యాలు వాయించేవాళ్లనూ కూడగట్టి, వాళ్లకు ఇలా, ఇలా చెప్పు!" అంటూ ఆమె నాకు బోధించింది.

ఆమె చెప్పిన ఆలోచన ద్వారా నాకు విముక్తి లభించేటట్టు కనిపించింది. నేను ఆమె చెప్పిన ప్రకారమే రకరకాల వాళ్లను పోగుచేసి, షేక్ అల్ ఇస్లామ్ ఇంటికి వెళ్లాను అక్కడ ఇ టిముందు తిన్నెమీద మేమిద్దరమూ షర్బత్ తాగుతూ, కబుర్లు చెప్పుకుంటూండగా, దేవిడీ తలుపు తోసుకుని అలగాజనం వచ్చిపడ్డారు.

ముందు నలుగురు మనుషులు తలకిందులుగా నడుస్తూవచ్చారు. వాళ్ల వెనక ఇంకో నలుగురు తాటిమీద కొటన వేళ్లతో నడుస్తూ వచ్చారు. వాళ్ల వెనకగా చేతులమీద పిల్లిమొగ్గలు వేస్తూ మరి నలుగురు వచ్చారు. ఆ తరవాత ఒక పెద్ద గుంపు పాడుతూ, ఆడుతూ, డప్పులు వాయిస్తూ, అరుస్తూ, ఈలలు వేస్తూ, కోతులతోనూ, ఎగ్గొడ్లతోనూ, బూతు పాటలు పాడుతూనూ, వాద్యాలు వాయిస్తూ కోలాహలంగా వచ్చింది.

వాళ్లందరూ మా చుట్టూ గుమిగూడి ఒక్కసారిగా నిశ్శబ్దంగా ఉండి పోయారు వాళ్ల పెద్ద ముందుకు వచ్చి మెట్లదగ్గిరనిలబడి, ఆ పోగైన నా బంధు బలగం తరపున, నేను వర్ధిల్లాలని పొలికేక పెట్టాడు.

షేక్ అల్ ఇస్లామ్ కంగారుగా నా కేసి తిరిగి, 'ఇదంతా ఏమిటి?" అని అడిగాడు.

"వీళ్లంతా నా బంధువర్గం. మీ కుమార్తెను పెళ్లాడాను గదా అని వీరందరినీ వదులుకుంటానా, చెప్పండి? ఎంత చెడ్డా రక్తంగదా! నదుల పుట్టుక కొండల్లో గదా!" అన్నాను.

"అలా అయితే, అబ్బాయీ! నీ వివాహం చెల్లదు. అందులో నీ వంశం గురించి అబద్ధం చెప్పావు. నువు షేక్ అల్ ఇస్లాం ఇంట ఉండతగవు. ఉంటే జనం నీ మొహాన ఊస్తారు!"

"యా అల్లా! నేను నా భార్యను కష్టపడి సంపాదించుకున్నాను. నన్ను ఇరాక్‌కు రాజును చేసినా ఆమెను వదులుకోను. ఆమె తలవెంట్రుక ఒక్కొక్కటీ నాకు వెయ్యి ప్రాణాలతో సమానం!" అన్నాను.

బలాత్కారంగా విడాకులు ఇప్పించటం ధర్మ విరుద్ధమని తెలిసి, పాపం, ఆ వృద్ధుడు. నన్ను అవతలికి తీసుకుపోయి, ఎంతగానో ప్రాధేయపడుతూ, "నా మర్యాద నువు కాపాడితే నీ పరువు అల్లా కాపాడతాడు!" అన్నాడు.

చివరకు నేను ఆయన కోరిక మన్నించి, అందరూ వినేటట్టుగా, నా భార్యను విడిచి పెట్టుతున్నానని మూడు సార్లు అన్నాను. విడాకులు కోరినది నా మామగారే గనక, నేను పత్రంలో చెప్పిన ప్రకారం పరిహారం ఇచ్చుకునే పని కూడా లేకపోయింది.

ముసలాయనతో వస్తానని కూడా చెప్పకుండా నేను పిక్కబలం కొద్దీ నా దుకాణానికి పరిగెత్తివచ్చాను. నా ప్రణయదేవత ఇంకా అక్కడే ఉన్నది.

ఆమె నాకు స్వాగతం చెప్పి అభినందించి, "మరి మనం ఏకమయేది ఎప్పుడు?" అని అడిగింది.

"మీ ఇంట్లోనా? నా దుకాణంలోనా?" అన్నాను.

"పిచ్చివాడా, ఇలాంటి సందర్భంలో ఆదరిచేసుకునేది చాలా ఉంటుంది. మా ఇంటికే పోదాం," అన్నదామె.

నేను దుకాణానికి తాళంపెట్టి, ఆమె దాసిసలతోబాటు ఆమె వెంట ఒక గొప్ప భవనానికి వెళ్లాను. మేం లోపలికి వెళ్లాక ఆమె ఇద్దరు కొజ్జాలను పిలిచి, నా చేత స్నానం చేయించమన్నది. వాళ్లు నాచేత స్నానం చేయించి, చీనీఅంబరు సువాసనలు పూసి, మంచి బట్టలు ధరింపజేసి, నన్ను అనేక నడవలకుండా ఒక రహస్యమైన గదికి తీసుకుపోయారు. అక్కడ నా ప్రియురాలు పట్టుపరుపులమీద నగ్నంగా నా కోసం నిరీక్షిస్తూ ఉన్నది.



ఆ రాత్రి మాకు అంతులేని మదన క్రీడలతో గడిచిపోయి, తెల్లవారింది. మేమిద్దరమూ ప్రార్థనలు ముగించి, స్నానాలు చేసి. భోజనాలకు కూర్చున్నప్పుడామె, "నువు మంచి సమర్థుడివి. నిన్ను ఏరుకుని, నీకోసం వేచి ఉన్నందుకు నాకు విచారంలేదు. నువు నన్ను పెళ్లాడగోరుతావా? లేక ఇంతటితో వదిలేసి వెళ్లిపోతావా?" అన్నది.

"నన్ను కండలు కోసినా సహిస్తాను గాని, నిన్ను వదలను," అన్నాను

"అలా అయితే కాజీని పిలిపించాలి," అన్నదామె.

కాజీ, సాక్షులూ వచ్చారు. వివాహ పత్రం రాశారు.

మేం అహోరాత్రాలు మైథున క్రీడాలలో మునిగితేలాం. అలా ముప్ఫై రోజులు మహా మైథునంగా గడిచిపోయాక, ఒకసారి నాకు అపరిమితమైన నీరసం వచ్చేసింది.

"ఇంక నావల్ల కాదు!" అన్నాను.

"పాపం, నీకు విశ్రాంతి కావాలి! పడుకో!" అన్నదామె నవ్వుతూ.

నాకు వెంటనే స్పృహ తప్పింది. తిరిగి నాకు ఒళ్లు తెలిసేసరికి ఈ మారి స్థానలో గోడకు గొలుసులతో బంధించి

ఉన్నాను. నేను ఇక్కడ ఎందుకున్నా నని అడిగితే ఇక్కడ కాపలావాళ్లు, "నీకు విశ్రాంతి కావాలి! విశ్రాంతి కావాలి!" అన్నారు.'

మహారాజా, నేను విశ్రమించాను తిరిగి పుంజుకున్నాను తమరు అనుగ్రహించి నన్ను నా ప్రేయసి వద్దకు పంపలేరా? నేను మీకు ఆమె పేరుగాని, హోదాగాని చెప్పలేను. కాని నేను చెప్పినదంతా అక్షరాలా నిజం. అల్లా మాత్రమే సర్వజ్ఞుడు!

అతని కథ విని సుల్తాన్ మహ్మద్ చాలా ఆశ్చర్యం పొంది, "నిన్ను పిచ్చి వాడని ఇక్కడ ఉంచినప్పటికీ, నువు నీ కథ చెప్పిన తీరునుబట్టి నిన్ను తక్షణం విడుదల చేయగలను నీ భార్య ఉండే భవనానికి దారి తెలుసునా?" అని అడిగాడు.

"కళ్లు మూసుకుని వెళ్లమన్నా అక్కడికి వెళ్లగలను అన్నాడు ఆ యువకుడు

అతని గొలుసులను సుల్తాను స్వయంగా తొలగించి, అతన్ని తీసుకుని పోబోతూండగా మూడో పిచ్చి వాడు, "అయ్యలారా, నా కథ ఇంకా చిత్రమైనది. వెళ్లకండి," అన్నాడు.

త్వరలోనే తిరిగి వస్తామని ఆ యువకుడికి మాట ఇచ్చి, సుల్తాను తన అనుచరులతో సహా మారిస్తానునుంచి బయలు దేరాడు. యువకుడు వాళ్లను ఒక గొప్ప భవనం వద్దకు తెచ్చాడు. దాన్ని చూస్తూనే సుల్తాను, "పాపం శమించాలి! ఇది పాత సుల్తానుగారి మూడో కూతురి నివాసం!" అన్నాడు.

ఆయన అందరినీ వెంట బెట్టుకుని లోపలికి వెళ్లగానే ఇంటి యజమానురాలు ఆయనకు వినయంగా స్వాగతం పలికింది. ఆ యువకుడి ప్రణయ స్వరూపిణి ఆమె! సుల్తాను ఆమె అక్కకు మొగుడు!

"అమ్మాయీ, ఇడుగో నీ భర్త ఇతన్ని నా రెండో ప్రతీహారిగా నియమించాను. మీ ఇద్దరికీ మధ్య కలిగిన ఘర్షణ గురించి విన్నాను ఇకముందు అలా జరగకుండా చూస్తాను ఈ కుర్రవాడు చక్కగా విశ్రాంతిపొంది దేనికైనా సంసిద్ధంగా ఉన్నాడు," అన్నాడు సుల్తాను.

"చిత్తం!" అని ఆమె తన భర్తతో కాపరం చెయ్యటానికి అంగీకరించింది.

"వామైనుంచి పెద్ద బరువు దించేశావు. ప్రస్తుతం నేను నీ భర్తను నావెంట తీసుకుపోతున్నాను. ఎందుకంటే మేం మరో యువకుడి వృత్తాంతం వినాలి. అది చాలా అద్భుతంగా ఉండబోయేటట్టు కనబడుతుంది," అని సుల్తాను తన అనుచరులతోనూ, ఇద్దరు ప్రతీహారులతోనూ మారిస్తాన్‌కు తిరిగి బయలుదేరాడు.

మంత్రికుమార్తె ఇంతవరకు కథ చెప్పి, తూర్పు తెల్లవారుతూ ఉండటం గమనించి. మౌనం వహించింది,

(సశేషం)




నా గుండె లయ తప్పింది.

రెప్పకొట్టడం మరిచిపోయాను.

ఎదురు మేడమీద గదిలో కిటికీదగ్గర నిలబడి అద్దంలో చూచుకొంటూ అతడు క్రాపు దువ్వుకొంటున్నాడు.

మొన్నటి వరకూ ఆ ఎదురుగావున్న మేడమీద గదులలో ఒక కుటుంబం కాపురం ఉండేది వాళ్ళు ట్రాన్స్ఫరై వెళ్ళిపోయారు. ఇతడు క్రొత్తగా అద్దెకు దిగినట్టున్నాడు. ఇతిడికి ఫామిలీ ఉందా? ఒక్కడేనా?

కాలేజీకి టైం అవుతూంది నాకు.

"అన్నం పెట్టాను." అమ్మ వంటిం ట్లోంచి కేక వేసింది.

"ఆఁ వస్తున్నా."

కంచంలో అన్నం పొగలు గ్రక్కుతూంది.

వాచీకేసి చూశాను. అయిదు నిమిషాలు లేట్.

నాకు తొందరెక్కువై పోయింది. ఆదరాబాదరాగా తింటున్నాను. ఎదురింటి కిటికీ దగ్గర కనిపించిన సుందర రూపం నా మనసులో మెదిలింది. అబ్బ! ఎంత బావున్నాడు?

నిప్పు మింగినట్టుగా నా గొంతు మండింది.

చెంబు ఎత్తి గబుక్కున నోటికి పట్టాను.

"విసనకర్ర ఇవ్వనా? ఏం చదువులో ఏం పరుగులో?'' అమ్మ అంది.

కళ్లలో తిరిగిననీళ్ళు పమిటతో ఒత్తుకొని తినడం పూర్తిచేశాను. పుస్తకాలు సర్దుకొన్న బాగ్ తీసుకొని, బస్‌ఛార్జ్‌కి పర్సులో డబ్బు చూచుకొని మేడమెట్లు దిగాను.

నా గుండె మళ్ళీ లయ తప్పింది. అతడూ తాళంచెవి చెయిన్ త్రిప్పుకొంటూ మేడమెట్లు దిగుతున్నాడు. అప్రయత్నంగా పైకి చూశాను. గది కిటికీలుమూసిఉన్నాయి అయితేఒక్కడే ఉంటున్నాడన్నమాట!

ఇద్దరం రోడ్డుమీద కాలుపెట్టాం.

అతడు తలెత్తి నావైపు చూశాడు.

చటుక్కున చూపు మార్చాను. చీరకుచ్చెళ్ళు కొద్దిగా పైకెత్తి పట్టుకొని గబగబా నడుస్తున్నాను. అతడు పాంటు జేబుల్లో చేతులు దూర్చి నడుస్తున్నాడు.

పది నిమిషాల్లో బస్‌స్టాప్ చేరుకొని అతడికోసంచూశాను. అతడు ఇంకొంచెం ముందుకు నడిచి అక్కడున్న లక్ష్మీ రమణ రెస్టారెంట్‌లోకి ప్రవేశించాడు.

సాయంకాలం కాలేజీనుండి వస్తూ ఎదురింటిపైకి చూశాను. ఆగదితలుపులు మూసి ఉన్నాయి.

చీరమార్చి ముఖం కడుక్కొని నా గదిలో కిటికీలో కూర్చున్నాను ఓ పుస్తకం చేతిలోకి తీసుకొని. పది నిమిషాల తరువాత అతడి గది కిటికీ తలుపులు తెరుచుకున్నాయి.

అతడు కిటికీకి వీపుజేసి డ్రెస్ మార్చాడు. తరువాత ముఖంకడుక్కొని తిరిగి కిటికీ దగ్గరికి వచ్చాడు. అద్దం కిటికీలో ఉంచి దువ్వుకోసాగాడు.

నేను ఓరగా చూస్తున్నాను.

అతడు కుర్చీ కిటికీప్రక్కగా జరుపుకొని డైలీపేపరు పట్టుకు కూర్చొన్నాడు.

అతడు నన్ను గమనించలేదు.

పుస్తకం తెరిచి పట్టుకొన్నానుగాని ఒక పేజీకూడా చదవడంలేదు నేను. నా ధ్యాసంతా ఎదురుగాఉన్న కిటికీపైనే ఉంది.

మరురోజు ఉదయం సరిగా ఇద్దరం ఒకేసారి మేడమెట్లు దిగాం. అతడు నన్ను చూడనట్టుగా నడవసాగాడు.

నేను బస్‌స్టాప్ దగ్గర ఆగాను.

అతడు రెస్టారెంట్‌లో దూరాడు.

మూడోరోజు కూడా ఇద్దరం ఒకే

సారి మేడమెట్లు దిగాం కాని అది కాక తాళీయంకాదు. అతడు కిటికీ తలుపులు మూయడంచూసి నా పుస్తకాలబాగ్ అందుకొన్నాను.

వారంరోజులు ఈ రకంగానే గడిచాయి.

నా గదిలో కిటికీ దగ్గర కూర్చొని అతడి దినచర్య గమనించడంలో నాకు ప్రొద్దు తెలియడంలేదు. అతడి గదికి రెండు పెద్ద కిటికీలు ఉన్నాయి. ఆ కిటికీలు తెరిచిఉంచితే ఆ గదిలో ఏమేం జరిగేది స్పష్టంగా కనిపిస్తుంది. అతను ప్రొద్దున్నే ఆ కిటికీ దగ్గరే నిలబడి గడ్డం గీచుకొంటాడు. తరువాత స్నానం చేసి ఒళ్ళు తుడుచుకొంటూ వచ్చి డ్రెస్ చేసుకొంటాడు. సరిగా ఉదయం ఎనిమిది గంటలకి రెస్టారెంట్‌కి బయల్దేరుతాడు. సాయంకాలం ఆ కిటికీ దగ్గిరే పేపరు చదువుతూ కూర్చొంటాడు. చీకటి పడుతూండగా అతడి గదికి అవతల కొద్దిగా ఉన్న ఖాళీస్థలంలో పిట్టగోడమీద కాస్సేపు కూర్చొని చూస్తాడు. చీకటిపడ్డ తరువాత తిరిగి గదిలోకి వచ్చి డ్రెస్ చేసుకొని కిటికీలు మూసివేసి హోటల్‌కి వెడతాడు భోజనానికి. తిరిగి వచ్చాక కాస్సేపు చదువుకొంటాడు. తొమ్మిది న్నర అవుతూంటే దోమతెర క్రిందికి వాల్చుకొని గదిలోలైట్ తీసివేస్తాడు.

అతడి దినచర్య గమనించడంవల్ల నా దినచర్యలో మార్పువచ్చింది. కాలేజీ నుండి వచ్చాక అమ్మకు పనిలో కొద్దిగా సాయం అయ్యేదాన్ని. పాఠాలు రాసుకొని, ఏరోజువర్క్ ఆరోజు చూచుకొనేదాన్ని. ఇప్పుడు అన్నిటినీ మరిచిపోయాను. ఆ కిటికీవైపు చూస్తూ కూర్చొంటే నాకింకేమీ అక్కరలేదనిపిస్తుంది. కాలేజీకివెళ్ళినా అతడిని మరిచిపోవడం నాకు సాధ్యం కాలేదు.

రోజురోజుకూ అతడు నాలో గాఢమైన అనుభూతి ముద్రిస్తున్నాడు. బ్రహ్మచారి జీవితం ఎంత ఆకర్షణీయం! లైట్‌తీసివేసిన ఆ గదిలో..దోమతెరలో ఒంటరిగా శయనించిన అతడి ప్రక్కన చేరగల ఆడదాని అదృష్టం......

పక్కమీదికి చేరితే నాకు ఎంతసేపటికి నిద్రపట్టేదికాదు. ఏవో కలలతో ఆలోచనలతో శరీరం వేడెక్కిపోయేది.

ఒకరోజు ఇద్దరం రోడ్డుమీద నడుస్తున్నాం.

అతడు పాంట్ జేబుల్లో చేతులు దూర్చుకొని, తలవంచుకునడుస్తున్నాడు.

ఎందుకని నావైపు చూడడు? అతడి కంటికి నేనందంగా కనిపించడంలేదా? కాలేజీలో, రోడ్డుమీదా, బస్సుల్లో పదిమంది ఆడపిల్లలతో కలిసి ఉన్నా ప్రతి మగాడికన్నా ప్రత్యేకంగా నా మీదనే పడుతూంటుంది! నేను కట్టుకొనే చీరా, పెట్టుకొనే నగలూ ఖరీదైనవి కాకపోయినా నా చీరకట్టులో ఒక

ప్రత్యేకత ఉంటుంది. నా చిరునవ్వు మరొక ప్రత్యేకమైన ఆకర్షణ!

అసలతడికి ఆడవాళ్ళంటేవిముఖమా? ఆడదంటే, అందమైన యువతి అంటే స్పందించని హృదయమా?

బస్‌స్టాప్ సమీపిస్తోంది.

అతడు నావైపు చూశాడు రోడ్డుమీద ఏ షాప్‌నో, బండీనో చూసినంత నిరాసక్తకంగా.

నేను మాత్రం ఈ అవకాశం పోనివ్వలేదు.

గాలం వేస్తున్నట్టుగా గాఢంగా చూశాను. చిరునవ్వు నవ్వాను.

అతడు తెల్లబోయినట్టుగా చూశాడు.

స్టాప్ పదడుగుల దూరం ఉండగానే నేనెక్కవలసిన బస్సు వచ్చి నిలబడింది. గబగబా నడిచాను. అతడి ఆశ్చర్యానికి సమాధానం చెప్పకుండా నే.

మరునాడు ఉదయం నేను కిటికీ దగ్గరికి చేరుకొనేప్పటికి అతడు కిటికీ తలుపులు మూసివేస్తున్నాడు. అయిదు నిమిషాలు మించకుండానే అతడు సూట్ కేస్ పట్టుకొని మెట్లుదిగి రోడ్డుమీదికి వచ్చాడు.

రిక్షాను ఆపి, బేరంమాట్లాడి, ఎక్కి వెళ్ళిపోయాడు.

నా కళ్ళలో నిరాశ నిండిపోయింది. మూసిఉన్న కిటికీలు నా గుండెల్ని కలిచాయి. నా కళ్ళముందు ఏవో చీకటి తెరలు పరుచుకొన్నాయి.

మూడురోజులు ఈ బాధ అనుభవించాక ఒకనాటి సాయంత్రం తిరిగి గది కిటికీ తలుపులు తెరుచుకొన్నాయి. ఆగిపోయిన ఊపిరి తిరిగి ప్రారంభమైనట్టుగా అనిపించింది.

మరునాడు ఉదయం మామూలుగా రోడ్డుమీద నడుస్తున్నాం

అతడిని పలుకరించాలనుకొని సిగ్గుపడి ఆగిపోయాను.

అతడినుండి ఎటువంటి ప్రోత్సాహం లేకుండా ఏమని పలుకరిస్తాను? ఏమనుకొంటాడు? అసలు నేనంటే అతడికి ఎటువంటి అభిప్రాయంఉందో?

ఏం జరిగిందో గుర్తించేలోగానే నా జబ్బపట్టుకొని ఎవరో అవతలికితోశారు. ఆటో కొంచెం ముందుకువెళ్ళి ఆగిపోయింది.

డ్రైవర్ దిగివచ్చాడు. "రోడ్డుమీద కళ్ళుంచుకు నడవక్కరలేదా?" అన్నా డతడు కళ్ళెర్రజేసి.

నాకు సిగ్గుతో చచ్చినంతపనైంది.

"ఏమిటంత పరధ్యానం? ఎంత ప్రమాదంజరిగేది?" అతడు చిరునవ్వుతో మృదువుగా మందలిస్తూ చూశాడు.

ఇందాక నా జబ్బ పట్టుకుత్రోసింది అతడి చెయ్యేనని తెలిసేప్పటికి నా మనసు దూదిపింజలా తేలికైపోయింది.

"ఈరోజు ఎంత ప్రమాదం తప్పించారు? మీకు నా కృతజ్ఞతలు ఎలా చెప్పాలో..." గొణిగినట్టుగా అన్నాను.




"ఎదురింటి అమ్మాయివి కదా? చేరువనేఉండి ఆమాత్రం చేయకపోతే ఎలా?" అతడు మళ్ళీ నవ్వాడు.

ఎంత అందమైన నవ్వు!

"నేను ఎదురింటిపిల్లనని గుర్తుందన్న మాట?" సంతోషం, ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ అన్నాను.

"ఏం చదువుతున్నావు?"

"బి ఎ. ఫస్టియర్."

"ఏ కాలేజీ?"

"రెడ్డీ కాలేజీ."

"మీ పేరు?"

రాధ ... ... మీరు ఏంచేస్తుంటారు ఇక్కడ?"

"కో-ఆపరేటివ్ ట్రెయినింగ్ అవుతున్నాను."

స్టాప్ వచ్చింది. ఆగాను.

అతడు ఒక క్షణం తరువాత రెంస్టారెంట్ వైపు వెళ్ళిపోయాడు.

సాయంత్రం అతడు కిటికీ దగ్గర నిలబడి నన్ను చూసి నవ్వాడు.

నేనూ నవ్వాను. 'దారికి వచ్చాడు!' నా మనసు ఉయ్యాల లూగిపోయింది.

రోజూ ఉదయం రోడ్డుమీద కలిసి నడుస్తున్నాం. అతడు మా ఇంటిసంగతీ నా చదువు సంగతీ ఏవో పొడి పొడి ప్రశ్నలు వేసేవాడు. నేను జవాబు చెప్పేదాన్ని.

నేనూ, అతడు కిటికీలో నిలబడి నప్పుడు కళ్ళతో మాట్లాడుకోవడం, చిరునవ్వు నవ్వుకోవడం జరుగుతోంది.

మా మధ్య కనిపించని బంధం పెన వేసుకుపోతున్నట్టుగా చూశాడు.

"సినిమాకు వెడదామా?" అన్నానో రోజు.

నా చొరవకు ఆశ్చర్యపోతున్నట్టుగా చూశాడు.

"ఏం పిక్చరు?" అని అడిగాడు.

చెప్పాను.

"ఫస్టు కేనా?" అన్నాడు తిరిగి.

"ఫస్టుషోకే. ఫ్రెండుతో వెడుతున్నా నని చెబుతాను ఇంట్లో."

"ఆల్ రైట్."

సాయంకాలం నేను రోడ్డుమీదికి రాగానే అతడి గది కిటికీ తలుపులు మూసుకున్నాయి. అయిదు నిమిషాల తరువాత నెమ్మదిగా వచ్చి నన్ను కలిశాడు.

"మీనాన్నగారు ఏంపనిచేస్తుంటారు?"

"డి ఆర్. ఆఫీసులో క్లర్కుగా. మా అక్కయ్య పెళ్ళయిపోయింది. మా తమ్ముళ్లు చదువుకొంటున్నారు. నా చదువు అతికష్టంమీద సాగుతోంది. మా అమ్మకేమో నా పెళ్ళిచేసి పంపేయాలని తొందర. అప్పుడే ఓ సంబంధంచూశారు. ఆ మధ్య పెళ్ళిచూపులు కూడా అయ్యాయి. ఆ అబ్బాయి నాకు నచ్చ లేదు. మా వాళ్ళు ఆ సంబంధమే సెటిల్ చేసేలాగున్నారు."

"ఏం చదువుకొన్నాడతడు?"

"పి. యు. సి. చదివాడు. టీచర్ ట్రెయినింగ్ఆయి ఈ మధ్య టీచర్‌గా అపాయింట్ అయ్యాడట. చదువు అంతంతే. రూపంకూడా అంతంతే. నేనేం రంభను కాదనుకోండి. నాకు తగిన వాడైనా కావాలా వద్దా?"

"నీ అందానికేమైంది? నువ్వు చాలా అందంగాఉన్నావు" అంటాడనుకొన్నాను గాని అతడేమీ వ్యాఖ్యానం చేయలేదు.

చెప్పుకోదగ్గ విశేషాలేవీ జరగ కుండానే మేం సినిమా చూసి బయట పడ్డాం.

అలా రెండు మూడు సినిమాలు చూశాం.

ఎక్కడ చూసినా సస్నేహంగా పలకరించుకొంటున్నాం. కిటికీ దగ్గర నిలబడి సైగలు చేసుకొంటున్నాం. మా మధ్య విడదీయరాని అనుబంధమేదో ఏర్పడినట్టుగా తోచసాగింది.

ఇప్పటికీ అతడి ప్రవర్తన నిర్మలంగా ఉంది. ఇంతవరకూ ఎలాంటి వికార చేష్టా చేయలేదతడు. అతడి నిగ్రహం నాకే ఆశ్చర్యాన్నీ, అసంతృప్తినీ కలి గిస్తోంది.

అతడి ఆకర్షణ నన్ను బలంగా బంధించివేసింది. అతడు ఏంచేసినా, ఏంకోరినా నేను కాదనేస్థితిలోలేను.

ఒకరోజు అమ్మా నాన్న నా పెళ్ళి విషయమే మాట్లాడుకొంటున్నారు.

ఆ సంబంధం చేయడానికే నిశ్చ యించారు.

సురేష్ ముందు అతడి రూపం ఊహించుకొంటూంటే నాకు కంపరంగా తోచింది. అతడినిచేసుకోనని కచ్చితంగా చెప్పాలనుకొన్నాను. ఇంతకంటే శ్రేష్ఠమైన సంబంధమే నేను ఎన్నుకొన్నానని గర్వంగా చెప్పాలనిపించింది.

ఇంతవరకు పెళ్ళి ప్రసక్తి మా మధ్య రాకపోయినా, నిన్ను ప్రేమిస్తున్నానని సురేష్ చెప్పకపోయినా అతడు తప్పకుండా నన్ను చేసుకొంటాడన్న నమ్మకం నాకుంది. అయితే ఇంతవరకూ అతడి కులమేమిటో, ఏ ఊరో తెలుసుకోలేదు. ప్రేమకు కులమేమిటి? మతమేమిటి? అతడి ప్రవర్తన నాకెంతో నచ్చింది.

ప్రేమించి పెళ్ళిచేసుకొంటానన్నప్పుడు కట్నం ప్రసక్తి వస్తుందా?

ఈ విధంగా అమ్మానాన్నకి కట్నం కానుకల బాధ తగ్గిస్తున్నాను.

సురేష్ సంగతి చెప్పేయ్యాలనుకొన్నానుగాని, అతడి అభిప్రాయం కనుగొనకుండా నోరు జారడంలో ప్రమాదం కనిపించి అప్పటికి మౌనం వహించాను.

ఉదయం కాలేజీకి వెడుతూ దారిలో "సాయంత్రం పార్క్‌కి వస్తావా?" అని అడిగాను.

"నాకేం భయంలేదు. నేనీ ఊరికి కొత్త. ఇక్కడి వాళ్ళకికొత్త. కాని, నీకు తెలిసివాళ్ళెవరైనా కనిపిస్తే...."

"కనిపిస్తే ఏం?"

"మీ వాళ్ళకి చెబితే?"

"చెబితే మాత్రం ఏం? నేనైనా ఒక రోజు చెప్పాల్సిందే కదా."

"నువ్వే చెబుతావా? ఏమని?" అతడు కాస్త కంగారు పడ్డాడు.

"నాన పరిచయం గురించి!"

"వాళ్ళు అపార్థం చేసుకోరూ?"

"చెప్పవలసిన రీతిగా చెబితే ఎందుకు అపార్థం చేసుకొంటారు? అయినా మన మిప్పుడు ఏం కానిపని చేస్తున్నామని? మనసు కలసిన స్నేహితులతో కాస్సేపు కూర్చొని కబుర్లు చెప్పుకొంటే తప్పేమిటి?"

"ఓ! నువ్వు చాలా ధైర్యంకల పిల్లవి!" అతడు నవ్వాడు. సాయంత్రం ఆరింటికి పార్క్‌కి వస్తానన్నాడు.

ఎన్నోసార్లు రోడ్డుమీద కలుసుకొని మాట్లాడాం. సినిమాలకి వెళ్ళాం. అప్పుడెప్పుడూ జరగని అపూర్వసంఘటన ఈరోజు జరుగుతుందనిపించింది.

సురేష్‌ని పెళ్ళిచేసుకొమ్మని అడిగితే ఏం చెబుతాడో? పార్క్‌లో చెట్లచాటున అతడి ఒడిలో పడుకొని తీయని కబుర్లు చెప్పుకొనే సన్నివేశం ఊహించుకొంటూంటే ఏదో చుక్కల లోకంలో విహరిస్తున్నట్టుగా తోచసాగింది.

అతడు ఆఫీసునుండి అయిదున్నరకి ఇంటికి రావడం చూశాను అతడుముఖం కడుక్కొని టవల్‌తో తుడుచుకుంటూ కిటికీ దగ్గరికివచ్చి, "రెడీయేనా?" అన్నట్టు సైగ చేశాడు.

నవ్వుతూ చెయ్యూపాను.

"అయితే నువ్వు ముందుపద," అన్నట్టు తిరిగి సైగచేశాడు.

ఓ ఫ్రెండింటికి నోట్సు తెచ్చుకొంటానని అమ్మకిచెప్పి నేను బయల్దేరాను. అ

నాకున్న చీరల్లో కాస్త మంచిచీర తెల్ల చీర కట్టుకొన్నాను. కాలేజీనుండి వస్తూ తెచ్చుకొన్న మల్లెచెండు తల్లో తురుముకొన్నాను. నా కిష్టమైన రీతిలో అలంకరించుకొన్నాను.

పార్కు గేటువద్ద వచ్చి కలిశాడు సురేష్.

ఇద్దరం వెళ్ళి ఒక పూపొద ప్రక్కగా కూర్చొన్నాం.

ఎలా సంభాషణ ప్రారంభించాలో నాకు తోచలేదు.

అతడే మొన్న చూసిన సినిమాగురించి ఏదో మాట్లాడాడు.

పరధ్యానంగా గడ్డిపరకలు నోటితో త్రుంచివేస్తున్న నన్ను చూసి నవ్వాడు. "నువ్వీ లోకంలోలేవు!"

"సురేష్!" నేను హఠాత్తుగా, ఆవేశంగా అతడి చెయ్యి పట్టుకొన్నాను. "నా గురించి నీ అభిప్రాయమేమిటి?"

అతడు ఫక్కున నవ్వాడు, అదోలా నా వైపు చూస్తూ.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"నవ్వొస్తే నవ్వాను!"

"ఆ నవ్వే ఎందుకు వచ్చిందని అడుగుతున్నాను."

అతడు నవ్వు తగ్గించుకొని, "నీ గురించి నా అభిప్రాయం అడిగావుకదూ? చెబుతాను, విను. వయసు పొంగులో ఉన్నదానివి. పాలేవో నీళ్లేవో తెలియని దానివి. గ్రుడ్డిగా ప్రేమలో పడిపోయి, కలల తెప్పపై తేలిపోయేదానివి!" అన్నాడు.

"నా కలలు నిజమయ్యే అవకాశం నాకు లేదంటారా?"

"నేనా చెప్పాల్సింది? కాలం చెబుతుంది సమాధానం."

నా కళ్ళలో భయం రెపరెపలాడింది. "మీరు నన్ను పెళ్ళిచేసుకోరా?" అన్నాను వణికే కంఠంతో.

"మగవాడికి రెండు పెళ్ళిళ్ళు చట్టసమ్మతం కావు!"

నా నెత్తిన పిడుగు పడింది. "మీకిదివరకే పెళ్ళి అయిపోయిందా?" పది లంఖణాలు చేసినట్టుగా నా గొంతు నీరసించిపోయింది.

"నా పెళ్ళి అయి నెలా పదిహేను రోజులు అవుతోంది. నా భార్య చదువుకొంది. కథలూ, నవలలూ రాస్తుంది. ఆమె పేరు... " చెప్పాడు ఆమె పేరు.

నాకు కళ్ళు తిరిగినట్టయ్యాయి. ఈ మధ్యే ఆమె నవల సీరియల్‌గా ప్రభలో చదివాను ఆ నవలని ప్రశంసిస్తూ ఉత్తరం కూడా రాశాను ప్రభవాళ్ళకి.

"ఆమె అందంగురించి వర్ణిస్తే నీ మనసు బాధపడుతుంది. ఇదిగో, ఆమె ఫోటో." సురేష్ పర్సులోంచి చిన్న ఫోటో తీసిచ్చాడు.

నా ముఖం అవమానంతో కందిపోయింది. "ఎందుకు నన్ను మోసం చేశారు?" కోపంగా అడిగాను.



"మోసంచేశానా?" అతడు పరిహాసంగా చూశాడు.

"కాదా? వివాహితులు. ఒక కన్నెపిల్ల జీవితంతో చెలగాటం ఆడ్డం కాదా?" దుఃఖంతో దోషంతో నా గొంతు పూడుకుపోయింది.

"నీ కన్నెరికాన్ని నేను చెడగొట్టలేదే?" అతడు పెంకెగా అన్నాడు.

నాకు ఒళ్ళు మండిపోయింది "ఈ స్నేహానికి అర్థమేమిటి?" కస్సుమన్నాను.

"అర్థం చెప్పాలనే ఈ రోజు నువ్వు పిలవగానే ఇక్కడికి వచ్చాను." అతడు గంభీరంగా మారిపోయాడు. "ఎదురెదురు ఇళ్ళలో వయసొచ్చిన ఆడదీ, వయసులో ఉన్న మగాడూ కాపురముంటే ఇలాంటి సంఘటనలు మామూలేమో? పాముకు కుబుసం కప్పితే కళ్ళు కనిపించకుండా మత్తుగా ఉంటుందట. ఈ వయసుకూడా అలాంటి కుబుసాన్నే కప్పుతుంది స్త్రీ పురుషులకు. ప్రపంచం కనిపించదు ప్రేమ తప్ప. తల్లిదండ్రీ, సమాజం కనిపించదు. ప్రియుడు తప్ప. కలలు తప్ప మరేవీ తీయగా ఉండవు. ఆ కలలను నిజం చేసుకొనే తాపత్రయంతో జీవితం ఒక పొరపాటుగా మారిపోతూ ఉంటుంది చాలామందికి. ముఖ్యంగా కన్నెపిల్లలకు.

"కిటికీలో నిలబడి నువ్వు పడే అవస్థ చూశాను. రోడ్డుమీద మనం కలిస్తే నువ్వు పొందే తన్మయం చూశాను. నా భార్య ఇంకో నెలరోజుల దాకా కాపురానికి రాదన్న విషయం నాకు గుర్తువచ్చింది. ఈ నెల రోజులూ సరదాగా నీతో కాలక్షేపం చేయొచ్చని నీ ఆహ్వానం అందుకొన్నాను."

"ఛీ!" జుగుప్సగా చూశాను అతడి

కేసి. నా కళ్ళకి అతడి రూపం వెగటుగా, అతడొక రాక్షసుడుగా, పరమ నీచుడిగా కనిపించసాగాడు.

"కాని, నీతో ఆడుకోవాలనుకొన్నప్పుడల్లా అమాయకమైన నా భార్య ముఖం గుర్తువచ్చేది. ఆమె ప్రేమ గుర్తువచ్చేది. ప్రతి క్షణం నా ఊహతోనే ఆమె జీవిస్తోందన్న నిజం గుర్తువచ్చేది. దాంపత్యంలో వంచన అప్రతిష్ఠ భార్యా భర్తల్లో ఎవరి వైపునుండి ప్రవేశించినా అందుకు ఇద్దరూ సమానంగా నష్టపోవలసివస్తుంది. అందుకే నీతో స్నేహం చేసినా నిన్ను ఉంచవలసిన దూరంలోనే ఉంచాను. మా దాంపత్యం కలుషితం కాకుండా జాగ్రత్తపడ్డాను. ఈ చేదు నిజం నీకు చెప్పి, నీకు చిన్న హితవు కూడా చెప్పాలనుకొంటున్నాను. నన్ను కాక మరొకరిని ఆహ్వానిస్తే ఈసరికి నీ అదృష్టం మరొక మలుపు తిరిగేది జీవితం తప్పటడుగుగా మారిపోయి ఉండేది. తొలిచూపు గారడీలో పడిపోయే ముందు ప్రతి ఆడపిల్లా తన చుట్టూ ఉన్న పరిస్థితులన్నీ ఒక్కసారి సమీక్షించుకోవడం మంచిది. మిగతా ప్రపంచాన్ని మరిచిపోవడం ఎవరికీ అంత మంచిదికాదు. ప్రేమించడం తప్పని అనను. కాని, ఈ ప్రేమ ఇచ్చిన వాళ్ళకి వరాన్ని ఇస్తుంది. లేకపోతే శాపం అవుతూంటుంది.

నీ శ్రేయోభిలాషిగా నేను చెప్పేది ఏమిటంటే సాధ్యమైనంత తర్వాలో ఈ సంఘటన మరిచిపో. మీ తలిదండ్రులు దూరదృష్టితో ఆదేశించిన మార్గంలో అడుగుపెట్టు. అదే ఏ ఆడపిల్లకైనా నిరపాయమైంది."

నాకిక వినాలనిపించలేదు. థాంక్స్ చెప్పేవి లేచిబయల్దేరాను.

ప్రేమిస్తున్నాడనుకొంటున్న వాడి దృష్టిలో నేనెంత పరిహాస పాత్రమైపోయాను! అవమానంతో నా హృదయం కుతకుతలాడిపోయింది. కట్టుకొన్న గాలి మేడలన్నీ కుప్పకూలిపోయాయి.

నేనిక ఎప్పుడూ కిటికీదగ్గరకి వెళ్ళలేదు.

కాలేజీకి వెళ్ళినా తలొంచుకుపోవడం, తలొంచుకొని రావడం నేర్చుకొన్నాను. వారంరోజుల తరువాత ఎదురింటి కిటికీలో ఒక అందమైన అమ్మాయి ముఖంకనిపించింది. చప్పున తిప్పుకొన్న నా కళ్ళలో నీళ్ళు నిలిచాయి.





గంటసేపటినుంచి వర్షం అలా కుండపోతగా, సంతతధారగా కురుస్తూనే ఉంది. ఉండుండి ఫెళఫెళార్భాటాలతో ఉరుముతూనే ఉంది. దాన్ని వెన్నంటి తృటిలో ఓ కాంతి పుంజం వెలుగొంది, కంటిలో చురుక్కుమని గుచ్చుకుంటూనే ఉంది. గాలి విసురుగా వీచినప్పుడొక జల్లు చొరవగా లోపలికి వచ్చి నిర్మల పాదాలను తాకి, అంతలోనే మళ్ళీ వెనక్కి తగ్గుతోంది.

నిర్మల స్థాణువులా అలానే కూర్చుని ఉంది. ఎప్పుడో ఈ వర్షం ముదరకముందు, అసలు మొదలుగాకముందు, చందనపు పూతలా సోకుతూ చల్లగాలి హాయిగా నిలువెల్లా తడుముతూ ఉంటే, అప్పుడు పేముకుర్చీ గుమ్మంలోకి లాక్కుని అందులోకి చేరగిలబడి పోయింది. ఆ తర్వాత నెమ్మదినెమ్మదిగా గతంలోకి జారిపోయింది.

ఇన్నేళ్ల తర్వాత ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుంటే, తనకు మిగిలిపోయిన ఆస్తి—అప్పటి ఆ రెండేళ్ళ అనుభూతులే.

అప్పుడు తను కలలుగన్న భవితవ్యపు, చైతన్యపు ఆశాసుమాలన్నీ గగన కుసుమాలే అయినయి. మరీ మరీ

ఎదురుచూసిన జీవితానుభవాలన్నీ ఎడారి దారిన ఎదురైన మరీచికలే అయినయి.

అప్పుడవి సుందర స్వప్నాలు ! ఇప్పుడవి వికృత సత్యాలు ! కళ్లుమూసి కల గనటానికీ, కళ్లు తెరిచి మనగలగటానికీ మధ్య ఎన్ని యోజనాల దూరం ఉందనీ !

నిర్మల ఉస్సురని నిట్టూర్చింది, తల వెనక్కు వాల్చి, తన చుట్టూ మిగిలి ఉన్న సూన్యంలోకి చూస్తుండిపోయింది. ఇంక ఈ లోకంలో తనవంక రవ్వంత జాలిగా చూసేవాళ్లు ఎవరున్నారు ?

అయిపోయింది. అపచారం జరిగి, తీరని అపకారం కలిగింది. చేతులు కాలాయి. ఇంక ఎన్ని శైత్యోపచారాలు చేసి చూసినా ఇంతే. మునుపటి మృదుత్వమూ రాదు. వెనుకటి లాలిత్యమూ లేదు పైగా తనకే వికృతంగా, భయంగా ...

తన పరిధిని ఎంత పరిమితం చేసుకున్నా, ఉద్యోగం కోసమైనా తను నలుగురిలోకి వెళ్లకతప్పటంలేదు. అవసరం ముందుకు నెడితే, అభిమానాన్ని చంపేసుకుని తిరుగుతోంది తను కనిపించగానే ఎదుటివాళ్ళ చూపుల్లో ఎదురయ్యే తూష్ణీభావం, తిరస్కార ధీత్కారాలను సహించి, భరించక తప్పటమూ లేదు.

పూలు అమ్మిన ఊళ్లోనే కట్టెలమ్ముకుంటూ, కనుకొనుకుల్లోనే కన్నీళ్లు కుక్కుకుంటూ, ఈనాటికిలా దిక్కులేనిదై పోయినందుకు దిగులుగా గుటకలు మింగుకుంటూ, ఇంటికీ ఆఫీసుకు మధ్య కట్టేసిన గానుగెద్దులా, పోసీ గంగిగోవులా, వస్తూ పోతూ, పోతూ వస్తూ, పోయివస్తూ, వచ్చిపోతూ, చచ్చిపోతూ...

అవును, తనెందుకు చచ్చిపోలేదు ? ఇన్నాళ్లకీ విషయం గుర్తొచ్చినందుకు లీలగా నవ్వొచ్చింది. ఇప్పుడు తను బ్రతికే ఉందా ? లేదా ? ఏ రోగమన్నా వచ్చి పోతే, తను పోతే ఎంత బావుండేది ?

నిర్మల ఎంతోసేపు అలాగే కుర్చీలో కూర్చుండిపోయింది. ఇలా ఒంటరిగా ఉండిపోయి, తన ఆలోచనలను తనే తవ్వుకుంటూ, ఎప్పుడో పోగొట్టుకున్న దేనికోసమో వెతుక్కుంటూ కూర్చోవటం ఈ నాలుగేళ్లనుంచీ బాగా అలవాటైపోయింది. జీవితంలో ఇంకెవర్నీ నమ్మలేక, నమ్మకంగా పడిఉన్న ఈ పేముకుర్చీపై తన భారాన్నివేసి, దాని చేతులమీద సిరసంగానున్న తన చేతుల్ని వేలాడేసి, తల వెనక్కి వాల్చేసి, నిశ్శబ్దపు సుద్దముక్కతో తన చుట్టూ గిరి గీసుకుని ఇలా ఒంటరిగా మిగిలిపోయి పదిలంగా దాచుకున్న హృదయపేటిక మూతతీసి, గత జ్ఞాప

కాలను రాసిపెట్టిన పాత కాగితాలను వెలికితీసి ... అదేపనిగా ఆలోచించుకుంటూ, చించుకుంటూ ... ఎప్పటికో తెలివి తెచ్చుకుని, తన తెలివిమాలిన తనానికి ఎంతగానో నొచ్చుకుని, తనను తానే నిందించుకుంటూ ఉంటోం దీమధ్య.

అపర్ణ ఇంకా కొంప జేరలేదు. దీనికి మధ్య తిరుగుళ్లు ఎక్కువైనయి. పన్నెండు కావస్తోంది? ఇప్పటిదాకా ఇది ఎక్కడికి పోయినట్లు ? ఎక్కడికన్నా పోనీ...ఏట్లోకి... వల్లకాట్లోకి ... దీని కోసం తను భోజనం చెయ్యకుండా ఎదురుచూస్తున్నదన్న జ్ఞానమే లేదు. ఆకలి, కడుపులోని పేగుల్ని కొంద చిలువలా చుట్టుకుని పడుకుంది. నిర్మలకు దప్పికవుతోంది. కనీసం మంచినీళ్లయినా తాగాలంటే కుర్చీలో నుంచి లేవాలి, లైటువెయ్యాలి, వంటిం ట్లోకి వెళ్లాలి... బద్ధకం కదల నివ్వటం లేదు. మళ్ళీ రంగులు రంగులుగా రింగులు రింగులుగా తిరుగుతూ ఆలోచనలు...

కాలం అన్నన్ని కలల అలల్ని రేపుతూ ఉంటే, పురుషుడు చుట్టుముట్టి ఆశల వలలు విసురుతూ ఉంటే, ఆడ పిల్ల చేతికి చిక్కిన చేపపిల్లకాక మరే మవుతుంది ? ఆపైన దాని బ్రతుకేమవుతుంది ? కడకు మళ్ళీ ఆడపిల్ల కడలి పాలే అవుతుందా ? ఈ ఆద్యంతాల నడుమ కడగండ్ల వడగళ్లవానే మిగులుతుందా ?

ఓ జల్లు విసురుగావచ్చి ఆమె పాదాలను తాకింది. నిర్మల చటుక్కునపాదాలను వెనక్కి లాక్కుంది. ఇంత ఈ వాన ఇవాళ్టికి వెలవదు కాబోలు. ఏమిటో ఈ చిత్రం ? నేలపైనున్న నీరు మరిగి ఆవిరై, అంతెత్తుకు ఎగిరే మేఘ శకలాలై, తిరిగి కరిగి నీరై, నేల పాలై – అప్పుడంత ఎత్తుకు ఎరగట మెందుకూ, ఇప్పుడింత దీనంగా, హీనంగా, మట్టిపాలై పోవటమెందుకూ .. తనూ ఇంతేకదూ, నేలమీద నడుస్తూ, ఒద్దికగా జీవిస్తూండగా, నిద్రిస్తూన్న తన జీవనవనంలోకి ఆయన వచ్చి, ఎక్కడో గుండె కుదుళ్లలోని గూళ్లలో నున్న యవ్వన కోరికల శారికలను ఒక్కసారిగా రివ్వున ఎగరగొట్టి, కేరింతలుకొట్టి, తన చేయిపట్టి రారమ్మని ముందుకులాగితే...మీద పడితే, అదిమిపెడితే ... తనుమాత్రం మనిషి కాదా, మగువ కాదా ?

కుర్చీలో కూర్చున్న నిర్మల నెమ్మదిగా కదిలింది. ఆమెకు దాహంగా ఉంది. ఈ పిల్లముండ ఇంకా రాలేదు. తేదీ మారిందిగాని, దీనికి కొంప గుర్తుకు రాలేదు. 'ఈ తద్దినం నా కొద్దు' అంటే ఆయన విన్నాడు కాదు. పైగా అన్నాడు కదా "నా మీద నీకేమాత్రం గౌరవం ఉన్నా అపర్ణను నీ కూతురులా చూసుకో."

ఆడదాన్నయి పుట్టినందుకు, అర్థ బ్రతుకు వ్యర్థంగా గడిచినందుకు ఎప్పుడన్నా పిల్లలు లేరన్న చింత రవ్వంత కలిగినా వింత లేదుగాని ఇలాంటి రాక్షస పిల్లను తన కూతురుగా అంగీకరించ లేదు. ఆ మాటకొస్తే ఏ ఆడదీ మరొకరి కడుపున పుట్టిన పిల్లల్ని తన పిల్లలుగా చస్తే భావించలేదు. ఎవరన్నా అలా భావిస్తున్నట్లు, ప్రేమిస్తున్నట్లు కనిపిస్తే, కేవలం అలా నటిస్తున్నారన్నమాట. ఇద్దరి స్త్రీలతో ఇంత పరిచయాలు పెంచుకున్నాక గూడా ఆయనకు ఆడదాని హృదయం తెలియలేదంటే ఏమనుకోవాలి ?

అసలింతకీ తన మంచితనమే తనని వంచిస్తూ వస్తున్నది. తన మెతకదనాన్ని అలుసుగా తీసుకునే ఆయన ఆనాటినుంచీ ఈనాటిదాకా ఇన్ని విధాల ... అన్ని విధాలా అన్యాయం చేశాడు.

ఈ కృష్ణమోహనరావు అనే మోహనాకారుడు ఆనాడు తన ఇంటి పక్కకు, తన పక్కకు చేరకుండా ఉంటే, ఈనాడు తానింత హేయమైన స్థితిలో ఉండవల్సిన అవసరం ఉండి ఉండేది కాదు.

ఆయన నలభయ్యో పడిలో పడినా, పయ్యెద సర్దుకునే వయసొచ్చిన పిల్లలు ఎదిగొచ్చి ఎదమీద కూర్చున్నా, ఆయన ఇంకా ముప్ఫయి ఏళ్ల లోపుగానున్న మనిషిలాగానే కనబడతాడు. అదృష్టవంతులు కొందరికి ఎన్నేళ్లొచ్చినా, వచ్చిన యవ్వనం అలానే నిల్చి ఉంటుంది. దురదృష్టవంతులు కొందరిని ముందరగా, తొందరగా వార్ధక్యంవచ్చి వాటేసుకుంటుంది. ఆయన మొదటి తరగతికి చెందినవాడు.

ఇందులోనే కాదు, ఎందులోనైనా ఆయనది మొదటి తరగతే. ఆయనకేం తక్కువ? వెయ్యిరూపాయలజీతం. ఇంటి నిండా బోలెడు సామాన్లూ, హంగూ, ఆర్భాటం, రయ్‌మని తిరిగి రావటానికో స్కూటరూ, ... కార్యేషు మంత్రిలాంటి భార్యా, కూతురూ, కొడుకూ, ..అయితే చివర చెప్పిన వాటి గురించి, తనకు చివరిదాకా తెలియనివ్వలేదు.

భార్యకేదో జబ్బుచేస్తే రెండేళ్ల పాటు ఆయన అసలు కుటుంబమంతా గుంటూర్లోనే ఉండిపోయినారు. ఈయన ఒక్కరూ ఇక్కడ ఉంటూ ఉండేవాడు. తను ఒక్కతే పక్కవాటాలో ఉంటూ ఉండేది, పగలంతా ఉద్యోగం చేసుకుంటూను, ఎంతకీ నిద్రరాక రాత్రంతా డాబామీద పచార్లు చేసుకుంటూను.

కృష్ణమోహనరావు గొప్ప మాంత్రికుడు ఎవరివైపైనా చూసి మెత్తగా నవ్వాడో, కాలికి ఉచ్చుతాడు బిగించి లాగాడన్నమాటే. కాసేపు మాటా మాటా




కలిపి మాట్లాడాడో, ఎంతటివాళ్లనయినా ఇట్టే బోల్తా కొట్టించాడన్నమాటే. ఆయన వ్యాపార రహస్యమంతా అక్కడే ఉంది మరి

ఆయనెప్పుడూ ఎంతో బిజీ బిజీగా ఉంటాడు. గజిబిజీగా తిరుగుతూంటాడు. వారానికి నాలుగురోజులు ఊర్లు తిరిగి వస్తుంటాడు. తన దగ్గరకు వచ్చిన కాసేపూ ఈ ప్రపంచాన్నే మర్చిపోయి నట్లు ఎంతో కౌతుకంగా తన కళ్లల్లోకి చూసేవాడు. క్షణక్షణానికీ చెరకు వింటి బాణాలను వదిలేవాడు. తామిద్దరిమధ్యా ఆంక్షల వలయాలు చెరిగిపొయ్యేవి. అప్పుడింక కాంక్షల కేబరా డాన్సులు మొదలయ్యేవి.

అమ్మో...కాంక్షలంటే అవి కేవలం మోహినీ పిశాచాలే ! దగ్గరగా వచ్చి, మనకు వచ్చి, నమ్మకంగా అరచేతిని అందిపుచ్చుకుని, నెమ్మదిగా తమవెంట నడిపించుకుని వెళ్తాయి. మనకోసం ఒక్కటొక్కటిగా నవస్వర్గధామాల ద్వారాలు తెరుస్తాయి. మనం ఎదురుగా చూస్తే, కనుగిపి. చెయ్యూపి లోనికి రమ్మని పిలుస్తాయి. అన్నీ తెల్సినా ఆ కాసేపూ మైమరిచిపోయి వెళ్తాంగదా. మన వెనక వెనక్కి వెళ్ళే అవకాశాల తలుపులు దభేల్‌మని మూసేస్తాయి. ఇంక అప్పుడా కాంక్ష అనే కామినీ పిశాచం, చుట్టూ పరిస్థితుల కౌగిలి బిగించి బలంగా నొక్కుతూ, బాధ్యతల గోళ్లతో ములహీన రక్కుతూ ఉంటే, బాధేగాని సుఖం ఉండదు. అప్పుడక్కడ ఆశించిన స్వర్గమూ ఉండదు. కలలు గన్న దుర్గమూ ఉండదు. ఎప్పుడో కళ్లుతెరిచిచూస్తే, తెలివి తెల్లగా తెల్లారాక చూస్తే, ఊరి బయట పాడుబడ్డభవంతిలో,

వి|భ్రాంతిలో మనం ఉండగా, జరిగీ జరగని ఆశ నిరాశల రాక్షస కామ|క్రీడా కలాపాలు ! అంతకుముందు మనం ముద్దుకుపస్తూ |క్రిందికి నెట్టేసిన వాళ్లు చుట్టూ కనిపించకుండా ఉండి వినిపించే విలాపాలు !! పైగా నిర్గతిలేని దుర్గతి !...తన గతీ అలానే అయింది. ఈ కాంక్షలే తనని మోసపుచ్చి, మభ్య పెట్టి, ఆయన కౌగిట్లోకి నెట్టి ... తీరా తెలివి తెచ్చుకునేటప్పటికి చాలా ఆల స్యమైపోయింది ! తను ఒంటరిగా ప్లాట్‌ఫాంమీద మిగిలిపోయింది.

అతి నిరాడంబరంగానే అయినా, ఆయనతో తన పెళ్ళి జరిగిపోయింది. మిస్ నిర్మల ఎమ్మే అయినతను, మిసెస్ కృష్ణమోహనరావు అయిపోయింది. అంతా తన |ఫ్రెండ్సేగాని ఆయన తరవు నుంచి ఒక్కరూ రాలేదు. ఎందుకని అడిగితే కౌగిలి లోగిలిలోకి లాగి సమ్మోహనంగా నవ్వేశాడు. మారు మాట్లాడకుండా తన నోరు తెరవకుండా ఉక్కిరిబిక్కిరి చేశాడు.

ఆ రోజుల్లో తన జీవనవనంలోని ఊహల వృక్షాలనిండా రంగురంగుల మోహాల పూలుపూసి గుత్తులుగుత్తులుగా వేలాడుతుండేవి. అప్పుడా ఆనంద సీమలో సువర్ణరజిత మణిమయ ఖచిత కిరీటాలు ధరించి, అందాల ఉడుపులు ధరించిన భవిష్యత్ స్వప్నాలెన్నో కళకళలాడుతూ, కిలకిలలాడుతూ, కళ్లముందు కదలాడుతున్నట్టే ఉండేవి. |క్రమంగా ఉదయారుణ కిరణాలు విస్త రించేటప్పటికి, |భమలుగొలిపే వెన్నెల కాంతులు వెలాతెలా పోయినయి. అను రాగ రాగ గీతమాలికలు మార్మోగిన తన |బతుకు బృందావనం, ఇప్పుడు అయిష్టపు కీచురాళ్ల ధ్వని |ప్రతిధ్వనించే కీకారణ్యం ... ప్చ్ ... ఈ |బతుకొక |భ్రాంతి.

రోజూ విసుగులేకుండా రొటీన్‌గా మనం ఆడుకునే ఈ ఆశనిరాశల ఆటలో తుదిగెలుపు ఎప్పుడూ మనది కాదు. అంతంచూసే మృత్యువుది. దాన్ని జయించలేదింతవరకూ ఈ ఆరడుగుల మనిషి.

దూరంగా ఎక్కడో, ఎవడో తన కబంధహస్తాలతో ఆకాశాన్ని అప్పడంలా విరిచేసినట్లు ఫెళఫెళమని ధ్వని. దాన్ని వెన్నంటి తళుక్కుమని వెలిగి ఆరి పోయిన కాంతి కిరణం. క్షణంసేపు భరించలేని వెలుగు కొరడా ఝుళిపించి నట్లు వెలిగింది.

ఇదుగో ఇల్లాంటి మెరుపు వెలుగు లాంటిదే, ఆయనతో తను కాపురం వెలగబెట్టిన ఆ మూడునెలల ముచ్చ టాను. ఇంత వెలుగు ఉండగా ఇంక తనకేం తక్కువ అనుకుంది. అదంతా ఎంత |భ్రమ ! అంతలోనే ఆ సంతోష మంతా మటుమాయమైపోయింది. ఇప్పుడు గట్టిగా చుట్టేసుకున్న ఈ

చీకటి మునుపటికన్నా మరింత దట్టంగా ఉంది.

తర్వాత ఎప్పుడో తెల్సుకుంది, ఆయనకో భార్య ఉందనీ, ఇద్దరు పిల్లలు ఉన్నారనీ. తెల్సిన క్షణంలో పిడుగుపడింది. ఆ పిడుగుపాటు తగిలి తనలోని ఉత్సాహం ఉన్నపళంగా చచ్చింది.

"ఏమిటిదంతా?" అని అడిగితే, చిద్విలాసంగా నవ్వేసి, ఎప్పట్లా బుగ్గ మీటేసి, "ఇప్పుడు నీ కొచ్చిన నష్టం ఏమిటీ?" అన్నాడు.

నష్టం ... బ్రతుకును కాష్టంలోకి ఈడ్చాక ఇంక లాభనష్టాల ప్రసక్తి ఏముంది? ఆ తర్వాత తనను ఎప్పటిలా నవ్వించాలని ఆయన ఎన్నో పాట్లుపడ్డాడు. మొక్కుబడిగా ఎవరి ముందన్నా బలవంతంగా నవ్వుతెచ్చుకున్నా, మునుపటిలా స్వచ్ఛంగా ఇంక తను నవ్వలేదు. అమావాస్యనాడు తెల్లని పున్నమి వెన్నెల ఎల్లాకాస్తుంది? అశ్రువులు కురిసే సమయాన, ఆనందాతిహాసం ఎల్లా వెల్లివిరుస్తుంది? లోకం అంతా తనని చూసినవ్వుతుంటే, తను నిండుగా ఎలా నవ్వుతుంది?

ఈ జీవుల జాతకాలు, తను కాసులో నిలబడి నల్లబల్లమీద చాక్‌పీస్‌తో రాసే వ్యాసాలు కావు గదా, పదే పదే చెరిపి వేయటానికీ, తిరిగి మళ్ళీ కొత్తగా రాయటానికీను. తీసుకున్న నిర్ణయం తప్పు అయినా, చేసుకున్నాక ఇంక తప్పదు గదా మరి. అందుకని సహనాన్ని సలహా అడిగింది. అదేమో ఇంక నోరు మూసుకుని పడి ఉండమంది. 'కాదంటే, నువ్వు నీతిమాలినదానివని నీ జాతి అంతా నిన్ను వెలివేస్తుంది. చుట్టూఉన్న తుంటరులకు నీ ఒంటరి బ్రతుకును బలి చేస్తుంది. జాగ్రత్త సుమా'. అని హెచ్చరించింది.

పొద్దున లేచివప్పటినుంచీ ఈ ఆడంగులంతా సమానత్వం అంటూ, వేదిక లెక్కి, పిడికిలి పైకెత్తి, ఎలుగెత్తి అరుస్తుంటే, వీళ్లెంత అవివేకులో అనిపిస్తుంది. ఇప్పుడు సమానత్వం లేదా? అర్హత ఉన్నవాళ్లకు ఎప్పుడూ ఉన్నది గదా. వ్యక్తిగత స్వేచ్ఛ, సమానత్వం అనేవి ధైర్యసాహసాలు లాగా మనకు మనం వెంట తెచ్చుకోవాలిగాని ఒకరిస్తే పుచ్చుకునేవా అవి?

కృష్ణమోహనరావుతో తను సమానం కాదా? అందంలో, చదువులో, సంపాదనలో తెలివితేటల్లో అన్నిట్లోనూ ఆయనకన్నా తాను అధికురాలు. అయినా ఆయన ముందు తనెందుకింత నిస్సహాయురాలై పోయింది? ఆయన వ్యాపారస్తుడు గనుక, మోసం చెయ్యదలిస్తే మాత్రం తను జాగ్రత్తపడవద్దా? పడలేదు. తర్వాత ఆయనతో సరిపడలేదు. రాయి తట్టుకుని ముందుకుపడితే

ఎవరినితిట్టాలి,రాయినాఆ దారినా,మంద గించిన తన ముందుచూపునా ?

గిట్టలేదు కదానికట్టుకున్న భర్తను, కట్టుకున్న బట్టను విడిచేసినంత తేలిగ్గా విడిచేసి, తేలిగ్గా గాలిపీల్చుకోగలిగిన సమాజం కాదుగదా మనది. అప్పుడుండే ఇబ్బందులు అప్పుడూ అంటాయి మరి.

ఆయన తన ప్రథమ కళత్ర పుత్రికా రత్నాన్ని తెచ్చిపెట్టి, దాన్ని తన కన్నబిడ్డగా భావించుకుని పెంచి పెద్దజేసి మనవళ్లనూ, మునిమనవళ్లనూ ఎత్తుకుని, హృదయానికి హత్తుకుని తరించమన్నాడు. ఈ అవమానాన్ని సహించటం ఎట్లాగని పోట్లగిత్తలా మనసెంత ఎదురు తిరిగినా, రాద్ధాంతం చేసి సాధించే సుఖశాంతు లేమీలేవు గనుక గతిలేక ఖర్మసిద్ధాంతాన్ని తల్చు కుంటూ కూర్చుంది. ఆ పిల్లకు తనపొడ గిట్టదు. ఈ ఇంట్లో తామిద్దరూ ఒకే ఒరలోనున్న రెండు కత్తుల్లా ఉన్నారు.

ఈ పిల్లనీ, దీని అబ్బనీ తోలు బొమ్మల్లాచేసి, వెనకనుంచి తాళ్ళు లాగుతూ తన ఇష్టంవచ్చినట్లు ఆడి స్తున్నది, నాయకురాలు నాగమ్మలాంటి దీని అమ్మ.

ఆమెకున్న జాగర్తలో వందోవంతు తనకు ఉంటే, ఈ కథ ఇంకొక రకంగా ఉండేది. కృష్ణమోహనరావును ఆరంభంలో లాగానే, వదలకుండా తన పరిరంభంలోనే బంధించి ఉంటే ఎలా ఉండేది ? ఆవిడా, ఆమె పిల్లలూ వాళ్ళ పంచకిందా, వీళ్ల చూరుకిందా చేరి అంట్ల గిన్నెలు తోముతూ, ఎంగిలిమెతుకులు కెలుకుతూ ఉండేవాళ్ళు. తనది జాలి గుండె కాబట్టి "అయ్యో పాపం" అను కుంది. అలా అనుకుని ఆయన్ని తిరిగి వాళ్లదగ్గరికి వెళ్లనివ్వటమే తాను చేసిన పాపం అయింది.

భర్తనుంచి తాను ఆశించిన సుఖ శాంతులు అంతగా లేకపోయినా, పోనీ ఒకరిద్దరు పిల్లలయినా కలిగితే, వాళ్లను చూసుకుంటూనయినా బ్రతుకుదామను కుంటే, ఆ ఆశా నిరాశేచేసింది నాగమ్మ. తనకు సంతానం కలిగితే, దాన్నీ, దాని పిల్లల్ని చూడదేమోనని కుశంకలు పెంచుకుని, ఆయన్ని మభ్యపెట్టి, బల వంతపెట్టి, ఆయన కింక పిల్లలు కలగ కుండా ఆపరేషను చేయించింది. ఇది తన కడుపులో చిచ్చుపెట్టటం కాదా ?

నాగమ్మగారి పథకం ప్రకారం కొన్నాళ్ళు పొయ్యాక, ఆయన ఈ కొరకరాని కొయ్యనుతెచ్చి, తనకిచ్చి "దీనికి నీవు తల్లివి" అన్నాడు.

తను తల్లిలాంటిదన్న భావన దానికీ లేదు. అది కూతురులాంటిదన్న ఆలో చన తనకూ రాదు. కడుపులో లేనిది కావలించుకుంటే వస్తుందా ? ఏమో, మగవాణ్ణి కావలించుకుంటే, ఎన్నటి కయినా కడుపొస్తుందేమోగాని, ఆడ దాన్ని మరో ఆడది కావలించుకుంటే




చెమటకంపు తప్ప మరేమీ రాదు. ఈ మాత్రం గూడా ఆయనకి తెలియదా? ఇంతకీ ఇదంతా తన ఖర్మ.

నిర్మలకు మళ్ళీ ఆకలి గుర్తుకొచ్చింది. గొంతు తడారిపోయింది. పొడిగా దగ్గువచ్చింది. ఓపికతెచ్చుకుని నెమ్మదిగా లేచి, గదిలోని లైటువేసింది. వంటింటి తలుపుతీసి లోపలికి నడిచింది. కూజాలోని నీళ్ళు రెండు గ్లాసులు గడగడా తాగి చుట్టూ చూసింది. టేబులు మీద అన్నం, కూరా ఉన్న గిన్నెలు ఉన్నాయి. అటూ, ఇటూ రెండు కంచాలు, మధ్యలో మంచినీళ్ల జగ్, రెండు గ్లాసులూ ... అన్నం గిన్నెమీద మూత మూషికరాజులు తీసి చూసినట్లున్నారు. అప్పడాలు. వడియాలూ చవి చూడాలని చూసినట్లున్నారు. పళ్లెం పక్కన పడున్నయి, అవన్నీ సర్దుతూ, అపర్ణ తినే కంచంవైపు చూసింది. తళతళామెరుస్తున్న ఆ పల్లెంలో ఒక సాలెపురుగు ప్రాకుతోంది. దానికోసం కాబోలు బల్లి గోడమీద కాపువేసింది ఈ పురుగు చూడకుండా తిండిలో కలిసిపోతే, ప్రాణానికేమన్నా ముప్పా? ఏమో...

ఖర్మకొద్దీ ఇలాంటి దేమన్నా జరిగితే, తనే గిట్టక చంపిందని నలుగురూ అనరూ? ఆయనమాత్రం ఊరుకుంటాడా? నాయకురాలు నాగమ్మ తనని బ్రతకనిస్తుందా?

కంచాలు కడిగి బోర్లించి, మళ్ళీ ముందుగదిలోకి వచ్చింది. ఇంకా చినుకులు రాలుతూనే ఉన్నాయిగాని, ఇందాకటి అంతటి ఉధృతం లేదు.

చల్లగాలి రయ్‌మని వీస్తుంటే, బాల్కనీ పిట్టగోడదాకా వచ్చి వీధి

చివరిదాకా చూస్తూ నిలబడింది. ఇది ఎంతకీ రాదేమిటి ? ... ఎక్కడ, ఎవడితో ... దీని కెవరు కాపలా కాయ గలరు ? ఇంతకీ దాన్ని ఇక్కడ ఉంచటంలో ఆయన ఆంతర్యం, దానికి తను కాపలా కాయాలనా, తనకు అది కాపలా కాయాలనా ? అసలు మనసు అవినీతివైపు మొగ్గకుండా ఎవరికివాళ్ళే జాగ్రత్తపడాలిగాని, మరొకరు పట్టి లాగితే ఆగుతారా ? అవినీతినుంచి నీతికి, అంటే దిగువనుంచి ఎగువకు ప్రాకటం కష్టంగాని, పైనుంచి క్రిందకు జారటం ఎంతో తేలిక. పైగా పిల్లలకు అదెంతో సరదాగా గూడా ఉంటుంది.

రోడ్డుమీద వర్షంనీరు గూడా ఎగువ నుంచి దిగువకు దూకుడుగా పారు తోంది, గలగలలాడుతూ. ఊరంతా నిర్మానుష్యంగా ఉంది. లోకమంతా నిద్దరమత్తులో ఉంది. వీధి దీపాలు నడుం వంగిన వయోవృద్ధుల్లా ఉన్నాయి. వాటి వెలుతురు చత్వారం వాడిచూపులా నేలమీదకు అనీ ఆనకుండా ఉంది.

పారే ఏరులా ఉన్న నీటిని చిమ్ము కుంటూ తన ఇంటిముందుకు వచ్చి ఆగిందో టాక్సీ. దానిలోనుంచి అపర్ణ దిగింది. అందులోనున్న పరపురుషు డెవడో వీడ్కోలుగా చెయ్యి ఊపాడు.

వాడికి టాటా చెప్పి ఇది పైకి వస్తుం డగా, టాక్సీ వెనక్కి మళ్ళిపోయింది. మెట్లెక్కి వచ్చి అపర్ణ నిర్మలవంక ఒక సారి నిరసనగా చూసి, విసురుగా తల ఎగరేసి లోపలికి వెళ్ళిపోయింది. బట్టలు మార్చుకుని బాత్‌రూంలోకి వెళ్ళి మొహంకడుక్కుని వచ్చింది. టవల్‌తో తుడుచుకుని, అద్దంలో చూసుకుంటుంటే వెనకనుంచి నిర్మల అడిగింది చాలా సౌమ్యంగా.

"ఎవడు వాడు ?"

"...ఫ్రెండ్..." ముక్తసరిగా బదులు చెప్పి ఊరుకుంది అపర్ణ.

"ఇప్పటిదాకా ఏంచేస్తున్నారు ?"

"పిక్చర్ కెళ్లాం..."

నిర్మల కాసేపు మౌనంగా ఊరు కుంది. అపర్ణ అద్దం ముందునుంచి కదిలి, తుండుగుడ్డ దండెంమీద ఆరేసి వచ్చి మంచంమీద కూర్చుంది.

"ఇప్పుడు టైం ఎంతయిందో తెల్సా ?" అని అడిగింది నిర్మల.

అపర్ణ ఒకసారి క్రోధంగా చూసి ముహం చిట్లించుకుంది. నోరు మెదప లేదు.

"నిన్నే అడిగేది ?" అని రెట్టిం చింది నిర్మల. దాంతో "కంయ్" మని మీద పడ్డది అపర్ణ.

"నన్ను అడగటం ఎందుకు ? నీకు టైం ఎంతయిందో తెల్సుకోవాలంటే వాచీ చూసుకో."

"నేను చూసుకుంటూనే ఉన్నాను. నువ్వు ఎంతసేపటిదాకా ఎక్కడెక్కడ తిరుగుతున్నావో చూసుకుంటున్నావా

అని ?" నిర్మల గూడా స్వరం పెంచింది.

"నువ్వు నాకేం చెప్పక్కర్లా. నా కన్నీ తెల్సు."

"నా కన్నీ తెల్సు అనేవాళ్ళకు ఏమీ తెలీదు అని అర్థం."

"నువ్వు నాకేం పాఠాలు చెప్పక్కర్లా."

"నీకు పాఠాలు చెప్పమనే, చెప్పించమనే మీ నాన్న నిన్ను ఇక్కడ పెట్టి వెళ్ళాడు! అర్ధరాత్రి దాటేదాకా ఈ తిరుగుళ్లేమిటి ? ఎక్కడికెళ్ళావు ? ఏం చేస్తున్నావు ? చెప్పు..."

"పార్టీ..."

"ఏమిటీ ?"

"కొంతమంది ఫ్రెండ్స్ కల్సి ఒక గొలుసు నవల రాశాం. అది అచ్చవబోతోంది. మేం అంతా కల్సి ఇవాళ పార్టీ చేసుకున్నాం. అన్నపూర్ణాలో భోంచేసి, రామకృష్ణలో సెకండ్‌షోకి వెళ్లాం. చాలా. ఇంకా ఏమన్నా కావాలా ?" అన్నది అపర్ణ రోషంగా చూస్తూ.

నిర్మల పోతున్న సహనాన్ని పిల్చి తోడుతెచ్చుకుని, నెమ్మదిగా చెప్పింది.

"చూడు అపర్ణా, ఇప్పుడు నువ్వు యవ్వనారంభావేళలో నున్నావు. పాల పొంగులాంటి వయసు తరుముకుంటూ వెళ్తుంటే, పర్యవసానాలను గురించి ఆలోచించుకునే తీరికా, ఓపికా ఉండని రోజులివి. కానీ ఇప్పుడు కుదురుగా నడవకపోతే, తొందరపడితే, ముందుకు పడితే, జీవితంలో ఇంక లేవలేవు. చేయూతనిచ్చి, లేవదీసి, వెంట నడిపించుకుని తీసుకు వెళ్ళేవాళ్ళు ఉండరు. అంతదాకా వచ్చాక, కన్న వాళ్ళు గూడా ఎవరి ఖర్మ వాళ్ళదని వదిలేసి ఊరుకుంటారు..."

"నేనేం చేశానిప్పుడు ?"

"చేశాక, ఇంక మనం చెప్పటానికి, నోరువిప్పి చెప్పుకోవటానికీ ఏమీ ఉండదు. మనం ఎవరికీ ఏమీ చెప్పక పోయినా, అప్పుడు లోకమంతా మన గురించే చెప్పుకుంటుంది."

"అంతా నీ లాగే ఉండరు" ఆ మాట కొరడా దెబ్బలా తగిలింది

నిర్మల ఉలిక్కిపడ్డది. అయినా ఇలాంటి వన్నీ అలవాటే గనుక వెంటనే తమాయించుకుని, ఇంకా శాంతంగానే అన్నది.

"నాలా ఎవరూ ఉండకూడదనే కోరుకుంటున్నాను తల్లీ. నేనొక శాపగ్రస్తురాల్ని. నన్నిలా ఉండమని శపించింది మీ నాన్న. అయినా, నేను మీ అందరి బాగుకోసమే తపించి పోతున్నాను. కానీ నేను మీకు గర్భ శత్రువులా కనబడుతున్నాను. దీని కంతటికీ కారణం ఏమిటని ఇప్పుడు ఆలోచిస్తే, అదుగో అప్పుడు

ఆలోచించకుండా అలా చేసుకోవటం వల్లనేనని..."

"ఇష్టంలేకపోతే వెళ్ళిపోవచ్చుగా. మమ్మల్ని పట్టుకుని వేళ్ళాడ్డం ఎందుకూ ?" అన్నది అపర్ణ మంచం మీద వెనక్కివాలి పడుకుంటూ.

ఆ మాటతో నిర్మలకు సహనం చచ్చిపోయింది. కోపం హెచ్చిపోయింది. "ఎందుకా ? ఎందుకంటే నీలా నాకింత గడ్డిపెట్టే వాళ్లెవరూ లేరని, మిమ్మల్ని పట్టుకుని దేవుళ్ళాడుతున్నానే పాపిష్టి ముండా ?"

అపర్ణ చట్టున లేచి కూర్చున్నది. "ఏవమ్మోవ్, మాటలు జాగర్తగా రానీ. ముండా, గిండా అన్నావంటే మర్యాదగా ఉండదు. ఇంకా నువ్వే మా నాన్నకు ముం..."

"నోర్ముయ్. విశ్వాసఘాతకురాలా. నీ కోసం, నీ యబ్బకోసం, నేను పరువూ, మర్యాదా, సిగ్గూ, అభిమానం అన్నీ విడిచేసి తిరుగుతున్నానే. నేనే గనక తల్చుకుంటే మిమ్మల్ని అందర్నీ నిలవనీడలేకుండా చేసి, చెట్టు కింద కాపరం పెట్టించేదాన్ని. నా మంచితనం మీకు చేతగానితనంగా కనపడుతోంది. రేపట్నించీ చూపిస్తాను నా తడాఖా..."

"ఏం చేస్తావేంటి ?"

"ఏమైనా చేస్తాను, ముందు నీ భాగోతమంతా మీ నాన్నకు చెప్తాను."

"నీ భాగోతం నేనూ చెప్తాను."

"ఏమిటే నా భాగోతం ?" అని గదిస్తూ ముందుకొచ్చింది నిర్మల.

"నా భాగోతం ఏమిటి" అని రెట్టించింది అపర్ణ!

"అర్ధరాత్రి దాటాక టాక్సీలో తీసుకొచ్చి దించుతున్న వాడెవడే ? నీకేమవుతాడే ? ఫ్రెండ్ ట ఫ్రెండ్ ... బోడి ఫ్రెండ్."

"నా యిష్టం నువ్వు అనవసరంగా మాటలంటే పడి ఉండేవాళ్ళెవరూ లేరిక్కడ."

"పడి ఉండకపోతే పోవే. నీ యిష్టం వచ్చిన వాడితో లేచి పో."

"పోతాను. ఇప్పుడే పోతాను. నీచేత ఈ మాటలు పడటంకన్నా, హుస్సేన్ సాగర్‌లో దూకిచస్తే నయం'' అని లేచి విసురుగా వెళ్ళిపోతున్న అపర్ణ వెంట పడి బాల్కనీదాకా దాదాపు పరుగెత్తుకుని వెళ్ళి, చెయ్యిపట్టుకుని బలవంతంగా వెనక్కిలాక్కొచ్చి, విసురుగా మంచం మీదకు తోసేసింది నిర్మల.

"కదిలావంటే చంపేస్తాను. నోరు మూసుకు పడుండు. ఈ అర్ధరాత్రి నువ్వెందులోనన్నా దూకి చస్తే, పోలీసులు నన్ను చంపుకుతింటారు. నీకు ఇష్టంలేకపోతే, మీ నాన్నను పిలిపిస్తాను. నే చెప్పేది నే చెప్తాను. నువ్వు చెప్పేది నువ్వూ చెప్పు. ఆ తర్వాత ఆయనా, నువ్వూ పోయి ఏ గంగలో నన్నా దూకండి. నాకేం పట్టదు...''

అపర్ణ మంచంమీద బొక్క బోర్లా పడి వెక్కివెక్కి ఏడుస్తూ, మధ్యమధ్య చీదేస్తూ, కాసేపటికి నెమ్మదిగా కునుకేస్తూ, లేస్తూ, మళ్ళీ రోదిస్తూ రాత్రంతా గడిపేసింది.

నిర్మల తలుపు గడియవేసి, గుమ్మానికి అడ్డంగా తన
కూర్చుని, అంతలోనే కునికిపాట్లు పడుతూ ఆ రాత్రంతా గడిపేసింది.

తెల్లారి లేచాక మళ్లీ ఎవరి పనుల్లో వాళ్ళు మునిగిపోయినారు. నిర్మల కాలేజీకి వెళ్ళింది. అపర్ణ గూడా పుస్తకాలు పుచ్చుకుని రోజూలాగానే ఇల్లు వదిలి వెళ్ళింది.

ఆ తర్వాత రెండురోజులు గడిచినా అపర్ణ ఇంటి ముఖం చూడలేదు. నిర్మల ముఖం పెంకులా మాడిపోయింది. ఆమె గాభరాపడింది. కంగారు ఎక్కువైంది. వెతుకుదామంటే, ఆ పిల్లకు స్నేహితులెవరెవరో, ఎక్కడున్నారో గూడా నిర్మలకు తెలియదు. స్కూల్లో కనుక్కుంటే అక్కడికి రాలేదని చెప్పారు.

క్లుప్తంగా విషయం తెలియజేస్తూ వెంటనే బయల్దేరి రమ్మని కృష్ణమోహనరావుకి టెలిగ్రాం ఇచ్చింది.

ఆయన రావటం రావటమే నిప్పులు కురిపిస్తూను, చిందులు తొక్కుతూనూ వచ్చాడు.

"దాన్ని ఏం చేశావు నువ్వు? నిజం చెప్పు..." అని దండించాడు.

"నేనేమీ చెయ్యలేదు. అర్ధరాత్రిళ్లు కొంపజేరుతుంటే, ఇలాగయితే నా దగ్గర ఉండొద్దన్నాను. ఆ మాత్రానికే దానికి పౌరుషం పొడుచుకొచ్చింది." అని వివరించబోయింది నిర్మల.

ఆయనకు వినే ఓపిక లేకుండా ఉంది. చిటపటలాడుతున్నాడు.

"అది పసిపిల్ల. దానికి తెలియక ఏదన్నా తప్పుచేస్తే మాత్రం నువ్వు చెప్పే విధంగా చెప్పాలిగాని, దాన్ని వెడగొట్టింది చాలక, ఇల్లు నెక్కగొడతావా?"

"అదుగో ఆ మాటే అనొద్దు. నేను నీ కోసం, నీ పిల్లకోసం ఏంచేసినా, అది నాకే ఎదురు తిరిగి కొడుతోంది. నీకో నమస్కారం పెడతాను. నన్నిలా వదిలేసి పొండి." అని తప్పని కట్టం చేస్తూ రెండుచేతులూ మోగించింది.

"ఏం వాళ్ళు ఎలా ఉందే కట్టుకున్నవాణ్ణి బొమ్మని ఏం చేద్దామని?"

"వంగంలో దూకుదామని. నిన్ను కట్టుకున్నప్పుడు గూడా తెలియకుండా నే చేసిన పని అదే. నిశ్చింతగా తడి గుడ్డతో గొంతులు కోసే రకమని తెలియక..."

ఆ మాటతో కృష్ణమోహనరావు ఆవేశాన్ని పట్టలేకపోయినాడు. ఛెళ్ళుమని నిర్మల చెంపమీద కొట్టాడు. మునిపంటితో క్రింది పెదవిని నొక్కిపెట్టి దుఃఖం ఆపుకుంటున్న ఆమెకు ఆ దెబ్బతో దిమ్మ తిరిగిపోయింది. క్రింది పెదవికి పైపన్ను గుచ్చుకుని నెత్తురు చిమ్మింది. అరచేత్తో పెదవిని తుడుచుకుని, రక్తాన్ని చూసుకునేటప్పటికి, నిర్మల గుండెల్లో కోపం రెల్లుగడ్డిలా భగ్గున మండింది. ఆమె అహం గుండు దెబ్బతిన్న సింహంలా ఎదురు తిరిగింది.

"నన్ను కొడతావా నువ్వు? ఎక్కడిది నీకీ హక్కు?" కాళికాదేవిలా మారి కళ్ళల్లోనుంచి నిప్పుల వర్షం కురిపించింది, ఎప్పుడూ నిండుకుండలా నిర్మలంగా ఉండే నిర్మల.

"భార్య భర్తకు అణిగి మణిగి ఉండాలి. లేకపోతే సామ దాన భేద దండోపాయాలు ఉండనే ఉన్నాయి..." అని తనను తాను సమర్థించుకోబోయి నాడు కృష్ణమోహనరావు.

"నన్ను చావగొట్టే మొగాడు దొరకడనా నిన్ను కోరి చేసుకుంది? భార్య మెళ్లో తాళిగట్టటానికీ, గొర్రె మెడలో తాడుకట్టటానికీ తేడా లేదనుకునే నిన్ను గుడ్డిగా వరించటం నాదే పొరపాటు. పసుపుతాడు కంఠానికి బిగించి, రోజు రోజూకూ బిగించి లాగుతూ దాన్నే ఉరి తాడుగా మార్చిన నువ్వు నాకు భర్తవెలా అవుతావు? నువ్వు నా శత్రువ్వి. ద్రోహివి. నీచుడవు..."

కృష్ణమోహనరావు క్షణకాలం దిగ్భ్రమ చెంది నిరుత్తరుడైనాడు. తమాయించుకుని ఇంక రాజీమార్గానికి రావాలనుకున్నాడు.

"నిర్మలా నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెలుస్తోందా? నువ్వు కోపంతో కాదన్నంత మాత్రాన చెరిగి పొయ్యేదికాదు మన సంబంధం. భార్యాభర్తల అనుబంధం, జన్మ జన్మల బంధం..."

"నీ బొంద బంధం. గెటవుట్... ఇంకా ఇక్కడే తగలడావేం? పో...పొమ్మంటుంటే..." వర్షించే మేఘంలా ఏడుస్తూనే ఉంది, గర్జిస్తూనే ఉంది.

"హుఁ.. నన్నుకాదని నువ్వెలా బ్రతుకుతావో అదీ చూస్తాను.'' అంటూ కృష్ణమోహనరావు రోషంగా బుసకొట్టి, పెద్ద పెద్ద అంగలతో అక్కడినుంచి వెళ్ళిపోయినాడు.

ఇన్నేళ్ళ జీవితంలో ఎన్నడూ ఒకరి చేత ఒకమాట చెప్పించుకోవటం ఎరుగని నిర్మల, ఈ కృష్ణమోహనరావు చేతిలో చావుదెబ్బతిన్నది. ఆ నిస్తేజంలో నుంచి తేరుకోకముందే, పక్కవాటాలోని కరుణాకరం వచ్చి పలకరించాడు.

"ఏమిటి నిర్మలగారూ, ఏదో గొడవ పడుతున్నట్లున్నారు...అరెరె, ఆ రక్తం ఏమిటి?" అంటూ చొరవగా దగ్గరకి రాబోయినాడు.

"నాకేం వర్వాలేదు. దయచేసి నన్నిలా వదిలెయ్యండి మీకో నమస్కారం పెడతాను'' అంటూ దాదాపు అతన్ని బయటికి గెంటేసి, ధన్‌మని తలుపుమూసేసింది.

నిర్మల పరుపుమీద పడిపోయి, బాణందెబ్బతిని రక్తాన్ని స్రవిస్తున్న నెమలిలా, కళ్ళల్లోనుంచి నెత్తుటి కన్నీటిని బొట బొట కారుస్తున్నది.

కిటికీలోనుంచి విసురుగా లోపలికి దూసుకొచ్చి, మొరటుగా మీదబడి జుట్టును చెదరగొడుతూ, ఒంటిమీద బట్టల్ని ఎగరగొడుతున్నది హోరుగాలి.

ఎవరికింక జాలి.

# నిజం నిష్ఠురం



## బూర్లె నాగేశ్వరరావు

వజ్రగిరి నగరానికి ఎక్కడినుంచో ఒక బ్రాహ్మణుడు ఉగాది రాబోతూండగా దిగాడు. అతను పెద్ద చదువుకున్నవాడిలాగా లేకపోగా కొంచెం పిచ్చివాడిలాగా కూడా కనిపించాడు. కాని అతను నలుగురి జాతకాలు చూసి, జరిగినదీ, జరుగుతున్నదీ ఏ మాత్రమూ పొరపాటు లేకుండా చెప్పాడు.

ఇంతలో ఉగాది వచ్చింది. ఆ రోజు సాయంకాలం ఊళ్లోవాళ్లు ఊరి దేవాలయంలో పంచాంగ శ్రవణం ఏర్పాటు చేసి. ఆ పనిని బ్రాహ్మడిమీద పెటారు.

ఆయన సంవత్సర ఫలితాలు చెబుతూ చిట్టచివరకు, " ఈ సంవత్సరం మొదలుకుని వరసగా మూడు సంవత్సరాలపాటు దేశంలో తీవ్రమైన కాటకం ఏర్పడబోతున్నది. అందుచేత గ్రామస్థులు ధాన్యం నిలువచేసుకుని పొదుపుగా వాడుకోవటం మంచిది," అని హెచ్చరించాడు.

పురాణ శ్రవణానికి వచ్చినవారిలో చాలామంది ఈ హెచ్చరికను లెక్క చెయ్యలేదు. ఆ దేశం సుభిక్షమైన దేశం. ఎన్నో తరాలుగా అక్కడి

ప్రజలు కాటకమన్నది ఎరగరు. కొద్దిమంది ఆ బ్రాహ్మడితో, "మాకు ఏ భయం వచ్చినా కరువు భయం మాత్రం లేదు. చుట్టుపక్కల దేశాలన్నీ క్షామం వాతపడినా మాకు తిండిలోటు ఉండదు. మా గాదెలు ఎప్పుడూ నిండుగా ఉంటాయి," అన్నారు.

బ్రాహ్మడు చేసిన హెచ్చరికను కొద్ది మంది వర్తకులు పట్టించుకున్నారు, కాని వాళ్లు పైకి ఏమీ అనలేదు.

గ్రామస్థులు తన హెచ్చరిక పట్టించు కోకపోయేసరికి, బ్రాహ్మడు తిన్నగా రాజుగారి వద్దకు వెళ్లి మూడేళ్లపాటు దేశం తీవ్రమైన తిండి కరువుకు గురి కాబోతున్నదనీ, కావాలంటే రాజుగారు నక్షత్ర జపాలూ, గ్రహశాంతులూ చేయిస్తే చేయించవచ్చుననీ చెప్పాడు.

పిచ్చివాడిలాగా కనిపించే బ్రాహ్మడి మాటల్లో రాజుకు గురి కుదరలేదు. ఆయన బ్రాహ్మడితో," "తరవాత చూస్తాం. అయినా దేశంలో నాలుగేళ్లకు సరిపడే ధాన్యం నిలువ ఉన్నది. మూడేళ్లు పండకపోయిన అంత బాధ ఉండదనుకుంటాను," అన్నాడు

"మహారాజా, నిలువ ఉన్న ధాన్యం మాయం కావటం కూడా కరువులో ఒక భాగమే. మీ దేశ ప్రజలకు తిండిదగ్గిరా పొదుపు తెలిసినట్టులేదు. వాళ్లను కొంచెం హెచ్చరికగా కూడా ఉండమ నండి,'' అని చెప్పి బ్రాహ్మడు వెళ్లి పోయాడు.

అది మొదలు ఆ బ్రాహ్మణ్ణి చూసిన వాళ్లందరూ ఆయనే క్షామదేవత అన్నట్టు, భయం భయంగా చూడ సాగారు. నిజం నిష్ఠురం అన్నమాట అబద్ధం కాదుగదా !

బ్రాహ్మడు చెప్పినట్టే. ఆ యేడు వర్షాలులేవు. ఒక్క రైతు కూడా తన పొలానికి నాగలి కట్టలేదు ధాన్యం వ్యాపారులు మంచి ధర పలికారు నిలువ చేసుకున్నవాళ్లు తమ అవసరానికి ఉంచు కోగా మిగిలిన ధాన్యం హెచ్చు ధరకు అమ్మేశారు. కరువు రోజుల్లో రొక్కం అవసరమవుతుందని వారికి తెలుసు.

మొత్తంమీద ఆ యేడు దేశంలో ఎవరూ తిండికి ఇరకాటాన పడలేదు.

కాని మరుసటి సంవత్సరం కూడా వర్షాలులేవు. భూమి నెర్రెలు విచ్చి ఎడారిలా అయిపోయింది. కరువు రాక్షసి నోరు తెరిచింది. జనానికి తీవ్ర మైన తిండి కొరత ఆరంభమయింది. జనం దగ్గిర ఉన్న డబ్బు ఆహార ధాన్యం కొనుగోలుకు ఏ మూలా చాల లేదు. ధాన్యం ధర పాపం పెరిగినట్టు పెరిగిపోయింది. అమ్మితే అట్టెడూ, కొంటే గిద్దెడూ అన్న సామెత అక్ష రాలా నిజమయింది.

రాజుకు ఏంచెయ్యటానికి పాలు పోలేదు. ఆయన ధాన్యపు వర్తకులను

పిలిచి, వారివద్ద ఉంటే అదనపు ధాన్యాన్ని విడుదల చెయ్యమని కోరాడు. తమవద్ద ఉండే ధాన్యం తమ కుటుంబాలకే చాలటంలేదని వాళ్లు రాజుకు విన్నవించారు. వెంటనే వాళ్లు తమ ధాన్యపు బస్తాలను ఈశ్వరుడైనా కనిపెట్టలేనంత భద్రంగా దాచేసుకున్నారు.

బ్రాహ్మడు మాత్రం ధ్వజమెత్తాడు. ఆయన నగరంలో ఉండే ధాన్య వర్తకులందరి దగ్గిరికీ వెళ్లి, "మీ దగ్గిర ఎంతెంత ధాన్యం నిలువ ఉన్నదీ నాకు తెలుసు. మీ రహస్యం నేను ప్రజలకు చెప్పానంటే వాళ్లు మిమ్మల్ని వదలరు. అందుచేత, మీరు ఉంచిన ధాన్యాన్ని బయటపెట్టండి. మీవద్ద ఉన్న ధాన్యం ప్రజలకు రెండేళ్లపాటు సరిపోతుంది," అన్నాడు.

ఈ విధంగా బ్రాహ్మడు బెదిరించిన వారిలో నారాయణశెట్టి అనేవాడు ఒకడు. అతను మిగిలిన ధాన్య వర్తకులతో కలిసి ఒకరాత్రి కుట్రచేశాడు. మర్నాడు వర్తకులందరూ కలిసి రాజుగారి దర్బారుకు వెళ్లారు. రాజు వాళ్లను చూసి, కరువు సమస్యకు పరిష్కారం చెప్పటానికి వస్తున్నారనుకుని చాలా సంతోషించాడు. కాని నారాయణశెట్టి కంటనీరు పెట్టుకొంటూ అన్నమాటలు వినగానే ఆయనకు గుండె జారిపోయింది.

"మహారాజా, మేమంతా మరో దేశం వెళ్లిపోతున్నాం. నావలు కూడా సిద్ధంచేసుకున్నాం. తమవద్ద సెలవు పుచ్చుకోవటానికి ఇలా వచ్చాం," అన్నాడు నారాయణశెట్టి.

రాజు వాళ్లకు ధైర్యం చెబుతూ, "ఈ పని మీరెందుకు చేస్తున్నారు? ఈ కరువు శాశ్వతమా? అయినా, మీరు తిండిలేక చచ్చిపోతున్నారని నేను అనుకోను. ఈ సంవత్సరం ఎలాగో తంటాలుపడితే, వచ్చే ఏడు వర్షాలు కురవటం ఖాయం. తిరిగి మీ వ్యాపారాలు ఎప్పటిలాగే సాగుతాయి," అన్నాడు.

"అలా జరగదు, మహారాజా. ఆ బ్రాహ్మడు మాతో రూఢిగా చెబుతున్నాడు అతను వచ్చే సంవత్సరం కూడా కరువు ఉండేటట్టు చూస్తాడుట! అతను తల్చుకుంటే అంతపనీ చేసేలాగే ఉన్నాడు," అన్నాడు నారాయణశెట్టి.

"ఎవరా సృష్టికర్త?" అని రాజు ఆశ్చర్యంగా అడిగాడు.

"కిందటేడు మన దేశానికి శనిగ్రహంలా వచ్చిన బ్రాహ్మడే. వాడు చూడటానికి పిచ్చివాడులాగే ఉన్నాడుగాని, సామాన్యుడు కాడు. కాకపోతే ఈ కరువు గురించి ముందే ఎలా చెప్పాడు?" అన్నాడు నారాయణశెట్టి.

"మీరు పొరపాటు పడుతున్నారు. ఇంత దేశానికి కరువు వచ్చేశక్తి ఒక పిచ్చి బ్రాహ్మడికి ఉంటుందని మీరెలా

అనుకున్నారు, మీరెవరూ దేశం విడిచి వెళ్లటానికి వీల్లేదు," అన్నాడు రాజు.

వర్తకులు వచ్చినదారే వెళ్లిపోయారు. రాజుదగ్గిర వాళ్ల ఎత్తు పారలేదు. కాని బ్రాహ్మడు వాళ్లకు ప్రాణసంకటమై కూర్చున్నాడు. అతడు తమ నిలువలను ప్రజలకు చెప్పి, తమ ప్రాణాలకు ఎసరు తీసుకురాగలడు. అతడి పీడ ముందు వదిలించుకోవాలి. అందుకు వాళ్లు మరొక ఉపాయం ఆలోచించారు.

ఆకలి బాధ ఎక్కువైన కొద్దీ జనంలో వెర్రి ఆవేశం పెరిగిపోయింది. నారాయణశెట్టి కొందరితో, రాజుతో చెప్పినట్టే, ఈ కాటకం తెప్పించిన వాడు దేవాలయంలో ఉండే బ్రాహ్మడని చెప్పారు. వాళ్లు వెర్రెత్తిపోయి, ఆ బ్రాహ్మణ్ణి పట్టుకుని చితకతన్ని, నారాయణశెట్టి ఇంటిముందరికి తెచ్చారు.

వాళ్లు ఆ బ్రాహ్మణ్ణి, "ఓరీ శని బ్రాహ్మడా ? మాకు కరువు ఎందుకు తెప్పించావు ? మమ్మల్నందర్నీ తిండి లేకుండా ఎందుకు చంపుతున్నావు ? నీ శనిని నువ్వు తీసుకుపోతావా, పోవా ?" అని అడిగారు.

బ్రాహ్మడు వాళ్లతో "అయ్యా, మీరన్నది నిజమే. ఈ కరువు నా మూలంగానే వచ్చింది దీన్ని తర్వాలో నేనే పోగొట్టుతాను. నాకు కాస్త వ్యవధి ఇయ్యండి," అన్నాడు.

"ఆ పని చేసేదాకా నిన్ను కదలనియ్యం," అని ఆ జనం బ్రాహ్మణ్ణి నారాయణశెట్టి ఇంటి పక్కన ఉన్న ఒక పాడుపడిన ఇంట్లో పెట్టి, తాళం వేశారు.

బ్రాహ్మడు తన పరిస్థితి గురించి తలుచుకుంటూ, కిటికి నేల మీద పడుకున్నాడు. కొద్దిసేపట్లో ఏదో ధ్వని వినిపించింది. అది ఒక మూలనుంచి వస్తున్నది. అక్కడ ఒక కలు గున్నది. దానిలోనుంచి రెండు ఎలుకలు పైకి వచ్చి మరొక కలుగులోకి పోవటం బ్రాహ్మడికి కనిపించింది. ఆ ఎలుక నోట ధాన్యం ఉన్నది.

ఎలుకలు కలుగులోనుంచి ఎలా ధాన్యం తెస్తున్నాయి ? అవి జొరబడిన రెండో కలుగే వాటి నివాసం అయి ఉండాలి. మొదటి కలుగు ధాన్యంగల చోటికి దారిఅయి ఉండాలి. నారాయణ శెట్టి ఇల్లు పక్కనే ఉన్నది. ఎలుకలు అతని ఇంటినుంచి ధాన్యం తెస్తున్నాయా ?

ఈ ఆలోచన రాగానే బ్రాహ్మడికి ఏనుగంత బలంవచ్చింది. అతను చూరు నుంచి గట్టివాసం ఒకటి విరిచి, దానితో కలుగును గబగబా తవ్వసాగాడు.

నారాయణశెట్టి ధాన్యం దాచిన చోటు ఎంతో దూరంలేదు. రెండుగంటలు



శ్రమపడి బ్రాహ్మడు అక్కడికి తాను మోయగలిగినంత చేశాడు. తరవాత ఆయన తెల్లవార్లూ శ్రమపడి ఆ గోదామునుంచి ధాన్యంతెచ్చి, పాడుబడిన ఇంట్లో పెద్ద రాశిపోశాడు.

ఉదయం కాగానే కొందరు మనుషులు వచ్చి, "ఏం బ్రాహ్మడా, శని ఎంతదూరం వెళ్ళింది?" అని అడిగారు.

"తిండిలేని వాళ్ళను పిలవండి ప్రస్తుతానికి ఒకపూట గింజలిస్తాను" అన్నాడు బ్రాహ్మడు.

వాళ్ళు వెళ్ళి తమ వాళ్ళందరికీ చెప్పారు. తరవాత ఇతరులకు తెలిసింది. ఆ రాత్రి కూడా శ్రమపడి బ్రాహ్మడు నారాయణశెట్టి గోదాం ఊడ్చేసి, తానున్న ఇంట రాశిపోసి, జనానికి తిండి గింజలు పంచసాగాడు.

ఆకలి రోదనలు నిలిచిపోయాయి.

బ్రాహ్మడు కరువును పోగొట్టుతున్నా డన్నమాట నగరమంతా వ్యాపించింది.

ధాన్యవర్తకులకు ఇది విని రెండు రకాల దిగులుపట్టుకున్నది. ఈ బ్రహ్మడు ఇలా ధాన్యం అడిగినవారి కందరికీ ఇచ్చేస్తూంటే, తాము తమ ధాన్యాన్ని హెచ్చుధరకు అమ్మేదెలా? అసలు ఈ కాటకంలో ఈ బ్రాహ్మడికి పుట్ల కొద్దీ ధాన్యం ఎక్కడినుంచి వస్తున్నది? నిజంగానే అతడి దగ్గిర అద్భుతశక్తు లున్నాయా అని వాళ్లకు అనుమానం కలిగింది.

వాళ్లు బ్రాహ్మడి దగ్గిరికి వెళ్లి చాలా వినయంగా, "అయ్యా, ఈ పాడుబడ్డ కొంపలో ఉన్నట్టుండి ఇంత ధాన్యం ఎక్కడినుంచి వచ్చింది?" అని అడిగారు.

"నన్ను మీరు చావగొట్టించి ఈ కొంపలో పడేశారని తెలిసి నా మిత్రుడైన బేతాళుడు వచ్చి, జరిగిన సంగతి తెలుసుకుని, ఫలాని ఫలానివాళ్ల దగ్గిర ధాన్యం దాగి ఉన్నదని తెలిసికూడా జనానికి చెప్పనందుకు నన్ను కోప్పడి, ఎక్కడో గోదామునుంచి ధాన్యం తెచ్చి పోసిపోయాడు. కరువు ఉన్నంత కాలమూ ధాన్యం తెస్తూనే ఉంటానని మాట ఇచ్చాడు. అంతకంటె మరేమీ లేదు," అన్నాడు బ్రాహ్మడు.

బేతాళుడి పేరు వినగానే వర్తకులకు దడ పుట్టుకొచ్చింది. వాళ్లు వెంటనే తమ తమ ఇళ్లకు పరిగెత్తి తాము దాచిన ధాన్యం చూసుకున్నారు. నారాయణ శెట్టి గోదాము ఖాళీ అయిఉన్నది. బేతాళుడు నారాయణశెట్టి ఇంటికి వచ్చాడని తెలియగానే మిగిలిన వర్తకులకు మరింత భయం పుట్టి, ఆ రాత్రికి రాత్రే, తాము దాచి ఉంచిన ధాన్యపు బస్తాలన్నీ పాడుబడ్డ ఇంటిముందు పేర్చిపెట్టి వెళ్లిపోయారు.

మర్నాడు బ్రాహ్మడు రాజువద్దకు వెళ్లి జరిగినదంతా ఉన్నది ఉన్నట్టు చెప్పి, ఆ ధాన్యం బస్తాలన్నీ స్వాధీనం చేసుకోమనీ, ప్రజలకు న్యాయమైన ధరకు అందించమనీ అన్నాడు.

రాజు బ్రాహ్మడికి క్షమాపణ చెప్పుకుని, మంచి బహుమానాలిచ్చాడు వాటిని తీసుకుని ఆ బ్రాహ్మడు ఆ దేశం విడిచి వెళ్లిపోయాడు,



# కరప్టు పోస్టుమాస్టర్



మానస

'మీకు రూమ్ లేదంటే ఈ వర్షపు రాత్రి ఎక్కడికి వెళ్ళగలను...? ప్లీజ్ ! ఎంతైనా ఫరవాలేదు. ఎలాంటి రూమైనా ఫరవాలేదు. ఎడ్జెస్టు చెయ్యండి." దీనంగా అడుగుతున్నాడు మెడికల్ రిప్రజెంటేటివ్ ముకుందరావు.

"సారీ, సార్ ! ఉంటే ఇవ్వమా? వాన తగ్గేదాకా కావాలంటే ఆ కుర్చీలో కూర్చోండి. అంతకు మించి మరేం చెయ్యలేను" తలవంచుకునే అన్నాడు హోటల్ గుమాస్తా ఏదో రాసుకుంటూ.

ఫస్ట్‌ఫ్లోర్‌లోంచి ఈ భాగవతమంతా

చూస్తున్న సుబ్బారావు క్రిందికి దిగివచ్చి 'రండి సార్! నా రూమ్‌లో ఉందురు గాని-రేపేదైనా ఖాళీ అయ్యేదాకా!' అంటూ ముకుందరావుని తన గదికి ఆహ్వానించాడు. మొహమాట పడుతూనే థాంక్యూ వెరీ మచ్ సార్! అంటూ సుబ్బారావుని అనుసరించాడు ముకుందరావు.

సరిగ్గా అయిదేళ్ళ క్రితం వైజాగ్‌లో అదీ మెడికల్ రిప్రజెంటేటివ్‌లు ముకుందరావు సుబ్బారావుల కలయికకి నాంది!

రాను రాను ఎన్నో చోట్ల కల్సుకుంటూనే వచ్చారు నెలకి ఇరవై అయిదు రోజులు టూర్ చేసి, మిగిలిన ఐదారు రోజులు హెడ్‌క్వార్టర్స్ విజయవాడలో సేదతీర్చుకుంటూ ఉంటారు వాళ్ళు!

ఐదేళ్ళ క్రితం...పరిచయం అవక ముందు ఎవరికెవరో...! బట్. ఆ తరువాత మాత్రం...ఒకళ్ళకొకళ్ళైపోయారు వాళ్ళు!

* * *

సుబ్బారావు చాలా కలుపుగోరు మనిషి. మంచితనం, పరోపకారం అతని జన్మతోసహా వచ్చేశాయి. ఇవన్నీగాక అతడో జాలి మనిషి! తనకేకాదు, ఎదుటివాడికయినా చిన్న కష్టంవస్తేచాలు, తల్లడిల్లిపోతాడు. ప్రక్కవాడు ఆకలితో పడుకుంటే అతనికి భోజనం సహించదు. ఆకలితో దహించుకుపోయే వాడికొక్కడికి అన్నం పెడితే...పదిమంది అతనికి పెడతారు. ఇది సుబ్బారావు నమ్మిన సిద్ధాంతం! లేనివాడికి తగినంత సహాయం చెయ్యడమే అతని ధ్యేయం.

అందుకే,

వచ్చే ఐదారు వందల జీతం...ప్లస్ బేటాడం డబ్బుల్లో మిగిలిందేగాక, మరో వందో ... రెండొందలో అప్పుచేస్తూ ఉంటాడు ప్రతినెలా!

ముకుందరావు కూడా ఇంచుమించు సుబ్బారావులాందివాడే! అయితే ఎటొచ్చీ అప్పుజేసి మాత్రం పరోపకారం చెయ్యడు.

'చెయ్యడు' అంటే చెయ్యలేడు అని అనుకోవాలి! అతని వెనకాల పదిమంది కూర్చుని తినేవాళ్ళున్నారు. వాళ్ల డొక్కలు మాడ్చి...మరొకళ్ళ కడుపులు నింపలేడు.

అదీ, అతని పరిస్థితి...!

* * *

సుబ్బారావూ, ముకుందరావూ హెడ్‌క్వార్టర్స్ విజయవాడ నుంచి...సాధారణంగా ఒకే రోజున బయల్దేరుతారు.

సుబ్బారావు మెయిల్ రూట్‌లో వైజాగ్‌దాకా వచ్చి, అక్కడ్నుంచి రాయపూర్‌దాకా, ముకుందరావు సర్కార్ ఎక్స్‌ప్రెస్ రూట్‌లో కాకినాడదాకా ప్రయాణంచేసి, అక్కడ్నుంచి మెయిల్ లయినులో వైజాగ్ మీదుగా బరంపురందాకా—వెళ్తారు.

చిన్న సైజు కంపెనీల్లో ఉద్యోగా

లేమో . పాపం వాళ్ళు అంతలేసీ ప్రయాణాలు చెయ్యక తప్పదు మరి!

తిరుగు ప్రయాణంలో ఇద్దరూ మళ్ళీ వైజాగ్‌లో కల్సుకుంటారు. అక్కడే ఐదారురోజులు గడపడానికి వాళ్ళకి అవకాశం దొరికేవి. అలా వైజాగ్ వచ్చీ రాగానే వాళ్లు యెప్పుడూ బసచేసే లాడ్జింగులో ఇండెక్స్ బోర్డుమీద పడి పోతుంది. వాళ్ళ దృష్టి.

సుబ్బారావు వచ్చాడా? అని ముకుందరావు, ముకుందరావు వచ్చాడా? అని సుబ్బారావు—ఆతృతగా చూస్తుంటారు.

* * *

ఈ సారి మామూలుగానే బరంపురం వైపు క్యాంపుకెళ్ళిన ముకుందరావు పని ముగియగానే ... వైజాగ్ వచ్చేశాడు. వచ్చి రావడంతోటే పోస్టాఫీసుకి వెళ్లి ఉత్తరాలు చూసుకునేసరికి......అతని గుండె ఆగిపోయినంత పనయింది...!

"వ్యాపార విషయాలలో నువ్వు శ్రద్ధ తీసుకుంటాను" అని మాటఇచ్చినానిలుపుకోలేకపోయావు. ఫలితంగా కంపెనీ ప్రొడక్ట్సుకి మార్కెట్ పడిపోయింది. పైపెచ్చు నీ ప్రవర్తన సరిగా లేదని మాకు అనేక డీలర్సు దగ్గర్నుంచి కంప్లైయింట్సు కూడా వచ్చాయి.

కాబట్టినిన్ను ఈఉత్తరంఅందినరోజు నుంచి...పనిలోంచి తొలగించడమైనది. దాని ప్రకారం, ...

ఆ రోజునుంచీ నీకు జీతం గానీ బేటాలుగానీ ఇవ్వడం జరగదు. వీలైనంత త్వరలో డివిజనల్ ఆఫీసుకి వచ్చి నీ దగ్గర మిగిలిపోయిన శాంపిల్సూ, హ్యాండ్‌బ్యాగూ వగైరాలు మాకు అందజేసి..., నీ అకౌంట్స్ సెటిల్ చేసుకోవాల్సింది...!...

డివిజనల్ మేనేజర్

ముకుందరావుకి బుర్ర పనిచెయ్యడం మానేసింది . బాస్ ఉత్తరం చదువుకునే సరికి. నిశ్చేష్టుడై అలాగే వుండిపోయాడు కాసేపు.

"అయ్యగారూ! దసరా మామూలిప్పించరూ—!" అంటూ వినయంగా చేతులు కట్టుకుని నిల్చున్న పోస్టాఫీసు బంట్రోతు చేతిలో ఓ రూపాయి పెట్టి, గట్టిగా నిట్టూరుస్తూ, వడి వడిగా నడిచాడు ముకుందరావు లాడ్జికి!

* * *

"అనవసరంగావర్రీఅవక ముకుందం ...! ఇది కాకపోతే మరొకటి నేనిప్పిస్తాను నీకు ఉద్యోగం ! సరేనా?" వెన్ను తట్టాడు సుబ్బారావు ఆ మర్నాడు రాయపూర్ నుంచి వచ్చీ రాగానే సంగతి తెల్సుకుని.

"అదంత ఈజీ కాదు సుబ్బారావ్! మరోచోటికి ఉద్యోగంకోసం వెళ్ళితే ఎవడయినా అడుగుతాడుఉన్న ఉద్యోగం నేనెందుకు మానేశాననీ, లేకపోతే ఎందుకు పీకేశారనీ,...! ఖర్మ . నా

రోజులిలా ఉన్నాయి. వెళ్ళిపోతాను ఇంటికివాళే! ఉద్యోగం లేనివాడికి ఈ లాడ్జింగు ఖర్చులు కూడా ఎందుకు...? శుద్ధ దండుగ!" నిట్టూర్చాడు ముకుంద రావు.

"ఊరికే డీలా అయిపోకు ముకుందం ...! ఉద్యోగం అంటే జ్ఞాపకం వచ్చింది. మా కంపెనీలోనే ఓ జూని యర్ రిప్రజెంటేటివ్ పోస్టు ఖాళీగా ఉంది. మొన్న కాన్ఫరెన్సుకి వెళ్లినప్పుడు మా బాస్ చెప్పాడు కూడా చాకులాంటి కుర్రో డ్నెవరైనా చూడవయ్యా! అని, నేను రికమండు చేస్తాను. బాస్ హైద్రాబాదు లోనే ఉన్నాడింకా. నీ అప్లికేషను అక్కడికి పంపించేస్తే... అవసరమైతే ఇంటర్వ్యూపంటికక్కడే చేసేసి బొంబాయి వెళ్లగానే ఆర్డర్సు పంపించేస్తాడు. అంతా పది పదిహేను రోజుల్లో నువ్వు మళ్లీ సర్వీసులో జాయినవ్వొచ్చు ...!" ముకుందరావు భుజంతట్టి మరీ చెప్పాడు సుబ్బారావు.

"ఏమో సుబ్బారావ్! నా కంతా అయోమయంగా ఉంది. గంపెడు సంసా రాన్నెలా ఈదుకురావాలో తెలియటం లేదు. గాడిదకొడుకులు నెత్తిమీద పెట్టు కున్నంతకాలం పెట్టుకున్నారు నాలాంటి. వాడు కంపెనీకి 'వజ్రం' అని అందలం ఎక్కించారు. ప్చ్! ఏం లాభం సుబ్బా రావ్.. ? కాని ఒకటి నా మీద ఎవడో గిట్టక రాసుంటాడు, గాని...కాకపోతే మార్కెట్ పడిపోవడ మేంటి ...? ఏమంటావు...?" ముకుందరావు తన్ను తాను ఓదార్చుకునే స్థితికి వచ్చేశాడు.

"అవన్నీ ఇప్పుడెందుకు ముకుందం! మనం జరగబోయేది ఆలోచించాలి. నువ్వు వెంటనే అప్లయిచేసేసెయ్. ఇదిగో బాస్ అడ్రసు. వస్తాను. నాకింకా అనకా పల్లి ఏరియాలో పనుండిపోయింది. మళ్లీ ఎల్లుండి కల్సుకుందాం...!" అంటూ సుబ్బారావు వెళ్లిపోయాడు.

ఉద్యోగం వస్తున్న ఆశ లేక పోయినా, సుబ్బారావు మాట తీసెయ్య లేక అప్లయిచేశాడు ముకుందరావు, "కేరాఫ్ పోస్టుమాస్టర్...విశాఖపట్నం అనే అడ్రసిచ్చి.

రెండురోజులు ఓపిక పట్టిన తరువాత పోస్టాఫీసులోనే మకాం వేశాడు, జవాబు కోసం.

నాలుగోనాడు రిప్లయి వచ్చింది, ముకుందరావుకి.

"మీ అప్లికేషను అందింది. అర్హ తలూ, అనుభవం ఉన్న మీలాంటి యువకులకు మా కంపెనీ యెప్పుడూ స్వాగతం చెపుతూనే ఉంటుంది. మూడు వందల జీతం ప్లస్ రోజువారి బేటాలేకాక హ్యాండ్సమ్ బోనసుకూడా ముడుతుంది మీకు...!

నేను బొంబాయి వెళ్లి మీకు అపా యింట్‌మెంట్ ఆర్డరూ, టూర్ ప్రోగ్రాం, కఒనెల అడ్వాన్సు పంపిస్తాను. హైద్రా

ఊఁ కానివ్వండి! ఎవరు గెలుస్తారో చూద్దాం!! గెలిచిన వాళ్లకే యీ పూటకి అన్నం!!!



బాద్‌లో ఓ నెల్లాళ్ల ట్రైనింగు తరువాత మీరు లైనుమీదికి వెళ్లవచ్చు—!

మా రిప్రజెంటేటివ్ సుబ్బారావుమీకు అన్నివిధాలా సహకరిస్తాడు....

డివిజనల్ మేనేజర్"

ఎగిరి గంతేశాడు ముకుందరావు ఉత్తరం చూడంగానే! సుబ్బారావు మిత్రుడు కాదు. నిజంగా తనపాలిటి దేవుడు అతనికి ఈ సంగతి చెబితే ఎంత సంబరపడతాడో–? సమయానికి లేడు. విజయనగరం పనుందని వెళ్లాడు... రాగానే చెప్పాలి" ముకుందరావు ఆనందం పట్టలేకుండా వున్నాడు.

* * *

"కంగ్రాట్స్ మైడియర్ ముకుందం! నే చెప్పాగా, మా బాస్ చాలా మంచి వాడని. గుడ్‌లక్ మై బోయ్! ఇదిగో బ్యాగు...!"

"వ్వాట్--? నీ బ్యాగిస్తున్నావేమిటి గురూ, జోక్ చేస్తున్నావా...?"

"జోక్ కాదు ఆర్డర్సు...! పైనించి ఆర్డర్సిలాగే వచ్చాయి ముకుందం...! కావాలంటే చూడు. సుబ్బారావు జేబులోంచి ఉత్తరం తీసి ముకుందరావు చేతిలో పెట్టాడు.

"డియర్ మిష్టర్ సుబ్బారావ్!

మేము మీకెన్ని సదుపాయాలు సమకూర్చినా, దానికి విశ్వాసం చూపించక పోవడమే కాకుండా మమ్మల్నే మోసగించాలని చూస్తున్నారు మీరు. వైజాగ్ నుంచి మీ స్నేహితుడు ముకుందరావు పంపిన అప్లికేషన్‌లో నేను ఇవాళ కలుకున్న మీ రిప్రజెంటేటివ్ సుబ్బారావు ద్వారా మీ కంపెనీలో ఒక వేకెన్సీ ఉందని తెలిసింది, అంటూ వ్రాశాడు.

అంటే అతను మిమ్మల్ని కల్సు

కున్నది పధ్నాలుగో తారీఖన్నమాట.. ; ఆ రోజున మీరు మీ స్వదస్తూరీతో వ్రాసిన "డైలీ రిపోర్టు" ప్రూపు ప్రకారం ఇంకా రామ్‌పూర్‌లో ఉన్నట్టే!

దీన్నిబట్టే మా కర్థమౌతోంది, రామ్‌పూర్ సైడ్‌బిజినెస్ దెబ్బతినడానికి కారణం...!

కంపెనీ రూల్స్ ప్రకారం, 'బిజినెస్' నెగ్లెక్ట్ చేసేవాళ్ళకిచ్చే డిసిప్లినరీ యాక్షన్ క్రింద మిమ్మల్ని ఈ ఉత్తరం అందిన క్షణంనుంచీ పనిలోనించి తొలగించడమైనది.

మీ బ్యాగూ, శాంపిల్సు, లిటరేచరూ వగైరాలు, మేము కొత్తగా అపాయింట్ చేసిన మిష్టర్ ముకుందరావుకి అప్పజెప్పవలసింది...! మీ అకౌంట్స్ త్వరలో సెటిల్‌చేసి, మీకు రావలసింది మీ యింటికే పంపుతాము,

ఎప్పుడూ మీ శ్రేయస్సును కోరే...
డివిజనల్ మేనేజర్''

ఉత్తరం చదివి, దాదాపు కళ్ళలో నీళ్ళు పెట్టుకున్న ముకుందరావు "నీ నోట్లో మట్టి కొట్టలేను నేను. నేను చెయ్యలేను బాబూ ఈ ఉద్యోగం...! ఉద్యోగం పోతే పొయ్యింది గానీ... నీకు అన్యాయం జరుగుతుంటే మాత్రం చూడలేను. ప్లీజ్! తారీఖు పొరపాటున వ్రాసాను అని వ్రాసేస్తాను మీ బాస్‌కి." అంటూ గొడవ చెయ్యడం మొదలెట్టాడు.

"ముకుందం...! నీ పిచ్చిగానీ, నువ్వెన్ని అరచినా వాళ్లు నీకివ్వబోయే ఉద్యోగం ఆపగలరుగానీ ... నాకు మాత్రం మళ్ళీ ఇవ్వరు. మరో దార్లో పోయే దానయ్యని ఓ వంద తక్కువకి బేరం ఆడుకుని కుదుర్చుకుంటారు. అప్పుడిద్దరం కూడా నోట్లో వేలేసుకుని కూర్చోవాలి...!"

"అందుకని ..?"

"అందుకనే ముకుందం... నువ్వైనా ఈ ఉద్యోగం నిలబెట్టుకో! పెళ్ళాం పిల్లలూ గలవాడివి, మరో ఊత దొరికేదాకా, నేను నీ ఆసరాలో ఉంటాను, సరేనా...?"

"సుబ్బారావ్! ఇలా జరుగుతుందని కల్లోకూడా అనుకోలేదు. నన్ను క్షమించవూ...!" గొల్లుమన్నాడు ముకుందరావు.

"ఛ! తప్పు ఊరుకో! యూ ఆర్ ఇనోన్సెంట్" వెన్ను తట్టాడు సుబ్బారావు.

* * *

"మీ రిచ్చిన సూటూ బూటూ వేసుకుని కనపడిన ప్రతివాడినీ ముఖస్తుతి చేస్తూ...బజార్లవెంట బ్యాగు పుచ్చుకుని ఎండకూ, వానకూ తిరిగిన నన్ను... బిజినెస్ ఇంప్రూ చేశావంటూ ఎడిషనల్ ఇంక్రిమెంట్లిచ్చారు. బోనసులిచ్చారు. షేక్‌హ్యాండ్లిచ్చారు. సర్టిఫికెట్లిచ్చారు, పనికిరాని మందుల్నికూడా అంద

మైన సీసాల్లో పోసి, మరింత అందమైన అట్టపెట్టెల్లో పెట్టి...ఇవి మందులుకావు అమృతం అని అనిపించారు నాచేత

ఊళ్లో జబ్బులున్నా, లేకపోయినా, డాక్టర్లని చేతిలో బొమ్మలుగా ఉపయోగించుకునే కీలకాన్ని 'ట్రైనింగ్' అన్న పేరుతో మాకు నూరిపోసి. మా చేత ఎందరో నిర్భాగ్యుల్ని మోసగింపజేశారు.

అలాంటి తప్పుడు పన్లు చేసినప్పుడల్లా...సెహబాష్ అన్నారు...!

కాని,

కాఫీ నీళ్ళైనా దొరకనిచోట, నిద్రాహారాలు మాని (అసలు వాటి సంగతి మరచిపోయి...) నాలుగు రోజుల్లో చెయ్యాల్సిన పని నేను రెండురోజుల్లోనే పూర్తిచేసుకుని ... ఒకింత విశ్రాంతి తీసుకుంటే మాత్రం...డిసిప్లనరీ యాక్షన్ తీసుకోవాలనుకున్నారు.

ఇదేనా మీరు మా పట్ల చూపాల్సిన ఆదరణ...? ఇదేనా మీరు చూపాల్సిన కృతజ్ఞత...? పాత న్యూస్‌పేపర్‌లా తీసి పారేశారు అవసరం తీరగానే! మీకు దయ లేదా,? జాలి లేదా? సానుభూతి లేదా? అంటూ ఏవేవో వ్రాయాలనుకున్నాడు. సుబ్బారావు వాళ్ళ బాస్‌కి.

కాని ఎందుకో ఆ పని చెయ్యలేదు- ఇవన్నీ మర్చిపోయి, కళ్లుమూసుకుని హాయిగా నిద్రపోయాడు...!

* * *

ప్రొమోషన్ లెవల్‌దాకా వచ్చిన సుబ్బారావుని ఎలాగైనా పడగొట్టాలి!

కాని, ఎలా? ఎలా?

అని ఎదురుచూస్తూ—ఆ ప్రమోషని తన 'చుట్టానికే' ఇవ్వాలి అని నిర్ణయించుకుని, సుబ్బారావుని అడ్డులేకుండా చేసుకోడానికే, తిరిగి సుబ్బారావంత యోగ్యుడ్ని—అతని ద్వారానే సంపాదించడానికే—నిరంతరం ప్లాను వేసుకుని కూర్చున్న అతని బాస్‌కి అదృష్టంగా ఇన్నాళ్ళకి ఛాన్సు దొరికిందని అందుకనే ఇంతచిన్న విషయాన్ని కూడా కావాలని రాద్ధాంతంచేసి—అతని ఉద్యోగం పీకించాడని —పాపం సుబ్బారావుకి తెలియదు—

ముకుందరావుకి తెలిసింది!

అదీ,

మూడేళ్ళ తరువాత;

అతనూ, ఇంచుమించు అలాంటి పరిస్థితుల్లో ఇరుక్కున్నప్పుడే!



# రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్

## విజయా వారి సినిమా కథ

(గత సంచిక తరువాయి)

### 6. నిప్పులాంటి నర్సింహం తప్పటడుగు

అలవాటులేని శిలువ నా మెడలో గొంగళీపురుగులా మెదులుతోంది - ఇది ఎప్పుడు తీసి పారేద్దామా అని నా కాకచే తొందర. ఈ మత్తయ్యగాడు ఎంతకీ రాడేం? దగ్గర దగ్గర అయిదవుతోంది - నాలుగు గంటలకే తీసుకొస్తానన్నాడు ఆ పెద్దమనిషి నెవర్నో. గదిలోంచి వీధి గుమ్మంలోకి, వీధి గుమ్మంలోంచి గదిలోకి తెగ తిరిగాను. ఆఖరికి విసుగెత్తి కూర్చున్నాను. అప్పుడొచ్చాడు మేథ్యూ - ఆసామీని వెంట బెట్టుకుని.

"వీరు గేబ్రియేల్ గారని - నీ కోసమే వచ్చారు", అన్నాడు.

"ఏ ఊరండి మనది? నాతో ఏం పని?" అన్నాను.

గేబ్రియేల్ సమాధానం చెప్పకుండా నా వంక ఎగాదిగా చూస్తున్నాడు. నా ఒంటిమీద తేళ్లూ, జెర్రులూ పాకినట్టయింది

"చెప్పండి" అన్నాను కాస్త చిరాగ్గా.

"చెప్పేదేముంది, కుర్రాడు నచ్చాడు", అన్నాడు ఆ పెద్దమనిషి.

కుర్రాడు నచ్చాడంటాడేమిటి? పిచ్చాసుపత్రినుంచి వచ్చాడా? ఇంతలో మేథ్యూ కలగజేసుకున్నాడు-

"ఆదేరా! మీ చెల్లాయికి పెళ్ళి కుదిరిందన్నావుగా, ఆ సంగతే చెబుతున్నారు."

గేబ్రియేలు అందుకున్నాడు-

"అది చెప్పేదేముంది? ఎప్పుడో సెటిలయింది. ఇప్పుడు నే నొచ్చింది, మా అమ్మాయి రోసీని నీకు సెటిల్ చేద్దామని."

"క్రిష్ణ, క్రిష్ణ", అన్నాను పైకే- అనుకోకుండా వచ్చేసింది. పుట్టింది బ్రాహ్మణ పుట్టుకగదా! గేబ్రియేలు బితుక్కుమన్నాడు-

గుడ్డలుగాని ఏమీ గుర్తులేవు. రాజమ్మ అన్నట్టే జరిగింది అక్షరాలా.

ఏదో హోటలు, ఒక ఇల్లు దగ్గర కూర్చున్నాం— నా కంతా కలలాగా ఉంది. వాళ్ళేదో తెమ్మన్నారు— సర్వరు తెల్లటి ప్లేట్లో ఎర్రటి దేదో పట్టుకొచ్చి పెట్టాడు -

"అదేమిటి?" అని అడిగాను.

"తందూరీ చికెన్, కోడి," అంది రోసి.

నాకు కడుపులో తిప్పడం మొదలెట్టింది, ఎప్పుడూ అలవాటు లేంది, పైగా పుట్టింది బ్రాహ్మణ పుట్టక. దాన్ని తలుచుకుంటేనే డోకు— ఎలాగో ఉగ్గబట్టుకు కూర్చున్నాను. నేను తినక పోవడం చూసి ఒక చిన్న ముక్క విరిచి నా నోట్లో పెట్టింది, ప్రేమగా. అంతే- ఆ ప్లేట్లో ఉన్న కూర కోడిగా మారిపోయి నన్ను పొడుస్తున్నట్లు అనిపించింది. కోడికూతలు మొదలెట్టానట- ఒకటే వాంతులట, నన్నెలాగో లాడ్జికి చేర్చారు. ఎవర్నో డాక్టర్ని తీసుకొచ్చారు. ఆయన కోడిఎలర్జీ అన్నాడట. నాకప్పుడేం జరిగిందో తెలియదు. మర్నాటికి కాస్త సర్దుకుంది. రోసి ఇరవై నాలుగు గంటలూ నా మంచం ప్రక్కనే కూర్చుని పరిచర్యలు చేస్తుంటే, ఏదో స్వర్గంలో ఉన్నట్లు అనిపించింది. మంచంమీదే స్పాంజ్ బాత్ - తనే స్వయంగా నాకు పథ్యంపెట్టేది. రెండు మూడు రోజులు హాయిగా పాటలు పాడుకుంటూ గడిపేశాను.

ఒకనాడు నాకు వొళ్ళు కడిగి తుడుస్తూ, నా మొలలో వున్న జందెం చూసింది రోసి. ఆమె కంతా అర్థమై పోయింది. చర్రున అలిగి వెళ్ళిపోయింది. నేను మోసగాణ్ణి అంది-ఇంక నా మొహం చూడనంది ఎన్నివిధాల బతిమాలినా వినదికాదు. ఆఖరికి ఆమె పెట్టె లాగేశాను, తన పెట్టె యిమ్మని పేచీ పెట్టింది. అప్పుడు కూర్చోబెట్టి చెప్పాను, ఎందుకీ నాటకం ఆడాల్సొచ్చిందో. కులం, మతం. మా పెళ్ళికి అడ్డురావని నచ్చజెప్పి మెల్లగా దార్లోకి తెచ్చుకున్నాను.

మత్తయ్యగాడు ఎందుకోసం నా చేత ఈవేషం వేయించినా. చివరికి నాకు అది పెద్ద వరంగా పరిణమించింది నాకు రోసి దొరికింది. (సశేషం)






బస్సు కదిలింది.

పది సంవత్సరాల తర్వాత తిరిగి బందరెళుతున్నాను. బందరు నేను పుట్టి పెరిగిన ఊరు.

డిగ్రీ పుచ్చుకొన్నాక హైద్రాబాదు చేరుకున్నాను. ఉద్యోగం చేస్తూనే 'లా' డిగ్రీ కూడా సంపాదించుకుని హైద్రాబాదులోనే ప్రాక్టీసు పెట్టాను. నాన్నగారు పోవడం, మా ఆస్థిపాస్తులన్నీ దాయాదుల పరం అయిపోవడంతో నేను హైద్రాబాదులోనే స్థిరపడిపోవాల్సి వచ్చింది

ఇంతకాలం తర్వాత తిరిగి పుట్టి పెరిగిన వూరు వెళుతున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. మామయ్య కూతురి పెళ్ళి. 'జ్యోతి'నీ 'బుజ్జి' గాడ్ని కూడా తీసుకు రమ్మని మామయ్య రాశాడు.

కాని బందరుకి పదిమైళ్ళ దూరాన గల పల్లెటూరు మామయ్యది. వానా

కాలం అవడంచేత 'జ్యోతి' అవస్థపడు తుందని తీసుకురావడంలేదు.

తీసుకురాలేదని 'జ్యోతి' కి చాలా కోపం వచ్చింది. పల్లెటూళ్ళ సంగతి తనకి తెలీదు. సిటీలో పుట్టి పెరిగింది జ్యోతి. తను అవస్థపడ్డం నేను సహించ లేను. తను నన్నొదిలి ఒక్క క్షణం వుండనంటుంది. తన పంచప్రాణాలు నామీదే అంటుంది.

జ్యోతిచేత 'లా' పూర్తిచేయించి నా దగ్గర జూనియర్‌గా పెట్టేసుకోడం మంచిదనిపిస్తోంది.

బస్సు పోతోంది.

తియ్యటి అనుభూతులు, పాత జ్ఞాప కాలు గుర్తుకొస్తున్నాయి.

బస్సు విజయవాడ దాటి బందరు రోడ్డుపైన పరుగెడుతావుంటే మనసుకి వుల్లాసంగా వుంది.

అప్పటికీ ఇప్పటికీ కాలం మారినా ఆ పరిసరాలు మాత్రం ఏమీ మారలేదు ఉదయం ఏడవుతుండగా బస్సు బందరు చేరుకుంది. కంచరకొట్ల దగ్గర బ్రీఫ్‌కేస్ పట్టుకొని దిగాను

నన్నెవరన్నా గుర్తుపడతారేమోనని ఆశగా చూశాను. ఆశ నిరాశే అయింది. పదేళ్ళ తరువాత వూళ్ళో అడుగుపెడితే అప్పటికిప్పుడు నన్నెలా గుర్తుపడతారని ఆశపడాలి.

అక్కడ కొత్తగా కట్టిన సినిమా థియేటర్ "రాధిక" నాకు స్వాగత మిస్తున్నట్టుగా కనబడింది. మావూర్లో అంత అందమైన థియేటర్ వెలసి నందుకు నాకు చాలా గర్వంగా అని పించింది.

రిక్షావాళ్ళు నన్ను చుట్టుముట్టేరు. వాళ్ళని తప్పించుకొని కోనేరు సెంటర్ దగ్గరకి చేరాను.

నాకా వూళ్ళో ఎవరున్నారు? ఎక్కడ దిగాలి?

అన్నీ ప్రశ్నలే ఎదురైనాయి.

బందర్లో అన్నిరకాల బజార్లూ సమ్మేళనగా ఒకేచోట వుంటాయి.

బస్‌స్టాండు ఎదురుగా వున్న ఇంద్ర భవన్లో బస చేసాను.

చిన్నప్పుడు నాన్నగారితో ఆహోటల్‌కి చాలాసార్లు వెళ్ళేను. నాన్నగారితో కలసి ఆ హోటల్లో గులాబ్‌జామ్ తిని, కాఫీ తాగిన రోజులు గుర్తుకొచ్చేయి.

నాకెంచేతో ఆ వూళ్ళో అడుగుపెట్టిన దగ్గర్నించి నాన్నగారు గుర్తుకొస్తున్నారు కొండంత అండగా నిలిచి నన్ను ప్రాణాధికంగా చూసుకొన్న దేవుడు నాన్నగారు. ఆయన పోయేక ఈ ప్రపంచమంతా నాకు అంధకారం అయి పోయిందనిపించింది.

స్నానంచేసి బట్టలు మార్చుకొని ఎదురుగా వున్న సైకిల్‌షాపులో ఓ సైకిల్ అద్దెకి తీసుకున్నాను. సైకిల్ తొక్కి పదిసంవత్సరాలయింది. వూరుని

ప్రతి అంగుళం పట్టి చూడాలనుంది నాకు

మా ఇంటివైపుకి సైకిల్ పోనిచ్చాను. ఎత్తుస్తంభాల గాథా అలానే వుంది

నాన్నగారు పోయేక ఆ ఇల్లు అద్దె కిచ్చేసి అందరం హైద్రాబాదు చేరి పోయాం. ఆ వూళ్ళో మాకంటూ చెప్పు కోడానికున్నది ఆ ఇల్లు ఒక్కటే.

నేను ఫలానా అని చెప్పుకొని ఆ ఇల్లంతా ఓసారి చూసుకొన్నాను నా క్షణంలో ప్రాక్టీస్ హైద్రాబాద్‌నుంచి బందరు మార్చేయాలనుంది.

ఆ ఇల్లు మా నాన్నగారు కట్టేరు. ఆ ఇంట్లో నాన్నగారు నలభై ఏళ్ళు నివ సించేరు. వున్నంతకాలం ఆ రోడ్డుమీద నడిచేరు. కర్చీఫ్‌తో కళ్ళొత్తుకున్నాను. తిరిగి రోడ్డుమీద కొచ్చాను. బందరు రోడ్డంట సైకిల్ పోనిచ్చాను.

చిన్నప్పుడోసారి తొం బా యి కాల్వలో స్నానం చేస్తుంటే ఎవరో తన బట్టలెత్తుకపోయారు. ఆ రోజు మామయ్య వచ్చేడు.

బట్టల్లేకుండా ఇంటికొచ్చిన నన్ను వావ చితకబాదాడు మామయ్య

నేనేం చేసినా సమర్థించేవాళ్ళు నాన్న గారు.

మామయ్య నన్ను కొట్టాడని తెలిసి మండిపడ్డారు నాన్నగారు.

కాలేజీ దగ్గరకెళ్ళాను. కాలేజీ ఎదు రుగా చంద్రంబాబాయ్ హోటల్ వుంది. ఇప్పుడా డాబా ఇంట్లో కాక కింద పక్కగా తడికెలతో కట్టిన లోగిల్లో చంద్రం హోటలుంది. చంద్రం బాబాయ్ మారుతున్న కాలంతో ఓమెట్టు పైకి పోవల్సింది పోయి మెట్టు కిందికి దిగా డనిపించింది.

చంద్రం నన్ను అవలీలగా గుర్తు పట్టేసి,

"ఒరే రంగా," అన్నాడు. నన్ను అమాంతం కౌగిలించేసుకున్నాడు.నన్ను చూసిన ఆనందంతో చంద్రం కళ్ళలో నీరు సుడులు తిరిగింది.

"ఎలా వున్నావ్?" అన్నాను

అంటూనే అతన్ని పరీక్షగా చూసేను.

వయసుతోపాటు ముసలితనం వచ్చే సింది చంద్రంకి. ఒకప్పుడు పెద్ద ఫుట్ బాల్ ఆటగాడు చంద్రం. అప్పట్లో అర డజను మందిని అవలీలగా కొట్టేయ గలిగేవాడు. ఆ దర్పం, ఆ ఠీవి చంద్రం బాబాయిలో ఇప్పుడు నాకగ్గనిపించ లేదు.

"మంచితనం, నమ్మకం అన్నీ మీతోనే పోయినయిరా. నీలాంటివాడు మెచ్చుకొకడు మిగిల్తే ఈ వూళ్ళో నాలాంటివాళ్ళకి ఆసరా వుండేది," అన్నాడు చంద్రం.

చంద్రం బాబాయ్ కాఫీ కలిపిచ్చాడు.

గర్వంగా నేను చదువుకొన్న కాలేజీ కేసి చూసాను లోపలికెళ్ళి నా గురు




వైన తెలుగు లెక్చరర్ వెంకట్రామయ్య గార్ని కలుసుకున్నాను.

ఆయనకి నేనంటే ప్రాణం. నన్నెకసార్లు చాలా ట్రబుల్స్‌నించి కాపాడిన దేవుడాయన.

తర్వాత,

యన్. హెచ్. బ్లాక్‌దగ్గర రెండు నేరేడు చెట్లకింద కాసేపు నించొన్నాను. పి.యు.సి. చదివే రోజుల్లో ఆ నేరేడు చెట్టు ఎక్కినందుకు ప్రిన్సిపాల్‌గారు నాకు రెండురూపాయలు ఫైన్ వేశారు.

క్రికెట్ కోర్టుకేసి చూశాను.

ఇప్పుడక్కడ క్రికెట్ పిచ్ లేదు. ఏదో బిల్డింగ్ కట్టేశారక్కడ. నేన్ను లెఫ్ట్ ఆర్మ్ ఫాస్టు బౌలర్‌ని. నేను ఇన్నింగ్స్ ఓపెన్ చేస్తుంటే చాలామంది బాటు పుచ్చుకోడానికి కంగారుపడి చచ్చేవాళ్లు. ఆ రోజులైపోయినాయి. నేను క్రికెట్ ఆడ్డం మానేసి కూడా చాలా రోజులైంది ఇంట్రస్టు పూర్తిగా చచ్చిపోయింది.

పరాసుపేట మీదుగా భాస్కరపురం వేపు వెళ్ళాను.

రిజిస్ట్రార్ ఆఫీసుదగ్గిర కెళ్ళేసరికి నాకు చిన్నమ్మ గుర్తుకొచ్చింది. చిన్నమ్మ నా క్లాసుమేటు నాతూ చిన్నమ్మకి బొత్తిగా పడేదికాదు. నా షోకు తనకి నచ్చేదికాదు. దాని టెక్కుని నేను సహించేవాడిని కాదు. కల్చరల్ వీక్స్‌లో ఓ రాత్రి చిన్నమ్మ ఇంటికెలుతుంటే రాఘవ, నేనూ వెంటపడ్డాం. రాఘవగాడు సైకిల్‌ముందు కూర్చున్నాడు. నేను తొక్కుతున్నాను. చిన్నమ్మ జడ లాగమని చెప్పాను రాఘవకి. కానీ రాస్కెల్ ఆరోజు కొంపముంచేశాడు. చిన్నమ్మ గుండెలమీద చెయ్యివేశాడు. ఆ సమయంలో చిన్నమ్మ కళ్ళల్లో తళుక్కు

మని మెరిసిన కన్నీటి పొరల్ని నేనెప్ప టికీ మర్చిపోలేను. అమానుషంగా ప్రవ ర్తించిన రాఘవని చచ్చేట్టు తిట్టాను నేను.

చిన్నమ్మ మొహం చూడాలంటే నాకు చాలా సిగ్గనిపించింది.

చిన్నమ్మ ఇప్పుడు అమెరికాలో వుంది.

రాఘవగాడు మోటర్ సైకిల్ ఏక్సి డెంట్లో చచ్చిపోయాడు.

తిరిగి తిరిగి మళ్ళీ చంద్రం బాబాయ్ హోటల్ దగ్గర కొచ్చాను.

బాబాయ్ అడిగాడు–

"పెళ్ళయిందా ?"

"ఆఁ మా అక్కయ్య కూతుర్నే చేసుకున్నాను. ఓ వెధవ కూడా తయా రయ్యాడు" అన్నాను.

బాబాయ్ నవ్వేడు.

"అయినా నీ అల్లరి పోయినట్టు లేదురా," అన్నాడు.

చంద్రంబాబాయ్‌తో మాట్లాడ్తుంటే చాలా హోమ్లీగా వుంటుంది. ఏ సమ యంలో అక్కడ హోటల్ పెట్టాడో గానీ అందరికీ అతను బాబాయ్ వరస వాడే అయిపోయాడు.

నేను నవ్వేను.

బాబాయ్ అడిగాడు–

"గంగాభవాని గుర్తుందా ?" అని.

"ఆహాఁ..." అన్నాను.

"అది డేనియల్‌గాడ్ని పెళ్ళిచేసు కుంది" చెప్పాడు.

నాకు ఆశ్చర్యమనిపించలేదు. కారణం అలా జరుగుతుందని నాకు తెలుసు. పదేళ్ళక్రితం నాకు తెలిసిన వాళ్ళగురించి చెప్పడానికి చంద్రం బాబాయ్ ప్రయత్నం చేస్తున్నాడు.

"చిలకలపూడి సంబరాలు జరుగు తున్నాయి రాకూడదూ ?" అన్నాడు చంద్రం.

కార్తీకమాసంలో చిలకలపూడి తిర నాళ్ళు జరుగుతాయి. వెళ్లియ రోజున సముద్ర స్నానాలు చేస్తారు– ఆ సీజన్లో నాకు క్షణం తీరికుండేది కాదు.

నేను, రాఘవ, శివానందం, గోపు కలసి గుడిదగ్గర బీటు వేసేవాళ్ళం. చుట్టుపక్కల పల్లెల్నుంచి వచ్చిన ఆడ పిల్లల వెనకచేరి, వాళ్ళని రాసుకుని పూసుకొని తృప్తిపడేవాళ్ళం. అన్నింటి కంటే బిట్టర్ ఎక్స్పీరియన్స్ఏమిటంటే ఓసారి ఓ అమ్మాయి మాతో రావడాని కొప్పుకుంది. దాన్ని రాఘవగాడే కది లేశాడు. ఇలాంటివాటిలో వాడు ఫస్ట్. ఆ అమ్మాయిని నక్కలతోటలో రాఘవ గాడి రూంకి తీసుకెళ్ళాం.

అమ్మాయి తన పేరు సావిత్రని చెప్పింది.

"తప్పుకద"ఇలా రావడం అని అడి గాను!

–సశేష

సావిత్రి నవ్వింది. నలుగురు కుర్రాళ్ళం ఎదురుగావున్నా సావిత్రి బెదర్లేదు, సిగ్గుపడలేదు.

"సంవత్సరానికో సారిలా తిరనాళ్లకి రావడం నాకలవాటే. నాతోపాటు అమ్మమ్మ వస్తుంది. అమ్మమ్మకి దేవుడి పిచ్చి. నాకు స్టూడెంటు కుర్రాళ్ళంటే యిష్టం," అంది.

"నీకు పెళ్ళికాలేదా?" అడిగాను.

సావిత్రి మంగళసూత్రాలు చూపించింది.

మొగుడు పొలంపని చేస్తాడనీ, రోతగా వుంటాడనీ చెప్పింది. సావిత్రి తను పతివ్రతను కాదని తనకు తానుగా చెప్పుకున్నాక మేం చేస్తున్నపని తప్పు కాదనిపించి కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగించాము.

తర్వాత సావిత్రిని గుడిదగ్గర వదిలేశాం. ప్రతిఫలాన్ని ఆశించకుండా ఆడది వెంటొస్తాను అంటే వద్దనడం మగతనానికే సవాల్.

సముద్ర స్నానాలు జరిగేచోట జనం ఎవరి గొడవల్లో వాళ్ళుంటారు. ఆడపిల్లలు నీళ్ళలో మునగ్గానే పక్కనే నీటిలో మునిగి వాళ్ళని పట్టుకునేవాళ్లం. ఆ వారం రోజులు చివాట్లు తింటూ ఆనందంగా గడిపేసేవాళ్ళం. అదంతా గుర్తుకొచ్చి నవ్వు వచ్చింది.

"ఏం మాట్లాడవ్?" అన్నాడు చంద్రం.

"ఇదివరకు తిరనాళ్ళకి వెళ్తే తిట్టేవాడివి. ఇప్పుడు నువ్వే పిలుస్తున్నావ్?" అన్నాను.

చంద్రం అన్నాడు.

"ఒరే రంగా, అప్పట్లో అన్నిరకాలుగా అందరం పెద్దరికంలో నిన్ను మందలించబట్టే ఈ రోజు హైకోర్టు ప్లీడరివి కాగలిగావు. ఇప్పుడు నీకు వయసొచ్చింది. పెళ్ళాం వచ్చింది. కొడుకు పుట్టాడు. సంసారం వుంది. ఇప్పుడు నువ్వు ఒకరికి చెప్పే స్థాయికొచ్చేవు."

చంద్రం అన్నమాటలు నిజమే.

నేను చేసిన చిలిపి పనులకి సిగ్గనిపించింది జ్యోతికివన్నీ చెబితే ఏమంటుందో. అసలే తిక్కమనిషి. తిరిగి పుట్టింటి కెళ్ళిపోతుంది.

తనకది పుట్టిల్లయినా నాకు సొంత అక్క ఇల్లు. కానీ నాకు బావంటే ఈ రోజుకి చచ్చేభయం. ఆయనకి అయిదుగురు కూతుళ్ళు. అయిదుగురూ పంచరత్నాలే. ఏ కూతురి మీదన్నా పొరపాటున 'ఈగ' వాలిందని తెలిసినా ఛంపేస్తాడాయన.

రాత్రి సిటీ బస్సెక్కి వడ్లమన్నాడు దిగాను.

అక్కడ్నుంచి పొలంగట్లవెంట మూడుమైళ్లు నడవాలి.

వెన్నెట్లో నడక బాగానే వుంది. సిటీలో స్కూటరు కలవాటుపడినా

స్మృతుల పథంలోపడ్డ నాకు నడక ఈజీ గానే వుంది.

నాకు ముందు రెండు ఎడ్లబడ్లు నడుస్తున్నాయి.

వర్షాలు లేకపోవడంచేత దారికూడా బాగానే వుంది. "జ్యోతి"ని కూడా తీసు కొస్తే బాగుండే దనిపించింది.

ప్రతి వేసవి శలవలకి మామయ్య వూరుకొచ్చేవాడ్ని. నాకు ముంజెకాయ లంటే చచ్చేంత ఇష్టం. పాలేరు గంగ న్నతో కాయలు కొట్టించుకొని పొలం గట్టుమీద కూర్చుని తినేవాడిని

చెరువుగట్టు సమీపించాను.

అనుకోకుండా నా కాళ్లు అక్కడ ఆగిపోయాయి.

చిన్నప్పుడు గేలంతో చిన్న చేపల్ని పట్టి, చెంబులో పెట్టి ఇంటికి తీసుకెళితే మామయ్య చెవిమెలిపెట్టాడు.

మెల్లగా నడుస్తూ రావిచెట్టు దాటి రామమందిరం దగ్గిరకి చేరాను. రామ మందిరానికీ మామయ్య ఇంటికీ మధ్య దూరం వందగజాలు చాందినీ కట్టిన పెద్ద పందిరి. పెట్రోమాక్సు దీపాల్తో వెలిగిపోతోంది.

నన్ను చూస్తూనే మామయ్య ఎదు రొచ్చాడు.

"ఏరా! ఎంత పెద్ద ప్లీడరివయితే మాత్రం నా కూతురి పెళ్ళికి రావడం ఇంతాలస్యమా?" అన్నాడు.

ఆ రాత్రి రెండుగంటల తర్వాత సుభద్ర పెళ్ళయిపోయింది.

బడలికంగా పెళ్ళిపందిరిలోనే వున్న ఈజీ చైర్లో పడి నిద్రపోయాను.

ఉదయం మెలుకువ వొచ్చేసరికి ఫల హారాలు చేస్తున్నారందరూ. నేను కార్య క్రమాలన్నీ ముగించుకొని పందిరిలోకి వచ్చేను.

ఉప్మా తిని కాఫీ తాగి మెల్లగా రామ మందిరం దగ్గరకెళ్ళాను. దేవుడికి నమ స్కారం చేసి మండపం దగ్గరికి వెళ్ళ బోతూ ఆగిపోయాను. మండపం మెట్ల పైన కూర్చుని నావంకే తదేకంగా చూస్తున్న ఓ ముప్పైఏళ్ళ స్త్రీని గమనిం చాను.

నావంక ఎందుకలా చూస్తోంది? ఎక్కడో చూసినగుర్తు. లీలగా గుర్తు కొస్తోంది.

దగ్గరగా నడుస్తూ,

"నువ్వు లక్ష్మివి కదూ!"

అన్నాను.

ఆ మాట అన్నానో లేదో లక్ష్మి రెండుచేతుల్లో మొహాన్ని కప్పేసుకొని వెక్కి వెక్కి ఏడ్చింది.

నాకు కంగారు కలిగింది.

"ఏయ్! ఎందుకేడుపు?'' అన్నాను.

"నేను లక్ష్మినే. నన్ను గుర్తుపట్టారు బాబు. నాకదే చాలు" అంది.

నేను మెట్లపైన కూర్చుంటూ అడి గాను.



"పెళ్ళయిందా? నీ మొగుడేం చేస్తున్నాడు?" అని.

"పెళ్ళికాలేదు," అంది నిర్లిప్తంగా.

"ఎందుకని?"

లక్ష్మి అదోలా నవ్వింది.

"ఈ తనువు నో మా రాజుకిచ్చి మరోడ్ని మనువాడనా ప్లీడరుబాబు!" అంది.

నాకు చెర్నకోలాతో వీపు పగిలేలా కొట్టినట్టయింది.

మంటపానికి పది గజాల దూరంలో ఆడుకుంటున్న కుర్రాడ్ని దగ్గరగా పిలిచింది లక్ష్మి.

"ఇడుగో! వీడు నా బిడ్డ" అంది.

వాడి మొహంలోకి భయం భయంగా చూసేను.

అన్నీ నా పోలికలే. ఆ క్షణంలో నా కాళ్ళ కింద భూమి కదిలిపోతున్నట్టుగా అనిపించింది.

"ఇక్కడందరికీ తెలుసా?" అన్నాను.

అలా అడుగుతున్నప్పుడు నా గొంతు భయంతోనూ, స్వార్థంతోనూ, నిండిపోయింది.

లక్ష్మి నవ్వింది.

ఆ నవ్వువెనక లక్ష్మి ఎంత నరకాన్ని అనుభవించిందీ నాకు అర్థమయ్యింది.

"మారాజు బిడ్డవి నువ్వు. నిన్నల్లరి పెట్టడం ఇష్టంలేక ఎవరేమన్నా నా పీక నొక్కేసుకున్నాను. మనువు లేకపోయినా నీ బిడ్డకి తల్లినై మోడునై పోయి బతుకుతున్నాను రంగబాబూ" అంది.

ఆ క్షణంలో లక్ష్మిపైన నాకు విపరీతమైన గౌరవం పెరిగిపోయింది. చదువు సంధ్యల్లేని పల్లెటూరి మనిషే అయినా, ఓ పేదరైతు కూతురైనా లక్ష్మిలో గల సంస్కారం నన్ను పాతాళానికి తోసేస్తోంది

ఆ పదేళ్ళ కుర్రాడినీ ఎత్తి నా గుండెలకి హత్తుకోవాలనిపించింది. కానీ అశక్తుడ్ని.

నా చేతులకి ఎప్పుడో సంకెళ్ళు పడ్డాయి.

లక్ష్మి కేసి జాలిగా చూశాను. మరేం మాట్లాడలేకపోయాను.

చాలా చాలా అడగాలనీ, మాట్లాడాలనీ వున్నా అక్కడుండలేకపోయాను.

నేను అక్కడ్నించి వచ్చేస్తుంటే లక్ష్మి కన్నీళ్ళతో నన్ను చూడ్డం గమనించాను.

బి ఏ. చదివే రోజుల్లో మామయ్య వాళ్ళ వూరొచ్చేను. ఆ రోజు రాత్రి నాకు నిద్రపట్టలేదు.

అత్తయ్య, పిల్లలు గుడిలో జరుగుతున్న హరికథా కాలక్షేపానికి వెళ్ళారు. మామయ్య లోపల నిద్రపోతున్నాడు.

పక్కనే చాపమీద లక్ష్మి నిద్రపోతోంది.

లక్ష్మి చలమయ్య కూతురు. చలమయ్య మామయ్య పొలాన్ని కౌలుకు చేస్తున్నాడు చలమయ్య ఏదన్నా వూరెళితే లక్ష్మి ఒంటరిగా వుండలేక, మామయ్య వాళ్ళింట్లో పడుకునేది

లక్ష్మి వెల్లకిలా పడుకొనుంది. పవిట చెదిరిపోయింది లక్ష్మి గుండెలు నన్ను ఆహ్వానిస్తున్నాయి. మోకాళ్ళవరకూ చెదిరిపోయిన చీర నాలో ఆవేశాన్ని రెచ్చగొట్టింది. మెల్లగా అదురుతున్న గుండెతో లక్ష్మి పక్కనజేరి మీద చెయ్యి వేశాను.

లక్ష్మి కళ్ళువిప్పింది. నన్ను చూసింది లేవపోయింది. లక్ష్మిని కదలకుండా పట్టుకున్నాను. నా కళ్ళల్లో ఏం చూసిందోగానీ లక్ష్మి మరేవిధమైన అభ్యంతరం చెప్పలేదు.

ఆ రోజు జరిగిన ఆ చిన్న పొరపాటు ఈ రోజున ఇంత భయంకరమైన పరిస్థితి ఎదురు నిల్చేలా చేస్తుందని నేను కలలోకూడ అనుకోలేదు.

ఆ తరువాతసలు నేను లక్ష్మిని మర్చిపోయాను.

నాకు వూళ్ళో మరొక్క క్షణం వుండబుద్ధి కాలేదు.

బ్రీఫ్‌కేసులోంచి చెక్‌బుక్కు తీసి వెయ్యి రూపాయలకి చెక్కురాసి లక్ష్మికి పంపాను.

మామయ్య, అత్తయ్య ఎంత చెప్పినా వినకుండా బయల్దేరాను.

పొలంగట్టుమీద తలవంచుకొని వేగంగా నడుస్తున్నాను.

ఇంతలో పొలంగట్ల కడ్డంపడి లక్ష్మి

పరిగెత్తుకొచ్చి నాకు ఎదురుగా నించొంది.

లక్ష్మి చేతిలో నేను రాసిచ్చి పంపిన చెక్కు వుంది.

లక్ష్మి నాకేసి చూస్తూ నించొంది. లక్ష్మి కళ్ళల్లో నీరుగ్రిరున తిరుగుతోంది.

చేతిలోవున్న చెక్కుని అటు ఇటు తిప్పి చూసింది.

తర్వాత ముక్కలు ముక్కలుగా చింపేసింది.

లక్ష్మి చాలా ఆవేశంగా అంది.

"వెయ్యి రూపాయల్తో నా జీవితాన్ని, నీవల్ల నా కడుపున పుట్టిన బిడ్డ భవిత వ్యాన్ని, సరిచేశాననుకుంటే చాలా సంతోషం రంగబాబు! నీ డబ్బుని నేనే నాడూ ఆశించలేదు. నా బిడ్డని నేను పెంచుకోగలను. కన్న తండ్రెవరో ఆడికి తెలీకపోయినా, ఈ వూళ్ళోవాళ్ళకి తెలీకపోయినా, నాకు తెలుసు. నువ్వెప్పుడన్నా కనబడితే నీకు చెప్పాలనే నేనింతవరకు గుండెల్లోని ఈ బాధని సహిస్తూ ఎదురుచూశాను. ఈ లక్ష్మి నీకు గుర్తులేకపోయినా ఫర్లేదు. కానీ నువ్వెక్కడున్నా నీ పెద్దకొడుకు ఇక్కడున్నాడని మాత్రం మర్చిపోకు." అని వెనక్కుతిరిగి గబగబ వెళ్ళిపోయింది లక్ష్మి.

నేను అయోమయంగా నించుండి పోయాను.

లక్ష్మిలో గల సంస్కారం నన్ను ఆదిలించేసింది.

కానీ నేనేం చెయ్యను?

భారంగా కదిలేను.

మా ఊరు బందరు. అక్కడ సముద్రముంది. అక్కడ గాలి చల్లగా బాగుంటుంది. సపుపు తోటలున్నాయి. మైదానాలు, ఆహ్లాదాన్ని కలిగించే పచ్చికబయిళ్ళు వున్నాయి.

పుట్టి పెరిగిన ఈ వూరునీ, మంచినీ, మంచిని పెంచుకొన్న లక్ష్మిలాంటి మనుష్యుల్ని వదిలి ఎక్కడో కృత్రిమంగా బతుకుతున్న నాదీ జీవితమేనా?

"అయాం గిల్టీ," అనుకున్నాడు.

బస్సు కదిలింది.

దూరం అయిపోతున్న నా ఊరునీ అక్కడి పరిసరాలనీ చూడాలంటే భయంవేసింది. కళ్ళుమూసుకుని నా సీటులో వెనక్కిజారిపోయాను.





# శ్రీకాకుళ చిటికలు

పోలాప్రగడ సత్యనా        మూర్తి

మా 'శ్రీకాకుళం' కౌన్సిలరుగా నిలబడాడని విని మొదట నేను నమ్మలేదు. ఇదేదో పొరబాటనీ ఏ శ్రీకాకుళమో నిలబడితే ఇతనే అన్నారనీ అనుకున్నాను. కానీ 'నిర్లక్ష్యం' కనిపించి ఆ నిలబడింది మన శ్రీకాకుళమే అని చెప్పడంతో నాకు ఆశ్చర్యంతోపాటు వాడి మీద అసహ్యంకూడా వేసింది.

"ఏవిటి వీడి ధైర్యం? ఇదేం కుళాయి గట్టెక్కి ఉపన్యసించడం. కిళ్ళీ కొట్టుదగ్గర తీర్పులు చెప్పడం అనుకున్నాడా?" అని 'నిర్లక్ష్యాన్ని' ప్రశ్నించాను.

"ఏమో; ఎవరు చెప్పినా వింటేనా? నువ్వుకాకపోతే మరొకడు నా పేరు ప్రతిపాదిస్తాడని మొండిగా మొదలెడితే

ఏంచెయ్యను ?" అన్నాడు 'నిర్లక్ష్యం'.

"ఏమిటి ?... వాడిని నిలబెట్టింది నువ్వే నేవిటి ? ఏకేసినట్టుంది. ఆ చవటకి బుద్ధిలేకపోతే నీ కేమయ్యింది ?" అన్నాను.

"ఏమో ! ఆ విషయం నన్నుకాదు వాణ్ణేఅడుగు" అని నిర్లక్ష్యం విసవిసా వెళ్ళిపోయాడు ...

ఆ సాయంత్రం శ్రీకాకుళాన్ని వాళ్ళ ఇంటిదగ్గర కలుసుకున్నాను, నన్ను చూసి కంగారుపడి తను చేసిన పని. సిగ్గుపడతాడని ఊహించానేమో, వాడిలో ఆ చేష్టలేవీ కనిపించక పోవడంతో చకితుణ్ణయ్యాను, "మీరు మిక్కిలి అతి ప్రశాంతంగా కూర్చో" అని మాత్రం అని మౌనంగా దేన్ని గురించో తీవ్రంగా ఆలోచించసాగాడు.

కొంతసేపయాక 'కౌన్సిలరుగా నుంచున్నావట నిజమేనా ?' అన్నాను,

అంగీకార సూచకంగా తల ఊపాడు.

"ఏమిటి నీ ధైర్యం ?" అన్నా.

సమాధానం చెప్పకుండా మందహాసం మాత్రం చేసి ఊరుకున్నాడు, నాకు వొళ్ళు మండింది నాలుగు చీవాట్లు పెట్టి వాణ్ణి మాన్పిద్దాం అనే ఉద్దేశ్యంతో ఇలా అన్నాను,

"అప్పులవాళ్ళకి తప్ప ఇంకెవరికీ తెలియని అనామక శిఖామణివి నీకు కౌన్సిలరయ్యే పలుకుబడి ఏమి ఏడిసిందిరా, డబ్బయినా దండిగా ఉందా అంటే సెకండ్‌హాండ్ కరెంబీడీలే నీదగ్గర ఉండడం గగనం చదువుమాట సరేసరి పోనీ పెర్సనాలిటీ అయినా లేదు. ఎవరైనా వింటే నవ్విపోతారు. ఈ పాటికయినా ఉపసంహరించుకో"

నా మాటలేవీ వాడి చెవికెక్కినట్టు లేదు ఒక్కక్షణం ఆగి చేతిసంచిలోంచి ఒక కరపత్రం తీసి నాకందించాడు. లెదర్ బాగ్‌చూచి ఆశ్చర్యంతో "ఇదెప్పుడు కొన్నావ్ ?" అన్నా.

"అది ఈ సంచీ, లాల్చీ, కళ్ళజోడూ, ఆ చేతిగ్రా ఇవన్నీ ఒకసారే కొన్నా. నిన్ననే దినపత్రిక్కి కూడా చందా కట్టేశాను" అన్నాడు.

వాడి ఎన్నికల హంగామా చూస్తే నాకు నవ్వొచ్చింది. "పిల్లప్పటికి డబ్బెక్కడిది" అన్నా.

"పాత గ్రామఫోను ఉండేదికదూ, అది అమ్మేశా. అది సరేకాని ముందా కరపత్రం చదువు" అన్నాడు.

అందులో ఆ రోజున బహిరంగసభ అనీ ఉపన్యాసకుడు 'శ్రీకాకుళం' అని ఉంది ఆ సభకి అధ్యక్షుడుగా నా పేరు ఉంది. కరపత్రం క్రింద "శ్రీకాకుళం నిశానీ" అని నిశానీ బ్లాకు అచ్చువేసి ఉంది. ఈ ప్రహసనంలో నా పేరేవిటను కాని 'నేను అధ్యక్షుడుగా ఉండను" అన్నాను,

"ఉండకపోతే బలవంతంలేదు. కాని వార్డునిండా కరపత్రాలు ఇంతక్రితమే

పంచిపెట్టబడ్డాయి" అన్నాడు. 'శ్రీకాకుళం.' నాకు వొళ్ళుమండింది. ఈ పాటికే ప్రజలందరి దృష్టిలోనూ నేను ఒక పిచ్చివాడిగా అయివుంటాను, రేపటినుంచి వీధిలోంచి వెళుతూవుంటే "ఫలానా 'శ్రీకాకుళం' సభకి అధ్యక్షుడ"ని నా వెనకాల ప్రజలు అనుకుంటూ నవ్వు కుంటారు, నాకి ఆలోచనతో తేళ్లూ జెర్రులూ పాకినట్టయింది. "నా అనుమతి లేకుండా నా పేరు ఎందుకు వేశావ్!" అన్నాను తీవ్రంగా.

'శ్రీకాకుళం' నా చేతులు పట్టుకుని బతిమాలుతూ సభని పాడుచెయ్య వద్దని నా భరోసా చూసుకునే తా నీదులోకి దిగాననీ, అధ్యక్షుడుగా కుర్చీలో కూర్చుంటే చాలు ఇంకేం చెయ్యక్కర్లేదు. అన్నీ తానే చూసుకుంటాననీ ప్రాదేయపడసాగాడు. సరే చివరికి ఎలాగయితేనేం నేను ఒప్పుకోక తప్పలేదు, తెలిసింది ఎలాగా తెలిసింది. ఇంక కుర్చీలో కూర్చుంటే ఏంపోయిందని అంగీకరించాను.

రాత్రి ఎనిమిదింటికి వీధి మొగలో ఒక టేబిలూ రెండు విరిగిన కుర్చీలూ ఒక హరికేన్‌లైటూ శ్రీకాకుళమే సిద్ధపరచి నన్ను అక్కడికి పిలుచుకు వెళ్లాడు. నేను వెళ్ళేటప్పటికి పిల్లలూ, పెద్దలూ కలిసి పది పదిహేను మంది ఉన్నారు. నేను ప్రశ్నార్థకంగా 'శ్రీకాకుళం' కేసి చూశా.

"నువ్వేం జంకకు. కానిచ్చెయ్యి" అన్నాడు.

నేను లోపల్లోపల వినుక్కుంటూ శ్రీకాకుళంగురించి రెండు పరిచయ వాక్యాలు పలికి కూర్చున్నాను. తర్వాత శ్రీకాకుళం లేచాడు.

"ప్రజల్లారా! ప్రజలన్నానని ఆశ్చర్యపడకండి. సోదరులు కానివాళ్ళని ముఖప్రీతికోసం సోదరులారా అనీ, మనస్సులో వేరే ఆలోచనలు పెట్టుకొని పైకి మాత్రం సోదరీమణులనీ అనడం నా కిష్టంలేదు. అందుకే అలా సంబోధించాను. నేను నాయుడుగారి పార్టీవాడనూ కాను. పెద్ద కాపుగారి పార్టీవాడనూ కాను. నాకు ఓటు వెయ్యమని మిమ్మల్ని దేవురించను. అయినా నాకు కొన్ని అర్హతలున్నాయి ఆ యోగ్యతల్ని మీకు చెప్తాను. అంతే! మీకు ఇష్టం అయితేనే వెయ్యండి. నేను ఇతరుల సొమ్ము తినెయ్యలేదు. ఎవరి కొంపలూ కూల్చలేదు. ఎవర్నీ మోసం చెయ్యలేదు. ఎవరికీ ఉపకారాలు చేస్తానని శుష్క ప్రమాణాలు చెయ్యలేదు. ఇవే నా అర్హతలు.

నేను మీ వార్డు కేవో ఉపకారాలు చేస్తానని వాగ్దానం చెయ్యడంలేదు. కుల తత్వాలు, పార్టీ తత్వాలులాగే వార్డు తత్వాలుకూడా పరిహరించవలసినవే!"

'శ్రీకాకుళం' కంఠం హెచ్చించి మాట్లాడుతూంటే ఆ వార్డులో జనం ఒక్కొక్కళ్ళే నిద్దరపోతున్నవాళ్లు



కంగారుపడుతూ కళ్ళు నులుపుకుంటూ సభాస్థలికి వచ్చి పరిస్థితి చూసి స్థిమిత పడ్డారు. వచ్చిన వాళ్ళు కాసేపు వినిపోదామని కూర్చునిపోయారు. ఈ విధంగా ఒక అరగంటకల్లా సుమారు ఒక వంద మంది శ్రోతలు శ్రీకాకుళానికి లభించారు.

తనకు తెలిసినవి వాళ్ళకి తెలియకుండా ఉండేలాగ ఒక గంట అప్పగించి 'శ్రీకాకుళం' తన ఉపన్యాసాన్ని ముగించాడు. ఇది శ్రోతలలో చాలా మందికి చక్కని ప్రహసనానందాన్నిచ్చింది. కొందరు నవ్వుకున్నారు. కొందరు గుసగుస లాడుకున్నారు. మరికొందరు సభ పూర్తి అవగానే శ్రీకాకుళం చుట్టూ ముసిరి తమ పుస్తకాల్లో సంతకాలు పెట్టమని ప్రాధేయపడసాగారు. అతి కష్టంమీద ఆ గండాన్ని తప్పించుకొని 'శ్రీకాకుళం' సభను పరిసమాప్తి చేశాడు. ఈ విధంగా రోజూ ఆ వార్డులో 'శ్రీకాకుళం' హరికేన్ లైటు మీటింగులు ప్రతి వీధుల్లోనూ సాగుతున్నాయి. జనం విరివిగానే వచ్చేవారట! నేను మాత్రం ఆ రోజు తర్వాత వాడికి కనిపించడం మానేశాను, ఎక్కడ అధ్యక్షుడుగా ఉండవలసివస్తుందో అని.

ఎన్నికల ఫలితాలరోజు రాత్రివీధుల్లో హడావుడి విని ఇవతలికివచ్చి చూస్తే ఒక సైకిలు రిక్షాలో దండలతో మా 'శ్రీకాకుళం' ఊరేగుతున్నాడు. వాడికి జై కొట్టుకుంటూ సుమారొక వందమంది యువకులు ఉత్సవంలో నడుస్తున్నారు. నన్ను చూసి మా శ్రీకాకుళం మందహాసం చేశాడు...

ఒక రోజున మా యింట్లో పేపరు చూసుకుంటూ కూర్చున్న నాకు, మా యింటి ముందు ఒక చిన్న కారు ఆగిన

చప్పుడు వినిపించింది. పేపరు మడిచి వీధిలోకి చూద్దునుకదా కారు డ్రయివరు దిగివస్తూ "అయ్యా కాకలో చైర్మన్ గారు మిమ్మల్ని రమ్మంటున్నారు" అన్నాడు

ఆ రోజున ఛైర్మన్ ఎన్నిక అని గుర్తుకు వచ్చి "ఎవరు ఎన్నిక అయారు చెప్మా" అనుకుంటూ అలాగే నిలబడి పోయాను. ఇంతలో ఆ కారు తలుపులు తెరచుకుని మా శ్రీకాకుళం నవ్వుతూ నాకేసి రాసాగాడు. డ్రైవరు చేతులు కట్టుకుని పక్కకు తప్పుకున్నాడు. నేను విస్తుపోయి అలాగే నిలబడిపోయాను.

'శ్రీకాకుళం' లోపలికి వచ్చి మంచం మీదికి చేతినంచీ కర్రా విసరి కళ్లజోడు తీసి టీపాయమీద ఉంచుతూ "అల్లా తెల్లబోతావేం? లోపలికిరా" అన్నాడు. నేను నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ వాణ్ణి అనుసరించాను. కూచో అని నన్నొక కుర్చీలో కూర్చోపెట్టి తనింకో దాంట్లో కూచున్నాడు.

ఒక్కక్షణం నిశ్శబ్దం.

"కౌన్సిలరుఅయినందుకే ఆశ్చర్యపో తూంటే ఛైర్మన్‌కూడ అయ్యావేమిటి?" అన్నా,

అదంతా ఒకవిచిత్రమైనకథ. మొత్తం ఇరవై ముగ్గురం కౌన్సిలర్లం. అందులో పదకొండుగురు నాయుడుగారి పార్టీవాళ్లూ పదకొండుగురు పెద్దకాపుగారి పార్టీ వాళ్ళూనూ."

"అయితే దేనికీ చెందనివాడివి నువ్వొక్కడివే అన్నమాట."

"మరే — అందులోనూ వాళ్ళిద్దరి బలాలూ సమానంగా ఉన్నాయేమో కథ మరీ రక్తి కట్టింది."

"అవునవును. పైగా లక్షరూపాయ లిచ్చినా ఆ పార్టీలోవాడు ఈ పార్టీలోకి రాడు."

''అదే మనకి లాభించింది. ఏ పార్టీ వాళ్ల ఛైర్మన్ కావాలన్నా మన ఓటు అవసరం అయింది. నా ఓటుకి పాట పెరిగింది. పదివేలదాకా పెరగనిచ్చి నేను డబ్బుకి కక్కుర్తిపడే రకంకాదని రెండు పార్టీలకీ ఖచ్చితంగా తెలియ చెప్పాను. దాంతో వ్యాపారం మరీ బిగి సింది. ఆఖరికి నన్ను ఛైర్మన్‌గా ఒప్పు కుంటాం అనీ, తమ పార్టీ మనిషిగా వ్యవహరించమనీ నాయుడుగారు ప్రత్యే కంగా వచ్చి ప్రార్థించడంతో ఒప్పుకోక తప్పిందికాదు."

''చాలా ఎత్తులే వేశావన్నమాట."

"ఎత్తులేవిటిరా నీ మొహం, నా కసలీ రెండు పార్టీలలో దేనితోటి కలవడమూ ఇష్టంలేదు. ఎందుకు ఒప్పుకున్నానా అని ఇప్పుడు విచారిస్తున్నా.''

"అదేవిటి?"

"అవును. వాళ్ళకి బుద్ధిలేకపోతే నా కేనా ఉండొద్దూ! అక్షరంముక్క రాని, వాడిని నేను ఛైర్మన్ ఏమిటి? అందుకే నా గౌరవార్థం చేయబోతూన్న విందుకి వెళ్ళకుండా ఇక్కడికొచ్చా."



"నిజంగా నీలాంటి నిరాడంబరుడు ఉండడం చాలా అరుదు సుమా!" అన్నాను ఆశ్చర్యంతో అభినందిస్తూ.

"అదేమీ నువ్వు అనుకున్నంత గొప్ప విషయం కాదులే. అది సరేకాని మందు ఈ ఛైర్మన్ పదవికి నా రాజీనామా రాయి. వేలుముద్ర వేస్తాను," అన్నాడు.

"అదేమిటి?" అన్నా.

"అంతేలే!"

"అదేం?"

"ఇంక ప్రశ్నలు వెయ్యకు. ఒక రోజున నువ్వు చెప్పినట్టు విన్నానా, ఇవాళ వినడానికి? ఊ—రాయి" అన్నాడు, శ్రీకాకుళం.

విధిలేక రాశాను వాడు వేలిముద్ర వేసి డ్రైవరు చేతికిచ్చి అది కౌన్సిలర్లకీ, కమీషనరుకీ అందజేయమన్నాడు. ఆ ఉత్తరాన్ని డ్రైవరు వినయ విధేయత లతో అందుకుని వెళ్ళిపోయాడు.

'శ్రీకాకుళం' మళ్ళీ పూర్వంలాగే బ్రాకెట్ విషయాలూ, అందులో తన కున్న పాండిత్యం మెళుకువలు గూర్చి నేను వినకపోయినా చెప్పుకుపోతూ మధ్య మధ్య కరీంబీడి ఆరిపోకుండా పీలుస్తు

న్నాడు. చేతికర్రా, కళ్ళజోడూ, లెదర్ బాగ్ ఈ మూడూ మంచంమీద పడి ఉన్నాయి. నేను వాటికేసి చూసి ఆలోచిస్తూ వాడి మాటలు వింటున్నట్టు నటిస్తున్నా.

ఇంతలో బిలబిలమంటూ పాతిక ముప్పయిమంది లోపలికి చొరబడ్డారు. నేను కంగారుగా లేచి నిలబడ్డాను. వాళ్ళంతా కౌన్సిలర్లూ, ఊళ్ళో పెద్దలూను. వాళ్ళందరూ శ్రీకాకుళాన్ని బతిమాల సాగారు. ససేమిరా తన నిర్ణయానికి తిరుగులేదని శ్రీకాకుళం బిగిసిపోయాడు వాళ్ళు కాళ్ళా వేళ్ళా పడ్డారు. కాదూ కూడదన్నారు. ప్రార్థించారు. ప్రాకులాడారు. ఏమీ లాభం లేదన్నాడు,

తమలో తమకున్న వివాదాలవల్ల తమలో ఎవరూ ఛైర్మన్ అవడం కల్ల అన్నారు. కనుక అందరికీ అంగీకార యోగ్యుడైన అతను ఛైర్మన్ పదవి స్వీకరించి నగర గౌరవాన్ని కాపాడాలన్నారు: అతను అంగీకరించకపోతే అసలు ఛైర్మనే ఉండకపోవడంకానీ తిరిగి ఎన్నికలు రావడంకానీ జరుగుతుందన్నారు. మొదటిదానివలన మునిసిపాలిటీ అపహాస్యం పాలవుతుందన్నారు, రెండవదానివల్ల కౌన్సిలరుగా ఎవరూ నిలబడకపోవడమనే మహా ప్రమాదం సంభవిస్తుందనీ, పట్నంలో ప్రశాంతత నశిస్తుందనీ అన్నారు.

“నేనింత గొడవ అవుతుందంటే అసలు నిలబడకే పోదును తెల్సా” అన్నాడు. శ్రీకాకుళం.

“హమ్మమ్మ... ఆ మాట అనకండి. ఈ ఛైర్మన్ పదవి మీరు అంగీకరించే దాకా మేం ఇక్కడనుంచి కదలం,” అన్నారు వాళ్ళు.

అని, అక్కడే కూచుని సత్యాగ్రహం, మొదలెట్టారు.

కొంత సేపయాక “ఇదెక్కడి సంతయ్యా నాకుపదవి వద్దు మొర్రో అంటే వదలరేం?” అన్నాడు శ్రీకాకుళం

వాళ్ళలో ఎవరూ పెసకలేదు.

“పదవులు సీతాకోక చిలుకల్లాంటివిరా నాయనా. వెంటబడితే చిక్కవు, మనకెందుకని వచ్చికూర్చుంటే వాటంతట అవే వచ్చి మనమీద వాల్తాయి” అన్నాను. నేను, సాధ్యమైనంత నిర్లిప్త ధోరణిలో,

“మరయితే లే_నిన్ను నేను పి. ఏ. గా వేసుకుంటున్నాను. నీలాంటి చదువుకున్నవాడు దగ్గర లేకపోతే, ఆ ఛైర్మన్ పదవి నావల్ల ఏంఅవుతుంది?” అన్నాడు శ్రీకాకుళం చిరాగ్గా చేతికర్రా, సంచీ, కళ్ళజోడూ అందుకుంటూ, “చచ్చాం... ఈ సీతాకోక చిలుక నామీదవచ్చి వాలిందేమిటి?” అని తబ్బిబ్బు పడుతూంటే.” లేవండి పి, ఏ. గారూ, మీరు లేస్తేగానీ ఛైర్మన్‌గారు లేవరు'' అన్నారు కౌన్సిలర్లంతా ముక్తకంఠంతో కోరస్ పాడినట్టు...




నెలాఖరు. అందులోనూ ఆదివారం. జేబులో వున్నది వందరూపాయలు. అవసరం వెయ్యిరూపాయలు.

ఏం చెయ్యాలో తోచలేదు. ఎవర్నడిగినా ఈ నెలాఖరు రోజుల్లో మొండి చెయ్యే ఎదురు. మతిపోయి అబీడ్ రోడ్డులో పడ్డాను.

సారధి కన్పించాడు - దేవుడిలా! వాడు నా బాల్య మిత్రుడు. బంగారు పిచ్చిక. డబ్బులో పుట్టాడు. డబ్బులో పెరిగాడు. డబ్బులో జీవిస్తున్నాడు. కానీ వట్టి పిసినారి. తాగినప్పుడు మాత్రం దానకర్ణుడు.

వాణ్ణి చూడగానే ఓ ఆలోచన



వచ్చింది - ఎరను వేసి చేపను పట్టాలని! సారథిని "వెట్ పార్టీ" కి వప్పించే సరికి నా తలప్రాణం తోకకు వచ్చింది.

అది నా బర్త్‌డే పార్టీ అనీ, బిల్లు నేనే చెల్లిస్తాననీ చెప్తేగాని వాడు దారికి రాలేదు. యిద్దరం బార్‌లో పడ్డాం.

నా జేబులోని ఎనభయ్యారు రూపాయల 'చిలుం' వదలడంతో పార్టీ పూర్తయింది. ఇంకా నా జేబులో పధ్నాలుగు రూపాయ లున్నాయి. రాబోయే డబ్బు గురించి ఆలోచిస్తుంటే అంత ఖర్చయినా నా కేమీ బాధ అన్పించలేదు. బార్‌లో నుండి బయటపడ్డాం.

మాంచి స్వింగ్‌లో వున్నాడు సారథి. యిక అప్పు సంగతి అడగొచ్చు అను కొంటున్నా.

యింతలో ఎక్కణ్ణించో వూరోళ్ళ కారేసుకొని వూడిపడ్డాడు, రామారావ్! వస్తూనే "రారా సారధీ! నిన్నింటి దగ్గర డ్రాప్ చేస్తాను." అంటూ నా బంగారు పిచ్చికని గద్దలా తన్నుకుపోయాడు.

మతిపోయినట్లయి నే నలాగే నిలబడి పోయాను. తర్వాత తెలిసింది - రామారావు ఆ రెండువేలు సారథి దగ్గర ఆ 'స్వింగ్' లోనే అప్పుపట్టేశాడని.



ధర్మారావు ఇంట్లో సీతాఫలం మొక్క పెద్దదై తొలిసారిగా రెండు కాయలు కాసింది. కాయలు ముదిరి కళ్ళు విచ్చుకుని మెత్తబడ్డాయి.

ధర్మారావు భార్య సీతమ్మ వరండాలో నిల్చుని పక్కింటి పిల్లలు రమణని, బుజ్జిగాడిని కేకేసింది.

"ఎందుకే ?" అన్నాడు ధర్మారావు.

"సీతాఫలాలు పండాయి. పిల్లలు తింటారని పిలుస్తున్నా!" అంది సీతమ్మ.

ధర్మారావు మండిపడ్డాడు.

"తొలిసారిగా పండిన ఫలాలు మనం తినాలి గాని, వూళ్ళోవాళ్ళ కిస్తావా? అదిగాక ఒక్కోకాయ ఇరవై పైసలు ఖరీదు చేస్తుంది. అదే మనం కొనుక్కొని తినాలనుకున్నామనుకో డబ్బు ఖర్చుపెట్టాల్సిందే గదా! ..." అన్నాడు.

"కొనుక్కొని తింటానికి మనం పిల్లలమటండీ. అయినా, ఈ వయసులో అలాంటివి తింటే జబ్బుచేస్తుంది కూడాను." అంది సీతమ్మ.

"చాలు చాల్లే. మహా చెప్పొచ్చావు." అని విసుక్కున్నాడు ధర్మారావు.

సీతమ్మకి భర్త తత్వం తెలిసిందే గనుక మారు మాట్లాడక ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఆ రోజు శనివారం. టిఫిన్ తిన్నా కడుపులో వెల్తిగానే వుంటుంది. ఆ రెండు పళ్ళూ తను తినేస్తే సరి అనుకున్నాడు ధర్మారావు.

చీకటి పడేవేళకే వర్షం మొదలయింది.

సీతమ్మ ఏడింటికే ఉప్మా చేసి భర్తకి పెట్టింది.

ధర్మారావు మనసంతా సీతాఫలాల మీదే వుంది. తెల్లారి తను లేచే సరికి భార్య కోసి ఎవరికైనా ఇస్తుందేమోనని అనుమానం వేసింది.

వర్షం వెలిసేసరికి తొమ్మిదైంది. సీతమ్మ నిద్రపోయింది.

ధర్మారావు బ్యాట్రీలైటు వేసుకుని పెరట్లోకి వెళ్ళి రెండు పళ్ళూ తెంపుకొచ్చాడు.

చెట్టున పండిన కాయలేమో తాజాగా, నిగనిగ లాడుతున్నాయి.

ధర్మారావు ఆప్యాయంగా ఆరగించి మంచినీళ్ళు తాగి పడుకున్నాడు.

తెల్లారేసరికి పట్టుకుంది జలుబు. ముక్కులు బిగుసుకుపోయాయి. మెదడు మొద్దుబారిపోయింది. చెవులు సరిగా వినపడడంలేదు.

సీతమ్మ నిద్ర లేచేసరికి ధర్మారావు వరండాలో నిల్చుని చీదుతూ కన్పించాడు.

"ఏమిటండీ ప్రొద్దున్నే లేచారు?" అంది సీతమ్మ.

"జలుబు చేసిందే..." అన్నాడు నెమ్మదిగా.

సీతమ్మకి అనుమానం వేసి "సీతాఫలాలు తిన్నారా? ఏం? "అంది.

ధర్మారావు అవునని అమాయకంగా తలూపాడు.

"బాగుంది. ఈ ముసుర్లో తలంటుకుని పైగా సీతాఫలాలు తిన్నారా? అదీ రాత్రి పూట. జలుబు చెయ్యకేం చేస్తుంది. మీ పీనాసితనం తగలబడ్డట్టే వుంది. వెళ్ళి రెండు ఆస్ప్రో బిళ్ళలు వేసుకోండి. పాలల్లో మిరియాల పొడి వేసిస్తాను." అంది సీతమ్మ.

ధర్మారావు గొడుగు వేసుకుని వీధిలోకి వెళ్ళాడు.

సీతమ్మ పాలుకాచేసరికి, "పావలా వదిలింది" అంటూ వచ్చాడు ధర్మారావు.

"అప్పుడే ఏమైందీ!" అని నవ్వింది సీతమ్మ.

తొమ్మిదింటికి భోజనంచేసి ఆఫీసుకి బయల్దేరాడు.

'బస్‌స్టాప్‌లో తోటి గుమాస్తా సుబ్బయ్య పలకరించాడు "జలుబు చేసినట్లుందే" అని.

"అవునండి!" అన్నాడు ధర్మా రావు నీరసంగా.

"కోడో పైరిన్ రెండేసుకోండి. తగ్గిపోతుంది," అన్నాడు సుబ్బయ్యా.

"వూ" అని మూలిగాడు ధర్మా రావు ఇప్పటికే పావలా దండగ వేసుకున్నవి పట్టేయక పోతాయా? అనుకున్నాడు.

ఆఫీసులో కూర్చున్నాడన్న మాటే గాని పని చెయ్యబుద్ధికాలేదు. మాటి మాటికీ వరండాలోకి వెళ్ళి చీదడం మొదలెట్టాడు

మధ్యాహ్నానికి ముక్కులు మరీ బిగుసుకుపోయాయి. గాలి పీల్చడమే కష్టమైపోయింది. పోతే పోయిందని సుబ్బయ్యా సలహా ప్రకారం రెండు కోడో పైరిన్ వేసుకుని వేడి వేడి పాలు తాగాడు.

ఆ రాత్రి అతనికి నిద్రపట్టలేదు. పడుకుంటే తల భారంగావుంది ఒకటికి రెండు దిండ్లు వేసుకున్నాడు అయినా వూపిరి ఆడడంలేదు తెల్ల వార్లూ వరండాలోకి వెళ్ళి వస్తూనే వున్నాడు

మర్నాడు ఉదయం సీతమ్మ మిరి యాల పొడి వేసిన పాలు ఇచ్చి "విక్స్ డబ్బా ఒకటి కొని ముక్కుకు రాసుకోండి," అంది.

బస్‌స్టాప్ దగ్గర కెళ్ళి కొట్లో విక్స్ డబ్బా ఒకటి కొన్నాడు.

పక్కింటి కుర్రాడు పలకరించి "ఇన్‌హేలర్ ఒకటి తీసుకుని లోపలికి పీల్చండి గుణం కన్పిస్తుంది" అన్నాడు.

ఇప్పటికి అయిన దండగ చాల్లే అనుకున్నాడు దర్మారావు.

ఆఫీసులో కూర్చుని జలుబుతో బాధ పడడం చూసి పక్క సీట్లో టైపిస్టు మేరీ అన్నది, "కొసావిల్ వేసుకోండి," అని.

లంచ్ అవర్లో రెండు కొసావిల్ బిళ్ళలు వేసుకుని వేడి వేడి పాలు తాగాడు .

సాయంత్రానికి అసలు వూపిరాడ లేదు.

బస్‌స్టాఫ్‌కు పోతూ, పోతూ ఇన్ హేలర్ కొనుక్కుని పీల్చసాగాడు. కొంచెం సాఫీగా వూపిరాడినట్లని పించింది.

ముక్కుకి పూసి, గుండెలకు రాసి విక్స్ డబ్బా ఖాళీ అయ్యింది. కాని రాత్రి మళ్ళీ జాగారమే తెల్లవారు జామున నిద్రపట్టింది.

పాల మనిషి కేక విని మెలకువ వచ్చింది. సీతమ్మ ఇంకా నిద్రలేవ లేదు. ఆమెని లేపడం ఎందుకని తనే పాల గిన్నె తీసుకెళ్ళి పాలు పోయించు కున్నాడు.

"అయ్యగారికి పడిశం పట్టి నట్లుందే," అంది పాల పుల్లమ్మ.

"అవును పుల్లమ్మా! ఇది మూడో

రోజు, చచ్చిపోతున్నాననుకో,'' అన్నాడు నీరసంగా.

"అమృతాంజనం పుయ్యండి'' అంది

"విక్స్ పూశాను."

"ఇదీ పుయ్యండి..." అని వెళ్ళిపోయింది పుల్లమ్మ

- మళ్ళీ మిరియాల పొడి పాలు త్రాగి ఆఫీసుకి వెళ్ళాడు ధర్మారావు.

"ఏమయ్యా ధర్మారావు! నీ కాగితాలు ఏవీ రావడం లేదే,'' అన్నాడు సూపర్నెంట్.

"జలుబు చేసిందండీ బుర్ర పనిచేయడంలేదు," అన్నాడు ధర్మారావు చిరునవ్వుతో.

"అలాగా! మాండ్రిబాన్ బిళ్ళలు రెండు పూటలు వేసుకో. దెబ్బకుపోతుంది" అని సలహా ఇచ్చాడు సూపర్నెంటు.

లంచ్ అవర్లో సూపర్నెంటు సలహా పాటించాడు ధర్మారావు. రెండు బిళ్ళలూ ఒకేసారి వేసుకుని వేడి వేడి పాలు త్రాగాడు.

సాయంత్రానికి గూడా ఏమీ తగ్గలేదు.

ఇంటికి పోతూ అమృతాంజనం సీసా ఒకటి కొనుక్కుని వెళ్ళాడు.

ఆ రాత్రికి అన్నం సహించలేదు. మిరియాల చారుతో నాలుగు మెతుకులు తిని లేచాడు.

అమృతాంజనం ముక్కుకి, గుండెలకు రాస్తూ ముసిముసి నవ్వులు నవ్వుతుంది సీతమ్మ

"నేను ఛస్తుంటే నీకు నవ్వుగా వుందా ?" అని మండిపడ్డాడు

"బాగుంది. లోభికి నాలుగండాల నష్టమని పెద్దలు వూరికినే అన్నారా?" అంది.

మాట్లాడకుండా పడుకున్నాడు. అతని కళ్ళకి సీతాఫలాలు కన్పించాయి బాధగా మూలిగాడు.

తెల్లవారిన తర్వాత గూడా పరిస్థితిలో మార్పు లేకపోగా విషమించింది అసలే చీదలేక చస్తుంటే దానికి తోడు దగ్గు పట్టుకుంది.

ఇక లాభంలేదని ఆ పూట సెలవు పెట్టి డాక్టర్ని కలుసుకున్నాడు.

కన్సల్టింగ్ ఫీజు ఐదు రూపాయలు చెల్లించాక డాక్టర్‌గారు టెస్ట్ చేసి ప్రిస్క్రిప్షన్ చీటి చేతిలో పెట్టాడు.

అది మెడికల్ షాపులో చూపిస్తే, ఒక కాఫ్ సిరప్ బాటిల్, అరడజను కాప్స్యూల్సు పాక్ చేసి పదిరూపాయల బిల్లు చేతికిచ్చాడు.

గుండె జల్లుమంది ధర్మారావుకి.

ఆ పూటకి అన్నం సహించలేదు

ముక్కుతూ మూలుగుతూ ఆఫీసుకెళ్ళాడు. సీట్లో కూర్చోబుద్ధికాలేదు. తల భారం ఎక్కువైంది. రెండు కాగితాలు డిస్పోజ్ చేసేటప్పటికే తల నొప్పి వచ్చింది. కొంచెం జ్వరం



గూడా వచ్చినట్లుంది. ఎలాగో సైమ యిందాకా కూర్చుని ఇంటి కొచ్చాడు.

డాక్టర్ గారు వ్రాసిచ్చిన కాప్సూల్స్, కాఫ్ సిరప్ బాటిల్ మూడు రోజుల్లో పూర్తిగా వాడేశాడు. దగ్గు కొంచెం తగ్గింది కాని, జలుబు మాత్రం తగ్గలేదు.

పోయి మెడికల్ షాపు యజమానితో హిస్టరీ అంతా చెప్పుకున్నాడు.

"ఇదిగోండి, మూడు స్ట్రెప్టోమైసిన్ కాప్సూల్స్ పూటకొకటి వేసుకోండి తగ్గిపోతుంది," అని రెండ్రూపాయలు పుచ్చుకున్నాడు

వాటి సిగదరగ అవీ పనిచేయలేదు.

మళ్ళీ డాక్టర్‌తో మొరపెట్టుకున్నాడు ధర్మారావు.

"ఎస్కోల్డ్ రెండు వాడి చూడండి." అని రాసిచ్చాడు డాక్టర్.

రెండ్రూపాయలు పుచ్చుకుని రెండిచ్చారు మెడికల్ షాపులో.

ధర్మారావు జలుబు వయసు పది రోజులు దాటిపోయింది. అది ఏ మందులకీ లొంగలేదు.

"నస్యం ఒక పట్టు పట్టండి" అని సలహా ఇచ్చాడు రామశాస్త్రి గారని శివాలయం పూజారి.

నలభై వైసలిచ్చి నస్యం డబ్బా కొనుక్కొచ్చి రాత్రంతా ముక్కుకి పట్టించాడు ధర్మారావు.

ఒకటే తుమ్ములు. ముక్కు వెంట నీరుకారడం.

తెల్లవారేసరికి ముక్కు మంట పుట్టింది గాని జలుబు పారిపోలేదు.

"ఏమోయ్ ధర్మారావ్! జలుబు ఇంకా తగ్గనే లేదనుకుంటాను." అన్నాడు సుధాకర్ పక్క సీట్లో గుమాస్తా.

"లేదోయ్:... నన్ను పట్టుకుని చంపుతోంది..." అని జలుబుని పట్టుకుని తిట్టాడు ధర్మారావు.

"జలుబుకి మందు లేదోయ్! ఒకటే మందు." అన్నాడు సుధాకర్.

"అదేంటో చెప్పి పుణ్యం గట్టుకో!" అని బ్రతిమాలాడు.

"ఏం లేదు. ఆనక బార్ కెళ్ళి రెండు పెగ్గులు బ్రాందీ కొట్టు. తర్వాత ఒక కోడి పని పట్టు. తెల్లారితే జలుబుంటే ఒట్టు, అన్నాడు సుధాకర్..

ధర్మారావు గుండె ఆగిపోయింది. ఈ నలభై ఏళ్ళ వయసులో ఎన్నడూ బ్రాందీ వాసన గూడా చూసి ఎరగడు. పిల్లా పీచూ లేకపోయినా పీనాసిగానే బ్రతుకుతున్నాడు చుట్టాలిళ్ళల్లో తప్ప కోడిని కొని తిని ఎరగడు.

జలుబు బాధ పడలేక మార్కెట్ కి వెళ్ళాడు.

కాళ్ళరిగేటట్లు తిరిగి, తిరిగి బేరమాడి ఆడి పన్నెండుకి ఒక కోడి దొరికింది.

ధర్మారావు అదృష్టమేమోగాని కోడిని తిన్నా జలుబు మాత్రం పోలేదు

పగలు కొంచెం తగ్గినట్లనిపించినా రాత్రికి పూపిరాడేవి కాదు.

"నువ్వు చెప్పిన మందు పన్జేయలేదోయ్," అన్నాడు ధర్మారావు. మర్నాడు.

"ఏమిటి నువ్వు బ్రాందీ త్రాగావా?" అన్నాడు సుధాకర్ ఆశ్చర్యంగా.

"లేదు. కోడి తిన్నా!" అన్నాడు ధర్మారావు,

"అబ్బే లాభంలేదు. ఈ సారి రెండూ కలిపి చూడు. వెంటనే గుణం కన్పిస్తుంది," అన్నాడు సుధాకర్.

ధర్మారావు ఆలోచనలో పడ్డాడు. ఆలోచించి, ఆలోచించి ఏమైతే అయ్యిందని ఆఫీసు వదిలిన తర్వాత అటూ, ఇటూ చూసి స్వాగత్ బార్ లోకి ప్రవేశించాడు ధర్మరావు.

ఏం త్రాగాడో ఏం తిన్నాడో ధర్మారావుకి జ్ఞాపకం లేదుగాని పాతిక రూపాయల బిల్లు చెల్లించడం మాత్రం గుర్తుంది.

తలనెప్పిగా ఉంటే మీ మందు పుచ్చుకున్నానండీ!!



బార్‌లోంచి బైటికి వచ్చాక బస్ స్టాప్ వరకూ నడవలేకపోయాడు. కాళ్ళు తేలిపోయాయి. బస్ నెంబర్లు గూడా సరిగా కన్పించడంలేదు. ఒక బస్ ఎక్కబోయి ఇంకోటి ఎక్కితే కొంప మునుగుతుంది అనుకుని ఆటో రిక్షా కేకేస్తూ రోడ్డు మధ్యకు వెళ్ళాడు బాలన్సు తప్పిపోయి క్రింద పడిపోయాడు. పాపం యాక్సిడెంట్ అయ్యింది. ఒక టాక్సీ గుద్దింది. కాలు విరిగింది పాపం.

హాస్పటల్లో జేర్పించారు. అక్కడ మూడు నెలలు వున్నాడు. తర్వాత మామూలుగా నడవసాగాడు ధర్మారావు.

ఆ రోజు ఆదివారం.

ధర్మారావు దగ్గరుండి సీతాఫలం చెట్టు నరికించి, మళ్ళీ చిగుర్లు వేస్తుందేమోనని త్రవ్వించి వేళ్ళతో సహా తీయించేస్తున్నాడు.

"ఏమిటండీ! ఏదో చేయిస్తున్నారు," అంటూ వచ్చాడు రామశాస్త్రి.

"ఏం లేదండీ. సీతాఫలంచెట్టు కొట్టించేస్తున్నా!" అన్నాడు ధర్మారావు.

"అదేం ?" అన్నాడు రామశాస్త్రి ఆశ్చర్యపోతూ.

"ఏంలేదు అచ్చి రాలేదు...'' అని పొడి నవ్వు నవ్వాడు ధర్మారావు




ఆరోజు డ్యూటీ ఎక్కాను. విజయవాడనుంచి తిరుపతి వెళ్ళే బస్సు లాంగ్ జర్నీ. బుకింగ్‌లో టిక్కెట్లు యిస్తున్నా కొందరు టిక్కెట్లు తీసుకోకుండా బస్సు ఎక్కుతారు; లోపల ఇస్తారనే ధీమాతో. టిక్కెట్లు చెక్ చేస్తున్నాను ఒకామె టిక్కెట్లకు బదులు నాలుగు పదిరూపాయల నోట్లు యివ్వబోయింది. రెండు తిరుపతి అంటూ.

"బుకింగ్‌లో టిక్కెట్లు తీసుకోలేదా?"

"లేదు... మీరివ్వండి.. ఎక్కడయి తేనేం..."

డబ్బు తీసుకొన్నా. నన్ను చూచి వాళ్ళ పాప చిన్నగా నవ్వింది; నా వేషం చూసి కాబోలు. పిల్లలు బడికి వెళ్తున్నప్పుడు యూనీఫాం వేసుకొని పుస్తకాల సంచీ మెడలో తగిలించుకొని వెళుంటారు. అలాగే నేను కాకీ డ్రస్ వేసుకుని డబ్బుల సంచీ మెడలో వెసుకుని పంచి, టిక్కెట్లు పట్టుకొని ఉన్నా కదా... అందుకని నవ్వి ఉంటుంది.

"మీ పాప కెన్నేళ్ళండీ...''

"రెండేళ్ళు మొన్ననే నిండాయి..."

నిజానికి ఆ పాపకు నాలుగేళ్ళు నిండాయి. నాకు తెలుసు ఎలాగంటే వాళ్ళుండేది మా యింటి ఎదురుగుండా నే.

వాళ్ళకు రెండంతస్థుల మేడలు ఒక అరడజను ఉన్నాయి. మా ఊళ్ళో వాళ్ళు సొంత కార్లో వెళ్ళేవాళ్ళు ఇవాళ బస్సు ఎందుకు ఎక్కారో... కారు చెడి పోయిందేమో... లేక ఇంటి యజమాని బిజినెస్‌కోసం కారులో ఎక్కడికయినా వెళ్ళాడేమో!...

ఆ యింట్లో ఉండేవాళ్ళు ఎవరో నాకు తెలుసు కానీ ఆ యింట్లో వాళ్ళకి మేము తెలీదు. తెలుసుకోవాల్సిన అవసరం కూడా వాళ్ళకు లేదు. ఆ యువతి అలంకరించుకొన్న తీరు బస్సులో అందరినీ ఆకర్షించేదిలా ఉంది. ఇంకో ఆమె ఆ యువతి తల్లి. పాపవాళ్ళ అమ్మమ్మకు అమ్మకు మధ్యలో కూర్చుంది. ముగ్గురి సరిపోవాల్సిన సీటు వాళ్ళిద్దరికీ ఆ పాపకు సరిపోయింది సొంత కార్లో విశాలంగా కూర్చున్నట్లు కూర్చున్నారు.

ఆపాప సరిగ్గా నేను బి ఏ. రెండో సంవత్సరంలో ఉండగా పుట్టింది. అప్పటినుంచి నాలుగు పుట్టినరోజు పండుగలు జరుపుకొని అయిదోది తర్వాలో జరుపుకోబోతోంది, నా లెక్క ప్రకారం ఆ పుట్టినరోజు పండుగలకు ఎంతెంతో హడావిడి చేసేవాళ్ళు. ఒక పెళ్ళిలా జరిపించేవాళ్ళు. నేను అనుకొంటూ వుండేవాడిని పుట్టినరోజు పండుగలే యింత ఘనంగా జరిపించే వాళ్ళు పెళ్ళి ఎంత బ్రహ్మాండంగా చేస్తారో అని. పెద్ద పెద్ద వాళ్ళంతా వచ్చి ఆ పాపను ఆశీర్వదించి వెళ్తుండే వాళ్ళు. వాళ్ళలో రాజకీయ నాయకులు, సినీ తారలు, వ్యాపారస్థులు, లక్షాధికార్లు, కోటీశ్వరులు ఉంటూండేవాళ్ళు. నిజానికి ఆ పాపకు అరటిక్కెట్టు తీసుకోవాలి. కానీ ఆమె తన పాపకు రెండేళ్ళే నిండాయి అంటున్నది. 'కస్టమర్ యీజ్ రైట్.'

రెండు టిక్కెట్లు తిరుపతికి తీసి ఇచ్చాను. చిల్లర తీయబోతున్నా.

"అమ్మా! నాకు నాలుగేళ్ళు కదమ్మా..." అంది ఆ పాప అంతలో.

"నీ మొహం... నీకేం తెలుసు...

నోరు మూసుకుని కూర్చో..." అంది వాళ్ళ అమ్మ.

"ఎందుకే ఊరికే వసపిట్టలా వాగుతావు? నీకు నాలుగేళ్ళా! నవ్వుతారు ఎవరన్నా వింటే..." అంది వాళ్ళ అమ్మమ్మ

"అయితే మరి నాకు యిప్పుడెన్నేళ్ళు..." అంది ఆపాప. ఆపాప తెలివికి నేను ఎంతో సంతోషించాను

"మొన్నేగా రెండు నిండాయి."

"రెండేళ్ళేనా... అమ్మమ్మా...మరి నీకెన్నేళ్ళు... పదేళ్ళా!..."

నాకు అమాంతం నవ్వు వచ్చింది పిట్టకొంచెం కూత ఘనం అనే సామెత ఆ పాపపట్ల ఋజువైంది.

"ఛీ... నీ మొహం...నాకు ఏభై అయివేళ్ళు..." అంది వాళ్ళ అమ్మమ్మ.

"అబ్బ... అన్నేళ్ళే..." ఆశ్చర్యంతో ఆ పాప కళ్ళు పెద్దవిచేసి నోటిని గుండ్రంగా సున్నాలా చుట్టింది. నా దగ్గర కెమేరా లేదు. కానీ మనస్సనే కెమేరా ఉంది. దాన్లో ఆ పాప ముచ్చటగా ముద్రింపబడింది.

చిల్లర యిచ్చేసి నా సీట్లోకి వచ్చి కూర్చున్నా; మిగిలిన టిక్కెట్లు చెక్ చేసి. నా చెవులు మాత్రం ఆపాప మాటల మీదే కేంద్రీకరించబడ్డాయి

"అమ్మా! ఇవేంటమ్మా!..." అంటోంది టిక్కెట్లు చూస్తూ.

"అవి టిక్కెట్లు...పారెయ్యకు..." అని వాళ్ళ అమ్మమ్మ తీసుకొంది.

"టిక్కెట్లు ఎందుకూ..."

"మనం ఇక్కడ నుంచి తిరుపతి వెళ్తున్నామూ... అందుకు... ఛార్జీ యిచ్చి యివి తీసుకోవాలి..."

"...అంటే మనం బిస్కెట్లు కొంటే డబ్బులిచ్చినట్లా..."

"అవును... ఏమి తెలివే నీ తెలివి..." వాళ్ళ అమ్మమ్మ పాపను ముద్దుపెట్టుకొంది.

"మరి యిన్ని ఎందుకూ..."

"ఇవి మీ అమ్మకూ... ఇవి నాకూ..."

"మరి నాకో..."

"నువ్వు చిన్నపిల్లవి. నీకు టిక్కెట్టు అక్కర్లేదు."

"నీ అంత అయితే నాకూ తీసు కొంటావా అమ్మా!..."

"ఆఁ... అవును కానీ యిక నోరు మూసుకొని కూర్చో..."

ఆ పాప వెనక్కు తిరిగి నన్ను చూచి చిన్నగా నవ్వింది నేనూ నవ్వాను. చాలా సేపు ఆ పాప మాట్లాడకుండా కూర్చుంది అయిష్టంగా.

వాళ్ళకు ఎంతెంతో డబ్బు ఇళ్ళల్లో బ్యాంకుల్లో మూలుగుతున్నా ఒక అర టిక్కెట్టు దగ్గర అబద్ధాన్ని అంటించటం ఎందుకో నాకు అర్థంకాలేదు. ఒక విధంగా వాళ్ళ అలా అబద్ధాల్ని ఆశా



నరసింహ

ధించక పోతే యిన్ని అంతస్థులు పెంచ గలిగే వాళ్ళు కాదేమో!

ఆ పాపలో తొంగిచూస్తున్న ఆలోచనలు నాకు ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగించాయి. పాపం, పుణ్యం — తెలీని లేత వయస్సు. లోకంలో జరిగేవాటిని అర్థం చేసుకోవాలనే ఆ పాపలోని ఆరాటం మెచ్చదగింది. ఆకుల చాటు నుంచి తొంగి చూస్తున్న మొగ్గలా ప్రపంచంలోకి తొంగిచూస్తున్నది ఆపాప.

బస్సు చాలా వేగంగా వెళ్తోంది.

"అమ్మా! నాకెన్నేళ్ళే... రెండా.. నాలుగా..." మళ్ళీ పాప మొదలు పెట్టింది.

"ఎన్నయితేనేం... పాతిక..." వాళ్ళమ్మ కోపంగా చెప్పింది.

"పాతికేళ్ళంటే నీకన్నా పెద్దా... మరి మొన్న బాబాయితో పాపకు నాలుగేళ్ళని చెప్పావేం..."

పాపకు అనుమానాలు సముద్రంలోని అలల్లా వస్తున్నాయి.

"నోరు మూసుకొని కూర్చో..." వాళ్ళ అమ్మమ్మ అంది.

మళ్ళీ పాప వెనక్కి తిరిగి వెనకాల కూర్చున్న నన్ను చూచి నవ్వింది. నేనూ నవ్వాను. చాలా సేపు ఏం మాట్లాడినట్లు లేదు పాప.

సింగరాయకొండ వచ్చింది. ఇక్కడ భోజనంకోసం బస్సు ఆగుతుంది. భోజనం చెయ్యదల్చుకొన్నవారంతా భోజనంచేసి రండని అందరినీ హెచ్చరించి బస్సు దిగి వెళ్ళాను. పాపను బస్సులోనే ఉంచి వాళ్ళ అమ్మ, అమ్మమ్మ భోజనానికి దిగి వచ్చారు. నేను చకచకా భోజనం ముగించి బస్సెక్కాను.

కొద్ది సెకన్లలో ఆ పాప నా దగ్గరకు వొచ్చింది.

"ఏంకావాలి పాపా? ఆకలేస్తున్నదా?..."

తల అడ్డంగా తిప్పింది ఆకలి లేదన్నట్లు.

"ఏవండీ... నాకూ టిక్కెట్టు యివ్వరూ..." అంది.

"అలాగే యిస్తాను... కానీ నీకు మూడేళ్ళు నిండితేగానీ టిక్కెట్టు యివ్వను..."

"నాకు నాలుగేళ్ళుగా మరి..."

"నీకు రెండు నిండాయని మీ అమ్మ చెప్పారుగా..."

"కాదు... నాకు నాలుగేళ్ళు... నేనేం చిన్నమ్మాయిని కాదు. నాకూ టిక్కెట్టివ్వరూ..."

"అలాగే..." అన్నా.

పాపకు అబద్ధం యొక్క విలువ తెలీదు.

పాప వాళ్ళ అమ్మ, అమ్మమ్మ రావటం గమనించి వెళ్ళి కూర్చో. మన్నా పాప వెళ్ళి కూర్చుంది.

అంతా రావటంతో బస్సు బయలు

దేరింది. కొత్తగా ఎక్కినవాళ్ళకు టిక్కెట్లు యిచ్చి జనాన్ని ఒక్కసారి లెక్కచూచి కాగితంలోని లెక్కలు సరిపోయాక తృప్తిపడి సీటులోకి వచ్చి కూర్చున్నాను.

''అమ్మా ! ఆయన నాకు టిక్కెట్లు యిస్తానన్నారు...''

''ఎవరూ...''

పాప నన్ను చూపింది.

''ఛత్... నోరు మూసుకుని కూర్చో...''

''అమ్మా ! నాక్కూడా టిక్కెట్టు తీసుకోవే...''

''టిక్కెట్టు లేదు... గిక్కెట్టులేదు.. అరవకు...''

పాప సన్నగా ఏడవడం మొదలు పెట్టింది.

''ఏడవకు...''

పాప ఏడుపు ఎక్కువైంది. బస్సు లోని జనం అటు చూస్తున్నారు.

''ఏమిటండీ ! పాప ఏడుస్తోంది...'' వెనక సీట్లో కూర్చున్నామె అడిగింది పాపవాళ్ళ అమ్మను.

''తిన్నది అరక్క... దీనికి టిక్కెట్టు కావాలిట...''

''మీ టిక్కెట్టు ఇవ్వండి కాసేపు. ఏడుపు మానుతుంది.'' ఉచిత సలహా ఇచ్చింది ఆమె.

వాళ్ళ అమ్మమ్మ తన దగ్గరున్న టిక్కెట్లను పాపకిచ్చింది.

పాప తీసుకోలేదు.

''ఇవి వద్దూ... అవి కావాలీ ..'' అంటూ నన్ను చూపింది.

పాపవాళ్ళ అమ్మ నావైపు కోపంగా చూచింది. ఎందుకంటే ఇందాక పాప నాతో మాట్లాడుతూండటం వాళ్ళు చూచారు. ఆ చూపులు 'నువ్వు మా అమ్మాయికి మంత్రం వేసావు... నీదే తప్పు' అన్నట్లున్నాయి.

ఇప్పుడు ఆ పాపకు నేను టిక్కెట్టు యివ్వాల్సిందే. అంతవరకూ ఊరుకొనే ట్లులేదు. ఆ పాప కళ్ళవెంబడి నీళ్ళు రావటం నేను సహించలేకపోతున్నాను. దాంతోపాటు వాళ్ళ అమ్మ ప్రసరింప చేస్తున్న ఆ కోపపు కిరణాల్ని చూడలేక పోతున్నాను.

లేచి వాళ్ళ సీటుదగ్గర కెళ్ళాను

''పాపా ! ఏం కావాలమ్మా...''

''టిక్కెట్టు... ఊ... ఊ...''

టిక్కెట్లలోంచి ఒక టిక్కెట్టు చించి పంచిచేసి యిచ్చా. అది నా దగ్గరున్న మినిమమ్ టిక్కెట్టు.

ఆ టికెట్ తీసుకొంది పాప. అంతే, ఆపాప ముఖంలో ఏడుపు అస్తమించింది. చంద్రోదయం అయింది. కొన్ని క్షణాల్లో అ పాప ముఖంలో వెన్నెల వెల్ల వేసినట్లయింది.

''అమ్మా ! డబ్బులివ్వు... మరి...''

వాళ్ళ అమ్మ డబ్బులిచ్చింది. తీసు




కొని నవ్వుతూ వెళ్ళి నా సీట్లో కూర్చున్నాను.

ఆ పాపను, నేనిచ్చిన టిక్కెట్టు చంద్రమండలానికి తీసుకొని వెళ్ళిందనే చెప్పచ్చు. శత్రు రాజ్యాన్ని జయించిన గర్వం, పట్టాభిషిక్తుడయినప్పటి యువరాజు ఆనందం—రెండూ పెనవేసుకొని ఆ పాపలో మెరిసాయి.

ఆ పాపకు నిజానికి అరటిక్కెట్టు తీసుకోవాలి. తను టిక్కెట్టు తీసుకొని మాత్రమే ప్రయాణం చేయాలనేది ఆ పాప తెలుసుకోగలిగింది. నేను పాపకు అరటిక్కెట్టు ఇవ్వకపోయినా ఏదో ఒక టిక్కెట్టు ఇచ్చాను. దానికి వాళ్ళ అమ్మ డబ్బులిచ్చింది అది ఏ టిక్కెట్టు అనేది ఆ పాప మేధకు అందనిది. కానీ డబ్బులిచ్చి టిక్కెట్టు తీసుకోవటం వరకే ఆ పాపకు కావలసింది. అది నెరవేరింది. విజయపతాకం ఎగురవేసింది.

ఒక అబద్ధంతో కొన్ని రూపాయల్ని రక్షించుకోగలిగింది వాళ్ళ అమ్మ. ఒక నిజానికి కొన్ని పైసలు చెల్లించాల్సి వచ్చింది పాప విషయంలో. ఏది ఏమైనా నిజంకోసం, న్యాయంకోసం ఆ అమ్మాయి చేసిన పోరాటం మాత్రం హర్షించతగ్గది. ఆ నిజానికి ఆ పాపకు కనీసం ఒక బిస్కెట్టు పాకెట్ బహుమతిగా యిద్దామనే ఉద్దేశం కలిగింది. కానీ వాళ్ళ అమ్మా వాళ్ళు ఏమన్నా అనుకొంటారేమోనని వెనకడుగు వేసాను. పాపను మనసులో జ్ఞాపకాల పొరల్లో దాచుకొన్నాను ఒక నిధిలాగా.

వాళ్ళింటికి ఎదురుగుండా ఉండటంతో ఆపాప బయటకు వచ్చినప్పుడు పిలుచేసుకొని మాట్లాడుతూండేవాడిని.

ఆ పాప పేరు జ్యోతిట. నన్ను 'మామయ్యా' అని పిలవమని చెప్పా

ఒకసారి నన్నడిగింది 'అత్తయ్య ఏదని'.

ఆపిల్ల తెలివితేటల్ని వృద్ధిచేసు కొంటున్నది.

వీలు దొరికినప్పుడల్లా జ్యోతికి మంచి మంచి నీతి కథలు, అవీ చెప్తూండే వాడిని. జ్యోతికి నేనంటే చాలా యిష్టంగా ఉండేది.

దాదాపు రోజూ జ్యోతీ నేనూ కలుసు కొని కనీసం రెండు నిమిషాలయినా గడుపుతూండేవాళ్ళం.

ఇలా జరుగుతున్న కాలం ఒకరోజు ఆగిపోయిందనిపించింది. ఆ రోజు జ్యోతి నాకు కనిపించలేదు. ఆ తరువాత ఒక పదిహేను రోజులకు కనిపించింది. నేను చూడని యీ పదిహేను రోజుల్లో చాలా మార్పు కనిపించింది జ్యోతిలో. జ్యోతిలో యౌవనం తొంగిచూచింది.

పూర్వంలాగా ఇప్పుడు జ్యోతి నా దగ్గరకు రావటంలేదు. ఆడవాళ్ళలో మార్పు వచ్చినంత తర్వగా మగ వాళ్ళలో రాదు కాబోలు.

ఈ లోపల నేను నా ఉద్యోగానికి రాజీనామా యిచ్చాను. దానికి కారణం ఏదో ప్రయివేటు కంపెనీలో నాకు వచ్చిన మరో మంచి ఉద్యోగమే.

నేను సంసారంతో సహా ఊరు మార్చాల్సివచ్చింది. వెళ్ళేరోజు జ్యోతి కనిపించింది. వెళ్తున్నాన్ని చెప్పాను.

ఆ అమ్మాయిలో యిప్పుడు ఒక విధమైన 'రిజర్వ్‌డ్‌నెస్' కలిసిపోయింది. ఇప్పుడిప్పుడే ప్రపంచంలోకి అడుగు పెడ్తున్నట్లనిపించింది ఆ హోదాను చూచాక.

ఎవరికో ఇల్లు అద్దెకిచ్చేసి ఆ ఊరు వదిలేసాము మేము.

* * *

ఆపదలు, ఆనందాలు, తుఫాన్లు, వడగాడ్పులు, ఎండలు, వెన్నెలలు, విక సించిన పూలు, వాడిపోయి నేలకు రాలిన పూలు, ఇవన్నీ కాలం చేసే మార్పులు. కాలం చూపించే చిత్రంలో రంగు రంగుల బొమ్మలు, కొన్నిచోట్ల చీకట్లు ముసురు కొన్న మూలలు ఉంటాయి.

కాలగతిలో చాలా సంవత్సరాలు. గడిచిపోయాయి.

ఈ మధ్యకాలంలో జ్యోతికి పెళ్ళ యింది. అప్పుడప్పుడూ మా ఇంటికి వెళ్తూండటంతో వాళ్ళింట్లో జరుగుతున్న మార్పులు అన్నీ కాకపోయినా కొన్ని తెలుస్తూండేవి.

చిన్నపిల్ల కన్య అయింది.

కన్య శ్రీమతి అయింది. ఇల్లరికం ఉండే భర్తను సంపాదించింది.

ఇక ఆ తరువాత మార్పు మాతృ మూర్తి అవటం.

నా కళ్ళల్లో చిన్నపిల్లలా మెదులు తున్న జ్యోతి మాతృమూర్తి అయింది. ఆ చిన్నపిల్లకు ఒక చిన్న పిల్లవాడు.

మా ఊరు వెళ్ళినప్పుడల్లా జ్యోతిని కలుసుకోటానికే ప్రయత్నించేవాడిని.

కొన్నిసార్లు కలుసుకోవటం వీలు పడలేదు కూడా.

వయస్సు పైబడుతున్నకొద్దీ సత్తువ క్రిందకు వెళ్ళిపోతుంది, నా ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. దాంతో ఒక ఏడెనిమిదేళ్ళు మా ఊరే వెళ్ళలేదు.

నా ఆరోగ్యం కుదుటపడితే నీ కొండకొస్తాం. తలనీలాలిస్తామని నా శ్రీమతి మొక్కుకుంది వేంటేశ్వర స్వామికి.

నా ఆరోగ్యం కొంచెం మెరుగ్గా ఉండటంతో వీలుచూచుకొని తిరుపతి ప్రయాణం కట్టాము సంసారంతో.

* * *

తిరుపతి వెళ్ళే బస్సు చాలా రద్దీగా ఉంది. టిక్కెట్లు ముందుగానే రిజర్వు చేయించుకోవటంతో బస్సులో సీట్లకు యిబ్బందిపడలేదు.

కండక్టరు టిక్కెట్లు తనిఖీ చెయ్యటం మొదలుపెట్టాడు.

ఒక యువతి దగ్గర ఆగిపోయాడు

"ఆ అబ్బాయికి ఎన్నేళ్ళు?"

"పదకొండు. అందుకే అరటిక్కెట్టు తీసుకొన్నాము.

ఆ గొంతు నాకు బాగా పరిచయమైనదే.... అవును...జ్యోతి. దాదాపు ముప్పయి ఆయిదేళ్ళ క్రిందట బస్సులోని చిన్నపిల్లి జ్యోతి కళ్ళముందు పరుగెత్తింది. ఆ అబ్బాయి జ్యోతి కొడుకు. వాళ్ళని నేను గుర్తుపట్టగలిగాను. కానీ నన్ను వాళ్ళు పట్టలేరేమో! ఎందుకంటే బాగా పెరిగిన గడ్డం, నెరసిన నా పొడు వాటి తలవెంద్రుకలు నా ముఖాన్ని మూసివేసాయి.

"పదకొండేళ్ళేనా..."

"అవును. అబద్ధం చెప్పాల్సిన అవసరం నాకు లేదు."

కండక్టరు ఒత్తిడి చేయలేదు, ఎందుకంటే జ్యోతిని చూస్తే ఆమె పెద్ద కుటుంబంలోని పిల్ల. పెద్దవాళ్ళు మాట్లాడిన మాట అచ్చుగుద్దిన నిజంతో సమానం.

నిజానికి జ్యోతి కొడుక్కి యిప్పుడు పదమూడేళ్ళు నిండి ఉండాలి.

జ్యోతి అబద్ధం చెప్పిందా!

నా బుర్రలో మధనం ప్రారంభమయింది. నాకేదో పిచ్చి ఎక్కినట్లనిపించింది.

ఆనాడు నిజంకోసం, టిక్కెట్టు కోసం గోలచేసిన జ్యోతి నవ్వుతూ నాక్కనిపించింది.

బస్సు గుంటూరులో ఆగింది.

కాఫీకోసం జ్యోతి, వాళ్ళ అమ్మ దిగి వెళ్ళారు ఆ అబ్బాయిని అక్కడే ఉండమని చెప్పి.

నేను బాబును పిలిచాను.

"బాబూ! నీకెన్నేళ్ళు..."

"పదకొండేళ్ళు..."

"నిజంగా..."

"ఆ... నిజంగా..."

"అదిసరే. నువ్వేం చదువుతున్నావు..."

"ఎనిమిదో తరగతి..."

"అయితే నీకు పదమూడేళ్ళు కదూ"

"ఆ... అవును... పదమూడే..." బిక్కమొహం వేసాడు.

"మరి పదకొండేనని చెప్పావేం .."

"మా అమ్మ అలా చెప్పమంది; ఎవరైన కండక్టర్లు వాళ్ళు అడిగితే. అలా చెప్పకపోతే మా అమ్మ కొడుతుంది..."

"అలాగా... సరే... వెళ్ళి కూర్చో..."

ఇంకా ఏం వ్రాయను.

చిన్నప్పటి జ్యోతికి, ఇప్పటి జ్యోతికి ఎంత వ్యత్యాసం...

దీని క్కారణం ఏమిటి ?

ఆనాడు చిన్న నిజంకోసం చిటపటలు పేర్చిన జ్యోతి యివాళ తన కొడుక్కు అబద్ధాల్ని అమృతంలా అందిస్తోంది.

జ్యోతిని పలకరించాలనే ఉత్సాహం చచ్చిపోయింది.

జ్యోతి నన్ను ఎక్కడ గుర్తుపడుతుందోననే భయంతో తిరుపతిలో తప్పించుకొని తిరిగా. మరి జ్యోతి నన్ను చూచిందో లేదో ! నన్ను మాత్రం పలకరించలేదు మళ్ళీ. జ్యోతిలోని యీ మార్పు సహజమైనదేనేమో ! అనిపించింది. కానీ నేను ఊహించలేదు యిలాంటి మార్పును.

అందుకే షాక్ తిన్నాను.

'జ్యోతి'లోని 'జ్యోతి' ఆరిపోయింది. ఆమెలోని చిన్నప్పటి వెలుగు పారిపోయింది.

మరి ఇది నాకు షాక్ కాదా ! మీరే చెప్పండి.



- JOBS DONE HERE

# ఇచ్చట టైపు చేయబడును



— జి. విజయలక్ష్మి

"ఇది నాలుగు కాపీలు తీసిపెట్టాలండీ. వన్ ప్లస్ త్రీ. డేటు వద్దు. ఒదిలెయ్యండి. నేను తరవాత పూర్తిచేసుకుంటా," నంటూ వచ్చాడు సుందరం - ఇరవైయ్యేళ్ల నిండని ఒక యువకుడు.

మా ఇన్‌స్టిట్యూట్‌కి ఇతడిదివరకు మూడు నాలుగుసార్లు వచ్చాడు. అంటే- స్కూలు చదువు అయాక ఉద్యోగం వెతుక్కుంటూ అప్లికేషన్లు టైపుచేసి పెట్టమంటూ వచ్చేవాడు. కనుక బాగా ఎరిగున్న ముఖమే. కాగితం చూసి అడిగాను, "ఏమిటిది? జాయిన్ అయిందెప్పుడు? అప్పుడే వదిలేస్తున్నారే?"

"కాదులెండి. ఈ ఉద్యోగం నాకు బొత్తిగా సరిపడలేదు. ఒదిలెయ్యక తప్పదు."

"అలాగైతే మరి, ఏదైనా వేరే చూసుకున్నారా?"

"ఇంకా లేదు. ఇటుపైన చూడాలి. అందాకా..." అని మాటలు నమిలాడు.

"ఈపాటిదానికి నాలుగు కాపీలెందుకని?".

"మా అన్నయ్యా లిద్దరికీ పంపించి వాళ్ల సలహా కూడా తీసుకోవాలి."

"రెండురోజులు ఓపికపట్టండి తప్పకుండా టైప్ చేసిస్తా. మిషన్లకిప్పుడు ఓవర్‌హాలింగ్ అవుతున్నది. తరవాత రిబ్బన్లు కూడా కొత్తవి వెయ్యాలి. మీరు మాకు పాత ఫ్రెండ్స్‌గా, మీ పని చెయ్యడం కంటేనా?".

ముఖం కాస్త చిన్నబుచ్చుకుని, కాగితం పట్టుకు వెళ్లిపోయాడు

* * *

"ఏమిటమ్మా జయా! నీ పని నాకేం అంతుపట్టలేదు. ఈ పచ్చి అబద్ధాలేమిటీ? వచ్చిన మనుషుల్ని తిరగ్గొట్టెయ్యడమేమిటి?" అనడిగింది, ఇన్‌స్టిట్యూట్‌లో పనిచేస్తున్న కృష్ణవేణి.

"నీకు తెలీదు నా తత్వం. నన్నే కాదు, నా టైప్‌రైటింగ్ మెషిన్‌ని కూడా నువ్వు అర్థంచేసుకోలేవు. నా మెషిన్ జాయినింగ్ ఆర్డర్స్ కాని, రెజిగ్నేషన్సూ, రిలీవింగ్ లెటర్సూ టైప్ చెయ్యదు.

"మరీ వింత విషయం చెబుతున్నావే? నువ్వు మామూలు మనిషివి, నీది మామూలు మెషిను అనే అనుకుంటున్నాను. ఇన్నాళ్లబట్టీ"

"నా కథ వింటే నీకిలా ఆశ్చర్యం కలగదు," అంటూ నే చెప్పుకు పోతున్నా, కృష్ణవేణి వింటున్నది—

"మా పెద్ద లెవ్వరికీ అంటని చదువు

నాకు మట్టుకు అబ్బుతుందా అని ఒక ఫీలింగు, చిన్నప్పటినించీ, ఎలానో ఇంగ్లీషు చదువులో పెట్టారు మావాళ్లు. అన్నీ నెట్టుకువచ్చాగాని, లెక్కలు మట్టుకు యమగండం.

అయితే - నా అదృష్టంకొద్దీ, నేను ఫోర్త్‌ఫారంకు వస్తాననగా మా స్కూల్లో టైప్‌రైటింగ్ షార్ట్‌హాండ్ ఆప్షనల్సుగా ప్రవేశపెట్టారు. జన్మలో లెక్కలు రావనుకున్న లోటు దీంతో తీరిపోయింది. ఈ సబ్జక్ట్సు రెండూ నాకు చాలా సరదాగా ఉండేవి. స్కూల్ ఫైనల్‌లో (పబ్లిక్) నమ్ముతావో లేదో - నాకు టైప్‌రైటింగ్‌లో 98 పర్సంటు. మరీ బాగుండదని ఆ రెండు మార్కులూ తగ్గించినట్టుంది ఎగ్జామినర్ !!

"మరి లెక్కల్లో ?" అనడిగింది కృష్ణవేణి.

నవ్వుతూ చెప్పా : "బాడీగార్డు మార్కులు -8-"

"టైపు మార్కులు చూసి మురిసి పోతున్నావు, బాగానే వుంది, అటయితే, నవుకరీ యత్నమేం చేయలేదా ? అవసరంలేదు కామోసు..."

"అదే, సొంతంగా చెప్పనీ.

— పేసవగానే ఉద్యోగం దొరికే కాలమా ఇది ? ఈ సంగతి తెలిసే మా నాన్నగారు వాయిదా పద్ధతిని 'రాయల్' మిషను కొనిచ్చారు. ఉద్యోగ ప్రయత్నానికైతే పెద్ద మార్కులు రాలేదని బాధపడలి. నాకా బాధ లేదుగా.

రెండేళ్లనాడు ఈ బోర్డు తగిలించి నప్పటినించీ బోలెడంత పని వస్తూంది. అనుకున్న టయిముకి నీట్‌గా చేసి ఇవ్వడంవల్ల కాతాదారులు పెరిగారు. నా మిషన్ బాకీ తీరిపోగా, కొంత మిగి లింది కూడా ఆ సొమ్ముతోనే - ఇప్పుడు నువు పనిచేస్తున్న ఆ సెకండ్ హాండ్ 'రెమింగ్టన్' కొనగలిగాను.

ఎందిరికో అప్లికేషన్లు కొట్టిస్తాను కదా, అందులో ఉద్యోగం దొరికిన వాళ్లు సంతోషం కొద్దీ అయిదో, పదో అదనంగా ప్రెజంటేషన్ ఇవ్వడం కూడా కద్దు. ఇన్‌స్టిట్యూట్ పెట్టి నప్పటినించీ నాకొక్కటే కోరిక - నేను అప్లికేషన్లు టైపు చేసిపెట్టిన అందరికీ ఉద్యోగాలు రావాలి, నాకు చేతినిండా పనివుండాలి అని. వాళ్లకి ఉద్యోగం దొరికితే, నాకు దొరికినట్టే సంతోషించే దాన్ని.

ఇంకోటి - మన వూరు రైలుపేటలో చిరకాలంగా ఒక ఇన్‌స్టిట్యూట్ ఉన్నది గదా ! అక్కడ నేర్చుకునే విద్యార్థులే జాబ్ వర్క్సు కూడా చేస్తారట. యజ మాని పరమ బద్ధకస్తుడంటారు. కనుక, దూరాభారమైనా. మన రేట్లు ఎక్కువని తెలిసినప్పటికీ కాతాదార్లు ఇటు మళ్లు తున్నారు.

పైగా ఆ విద్యార్థులు, తెచ్చిన

కాగితం చూసి టైపు చెయ్యడమే గాని, ఇక్కడిలాగా స్వంతంగా అప్లికేషన్లు రాసిపెట్టలేరుట. అందుకనే అందరూ మన దగ్గిరకి రావటం. కోరిన పని నెరవేరిన వాళ్లలో ఒక మూఢనమ్మకం ఏర్పడి, మన ఇన్‌స్టిట్యూట్‌లో టైపు కొట్టిస్తే పని జయమయినట్టే అనే భావన చాలామందిలో అల్లుకుపోయింది.

అలాంటి నమ్మకం కలవాళ్లలో ఇందాకా వచ్చిన అబ్బాయి సుందరం ఒకడు.

"ఎంత మంచికథ చెప్పావు జయా! నీ స్వయంకృషి, స్వతంత్ర ఉపాధికి నువు చేసుకున్న సాధన చూస్తే, ఎంతో మందికి వరవడి పెట్టినట్టనిపిస్తుంది," అంటూ నా మాటలకు కృష్ణవేణి ఎంతో ప్రోత్సాహకరంగా ఊ కొట్టింది.

* * *

వారంరోజుల తర్వాత ఒకనాడు — ఆ పిల్లవాడు — సుందరం మళ్లా వచ్చాడు. ఈమాటు చేతిలో కాగితాల బొత్తి దండిగా ఉన్నది. ముఖం కలకల్లాడుతూవుంది. చలాకీగా ఉన్నాడు.

"ఆ రోజున మనస్సు బాగులేక నేను చాలా తొందరపడ్డానండీ. మీరు నిదానించి నన్ను కాపాడారు. చాలా థేంక్స్. అంతా మీ చలవ.

అకారణంగా నాపైన వచ్చిన నింద



పోలికలు

'కాదు' అని ఇప్పుడు రుజువయింది. నేను నిర్దోషినని తేలిపోయింది.

ఇప్పుడు మా ఆఫీసువాళ్లు అమోఘమైన సర్టిఫికేటు, ఇచ్చారు. మరో కొత్త కంపెనీలో పెద్ద జీతంమీద చేరబోతున్నాను ఈ సర్టిఫికేటు, టెస్టిమోనియల్సు — నాలుగేసి కాపీలు, అప్లికేషన్ రెండు కాపీలు కొట్టిపెట్టండి."

అంతా అనుకున్నట్టు క్షణంలో సవ్యంగా జరిగిపోయింది

ఈసారి కృష్ణవేణి ఆశ్చర్యపోలేదు కాని, నన్నభినందించి, ఆశీర్వదించింది



"మీవాళ్ళు మన పెళ్ళికి అంగీకరిస్తారా?"

రాజు చిన్నగా నవ్వి మేరి వెపు చూస్తూ "ఏమో?" అన్నాడు.

"అంటే...?"

"చూడు మేరి... సనాతనాచారాలు తు.చ. తప్పకుండ పాటిస్తున్నారు మా వాళ్ళు. తనలాంటి కోడలు రావాలంటుంది మా అమ్మ. నాపై వచ్చిన కట్నంతో మా చెల్లెలు పెళ్ళి చేయాలంటారు మా నాన్న. అందుకే మన పెళ్ళికి ఒప్పుకోరనుకుంటాను."

నడుస్తున్న మేరి చటుక్కున ఆగి ఆశ్చర్యంగా రాజు ముఖంలోకి చూసింది.

"మా వాళ్ళు వద్దన్నా, ఎందరు ఆక్షేపణ తెలిపినా మన పెళ్ళి జరగక మానదు."

"రాజు... !" ఆమె కళ్ళలో ఆనంద బాష్పాలు నిలిచాయి. ఆప్యాయంగా అతని చేయి నొక్కింది.

* * *

"నీవు అంటున్నది ఏమిట్రా ? కులం తక్కువదాన్ని పెళ్ళిచేసుకొని మన కుల గౌరవాలు మంట కలుపుతావా ?" కొడుకు వైపు కోపంగా చూసింది పార్వతమ్మ.

"మనిషి బ్రతకటానికి కులం ముఖ్యం కాదమ్మా!"

"నీకు కాక పోవచ్చు. కాని, మాకు కావాలి. ఫలానా వారి అబ్బాయి కులం తక్కువ దాన్ని పెళ్ళిచేసుకున్నాడంటే, మన పరువు ప్రతిష్ఠలు ఏమాతాయో ఆలోచించావా?"

"ఏమీ కావు... చూడమ్మా ! మారుతున్న కాలంతోపాటు మనమూ మారాలి."

"చూడు రాజు! జీవితమంటే కథలు, కావ్యాలు కావు. మారుతున్న కాలంతోపాటు మారాలంటావు. నీవు మారగలవు. అన్నీ మరచిపోగలవు. కాని, నీపై ఆశలు పెట్టుకున్న మా గతి ఏం కావాలి ?" కొడుకు వైపు చూస్తూ ప్రశ్నించారు శేషయ్యగారు.

"నా బాధ్యతలు మరచి పెళ్ళిచేసుకొని వేరేపోవటంలేదుగా నాన్నా!"

"ఛస్తే, ఆ కులంతక్కువదాన్ని ఇంట్లో అడుగుపెట్టనివ్వను."

తల్లి వైపు బాధగా చూశాడు రాజు.

"చూడు రాజు ! మంచి సంబంధం చూసి నీకు పెళ్ళిచేసి, నీపై వచ్చిన కట్నంతో కమల పెళ్ళిచేయాలని ఆశించాను. కాని, నా ఆశలన్నీ..."

"నెరవేరుస్తాను నాన్నా. అప్పుచేసి నా చెల్లెలు పెళ్ళి నే చేస్తాను. నేనూ, మేరీ ఉద్యోగం చేసి ఆ అప్పు తీరుస్తాం నాన్నా."

"అంటే... నీవా అమ్మాయిని పెళ్ళిచేసుకోక తప్పదా ?" సూటిగా ప్రశ్నించారు శేషయ్యగారు.

"నన్ను అర్థంచేసుకోండి నాన్నా. మనిషి మనుగడకు కులం ముఖ్యం కాదు ప్రేమ, మమత, మమకారాలకు కులం అడ్డుగోడ కాదు...కాకూడదు...

కాగితంపై కలం ఆగిపోయింది. నా శ్రీమతి అరుపులకు ఈ లోకంలోకి వచ్చాను.

"అబ్బబ్బా ... ఎంతసేపటినుండి పిలిచినా ఉలుకు, పలుకు లేదేమిటి ?" అంటూ హడావిడిగా వచ్చింది శాంత.

"ఎందుకు ?"

"ఎందుకా ?... నిన్నటినుండి చెబుతున్నా తీరా, సమయానికి 'ఎందుకు?' అని ప్రశ్నిస్తున్నారా ?" అంతే లెండి నేనన్నా, నా వాళ్లన్నా

మీకు అప్యాయతగాని, అనురాగం గాని ఎక్కడున్నాయ్ ?"

'శాంతా ! విసిగించకుండా అసలు విషయం ఏమిటో చెప్పు."

"ఏమిటీ నేను మిమ్మల్ని విసిగిస్తు న్నానా ?"... అంతేలెండి, నేనంటే ఇష్టం ఉంటేగా ?... నేను ఏమీ మాట్లా డినా మీకు విసుగ్గానే ఉంటుంది."

"శాంతా..." ఒకవైపు కోపం, మరోవైపు బాధ.

"ఎందుకండీ ఆ అరుపులు. అయినా అంత ఇష్టం లేనివారు నన్నెందుకు పెళ్ళిచేసుకున్నారు ? నా బ్రతుకు బండలుచేయడానికా ?... డబ్బు కోసం ఆడదాని జీవితాన్ని నాశనం చేస్తారా?.. మీరు మని..."

నేను ఆగలేకపోయాను ......... కోపంతో...శాంత చంప చెళ్ళుమంది...

"నన్నే కొడతారా ? ... అంతే లెండి... చాతగాని మగాడు పెళ్ళాన్ని కొట్టడంకన్నా ఏం చేయగలడు ?..."

నాకు అక్కడ ఉండాలనిపించలేదు. గబగబ బయటికి వచ్చేశాను ... నడుస్తున్నాను... దూరంగా వెళ్ళాలి... నిర్జీవ ప్రదేశానికి వెళ్ళాలి... ఏడ్వాలి.. బాగా ఏడ్వాలి...

'డబ్బు కోసం ఆడదాన్ని మోసం చేసాను.'... కాని, నిన్ను కాదు శాంతా... నిన్ను కాదు ... సరోజ ... అవును సరోజ... నా మాటలకు మోస పోయింది.

'ప్రపంచమంతా ఒక్కటైనా సరే, మన పెళ్ళిని ఆపలేరు సరోజా'

' రవీ! నీ మాటలు వింటూ, నీ ప్రక్కన ఇలా కూర్చుంటే...'

నా మాటలన్నీ వట్టి నీటి మూటలని, నే చేసిన ప్రమాణాలన్నీ కల్లలని తెలుసు కోలేకపోయింది... పిచ్చిపిల్ల...

'నీవు దాన్ని చేసుకోవడానికి వీల్లేదు.. నీకు సంబంధం ఖాయపరిచాము... నీకు వచ్చే కట్నంతో సుమకు పెళ్ళి కూడా ఏర్పాటుచేశాము.'

' అమ్మా! ఇది అన్యాయం... నేను పెళ్ళిచేసుకుంటానని సరోజకు మాట ఇచ్చాను.'

'నేను వాళ్ళకు మాట ఇచ్చాను. నీవు పెళ్ళిచేసుకోక తప్పదు.'

'నాన్నా...'

'అవును రవి... తప్పదు'

' ఎలా నాన్నా సరోజను మనసారా ప్రేమించాను. నేను లేనిదే సరోజ...'

'బ్రతకదు... కాని, మేము మాత్రం బ్రతకగలమా?... ఇచ్చినమాట విఫల మైతే...'

'అందుకని నా జీవితం...'

'నాశనం అవుతుందంటావ్? కాదు.. ఎన్నటికీకాదు... తల్లి దండ్రులు బిడ్డల భవిష్యత్తు నాశనంచేయరు. తమ బిడ్డలు బాగుండాలని ఆశిస్తారు ... వారికి

బంగారు బాట చూపుతారు... అలాగే నేను ఆశించాను... అది నా తప్పా?... ఆ మాత్రం అధికారం నాకు లేదా?... అధికారంతో ఆజ్ఞాపించుట లేదు, ఆవేదనతో అర్థిస్తున్నాను.... నా మాట మన్నించు రవీ!...'

'నాన్నా...'

అంతే... నోట మాట రాలేదు... నా మౌనమే నన్ను సరోజనుండి దూరం చేసింది... శాంత మెళ్ళో తాళి కట్టించింది...

అటు సరోజను మరచిపోలేక, ఇటు శాంతను సంతోషపరచలేక నలిగిపోతున్నాను. నేను చేసిన పాపానికి ప్రాయశ్చితం అనుభవించాలి, తప్పదు. అందరినీ ఎదిరించి పెళ్ళిచేసుకుంటానని సరోజకు మాట ఇచ్చాను. కాని.. కాని.. ఓడిపోయాను ... పెద్దవారి దుఃఖాశృవుల్లో కరిగిపోయాను ... విధి చేతుల్లో కీలుబొమ్మ నయ్యాను... నేను ఓడిపోయినా, నా పాత్ర ఓడిపోకూడదు. పెద్దవారిని ఎదిరించాలి... మేరిని పెళ్ళి చేసుకోవాలి. ఆదర్శవంతుడు కావాలి... రాజు జయించాలి.. అవును జయించాలి..

గబ, గబ ఇంటిముఖం పట్టాను... అందరూ నిద్రపోతున్నారు... రూంలోకి వెళ్ళాను... ప్యాడ్ చేతిలోకి తీసుకున్నాను ... ఇంతవరకు వ్రాసింది చదివాను.

"ప్రేమ, మమత, మమకారాలకు కులం అడ్డుగోడ కాకూడదు...

నా కలం కదిలింది...

"కాలం మారుతుంది... మనిషి చంద్రమండలానికి వెళ్ళి వస్తున్న ఈ రోజుల్లో కూడా కులాలు, గోత్రాలు ఏమిటి నాన్నా... అసలు ఎక్కువ, తక్కువలు ఎందుకుండాలి? భర్త మరణించగానే జీవితాన్ని అంధకారం చేసుకునే రోజులు పోయాయి... మళ్ళీ పెళ్ళి చేసుకుంటున్నారు... సమాజంచే మోసగింపబడ్డ స్త్రీలకు చేయూత లభిస్తుంది... రోజు, రోజుకు మనిషి ప్రగతి పథంలో ముందుకు పరుగెడుతున్నాడు ... సంకుచిత భావాన్ని పారద్రోలాలి... విశాల దృక్పథంతో ఆలోచించాలి ... నేను చేస్తున్నది తప్పుకాదు, అంతకన్న పాపము కాదు..."

"రాజు ...! ఆఖరిసారిగా అడుగుతున్నాను ఆ అమ్మాయిని మరచిపో.."

"సాధ్యంకాదు నాన్నా"

" అంటే... కన్న తల్లి దండ్రులకన్నా, ఆదే నీకు ఎక్కువా...?"

పార్వతమ్మ కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

"మేరి మీకన్నా ఎక్కువని నేనెన్నడూ చెప్పను, చెప్పలేను. తల్లిదండ్రులతో సమానమైనది ఏదీ లేదు"

"అన్నీ తెలిసే చేస్తున్నావా?"

" నాన్నా! నా మాట వినండి.

నే పెళ్ళి చేసుకుంటే ఎవ్వరికీ, ఏకష్టమూ ఉండదు."

" అని నువ్వనుకుంటున్నావు! ... కాని, మన కులం మంటలో కలుస్తుంది.. వీల్లేదు... నీవు మొండిపట్టు మానక పోతే, నీకి ఇంట్లో స్థానంలేదు."

"నాన్నా...?"

"మా మాట వినరా..."

"నన్ను మన్నించండమ్మా... సరే మీ ఇష్ట ప్రకారమే కానీ నాన్నా...నేను ఎక్కడున్నా మీ కొడుకునే... నేను దూరంగా వుండే కమలపెళ్ళి చేస్తాను."

" వీల్లేదు... నీ నీడ ఈ ఇంటిపై పడటానికి వీల్లేదు... వెళ్లు..." శేషయ్య గారు గంభీరంగా అన్నారు.

"రాజు...!" పార్వతమ్మ ఏడ్చింది.

రాజు బయటికి నడిచాడు.

* * *

సంతృప్తిగా నిట్టూర్చాను... నేను జయించకపోయినా, రాజు ఎదిరించి జయించాడు... నాలో నేనే గర్వ పడ్డాను.

కథను పూర్తిచేసి పత్రికకు పంపాను. ప్రచురితమైంది... కథ ద్వారా నేను జయించానని సంతోష పడ్డాను... నేనూ రచయిత నయ్యాను... నాలో నేనే నవ్వుకున్నాను.

ఈ విజయంతో మరో కథ వ్రాయ టానికి పూనుకున్నాను... ఆలోచిస్తూ ఈజీచేర్‌లో కూర్చున్నాను. నా కోసం ఎవరో వచ్చారని పనిమనిషి చెప్పింది క్రిందకు వచ్చాను... హాల్లో నిలబడి ఉన్నారు... వాళ్ళను సమీపించాను... ఆమెను చూశాను— నాకు తల తిరిగి నట్లయింది... ఆమె...ఆమె... సరోజ అవును సరోజ ... ఇక్కడి కెలా వచ్చింది? ... ఎందు కొచ్చింది?... చేతిలో పాప ఉంది... ప్రక్కన ఒక యువకుడు... ఎవరు?... అర్థంకాలేదు ఆలోచనలతో సతమతమయ్యాను ... నోట మాటరాలేదు... సరోజ నన్ను చూసి నిర్ఘాంతపోయింది.

" రవిగారు మీరేనా...? " అతను పలకరించాడు.

" ఆఁ... " అనగలిగాను.

" నా పేరు మధు. మీ కథ చదివి మిమ్మల్ని కలసిపోదామని వచ్చాము."

"...కూర్చొండి."

సోఫాలో కూర్చున్నారు ... నేను కూర్చున్నాను.

" ఈవిడ నా భార్య..."

" నమస్కారమండి... " సరోజ మరో వైపు చూస్తూ నమస్కరించింది.

" నమస్కారం... "

" మీ కథ చదివి ఉత్తేజితుడనై ఈ సరోజను పెళ్ళి చేసుకున్నాను. "

మధు మాటలకు ఆశ్చర్యంగా అతని ముఖంలోకి చూశాను.

" అవునండి ... సరోజ మా పక్కింట్లో ఉంటూ టీచరు ఉద్యోగం

చేస్తూవుండేవి... నేను ప్రేమించాను... పెళ్ళి చేసుకోవాలని ఆశించాను... కాని, నిరాకరించింది..."

"కారణం.. ?" అప్రయత్నంగా అడిగాను.

"ఇదివరకు ఎవరివల్లనో మోస పోయి ఈ బిడ్డకు తల్లి అయింది..."

సరోజ ముఖంలోకి చూశాను ... ఆమె పాప తల చేతితో దువ్వుతూంది... . అంటే... అంటే... ఆ పాప... నా మనసు బాధతో మూలిగింది... ఎవరో నా గుండెను సూదితో గుచ్చుతున్నట్లనిపించింది... నా పాపానికి ఫలితం ఈ పాప...

మధు చెప్పుకుపోతున్నాడు "నా ప్రేమకు ఈ అల్పకారణం అడ్డుకాలేదు. జీవితంలో ఒక మంచికార్యం చేస్తున్నాననే తృప్తి కలిగింది. ఇంట్లో మా తల్లి దండ్రులను ఎదిరించాను... ఆ సమయంలో మీ కథ చదవడం జరిగింది... ఒక నిర్ణయానికి వచ్చాను. సరోజను పెళ్ళిచేసుకున్నాను. ఈ పాపను, నా పాపగా అంగీకరించాను... ఇటువంటి ఉత్తమ కథలను వ్రాసి, నాలాంటివారికి ఉత్తేజాన్ని కలిగిస్తున్న మిమ్మల్ని చూసిపోదామని వచ్చాము."

నా కళ్ళలో నీళ్ళు నిండాయి... ఏమి చెప్పాలో అర్థంకాలేదు... సరోజను చూశాను... నావైపు చూసింది... ఆ చూపులు ' కథను చదివి ఉత్తములను కున్నాను... కాని, ఆడదాని జీవితంతో ఆడుకునే వంచకు లనుకోలేదు... ఇలా ఎందరిని మోసంచేస్తారు?...'అన్నట్టుగా ఉన్నాయి. నా చూపులు దించేశాను.

"మీరిలా ఉత్తమ కథలు వ్రాస్తూ, సమాజం మార్పుకు దోహదం చేయగల రని ఆశిస్తున్నాను."

మధు వైపు చూశాను. మంచిపని చేశాననే తృప్తి అతని ముఖంలో కనిపించింది... నిజమే... జయించింది నేను కాదు...

"వస్తాం అండీ..." మధు లేచాడు. సరోజ లేచింది.

ఏదో చెప్పాలనుకున్నాను.. క్షమించమని సరోజను అడగాలనుకున్నాను... మధుకు కృతజ్ఞత తెలుపాలనుకున్నాను .. కాని, గొంతులో తడి ఆరిపోయింది ... మాటలు రాలేదు కనీసం కాఫీ కూడా ఇవ్వలేదు... వెనక్కు పిలవాలనుకున్నాను... నోట మాట రాలేదు .. చేతులెత్తి నమస్కరించాను... వారు వెళ్ళిపోయారు... నా కళ్ళలోనుండి నీరు ఏకధాటిగా రా సాగాయి .. జయించింది నేను కాదు.





# కింకర్తవ్యం?

## పి.వి.ఆర్.శివకుమార్

"ఏమయిందండీ ?"

అడుగుదామనుకుంది సరస్వతమ్మ.

అడగలేదు, అడగలేకపోయింది.

జవాబు తెలియని ప్రశ్నలు అడిగినంత సులభంగా, జవాబు తెలియని సమస్యను కదిలించటం వీలుకాదు.

ఆ ప్రశ్న తను బయటకు వేస్తే. భర్త ఏం జవాబు చెబుతాడో తెలుసును.

ప్రేలనున్న అగ్నిపర్వతంలా కనుపించాడు భర్త ఆమెకు.

సీతారామయ్య ముఖం సరిగ్గా అలాగే వుంది.

ఆవిర్లు కక్కుతూ కూర్చునివున్నాడు ఆ పడకకుర్చీలో అతను.

అన్ని ప్రయత్నాలూ అలాగే వీగి పోయాయి,

ఇహ ఓటమి తప్పదు. మళ్లీ నిరాశ తప్పదు.

అయితే, ఎప్పటికైనా ఓటమిని జయించగలడా? ఏనాటికైనా నిరాశని తరిమెయ్యగలడా?

ఆ ఆశలేదు.

అందుకే అతడు మండిపడు తున్నాడు.

ఎవరిమీద మంట?

తనమీదే! తన నిస్సహాయత మీద. తన అథమసాయి మధ్య తరగతి బ్రతుకు మీద. తను కూడబెట్టుకోలేక పోయిన డబ్బుమీద. తను యీదవల్సి వున్న మహా సాగరం మీద!

ఇది మొదటిసారి కాదు. ఎన్నో సారో సరస్వతమ్మకూడా గుర్తు లేదు!

ప్రతిసారీ యిదే పరిస్థితి! ఏనాటికీ మారదేమోనని భయపడుతున్న పరిస్థితి!

ఏం చెయ్యాలి? కిం కర్తవ్యమ్!

మౌనంగా గడపలో కూలబడింది.

ఆమె చేతిలోని తాటాకు విసనకర్ర అప్రయత్నంగా వూగులాడింది.

బలహీనంగా వీచిన గాలి, సీతారామయ్యలోని నివురు విసురుగా తొలగించింది.

"ఇహ నావల్ల కాదు."

ఒక్కసారి అన్నాడు సీతారామయ్య.

తుళ్లిపడింది మధ్యగది కిటికీదగ్గర సుషమ.

ఆమెకూ ఆ జవాబు తెల్సు. తెల్సినా ఉలికిపాటు తప్పలేదు. బరువుగా వాలిపోయింది, లోపల మంచంమీద.

"చేతనయినన్ని విధాలా ప్రయత్నించాను." మళ్లీ అన్నాడు సీతారామయ్య.

మౌనంగా అతడికేసే చూస్తోంది సరస్వతమ్మ.

"ఇహ యీ ఒక్క కొంపగూడా పూర్తిగా అమ్ముకోక తప్పేలాగా లేదు!"

అరిచాడు సీతారామయ్య.

నోరు మెదిపిందావిడ.

"ఎక్కడా అప్పు పుట్టలేదా?"

"ఎవడిస్తాడు! ఏం చూసి యిస్తాడు? అదే అడుగుతున్నాడు ప్రతివాడూను!"

అయినా వున్నవన్నీ చాలక మళ్లా మొదలుపెట్టనా? రెండు, మూడు వేలన్నా కావాలి యింకా!

మూషి పాతికవేలు చెయ్యని కొంప మీద, పదిహేను వేలదాకా యిచ్చాడు ఆ శరభయ్య యిప్పటికే!

ఇవాళ అంటాడూ,

'నీ కొడుకు పంపేది కాస్తా ప్రతి

నెలా వడ్డీకే చాలటంలేదు. యీ అప్పు యినా ఎలా తీరుస్తావోనని చూస్తూ, యింకా ఎలా యిమ్మంటావయ్యా? పోనీ, నాకు వదిలిపారెయ్యి ఆ కొంప! మరో అయిదువేలు యిచ్చి బాకీ చెల్లు వేసేస్తాను!' అని!

చెయ్యటం తేలికే ఆ పని.

దాంతో సుషమని బయటికి పంపె య్యటం పూర్తవుతుంది గానీ, బాబిగాడి చదువూ, నానిగాడి, చంటాడి బతుకులూ ఎలా తెల్లవారతాయి?

రేప్పొద్దుటినుంచీ మరో అద్దె కొంపలో, అద్దెగూడా కట్టను ఎలా వీలు?

"ఏదీ, యిలా రమ్మను సుషమని."

"ఎక్కడ ఏడుస్తోందది?"

"మధ్యను అదేంజేస్తుందండీ?" నెమ్మదిగానే అంది సరస్వతమ్మ. "ఏంచెయ్యను చేతకాదుగానీ, చెప్పిన మాట వినకుండా రంకె లెయ్యటం మటుకు చేతనౌనేం?

నన్ను కాల్చుకు తినటానికే పుట్టారు వీళ్లంతా — కడతేర్చడానిక్కాదు, శత్రువులు — పోయిన జన్మలో శత్రువులు!"

నిప్పులు కక్కాడు సీతారామయ్య. "నాలుగేళ్లనాడే చెప్పాను, అక్కయ్యలతో పడిన నరకం చాలు తల్లీ — నువ్వయినా నోరు మూసుకు నే తెచ్చినవాణ్ణి కట్టుకోమని!"

ఆ పని చేసిందా? లేదు.

ఎందుకు చేస్తుందీ? నన్ను పూర్తిగా బ్రుర గొరిగించి వీధిలో నిలబెట్టనిదే?

చదువులు కావల్సి వొచ్చాయిం. డిగ్రీ చదువులు!

ఏం అఘోరిస్తుందిప్పుడా డిగ్రీ. నెత్తిన పెట్టుకుని ఊరేగమను. తలో దమ్మిడీ భిచ్చమయినా వెయ్యరెవరూ!

అప్పుడే అయితే, ఏ మెట్రిక్యులేటో, ఏ గుమాస్తా పని చేస్తున్నా — నాలుగైదు వేలల్లో సరిపడేవాడు!

ఇవేళ అమ్మాయిగారు బి. యే! యీవిడగారికి ఎమ్మేలో, ఎమ్మెస్సీలో కావాలి!

వాళ్లు చూస్తే కోతుల్లా కొమ్మమీంచి దిగిరారు — దేవుళ్లలా కొండమీంచి కదల్రు!

ఆ చెట్లు, కొండలు ఎక్కను నాకేదీ సామర్థ్యం? ఇద్దరమ్మాయిల్ని కొండ లెక్కించేసరికే కాళ్లు విరిగి చదికిల బడ్డ వెధవను!

దానికి దగ్గట్టుగానే దాని తమ్ముళ్లూను!

బాబిగాడిప్పుడా విశాఖలో ఇంజనీరింగు వెలిగించకపోతేనేం? ఆ బి. యస్సీతోనే ఏ గుమాస్తాగిరో దొరక్కపోనా? రేపా టోడి ఇంజనీరింగు డిగ్రీతో మాత్రం మహా ఊడ బొడిచెయ్యబోతాడా?

నానిగాడిని మాట్లాడమను; కీళ్లు విరగ



ఏడుస్తా! ఆ ఇంటరేదో కాగానే నౌక రీలో చేరకపోయాడో చెప్తా!...

ఎన్ని సంబంధాలు! ఎన్ని సంబంధాలు!

కట్నాలదాకా రావటం - కటుక్కున తిరిగిపోవటం!

ఇదీ వట్టిదై పోయిందా?

ఇహ నావల్ల కాదు.

పెళ్ళీ లేదు - పెటాకులూ లేదు. కబుర్లు చెప్పిందిగా - నా కడుపు నే పోసుకో గలనని! ఏడవమను - లేదా, వోమూల పడుండమను.

ఈ ముదనష్టపు వెదుకులాట కిక నే చావలేను!

"సీతారామయ్యగారూ సీతారామయ్యగారూ..."

ఎవరో పిల్చారు వాకిట్లోంచి

"ఎవరదీ! వస్తున్నా... ఎవరు దాపురించారో నా ప్రాణానికి! ఎవరో అప్పులాడు కాదు గదా ఖర్మ..." గొణుగుతూ విసురుగా లేచి బయటికి నడిచాడాయన.

దిగాలుగా అటే చూస్తూ, కన్నీళ్లైనా తుడుచుకునే ఓపికలేనట్లు గుమ్మం వారకి జారగిలబడిపోయింది సరస్వతమ్మ. ఆమె చేతిలో విసనకర్ర ఎప్పుడో జారిపోయింది.

తడిసిన తలగడకే ముఖాన్ని రుద్దుకుంటూ పడుకునే వుండిపోయింది తండ్రి సవాలుకి జవాబు తన దగ్గరలేని సుషమ.

* *

"ఆగు..."

ఉలికి పడింది సుషమ.

వెనుకగా వడివడిగా వస్తూ ప్రకాశం!

ఒక్కసారిగా అంత ఉద్రేకమూ తగ్గిపోయి, - కాళ్లూ - చేతులూ చచ్చు బడినట్లయి నూతి గట్టుమీదే కూలబడి పోయింది సుషమ.

"ఎందుకు నన్నాపారు!" రుద్ధంగా అంది.

"ఆపక? అలాగే చూస్తూ ఊరుకోమన్నావా?"

పిచ్చిదానా! సాయంత్రంనుంచీ మీ యింట్లో జరుగుతున్న భోగోతం వింటూనే వున్నా!

నాకు తెల్సు నీ ఆత్మాభిమానం చివరికి నీకే కర్తవ్యం బోధిస్తుందో!

"ఛీ... చివరికి నీకూ ఇదే మార్గం తోచిందన్నమాట! ఇలాగైతే యిహ నీకూ - నీకన్న పాతికేళ్ల ముందు పుట్టిన ప్రాచ్యులకీ ఏమిటి వైవిధ్యం?"

"చదువుకోని మందభాగ్యులకీ, చదువుకుని స్వయం వ్యక్తిత్వాన్నీ, సంస్కారాన్నీ సాధించానని భ్రమిస్తున్న నీకూ ఏమిటి తేడా?..."

"గొప్ప అభిమానవతివే!"

"చేతనైతే మీ వాన్న బాధని తొలిగించాలి గానీ- అ మార్గం యిది కాదు."

నడు చెప్తా - ఆ మార్గం ఏదో!"

చెయ్యిపట్టి లేవదీస్తూ అన్నాడు ప్రకాశం.

"వొదలండి. నాకే మార్గమూ వొద్దు. నాకిహ బ్రతుకే వొద్దు. కన్నవాళ్లకే బరువైపోయిన బ్రతుకు..."

"ఎవరి బ్రతుకు వారికి తప్ప, మిగతా వారందరికీ - ఒక పరిధి దాటాక - బరువే! అది కన్నవారైనా, మరెవరైనా తప్పదు.

ఇప్పుడింకా నీ బ్రతుకు బరువు వాళ్లే మోయాలనుకోవటానికి నీ వ్యక్తిత్వం అడ్డుచెప్పటం లేదూ?

యుక్తవయసు దాటి, విద్యావతి

నైన నీ బ్రతుక్కి మార్గం నువ్వే చూసుకోవటం ఉత్తమం — నీ ధర్మం!

"రా...నేను చెప్తాను, మీ నాన్న గారికెలా ఋణవిముక్తి కలిగించారో!"

విస్మయంగా అతడికేసి చూసింది సుషమ.

"సుషమా! అలా ఆశ్చర్యపడకు."

గత మూడేళ్ళుగా అవిరళంగా ఆలోచిస్తున్నా, మీ నాన్నగారి చండ శాసనమూ, నీ గంభీరర్యమూ నన్ను సాహసించనివ్వలేదు.

"ఎప్పుడైతే చచ్చిపోవటానికైనా నువ్వు సిద్ధపడ్డావో, అప్పుడే మీ నాన్నగారి మొండితనమూ, నీ గాంభీర్యమూ నాకు అడ్డు తొలిగిపోయాయి."

"పోనీ, యిది నీ నూతన జన్మ అనుకో!"

ఈ క్రొత్త బతుకులో నీకింకా ఆ పాత కులం లేదు! బుద్ధెరిగినప్ప ట్నుంచే కులాన్ని మర్చిపోయాను నేను.

"కనుకనే సాహసించ గలుగు తున్నాను."

'దయచేసి నామాట విను. నడు...'

సుషమ తలవంచుకు విన్నది. వింటోంది...

* * *

ఉదయంనించీ నూతులూ, చెరువులూ వెదికి, వెదికి వేసారి కన్నీళ్ళు గూడా కరువైపోగా, నెత్తుటిమీద చేతులు పెట్టుకు కూర్చున్న సీతా రామయ్యగారూ, సరస్వతమ్మా, బయట స్కూటర్ చప్పుడు కావటంతో ఒక్క ఉదుటున లేచి బయటకు వచ్చారు — 'ప్రకాశం వచ్చినట్లున్నాడు అతడితో చెప్తే, అతడయినా వెదకటంలో కొంత తోడ్పడతాడేమో' ననుకుంటూ

పసుపు, బట్టలతో, పారాణి పాదాలతో వెనుకగా స్నేహితులు రిక్షాలు దిగుతుండగా పచ్చగా దర్శన మిచ్చారు ప్రకాశం — వెనకే సుషమా!

కోపమో, ఆవేశమో, బాధో, లోకుల భయమో... లేక కలగాపులగంగా అన్నీనో కలిసి నిర్బంధితుల్ని చేసి నిలబెట్టేశాయి యిద్దర్నీ కనబడ్డ ఆ దృశ్యంతో!

ఇహ తను యింటిని ఎవరికీ అమ్మనక్కర్లేదని, అందరిదగ్గరా అప్పుచేసి ఆమె పెళ్లికోసమే బ్యాంకులో వుంచిన ఏడు వేలూ కూడా తిరిగి ఆ అప్పులు తీర్చటానికే వినియోగపర్చవచ్చుననీ, గొడ్డలికోసం తనని వెతికిస్తున్న సమస్య శాస్త్రా గోటితోనే తీరిపోయిందనీ యింకా తట్టలేదుగానీ, తట్టగానే బహుశః సీతారామయ్యగారూ సుముఖంగానే నిట్టూరుస్తారేమో! నిట్టూర్చలేక పోతే...ఆయన ఖర్మ మరి!




# చక్రపాణి

## కావిలిపాటి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

ఒకసారి అంది. ప్రతిరోజు ఎందుకు రావటం అనవసరమైన శ్రమ. ఈ హాస్పిటల్లో ఏముంది. అలా ఏ తోటవైపో షికారు వెళ్ళరాదూ!

ఆ మాటకతను తేలిగ్గా నవ్వి, "తోటలో ఏముంది? మాటలురాని చెట్లూ మాట్లాడలేని సెలయేరూ. హాస్పిటల్లో ఆయితే, ట్లాడటానికి అప్యాయంగా పలకరించటానికి మీరున్నారు? నా ప్రాణానికి మీ ప్రాణం అడ్డం వేశారే! ప్రత్యుపకారం నేనేం చెయ్యగలను మీకు? ప్చ్! ఏమిటో ప్రతిరోజూ మీతో కాస్సేపు మాట్లాడటం అల పోయింది. మీకు ఇబ్బందంటే రావడం మానేస్తాను. నాకు శ్రమేంలేదు, అన్నాడు పాణి.

పంపించి తీసుకురమ్మని కబురుచేసింది అన్నపూర్ణమ్మ.

ఆమె పద్మావతిని చూస్తూనే ఎన్ని నెల లయ్యిందమ్మా! అడిగింది నవ్వుతూ.

"రెండు నెలలు దాటింది అంది పద్మావతి నెమ్మదిగా."

"ఆమె ఏవేవో టానిక్కులు వ్రాసి తీసుకోవలసిన జాగ్రత్తలూ, ఆహారం చెప్పి, కాపీ తాగి వెళ్ళిపోయింది.

"పద్మావతి తల్లికాబోతూంది. తాను తండ్రి కాబోతున్నాడు. ఆ పుట్టిన పెద్దదై తండ్రిగుడ్డివాడని చిన్నబోతుంది నలుగురి మధ్యా తనను తక్కువగా అంచనా వేసుకు బాధపడక తప్పదు. తన అంధత్వం గురించి విచారించే మరో ప్రాణి లోకంలోకి రాబోతోంది. పోనీ పద్మావతికే బరువు బాధ్యతలు పైన వేసుకునే మగవాడే పుడతాడో లేక శశికి కోడలు అవడానికి అమ్మాయే పుడుతుందో. ఏ బిడ్డయినా, వారినిచూసి ఆనందించడానికి తనకు కళ్ళులేవు. ఇలాటి ఆలోచనలలో మనస్సేమిటోలా ఉందతనికి, విషాదం, ఆనందం, రెండూ కలిసిన మిశ్రమ భావంకాబోలు. అస్థిమితంగా పచార్లు చేయసాగాడు పాణి.

బత్తాయిరసం తాగమనీ, లేకపోతే హార్లిక్స్ తాగమనీ, అదీ కాపోతే ఏమిటి తింటావో చెప్పు చేస్తాననీ బ్రతిమిలాడుతుంది. అన్నపూర్ణమ్మ పద్మావతిని.

నా కేమీ వద్దంటూంది పద్మావతి. ఆమె ఏడుస్తూన్నట్టుగా గొంతు బరువుగా ధ్వనించడం గ్రహించిన పాణి అబ్బ. తానేమీ వద్దంటూంటే ఎందుకత్తయ్యా! అలా వత్తిడి చెయ్యకు అన్నాడు విసుగా.

"ఏమీతినక తాగక ఎలా తగ్గుతుంది బాబూ ఆ నీరసం. నువ్వు చూడలేవు కాని నల్లగా పొగ కాడలా మాడి పోయింది. అని గొణుక్కుంటూ వెళ్ళి పోయిందావిడ.

గుడ్డివాడి భార్య గర్భవతి అయ్యిందని అందరూ నవ్వుకుంటారు కాబోలు. తన బిడ్డ దృష్టిలోకూడా తాను తేలికవుతుందా! తండ్రికి కళ్ళు లేవని కృంగిపోవడం తప్పదా బిడ్డకి ఎంత ఆస్తి, ఐశ్వర్యం ఉన్నా ఇవేమీ తృప్తినివ్వలేవు. అసలు నాకు పిల్లలు పుట్టకూడదనే కోరుకున్నాను. ఛి, భగవంతుడు నన్ను పరీక్షిస్తున్నాడు. అందరిలా నేను ఎలా తిరగగలను. గర్భవతిగా నలుగుర్లో, పాణి చెయ్యి ఆమె తలమీద పడడంతో కనులు తెరచింది పద్మావతి. ఆమె కనులలోంచి జలజలా కన్నీళ్ళు కారాయి.

(సశేషం)






## మల్లాది వెంకటకృష్ణమూర్తి

దాదాపు నూటఏభైమంది మొగవాళ్ళు పనిచేసే ఆఫీసు అది. ప్రభుత్వ కార్యాలయం అవటంచేత ఆ ఆఫీసులో పనిచేసే మొగాళ్ళందరికీ పని వుండదు చేతినిండా పనిచేయటం రాదని కాదు. పని ఎగవేయడం వచ్చు కాబట్టి.

ఆ ఆఫీసు ఎదురుగా మేడమీద ఓ పెద్ద కుటుంబం కొత్తగా కాపరానికి వచ్చింది. తల్లి లేదు. తండ్రి రిటైరవబోతున్న బేంక్ వుద్యోగి. ఆయన పెద్ద కూతురికి ఇరవై రెండు దాకా వుంటాయి. లేక లేక పుట్టిన పిల్ల అవడంవల్ల గారాబం ఎక్కువ. ఓ చెల్లెలుకూడా. గారాబంతోపాటు ఆ అమ్మాయికి అందం, ఆకర్షణకూడా ఎక్కువే. ఒంట్లో వేడి, జిగి, బిగి, నగిషీ వగైరాలన్నీ సమపాళ్ళలో వున్న పిల్లలా అనిపిస్తుంది చూపరులకి. థర్డ్‌ఫారంతో చదువా పేసింది ఆ పిల్ల పాపం.

ఆ పిల్లకి ముగ్గురు అన్నయ్యలు. మొదటి ఇద్దరు అప్రాచ్యులు. చెల్లెలికి లాగే చదువు అబ్బలేదు ఎసెసెల్సీతో చదువుకు 'సయోనార' పాటపాడి పోకిరీగా తిరుగుతూంటారు ఆ చుట్టుప్రక్కల వున్న రౌడీలందరితో వారంరోజుల్లోనే పరిచయం చేసుకుని, స్నేహం పెంచుకోసాగారు.

ఆ అమ్మాయి కొంచెం అమాయకురాలిలా కనిపిస్తుంది. ఆ ప్రభుత్వ కార్యాలయం అరుగులమీద విఁబడి,

ఎదుటి డాబాకున్న కిటికీలోంచి చూస్తూ కనబడే ఆ అమ్మాయిని చూస్తూంటే, ఆ ఆఫీసులో పనిచేసే అందరికీ ఆ పిల్ల అమాయకురాలిలా కనిపిస్తుంది.

అక్కడ పనిచేసే నూటఏభై మంది మొగాళ్ళలో చాలామంది బ్రహ్మచారులు లేదా పెళ్ళయికూడా పరిస్థితుల వల్ల బ్రహ్మచారులుగా కాలం గడుపుతున్నవాళ్ళు. వాళ్ళ సంఖ్య దాదాపుగా అరవై దాకా వుంటుంది.

ఆ అరవైమందిలో చాలామంది, వీలయినప్పుడల్లా ఆఫీసు అరుగులమీదకు వచ్చి సిగరెట్ పొగ వదులుతూ, ఆ అమ్మాయిని చూస్తూ కాలం గడుపుతారు. పెళ్ళయిన మిగతావాళ్ళలో చాలామంది కూడా మేమేం తక్కువా అన్నట్లుగా ఆ అమ్మాయిని కళ్ళతోనే ఆస్వాదిస్తూంటారు.

సగటున దాదాపు వందమంది మొగాళ్ళు ఆ అమ్మాయిని చూస్తూ కాలక్షేపం చేస్తూంటారు. మిగతావాళ్ళు బుద్ధిమంతుల్లా పనిచేసుకుంటూంటే, అలా కిటికీ దగ్గర, తనని మొగాళ్ళు చూసేలా నిలబడకూడదని ఆ అమ్మాయికి తెలుసో తెలియదో? తెలిసికూడా, బహుశ, చూసినంత మాత్రాన ఏంచేయగలరు? అనే తలంపుతో ధీమాగా నిలబడుతోందేమో?

లేదా, నిజంగా ఆ ఆఫీసులో పనిచేసే మొగాళ్ళలో తనకి నచ్చిన వాడిని చూసుకోడానికి నిలబడుతోందేమో?

కారణం ఏదయినా కావచ్చు. కాని ఆ కారణం మాత్రం ఎవరికీ బోధపడలేదు. ఎవరికివారు వూహాగానాలు చేసుకుంటూ, ఒకవేళ ఆ అమ్మాయికి నేను నచ్చుండొచ్చు అనుకుంటూ కాలక్షేపం చేయసాగారు.

దానా దీనా, ఆ ఆఫీసుకు ఎప్పుడూ శెలవుపెట్టేవాళ్ళు కూడా, చీటికీ మాటికీ శెలవుపెట్టకుండా ఆఫీసుకి ఠంచన్‌గా వస్తున్నారు.

ఇలా దాదాపు రెండు నెలలు గడిచాయి. ఆ ఆఫీసులో పనిచేసే దజను మంది ప్యూన్‌లలో ఒకడు మాత్రం, జరిగే తంతుచూసి జ్ఞానిలా చిరునవ్వు నవ్వుకున్నాడు.

ఒకరోజు ఆ ఆఫీసులోని కేషియర్‌కు ఒక ఉత్తరం వచ్చింది. ఇన్‌లాండ్ కవరుమీద పొందికగా వ్రాసివున్నాయి ఈ కింది వాక్యాలు.

మైడియర్,

ఎన్నాళ్ళిలా?

ఎప్పటికి గ్రహించవే? నేనే ధైర్యం చేసి వ్రాస్తున్నాను మా అన్నయ్యలకి తెలియకుండా. వాళ్ళకి తెలుస్తే మనిద్దరి పీపులూ విమానంమోత మోగిస్తారు.

ఎల్లుండి ఆదివారం సాయంత్రం సరిగ్గా ఆరున్నర గంటలకి ఈ రోడ్డు మొదట్లో వుండే ఆంజనేయస్వామి

గుడికి రండి, నేనంటే మీకిష్టంవుంటే. వాగానే ఓ కొబ్బరికాయ దేముడికి కొట్టండి. ఏడుదాకా నాకోసం చూడండి. నేను రాని పక్షంలో, మరోసారి ఎప్పుడు రావడానికి వీలయేది రాస్తాను. తప్పక వస్తారు కదూ? మీతో ఎన్నో చెప్పాలి.

మీ

నా పేరు తెలీదుకదూ?

ఎదురింటి డాబా అమ్మాయి.

అమృతం జల్లు కురిసినట్లుగా ఆనంద పడ్డాడు కేషియర్. కేషియర్ ఆ ఆఫీసు లోని అందమయిన వాళ్ళకిందే వస్తాడు. సంతోషంతో కూర్చోలేక అరుగులవైపు పరుగెత్తాడు, కేష్‌చెస్ట్‌తాళంవేసి.

ఈ సంగతి ఎవరికీ చెప్పకుండా, అతి రహస్యంగా వుంచాడు. ఎప్పుడో ఓరోజు తామిద్దరినీ ఏ సినిమాహాల్లోనో చూసి ఆశ్చర్యపడకపోరు. ముందరే ఈ సంగతి వూదేస్తే ఎవరయినా అడ్డు పుల్ల వేయచ్చు. ఆ అమ్మాయి అన్నయ్యి లిద్దరికీ తెలిసే ప్రమాదం కూడా వుంది.

కేషియర్ ఆదివారం సాయంత్రం ఆరున్నరకల్లా అంజనేయస్వామి దేవాల యానికి చేరుకున్నాడు. ఓసారి ఆ ఇన్ లాండ్‌కవరు తీసి చదువుకుని, అందులో వ్రాసిన విధంగా బేరం కూడా ఆడ కుండా కొబ్బరికాయ కొన్నాడు.

"మిస్టర్ ఆంజనేయా. నువ్వు బ్రహ్మ చారివే అయినా, ఆ అమ్మాయి ఇక్క డికి వచ్చేలా, నా కోరిక సిద్ధించేలా దీవించు. అలాగే, నా పాప ఎరియర్స్ బిల్ కూడా త్వరగా అందేలా వరం ప్రసాదించు." అని మనసులో దేముణ్ణి ప్రార్థించి, కొబ్బరిచిప్ప కొట్టుకుని తింటూ కూర్చున్నాడు.

ఏడయినా ఆ అమ్మాయి రాలేదు. నిరాశగా కదిలాడు కేషియర్ ఇంటికి. ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. ఎందుకని రాలేదా, ఏమయివుంటుందా అనే ఆలోచనలతో పక్కమీద పొర్లాడు రాత్రి రెండున్నరదాకా.

నాలుగు రోజుల తర్వాత మరో ఇన్ లాండ్ కవరు వచ్చింది కేషియర్‌కి. అదే చేతివ్రాత. గుర్తుపట్టి, హడావిడిగా కవరు చింపాడు.

మై డియర్,

ఆదివారం రానందుకు కోపం వచ్చిందా? సారీ. మా అన్నయలు ఇంట్లోంచి కదిలేతేనా? ఇవాళ సాయంత్రం ఆరున్నరకి అక్కడే కలుసుకుందాం. నన్ను కలవటం మీ కిష్టమయితే ఓ కొబ్బరికాయ దేముడికి కొట్టి నే వచ్చే దాకా వుండండి.

లేదా వుత్తినే దేముడికి దణ్ణం పెట్టు కుని వెళ్ళిపొండి. అప్పుడు మీకిష్టం లేదని తెలుసుకుంటాను.

మీ

డాబామీద అమ్మాయి.

ఈసారి కేషియర్‌కి, అమృతజల్లుతో పాటు, ముత్యాలజల్లు కూడా కురిసి




నట్లుగా అనిపించింది, ఆ ఉత్తరంలోని సంగతులు గ్రహించగానే.

ఆ సాయంత్రం ఆఫీస్‌బాయ్ చేత కొత్త సబ్బు తెప్పించి, ఆఫీస్‌లోనే మొహం కడుక్కుని, తల చక్కగా దువ్వుకుని, అరున్నరకల్లా గుడికి చేరుకున్నాడు. కొబ్బరికాయ ఒకటి కొని, భక్తిగా దాన్ని పూజారికి అందించాడు. పూజారి తిరిగి ఇచ్చిన కొబ్బరిచిప్ప తింటూ కూర్చున్నాడు గుళ్ళో.

మధ్యలో పాత ఎరియర్స్ బిల్ గురించి మిస్టర్ ఆంజనేయస్వామికి ఓసారి గుర్తుచేసాడు, మనసులోనే ధ్యానించి. ఆ అమ్మాయి వస్తే ఎవరు ముందు మాట్లాడుతారు. తను మాట్లాడాల్సొస్తే ఏ విధంగా మాట్లాడాలి వగైరాల గురించి ఆలోచనలో వుండగా పూజారి వచ్చి చెప్పాడు.

''గుడి కట్టేస్తున్నాం బాబూ ఏడయింది ఇక పొండి.''

కేషియర్ నీరసంగా లేచి నిలబడ్డాడు, ఇంటిదారి పట్టాడు. తన దురదృష్టాన్ని తనే తిట్టుకుంటూ. ఈ సారి కూడా ఆ దాబామీద అమ్మాయి రాలేదెందుచేతో? ఆ అన్నయ్య పీనుగులు కదలలేదేమో? లేదా ఆడవాళ్ళకి వచ్చే వంట చేయ్యాల్సినలాంటి ఇబ్బందులు ఆకస్మికంగా వచ్చాయేమో?

ఆ రాత్రి కూడా కేషియర్ మనసు పరిపరి విధాలయిపోయింది. సరిగ్గా నిద్రపోలేకపోయాడు.

మూడోరోజు మరో ఉత్తరం వచ్చింది కేషియర్‌కి. ఈసారి ఆత్రతగా విప్పాడు. లెక్కపెడుతున్న డబ్బు కలిపేసి, అందరినీ దూరంగా పంపి టక్ టక్ చదవసాగాడు.

మై డియరెస్ట్,

ఈసారి సారీ అని మళ్ళీ అనడం నాకే చిన్నతనంగా, సిగ్గుగా వుంది. నన్ను తిట్టుకున్నావా బాగా?

రాకపోవడానికి కారణం, ఎలా రావాలో తెలియక సతమతమవుతున్నాను. ఆడవాళ్ళకి నెలకి మూడు రోజులు ఓ గమ్మత్తు అవుతుంది తెలుసా! ఆ సమయంలో గుడికి వెళ్ళకూడదు, క్షమించు.

రేపు సాయంత్రం ఆరున్నరకి రావడం మరువకేం? కొబ్బరిచిప్ప పూర్తిగా నువ్వేతినకూడదు. నాక్కూడా వుంచాలి మరి. సీ

డాబామీదమ్మాయి

కేషియర్ ఈసారి మరింత శ్రద్ధగా మొహం కడుక్కుని, దారిలో చొక్కా విప్పి ఇస్త్రీ చేయించుకుని, మళ్ళీ దాన్ని తొడుక్కుని గుడికి చేరుకున్నాడు ఆరున్నరకి. ముచ్చటగా ఆ అమ్మాయి రిక్షా లోంచి దిగుతోందనుకున్నాడు.

బహుశ పూజారి, ఆ అమ్మాయి స్నేహితులు. తను గుళ్ళో కొబ్బరికాయ కొట్టడం, కొబ్బరిచిప్ప పూర్తిగా తినడం పూజారి చెప్పకపోతే ఎలా తెలుస్తుంది ఆ డాబామీది అమ్మాయికి?"

మరోసారి ఆంజనేయులుగారికి తన పాత ఎరియర్ బిల్స్ సంగతి మనవి చేసుకుని, ఏడుదాకా ఎదురుచూసాడు. కాని ఆ అమ్మాయి రాలేదు.

గుడి కట్టేసిన పావుగంటదాకా కూడా వుండి ఇంటిదారి పట్టాడు కేషియర్. ఆ డాబామీదమ్మాయి తనని ఫూల్ చేసి ఆడిస్తోందేమో నన్న అనుమానం తొలిసారిగా కలిగింది కేషియర్‌కి ఆ రాత్రి పన్నెండున్నరకి. ఆ తర్వాత హాయిగా నిద్రపోయాడు.

మరో మూడురోజుల తర్వాత ఉత్తరం రావాలి కేషియర్‌కి, కాని రాలేదు మర్నాడు కూడా రాలేదు. మరో రోజు గడిచింది, అయినా రాలేదు కేషియర్ ఆ ఆఫీసు అరుగులమీద నిలబడి, ఆ డాబామీదమ్మాయి వంక దీనంగా చూశాడు రెండురోజులు.

తర్వాత ఉత్తరం వచ్చింది. విప్పి చదివాడు కేషియర్.

మై డియరెస్ట్,

బహుశ నీకు నా మాటమీద నమ్మకం పోయి వుంటుందనుకుంటున్నాను ఈసారి కూడా రానందువల్ల.

ఏం చేయను? నాకు సరిగ్గా ఆ రోజే పెళ్ళిచూపులు. ఎంత ఏడుపొస్తోందో తెలుసా? ఈ సంబంధం కుదిరేటట్లుగా వుంది.

చ్ఛ! ఈ జీవితానికి నాకే అదృష్టం వున్నట్లు లేదు. ఇవాళ ఆరున్నరకి రావడానికి విశ్వప్రయత్నం చేస్తాను. ఈ రోజునుంచి ప్రతిరోజు సాయంత్రం గుడికి వచ్చే ప్రయత్నం చేస్తాను.

రోజూ సాయంత్రం ఆఫీసు అయాక గుడికి రాకూడదూ?

— రోజూ కొబ్బరిచిప్ప పూర్తిగా తినకు డియర్. జబ్బు చేస్తుంది. ఇంటికి తీసు కెళ్ళు. నీ ఆరోగ్యంమీద నాకు శ్రద్ధేమి టని నవ్వుకుంటున్నావా? నవ్వుకో.

నీ

డాబామీదమ్మాయి.

ఆ రోజునుంచి కేషియర్ మరో వారం దాకా అంజనేయస్వామి గుడికి వెళ్ళాడు రోజూ. ఊరికినే కూర్చోవడం చేతకాక, కొబ్బరిచిప్ప తింటూ రోజూ ఆంజనేయ స్వామికి పాత ఎరియర్స్ బిల్ గురించి, స్టీల్‌సామాన్ల దుకాణంలో, బట్టల దుకా ణంలో కట్టే స్కీమ్‌లో ప్రయిజ్ రావా లని ఇలా అనేకవాటి గురించి విన్న వించుకుంటూ గడిపాడు.

హఠాత్తుగా ఎదురింటి డాబామీ దమ్మాయికి పెళ్ళయిపోయింది ఓరోజు.

కేషియర్ ఆ రోజు బాగా డీలా పడి పోయాడు. విపరీతంగా బాధపడ్డాడు. నెమ్మదిగా మామూలు స్థితికి వచ్చాడు.

ఆ డాబామీదమ్మాయికి పెళ్ళయిన పదిరోజుల తర్వాత ఓరోజు ఎస్టాబ్లిష్ మెంట్ స్టెనో స్టైల్‌గా చెప్పాడు ఎవరి తోనో, ఆ డాబామీదమ్మాయి తనకి చాలా ఉత్తరాలు రాసినట్లు, తనా అమ్మాయిని అనేకసార్లు కలుసుకున్నట్లు.

ఒక్క అ ఇ. బి. స్టెనోనేకాదు. టైపింగ్ సెక్షన్‌లోని టైపిస్టులు ఇద్దరు, ఒక సూపరింటెండెంట్, ఇద్దరు అసిస్టెంట్ సూపరింటెండెంట్‌లు, ఎకౌంటెంట్ మొద లయిన వాళ్ళుకూడా, ఆ డాబామీ దమ్మాయి తమకి ఉత్తరాలు రాసినట్లుగా చెప్పారు.

ఆఫీసంతా గగ్గోలు ఎత్తిపోయింది ఈ వార్తతో ఏం తెలియనట్లు, అమాయ కంగా ఆ డాబామీదమ్మాయి, నెరజా ణలా ఇంతమందికి ఉత్తరాలు రాసి, ఇంతమందితో స్నేహాలు చేసి, ఇంత మందితో సినిమాలు, షికార్లు చేయడం అందరినీ ఆశ్చర్యసాగరంలో ముంచెత్తే సింది. అందరూ ఆ అమ్మాయి గురించి మాట్లాడుకోకుండా వుండలేక పోతు న్నారు.

వాళ్ళంతా ఆ రోజు మధ్యాహ్నం ఒంటిగంటకి లంచ్ టైంలో కలిసారు కేంటిన్‌లో. తమని ఆంజనేయస్వామి గుడికి రమ్మని డాబామీదమ్మాయి ఉత్తరం రాసినట్లు, తాము వెళ్ళి ఆ అమ్మాయిని కల్సినట్లు, సినిమాలకి షికార్లకి తిరిగినట్లు చాలామంది చెప్పారు.

కేషియర్ ఆ అమ్మాయి తనకి రాసిన ఉత్తరాలు కొన్ని చూపించాడు. అందరూ చేతి వ్రాతని గుర్తుపట్టి, తమకి కూడా ఆ అమ్మాయే రాసిందన్నారు.

అంతమందితో సినిమాలకి, షికార్లకి వెళ్ళిన ఆ డాబామీదమ్మాయి తనని ఎందుకు కలుసుకోలేదో అర్థంకాలేదు

కేషియర్ కి. ఆ మిగతావాళ్ళందరి మీదట తను ఏ విషయంలోనూ తీసి పోడు. పైగా అధికుడు కూడా అందంలో.

చాలా రోజులు తనకి జరిగిన అన్యాయానికి బాధపడ్డాడు కేషియర్. కాని తనకిలాగే ఉత్తరాలు వ్రాసి, కలువకుండా ఏడిపించిందాఅమ్మాయి మరో ముగ్గురని. వాళ్ళు కేషియర్ తో అదే సంగతి చెప్పారు.

"మనం నలుగురం ఏం పాపం చేసామని మనని దూరంగా వుంచింది?" అని వాపోయారు వాళ్ళు.

కొత్తల్లో అరుగులమీద నిలబడి ఆ డాబా మీదమ్మాయిని తదేకంగా అంతా చూస్తూంటే, వాళ్ళనిచూసి జ్ఞానిలా నవ్వుకున్నాడో ఆఫీస్‌ప్యూన్. ఆ సంగతి పాఠకులకి గుర్తుండొచ్చు.

అలా జ్ఞానిలా నవ్వుకున్న ఆ ఆఫీస్ ప్యూన్ నిజానికి జ్ఞాని కాడు. కేవలం వ్యాపారి. ప్రభుత్వోద్యోగికి బయట వ్యాపారం చేసుకునే హక్కు లేదు కాబట్టి తన తమ్ముడిచేత వ్యాపారం చేయిస్తున్నాడు.

ఆఫీస్‌లోని అనేకమందిని ఆయస్కాంతంలా ఆ డాబామీదమ్మాయి ఆకర్షించడం గమనించాడు ఆ అయస్కాంత శక్తిని తన వ్యాపారంవైపు ఇన్‌డైరెక్ట్‌గా ప్రసరింపచేయాలనుకున్నాడు. చేసాడుకూడా.

ఆ డాబామీదమ్మాయి రాసినట్టుగా తనే స్వయంగా అందరికీ ఉత్తరాలు రాసాడు. అందరికీ, ఆ ఆంజనేయ స్వామి గుడి దగ్గర కలుసుకోమని ఆ అమ్మాయి రాసినట్లుగా రాసాడు. తను ఉత్తరాలు రాయడానికి ఎన్నుకున్న వాళ్ళకి, ఒకొక్కరికీ ఒకొక్క సమయంలో రమ్మని రాసాడు ఒకరినొకరు కలవకుండా వుండేందుకు గాను.

ఆ విధంగా ఉత్తరాలు రాసి, తన వ్యాపారానికి కస్టమర్స్‌ని రప్పించుకున్నాడు. ఆ ప్యూన్ అనుకున్నట్లుగానే, ఉత్తరాలు అందుకున్నవాళ్ళు ఆ సంగతి బహిర్గతం చేయకుండా రహస్యంగా వుంచారు; అందరికీ తెలిస్తే ఇబ్బందులకు లోనవుతామని.

ఆ ఆంజనేయస్వామి గుడి ప్రక్కనే, కొత్తగా ఆ ప్యూన్ తన తమ్ముడిచేత కొబ్బరికాయల దుకాణం తెరిపించాడు. అవి ఎక్కువగా అమ్ముడవాలని, ఆ డాబామీదమ్మాయి దాసులని గుడికి తరచుగా రప్పించి, వాళ్ళచేత కొబ్బరికాయలు కొనిపించాడు. అక్కడ మరో కొబ్బరికాయల దుకాణం లేదు.

తను ఉత్తరం రాయడానికి, ఇన్‌లాండ్ కవరుకోసం ఖర్చుచేసిన ఇరవై పైసలు కూడా కొబ్బరికాయ వెలకు కలిపి మరీ వసూలు చేసాడు వాడు.

తను ఏదో అర్థంకి వ్రాయాలని పెళ్ళిగురించి ఉత్తరంలో వ్రాస్తే, ఆ




డాబామీదమ్మాయికి నిజంగా పెళ్ళి అయిపోవడం తన వ్యాపారానికి చిన్న దెబ్బగా భావించాడు ఆ జ్ఞానిలాంటి వ్యాపారి.

అంతేకాదు. 'ఆ అమ్మాయితో మేం తిరిగాం' అనే కోతలరాయుళ్ళని చూసి మనసులోనే నవ్వుకున్నాడు. డాబామీదమ్మాయికి చెడ్డపేరు రావటం వాడిని ఏమాత్రం బాధించలేదు. పైగా, వారం ఆగి మళ్ళీ ఓ ఉత్తరం రాసాడు అందరికీ.

మైడియర్,

మా అక్కయ్య పెళ్ళికాక మునుపు మీ గురించి నాకు పదే పదే చెప్తూండేది. అక్కయ్య ఆ విధంగా పరోక్షంగా మీ మీద నాకు ప్రేమ అంకురించేలా చేసి వెళ్ళింది.

నన్ను తప్పుగా అర్థంచేసుకోకుండా వుంటే, సాయంత్రం ఆరున్నరకు ఆంజనేయస్వామి గుళ్ళో నా కోసం వేచియుండగలరా!

మీ

డాబామీదమ్మాయి చెల్లెలు.

గమనిక: నేను చక్కెర పొడి చేసి పొట్లంకట్టి తెస్తాను. కొబ్బరి ముక్కలు ముక్కలుగా కోసి, చక్కెరను నంచుకుని తింటూ మాట్లాడుకుందామేం! తప్పక వస్తారుగా!




పెట్టెతోసహా ఓడమీద పారిపోయిన పారసీకుడు నిజానికి ఒక భయంకర మాంత్రికుడు. వాడిపేరు బహ్రాం. సముద్ర ప్రయాణము సాగించినంత కాలమూ వాడు పెట్టెతెరిచి, అపస్మారక దశలో ఉన్న హసన్‌కు తిండిపెడుతూ వచ్చాడు. ప్రయాణం పూర్తిఅయి, ఓడ రేవు చేరింది. బహ్రాం పెట్టెతో సహా తీరం చేరాడు. ఓడ వెళ్ళిపోయింది.

బహ్రాం పెట్టెలోంచి హసన్‌ను పైకి తీసి, అతని కట్లువిప్పి మత్తుకు విరుగుడు ఇచ్చాడు. హసన్ కళ్ళు తెరిచి చుట్టూ కలయజూచాడు. సముద్రతీరంమీద ఉండే ఇసుక కణాలు ఎర్రగానూ, ఆకుపచ్చగానూ, తెల్లగానూ, నీలంగానూ, పసుపుగానూ, నల్లగానూ ఉన్నాయి. అది తన దేశపు తీరం కాదు.

హసన్ వెనక్కి తిరిగి, ఒక రాతి మీద కూర్చునిఉన్న పారసీకుణ్ణి చూసి ఆశ్చర్యపోయాడు. తాను మోసపోయిన

సంగతీ, ఇలా అవుతుందని తల్లి ముందే చెప్పిన సంగతీ హసన్ గ్రహించాడు. కాని, ఎలా జరగవలసిఉంటే అలాగే జరుగుతుంది. అన్నిటికీ అల్లాయే ఉన్నాడనుకొని అతను పారసీకుణ్ణి సమీపించాడు. పారసీకుడు కదలలేదు

"ఇదంతా ఏమిటి నాన్నా!" అని హసన్ వణుకుతున్న గొంతుతో అడిగాడు.

"హసన్, ఇప్పుడు నువ్వు నా అధీనంలో ఉన్నావు. ముందు నువ్వు నీ మతాన్ని విసర్జించి, నా మతం స్వీకరించు!" అన్నాడు బహ్రామ్.

"దుర్మార్గుడా, ఏమిటి నువ్వనేది?" అన్నాడు హసన్.

వెంటనే బహ్రాం తన ధోరణిమార్చి, "నిన్ను పరీక్షించటానికి అలా అన్నాను నాయనా! నిన్ను అల్లా మెచ్చాడు. నీకు నా విద్యఏకాంతంలో ఉపదేశించటంతప్ప నిన్నిక్కడికి తీసుకరావటంలో నాకు మరో ఉద్దేశం ఏమీలేదు. సముద్రం మీదికి ఉన్న ఎత్తయిన కొండశిఖరం చూశావా?అది మేఘపర్వతం. నాకు అవసరమైన దినుసులన్నీ అక్కడే దొరుకుతాయి. దానిమీదికి వచ్చావంటే నీకు ఎంతైనా లాభం ఉంటుంది. మనం అక్కడికి వెళ్ళినాక మేఘాలకు ఎగువగా మొలిచే మూలికలను కోసి, మిగిలినదంతా ఉపదేశిస్తాను!" అన్నాడు.

బహ్రాం చెప్పినట్టు చెయ్యక తప్పదు. కాని హసన్ తల్లిని తలుచుకుని కంటతడిపెట్టాడు

"ఏడవకు హసన్. నా సలహా ఎంత ఉపయోగమైనదో నీకు త్వరలోనే తెలుస్తుంది," అన్నాడు బహ్రామ్.

"ఆ కొండ గోడలా నిటారుగా ఉన్నదిగదా. దాన్ని ఎలా ఎక్కటం?" అని హసన్ అడిగాడు.

"దాన్ని గురించి విచారించకు. మనం పక్షులకన్నా లాఘవంగా పోతాం."

బహ్రాం తన దస్తుల మూటలోనుంచి చిన్న రాగి తప్పెట తీశాడు. దానిమీద ఏవో బీజాక్షరాలున్నాయి. దానికి నెమిలి చర్మం అమర్చి ఉన్నది. ఆ చర్మంమీద బహ్రాం వ్రేళ్ళతో మీటగానే వాళ్ళ చుట్టూ సుడిగాలిలాటిది లేచి, గుర్రం సకిలింపు వినిపించింది. మరుక్షణమే ఒక పెద్ద నల్లగుర్రం వారి ముందు ప్రత్యక్షమయింది. దానికి రెక్కలున్నాయి. దాని ముక్కునుంచి జ్వాలలు వెలువడుతున్నాయి. బహ్రాం దానిమీద ఎక్కి కూచుని, హసన్‌ను పైకిలాగి తన వెనక కూర్చోబెట్టుకున్నాడు. కళ్ళుమూసి తెరిచే లోపల ఆ గుర్రం వాళ్ళను కొండశిఖరంమీద దించి అదృశ్యమయింది.

"హసన్ ఇప్పుడెక్కడికి పోతావు? అగ్నిమీద ప్రమాణం చెయ్యి" అన్నాడు అగ్ని ఆరాధకుడు బహ్రాం.

హసన్ ఆవేశంతో, "అల్లా తప్ప

దేవుడు లేడు ? అల్లా ప్రవక్త మహ్మద్! పారసీక పశువా! అపవిత్రుడా! నేను నీ ప్రాణానికి అల్లా ప్రసాదించిన ఖడ్గాన్ని !" అని, మెరుపులాగా బహ్రాం మీదికి లంఘించి, అతని చేతిలోని తప్పెట లాగేసి, అతన్ని కొండ అంచు మీదినుంచి తోసేశాడు. బహ్రాం పల్టీలు కొడుతూ కిందికి వెళ్ళి, సముద్రతీరాన గల రాళ్ళ గుట్టలమీద పడి తునాతునక లయిపోయాడు.

ఆ మాంత్రికుడు బ్రతికి ఉంటే తాను ఎన్ని పాతకాలు చేయవలసి వచ్చేదో హసన్ ఎరగడు. అలాటివాడి పీడ విరగడైపోయింది. హసన్ తన చేతిలో ఉన్న తప్పెటను పరీక్షించాడు. కాని దాన్ని ఎలా ఉపయోగించాలో తెలియక అతను ఆ ప్రయత్నం చెయ్యలేదు. దాన్ని తన రొండిన పెట్టుకుని చుట్టూ చూశాడు.

శిఖరానికి రెండోపక్క శిఖరంఎత్తున సమ ప్రదేశం ఉన్నది. దానిమీద దూరంగా అతనికి మంట కనిపించింది. మంట ఉన్నచోట మనుషులుండాలను కుని అతను ఆ మంటకేసి నడిచాడు. దగ్గరకు పోతున్నకొద్దీ అతనికి నిజం తెలిసింది. అతను మంట అనుకున్నది ఒక బంగారు భవనంమీద పడుతున్న ఎండ! ఆ భవనంమీద నాలుగు ఎత్త యిన బంగారు స్తంభాలూ, వాటిమీద బంగారు గుమ్మటాలూ ఉన్నాయి.

ఆ రోజు తాను పొందిన అనుభవాల తోనూ, నడకతోనూ హసన్ బాలా బడలి ఉండి, "ఈ రాజభవనంలో రాజే వుండనీ, భూతమే ఉండనీ ద్వారపాల కుణ్ణి అడిగి కాస్త నీరూ, తిండీ తింటాను. వాడు మంచివాడయితే నన్ను ఒకమూల పడుకోనిస్తాడేమో !" అనుకున్నాడు. అతను ద్వారం చేరుకుని, లోపలి ఆవ రణలోకి అడుగుపెట్టాడు. ద్వారం తలుపు ఏ కొండపు పచ్చరాయితో మలిచి ఉన్నది.

అతను కొద్ది అడుగులు వేశాడో లేదో, ఇద్దరు చక్కని చుక్కల్లాంటి ఆడ పిల్లలు, ఒక పాలరాతి అరుగుమీద కూచుని చదరంగం ఆడుతూ కనిపిం చారు. వాళ్ళు ఆటలో నిమగ్నమై వుండి మొదట హసన్ రాకను గమనించలేదు. కాని త్వరలోనే,ఆ యువతులలో చిన్నది తల ఎత్తి, ఒక అందమైన యువకుడు నిలబడి ఉండటం చూసింది.

ఆమె వెంటనే లేచి నిలబడి "చూడు అక్కా ! ఎవరో అందగాడు వచ్చాడు. మంత్రగాడు బహ్రాం అప్పుడప్పుడు మేఘ పర్వతానికి తెస్తాడే అలాటి యువకుడై వుండాలి. కాని ఇతను బహ్రాంను ఎలా తప్పించు కున్నాడో. ఏమో !" అన్నది.

హసన్ వెంటనే ఆమె కాళ్ళమీదపడి "అవును, దేవీ నేను అలాంటి వాణ్ణే" అన్నాడు.



అంత అందమైన యువకుడి కంట తన్నీరుచూసి ఆ పిల్ల అమితంగా కలవర పడి "చూడు అక్కా! నీ సమక్షంలో అల్లా సాక్షిగా, నేను ఈ యువకుణ్ణి నా సోద రుడుగా దత్త స్వీకరణ జేస్తున్నాను!" అని, హసన్‌ను చెయ్యిపట్టుకుని లేవ నెత్తింది. తర్వాత ఆమె అతన్ని భవ నంలోకి తీసుకుపోయి, చక్కగా స్నానం చేయించి, అతనికి దివ్యమైన బట్టలు కట్టబెట్టి, అతని పాతదుస్తులు అవతల పారేసింది. తర్వాత అక్కా చెల్లెళ్ళు ఇద్దరూ అతన్ని చెరొక రెక్కా పట్టు కొని చెల్లెలు గదికి తీసుకుపోయారు. ఇద్దరిమధ్యా కూర్చుని అతను భోజనం చేశాడు.

భోజనం పూర్తయినాక చెల్లెలు అత నితో "అన్నా, నీ రాకకు మా భవన మంతా పరవశమైపోతున్నది. నీ పేరే మిటి? నువ్వు మా యింటికి రావటం ఎలా జరిగింది?" అని అడిగింది.

"చెల్లీ, అక్కా! నా పేరు హసన్. ఎన్నో కష్టాలు పడినమీదట అదృష్ట దేవత నన్ను మీ భవనానికి చేర్చింది." అంటూ హసన్ ఐబ్రహీంతో తన అనుభ వాలన్నీ చెప్పాడు.

"దుర్మార్గుడు! వాణ్ణి చంపటం చాల

మంచిపనిచేశావు,'' అన్నారు అక్కా, చెల్లెళ్ళు.

తర్వాత అక్క చెల్లెలితో, "గులాబ్ మన సమాచారంగూడా అతనికి చెప్పు. అతనికి తెలియాలిగదా !" అన్నది.

గులాబ్ ఇలా చెప్పింది.

"అన్నా, మేం రాజకుమార్తెలం. ఈమె నా అక్క. మాకు ఇంకా ఐదు గురు అక్కలున్నారు. వాళ్ళు మాకన్న ఇంకా అందంగా ఉంటారు. ప్రస్తుతం వాళ్ళు వేటకు వెళ్ళారు. త్వరలోనే తిరిగి వస్తారు. మా తల్లులు వేరయినా తండ్రి ఒక్కడే నేనూ ఈ మా అక్కా ఒకే తల్లి బిడ్డలం. నేను అందరికన్నా చిన్నదాన్ని. మా తండ్రి గొప్ప భూత రాజులలో ఒకడు. ఆయన అతిశయం ఎంతదాకా వెళ్ళిందంటే, మమ్మల్ని పెళ్ళాడదగినవాళ్ళు ప్రపంచంలో లేరని నిర్ణయించి మేం యావజ్జీవం పెళ్ళి కాకుండా ఉండాలని శపథం పట్టి "ఏ మనిషిగాని, ఏ భూతంగాని ఎన్నడూ అడుగుపెట్టనిచోటు ఎక్కడైనా ఉందా?'' అని తన మంత్రుల నడిగాడు. మంత్రులు 'మహారాజా, అల్లా స్త్రీలను సృష్టించింది పురుషులతో సంధానం కావటానికే నని మా అభిప్రాయం. కన్యాత్వం చెడకుండా స్త్రీలు వార్ధక్యం పొందరాదని ప్రవక్త నిర్ణయం. ఏలినవారి కుమార్తెలు కన్యలుగా ఉండి వార్ధక్యం పొందితే అది ఏలినవారికి తీరని అవమాన మవుతుంది. యవ్వనంలో వారు పడే బాధ వేరే చెప్పాలా, అన్నారు మంత్రులు.

"నా కూతుళ్ళు చావటానికైనా ఒప్పుకుంటానుగాని, వాళ్ళ పెళ్ళికి ఒప్పుకోను. నేను కోరినస్థలం ఎక్కడ ఉన్నదో చెబుతారా ? లేక ఆ స్థలం వెతకటానికి మీ తలలను పంపనా ?'' అన్నాడు మా తండ్రి. "అలా అయితే, మహారాజా. మీకు కావలసిన ప్రదేశం మేఘ పర్వతంమీద ఉన్నది. పూర్వం సులేమాన్‌మీద తిరుగుబాటుచేసిన అసురులు అక్కడ ఉండేవారు. వాళ్ళు అక్కడ ఒక బంగారు భవనం కట్టారు. వాళ్ళ అనంతరం అది ఖాళీగానే వుండిపోయింది. అక్కడి వాతావరణం ఆహ్లాదకరంగా వుంటుంది. చుట్టూ మంచి ఫలవృక్షాలున్నాయి. టెంకాయ పాలలాటి చల్లని నీరు ప్రసాదించే సెలయేళ్లున్నాయి." అన్నారు మంత్రులు.

వెంటనే మా తండ్రి బలమైన భూత సైనికుల వెంట మమ్మల్ని ఇక్కడికి పంపాడు. మమ్మల్ని ఇక్కడ ఉంచి వాళ్ళు వెళ్ళిపోయారు. ఇక్కడికి వచ్చాక మంత్రుల మాటలు అక్షరాలా నిజమని తెలుసుకున్నాం ఎక్కడ చూసినాపూలు, మంచి అరణ్యాలు, పచ్చిక మైదానాలు, పళ్ళతోటలూ, సెలయేళ్ళు, పక్షుల పాటలూ, సువాసనలూ. సరస్సులలో తేలుతూ హంసలు, అలంకరించుకున్న




పెళ్ళికూతుళ్ళలా నెమిళ్లా — ఇది భూతల స్వర్గమే! అందుచేత మాకు ఇక్కడ సుఖంగానే ఉన్నది. మాకున్న విచారమల్లా, యువ స్నేహితులులేరు, తెల్లవారిలేచి సంతోషంగా చూడటానికి ఒక ముఖంలేదు. అందుకే, హసన్, నీ రాక మాకు ఎంతో సంతోషదాయకంగాఉంది."

ఇలా తమ కథ చెప్పి, గులాబ్ హసన్‌తో కబుర్లలోకి దిగింది.

త్వరలోనే వేటకుపోయిన అయిదుగురు రాజకుమార్తెలు తిరిగివచ్చి, తమ కొక కొత్త తమ్ముడు ఏర్పాటయినందుకు పరమానందం చెందారు. వాళ్ళు అతనికి హృదయపూర్వకంగా స్వాగతం చెప్పి అతన్ని తమ వెంట చాలాకాలం ఉండమని కోరారు. వాళ్ళ మాట తీసెయ్యటానికి అతనికేమీ కారణం కనపడక, సరేనన్నాడు.

ఆ బంగారు భవంతి వింతలు చూస్తూ చెల్లెళ్ళతో వేటలకూ, విహారాలకూ పోతూ అతను కాలక్షేపం చేశాడు. అలాటి సోదరుడు దొరికినందుకు వాళ్ళు ఎంత పొంగిపోయారో అలాటి సోదరీమణులు దొరికినందుకు అతనుకూడా అంత గర్వపడ్డాడు. అందరూ కలిసి ఆటపాటలతో గడిపి సాయంకాలంవేళ ఒకరికి తెలియనివి, ఒకరు చెప్పుకునేవారు. రాజకుమార్తెలు భూతాల చరిత్ర చెబితే, హసన్ తన దేశపు ఆచారాలను గురించి వాళ్లకు చెప్పేవాడు.

జీవితం ఆనందదాయకంగా ఉండటంతో హసన్ అందచందాలు ఇనుమడించాయి. అతను రాజకుమార్తెలతో ఏకోదరుడులాగ మసులుకుంటున్నాడు. అందరికన్నా అతనికి గులాబ్ మీద అభిమానం హెచ్చు.

ఒకరోజు అందరూ కలిసి పాటలు పాడుతుంటుండగా ఆకాశం నిండా దుమ్ము కమ్మి, సూర్యుడు కప్పుకు పోయాడు. ఉరుములాంటి ధ్వని వాళ్ళకు వినవచ్చింది. ఏడుగురు అక్కచెల్లెళ్ళు హసన్‌తో, "పారిపోయి పొదరింట దాక్కో!" అన్నారు భయపడుతూ. గులాబ్ అతన్ని చెయ్యి పట్టుకు తీసుకు పోయి పొదరింట దాచింది.

ధూళి అణగారిపోగానే భూతాలసేన కనబడింది. మరొక పొరుగురాజు గౌర వార్థం భూతాలరాజు ఒక విందు ఉత్స వము తలపెట్టి, దానికి తన కుమార్తెలను తీసుకరావటానికి తన పరివారాన్ని పంపాడు.

ఈ సంగతి తెలియగానే గులాబ్ హసన్ వద్దకువెళ్ళి కంట తడిపెట్టు కుంటూ అతన్ని ముద్దుపెట్టకుని, తన ప్రయాణం గురించిచెప్పి, "అన్నా, మేం తిరిగి వచ్చేదాకా ఇక్కడే ఉండు. ఈ భవనానికి నువ్వే యజమానివి. ఇవిగో అన్ని గదుల తాళపుచెవులు. ఈ తాళపు చెవి గల గదిమాత్రం తెరవకు" అంటూ ఒక తాళపు చెవి చూపింది. ఆ తాళపుచెవితో ఒకే ఒక నీలంరాయి పొదిగి ఉన్నది.

హసన్ ఆమెను కౌగలించుకుని, అక్కలందరూ తిరిగి వచ్చేదాకా ఉంటా ననీ, ఆ తాళపుచెవి ఉపయోగించననీ, అన్నాడు. మిగిలిన ఆరుగురు రాజకుమా ర్తెలుకూడా ఒకరొకరే పొదరింటికివచ్చి అతన్ని ముద్దుపెట్టుకుని, వీడ్కోలు చెప్పారు. తర్వాత ఏడుగురు తమ తండ్రి రాజ్యానికి వెళ్ళిపోయారు.

ఆ మహాభవనంలో హసన్ ఒంట రిగా ఉండిపోయాడు. తోడు లేక పోవటం అతనికి తీరని విచారం కలిగిం చింది. అది పోగొట్టుకోవటానికి అతను ఒక్కొక్క రాజకుమార్తె గదికీ వెళ్ళాడు. ఆ గదులలో వాళ్ళు లేకపోవటంచేత అందులో ఉండే వాళ్ల వస్తువులు చూడ టంవల్లా అతని హృదయం ద్రవిం చింది. అలా గదులు తిరుగుతూ అతను తెరవగూడని తలుపు కనిపించింది. కాని అతను దాని జోలికి పోకుండా ముందుకు సాగిపోయాడు.

కాని అతనికి, "గులాబ్ ఆ గది ఎందుకు తెరకూడదన్నది? ఆ తలుపు వెనక ఏమి వింత ఉండి ఉంటుంది? అయినా తెరవనని మాట ఇచ్చానుగదా!" అన్న ఆలోచన వచ్చింది.

రాత్రి అయింది ఏకాంతం మరీ దుర్భరంగా ఉండటంచేత అతను నిద్ర పోదామని పడుకున్నాడు కాని ఆ తలుపు ఆలోచన అతన్ని విడవకపోవటంచేత అతనికి కన్ను మూతపడటంలేదు.

"ఏమయితే అయింది, తలుపు తెర వనా?...తెల్లవారినదాకా ఆగుదాం!" అనుకున్నాడు హసన్. కాని నిద్ర రావటంలేదు. "ఆ తలుపు తెరిచి, దాని

వెనక ఏముందో ఇప్పుడే చూస్తాను. నా ప్రాణం పోతే పోనీ! అనుకుని, ఒక దివిటీ వెలిగించి, తలుపువద్దకు వెళ్ళి, తాళంచెవితో తాళం తీశాడు. తలుపు నిశ్శబ్దంగా తెరుచుకున్నది,

హసన్ లోపలికి అడుగు పెట్టాడు. లోపల మొదట్లో అతనికి ఏమీ కనిపించలేదు. తివాసీలు లేవు, సామగ్రి లేదు. గది అంతా కలయ తిరుగుతూండగా అతనికి ఒక మూల, నల్లకర్రతో చేసిన నిచ్చెన ఒకటి కనబడింది. ఆ నిచ్చెన చూరులో ఉన్న కంతకుండా పైకి పోయి ఉన్నది.

అతను దివిటీని నేలమీద ఉంచి, నిచ్చెన ఎక్కుతూ, కప్పులో నుంచి పైకి వెళ్ళాడు. తల కప్పు దాటి పైకి లేవగానే అతనికి ఆకాశం కనిపించింది. అతను కప్పుమీదికి ఎక్కాడు. అతనిముందు అతి మనోహరమైన నైసర్గిక దృశ్యం కానవచ్చింది. అది నిండు వెన్నెలలో అద్భుతంగా ఉన్నది. అందులో, తోటలో లాగా, మొక్కలూ, పూలూ, పొదలూ ఉన్నాయి. సమీపంలోనే ఒక కోనేరు ఉన్నది. అందులో ఆకాశం ప్రతిబింబిస్తున్నది. దాని అవతలి ఒడ్డున అస్పష్టంగానూ, చెట్ల మధ్యగానూ ఒక వింత భవనం కనిపిస్తున్నది. ఆ భవనానికీ, కోనేరుకూ మధ్య మెట్లున్నాయి. మెట్ల దిగువన నీటికి ఎగువగా ఒక తిన్నె ఉన్నది. దాన్ని కెంపు, పచ్చ, బంగారు, వెండి ఇటుకలు మార్చి, మార్చి కూర్చి కట్టారు. తిన్నెమీద ఒక సింహాసనం ఉన్నది. నాలుగు రోజా రంగు పాలరాతి స్తంభాలమీద అమర్చిన ఆకుపచ్చ పట్టు చాందినీ సింహాసనం మీద ఉన్నది. ఇదంతా ఒక తడిక చాటున ఉన్నది. ఆ తడికను అతి సన్నని పట్టు దారాలతోనూ, బంగారు తీగలతోనూ అల్లారు. ఇలాంటి వైభోగం ఏ రాజుకూ ఉండదు.

హసన్ ప్రతిమలాగా నిలబడి ఈ మనోహర దృశ్యాన్ని తిలకిస్తుండగా ఆకాశంనుంచి పెద్ద పక్షులు కొన్ని దిగి కోనేరు ఒడ్డున వాలాయి. అవి తెల్లని పక్షులు, పది ఉన్నాయి. అవి అటూ, ఇటూ తిరుగుతూంటే వాటి తాకిడికి గడ్డి చెదురుతూ ఉన్నది. అంతలో పక్షులన్నిటిలోకీ పెద్దది వెళ్ళి సింహాసనం మీద కూర్చుకున్నది.

మంత్రి కుమార్తె తెల్లవారుతూండడం గమనించి కథ చెప్పటం నిలిపేసింది.



# భేదం



రుద్రా మంగతాయారు

"సరళా!" గర్జించారు రామయ్య గారు.

"అదికాదు నాన్నగారూ!"

"నీ సొద నాకనవసరం. నీ నిర్ణయం మార్చుకున్నావా? లేదా!"

"మన్నించండి నాన్నా."

"ఛీ! నా కడుపున చెడబుట్టావే! పాపిష్టిదానా! నీ ముఖం నాకు చూపించకు! ఇక్కడినుంచి పో" అంటూ అరిచారు.

"నాన్నగారూ! మీరేనా యిలా మాట్లాడేది? కుల, మత, వర్గ భేదాలు లేవని—ఎంతో గంభీరంగా సభల్లో వేదిక లెక్కి మాట్లాడిన మీరు యిలా అంటారనుకోలేదు. "చదువు — సంస్కారం వున్న యువతీ యువకులు ముందుకు రావాలి; చాదస్తపు సాంప్రదాయాల్ని వెనక్కు నెట్టాలి; ఆదర్శ వివాహాలు చేసుకోవాలి; కుల, మత, భేదాలు రూపుమాపాలి" — అని మీరంటుంటే మీ ఉన్నతభావాలకు ఎంత మురిసిపోయేదాన్ని! కాని..."

"ఇంక కట్టిపెట్టు — నీ కబుర్లు వినే ఓపిక నాకులేదు. నీ ఇష్టమొచ్చినట్టు అఘోరించు. ఈ రోజుతో నా కూతురు చచ్చిందనుకుంటాను" రామయ్యగారు భారంగా కూర్చుని కళ్ళుతుడుచుకున్నారు.

సరళ నిశ్శబ్దంగా నిలబడిపోయింది.

కోపాన్ని దిగమ్రింగి తగ్గుస్వరంతో రామయ్యగారే మళ్ళీ యిలా అన్నారు.

"అమ్మా! సరళా! గొంతెత్తి అరుస్తూ, బల్లగుద్ది చెప్పే ఆదర్శాలన్నీ ఆచరణలో పెట్టలేమమ్మా. మనలాంటి వాళ్ళను "స్టేజీ" మీద నాలుగు ముక్కలు చెప్పమంటే— యిలాంటి వెన్నో చెబుతూంటాం. కాని అవన్నీ మనం




చేస్తామా ? ఇలా చెప్పటానికి అర్హత సంపాదించామంటే—మన పేరు, పరువు ప్రతిష్ఠలు, మన తాత ముత్తాతలు చేసిన గౌరవమయిన పనులు, ముఖ్యంగా మన డబ్బు...కారణం తెల్లారితేస్తే ఊళ్ళో వాళ్ళందరికి మంచి — చెడ్డలు చెప్ప వలసిన వాళ్ళం — అలాంటిది మనమే యిలా చేస్తే "ఫలానావారి అమ్మాయి కులం తక్కువవాడితో... నేను భరించ లేనమ్మా" అంటూ కళ్ళు తుడుచు కున్నారు.

సరళ కొన్ని క్షణాలు నిశ్శబ్దంనుంచి తేరుకుని —

"నాన్నగారూ! మీరు నమ్మిన సాంప్ర దాయాలకు మీరెంత విలువ యిస్తు న్నారో, నేను నమ్మిన ఆదర్శాలకు నేనూ అంత విలువ యిస్తున్నాను. ఒకరికి మనసిచ్చి మరొకరితో ... నా వ్యక్తిత్వాన్ని "హత్య" చేయలేను. నాకు ఆ "బలహీనత" లేదు. అందుకే నా నిర్ణయం మారదు" చరాచరా వెళ్ళి పోయింది సరళ.

నౌకరు మల్లిగాడికిమాత్రం అయ్య గారి అవస్థ చూస్తే జాలివేసింది. కోపం కూడా వచ్చింది. "పిల్ల మనసుపడింది. నాలుగు అచ్చింతలు పడెయ్యకూడదా ! కులం అంటారేటి ! మనుషులు అంతా ఒకేలాగ పుడతారు గందా ? మొన్న గుళ్లో సాములోరు కూడా యీ మాటే సెప్పారు. గొప్పోళ్ళలోనూ, పేదోళ్ళ లోనూ రకతమే గదా వుంది అళ్ళు, యీళ్ళు కూడా తినేది కూడే ! కాకపోతే అళ్ళు డబ్బుండి ధనవంతులయ్యారు. యీళ్ళు డబ్బులేక పేదోళ్ళయ్యారు. భగవంతుడికి అన్నీ తెల్సంటారు — మ రీ తేడా లెందుకెట్టాడు ? అందరిని

సమానంగా సూత్తాడంటాడు — మది మాలాంటోళ్ళనిసాకికీ సెయ్యమంటాడు. యిలాంటోళ్ళని సేయించుకోమంటాడేటీ; సెప్పకింపతేప్పులాగాపోళ్ళ "అదారిటీ" లకు మాలాంటోళ్ళం నలిగిపోడం— అయనకు యిష్టంకాటోలు, ఏటో యీ "స్రుష్టి" అంతా యిసిత్తరం..." గొణుక్కుంటూ పనిపూర్తిచేసి యిల్లుచేరు తున్నాడు మల్లిగాడు.

* * *

మల్లిగాడు కుక్కిమంచంలో అటూ యిటూ దొర్లుతున్నాడు. వాడి బుర్ర నిండా అవే ఆలోచనలు. ఏటో అమ్మాయిగారి మొకమే గ్యాపకం వత్తుందాది. అయ్యగారు ఎన్ని సెప్పినా యినుకుండారు కాదు. అయ్యగారి కళ్ళంట నీళ్ళొచ్చాయిగాని—అమ్మాయి గారి కళ్ళల్ల ఒక్క నీటి సుక్కనేదు. పైగా తలెత్తుకుని ఎంత ఠీవిగా ఎల్లిపోనాదు. అయినా తలొంచు కెల్లటానికి ఆ యమ్మేం తప్పుసేసిందిలే ;"

యింతలో ఏవో అరుపులు, కేకలు వినిపించాయి ... మల్లిగాడి ఆలోచనలు చెదిరిపోయాయి.

అవి గంగన్న కేకలు శ్రద్ధగా ఆలకించాడు.

"సరోజా ! మాట్లాడవేం ! ఏదో సరదాపడుతున్నావుగదా అని తాహతు లేకపోయినా యింతవరకూ చదువు చెప్పించాను. మిడి మిడి జ్ఞానం సంపాతించి 'ప్రేమ-గీమ'' అంటూ ఎగురుతున్నావు. కులం కానోడిని పెళ్ళిచేసుకోవటం మన యింటా వంటా లేదు. చదవేస్తే వున్నమతి పోయిందట. వీధి గుమ్మం దాటావా కాళ్ళు విరగేస్తా ; నీ ముందు ముగ్గురాదపిల్లల పెళ్ళిచేసాను. పిల్లలంటే సుగుణాల రాశులు అని పేరు తెచ్చుకున్నారు. ఈనాటికి నువ్వు బయలుదేరి యీ ఘనకార్యం వెలగబెడుతున్నావు ఎవరి గురించన్నా ఏమైనా చెప్పుకుంటూంటే — "మా అమ్మాయిలు ఆలా వీథి ముఖం చూడరోయ్" అని ఎంతో గొప్పగా చెప్పుకునే వాడిని...'' పట్ ... ఫట్ శబ్దం.

"పాపం సరోజమ్మను కొడుతున్నాడనుకుంట. యీ తలిదండ్రులికి ఆళ్ళ పిల్లలు ఎవరినో పేవించి సెడిపోతన్నారనిగాదు బాద — యీదిలో యీళ్ళ పరువులు పోతాయని అనలేదువు. కన్న బిడ్డల 'సుంకం' కంటే 'గొప్పలే' ముఖ్యం అనుకుంటా !! యీ గంగన్న డబ్బులేకపోయినా పరువుతో బతుకుతున్నాడు. రేపటినుండి ఎలా బతుకుతాడో ఏటో ;

* * *

రామయ్యగారి యింటిలో పెళ్ళి హడావిడి. 'సరళ అభ్యుదయ వివాహం' చూడటానికి దేశం నాలుగు మూలలనుంచి జనం వచ్చారు. వాళ్లంతా డబ్బున్న బాబులు. వచ్చేవాళ్ళు వస్తున్నారు. తినేవాళ్ళు తింటున్నారు. తిన్న

వాళ్ళు తిరిగ్గా కబుర్లు చెప్పుకుంటున్నారు, కాసేపటికి అందరి భోజనాలు పూర్తయ్యాయి.

అంతా హాల్లో కూర్చున్నారు.

మంత్రిగారు లేచి గొంతు సవరించుకుని మొదలుపెట్టారు - "ఆదర్శాలు, అభ్యుదయాలు ... అంటూ అరవటమే గాని కార్యరూపంలో చూపించేవారు బహుతక్కువ. రామయ్యగారు తమ కుమార్తెకు ఆదర్శవివాహంచేసి "కార్య



కూపమ" అనిపించుకున్నారు. రామయ్యగారిలాంటివారు నూటికి పది మందివున్నా మనదేశంలో కుల, మత భేదాలు నామరూపాలులేకుండా పోయేవి. కాని ఎవరికి వారే వెనుతీస్తున్నారు. అలా కాక రామయ్యగారిలా పిల్లల్ని ప్రోత్సహించి వాళ్ళకు వెన్నెముకల్లా వుండాలని మిమ్మల్ని కోరుతున్నాను. ఎంతో పేదవాడు, తనకంటే ఎంతో తక్కువ కులంవాడు అయిన చంద్రాన్ని ఎన్నుకోవటంలో మన సరళ ఉన్నత భావాలు అర్థమవుతున్నాయి. ఈ తండ్రీ కూతుళ్ళ ఆదర్శభావాలకు నేనెంతో సంతోషిస్తున్నా" అంటూ ముగించారు.

ఆయన తర్వాత రామయ్యగారి ఆదర్శభావాల గురించి చాలామంది మాట్లాడారు.

* * *

నూతిలోంచి గంగన్న శవం తీసారు.

"కూతురు తక్కువ కులంవాడితో లేచిపోయింది. అది భరించలేక..."

"పరువే ప్రాణంగా చూసుకొనేవాడికి పరువుపోయాక ప్రాణం ఎందుకు?..."

"అయ్యో! రామా! ఎంత పొగరు? తండ్రిమాట కాదని అలా లేచి పోవటం..."

విందునుండి వచ్చిన మల్లిగాడి ప్రాణం నీరయిపోయింది.

వాడి బుర్రనిండా ఆలోచనలే...

"లోకం కాకుల్లా పొడుత్తారని పిరికి గంగన్న ఎంతపనిచేసాడు! డబ్బు లేనోడు గాబట్టి "దైర్యం" నేక సచ్చాడు. కాని రామయ్యగారు తెలివయినోడు ముక్కెంగా డబ్బునోడు గాబట్టే - దాన్నే "ఆదరసం"గా మారిసి కూతురు పెళ్ళిసేసినాడు. యిక కూతురు తన మాట యినదని తెలిసి ప్లేటు పిరాయిం చేసినాడు. నలుగురితోటి సెబాసని పించుకున్నాడు. సరళమ్మ నేసిన పనే సరోజమ్మా నేసింది. కాని సరళమ్మది "ఆదరస యివాహం" అన్నారు. సరోజమ్మ లేచిపోయిందన్నారు. యీళ్ళిద్దరికి "భేదం" ఏటో మరి! "స్రుష్టి" యిసిత్రంగా వుందే!!"





(గత సంచిక తరువాయి)

## మర్కట యువకుడి కథ

మర్నాడు రాత్రి మంత్రి కుమార్తె తిరిగి ఇలా ఆరంభించింది.

సుల్తాన్ మహమ్మద్ తన కథను ఇలా కొనసాగించాడు.

నేను వెంటనే దుకాణాలకు పరిగెత్తి పోయి, నా జన్మలో ఎన్నడూ రుచి చూడని ఆహార పదార్థాలతో పాడు పడిన ఇంటికి తిరిగివచ్చాను. మా తిండి పూర్తి అయేసరికి రాత్రి చాలా పొద్దుపోయింది. మర్కటయువకుడూ, నేనూ. పక్కపక్కనే పడుకుని నిద్ర పోయాం. నా అదృష్టం నా పక్కనే ఉన్నదన్న ధైర్యంతో నేను నిశ్చింతగా నిద్రపోయాను. నిద్రావస్థలోకి జారుతూ నేను అల్లాకు ధన్యవాదాలు చెప్పు కున్నాను.

మర్నాడు ఉదయం ఆ యువకుడు నన్ను నిద్ర లేపగొట్టి, "ఒక్క రాత్రి కటికనేలమీద పడుకునేసరికి ...

వాలొచ్చింది. నగరంలోకి వెళ్ళి మంచి భవంతి ఒకటి కిరాయికి తీసుకో. దాన్ని పక్కాగా అమర్చు. డబ్బు దగ్గిర చూడకు!" అన్నాడు.

అతను నాకు బంగారం ఇచ్చాడు. నేను చప్పున పని ప్రక్రమించి, శీఘ్రంగా పని పూర్తి చేశాను. కొద్దిగంటల లోపున మేమిద్దరమూ కైరోలోని ఉత్తమ భవనంలో గృహ ప్రవేశం చేశాం.

తరవాత యువకుడు నాతో, "మహమ్మద్, అలాటి కుళ్ళగుడ్డలతో నా వెంట ఉండటానికి నీకు నామోషీ అనిపించటంలేదూ? ఒక్క సారి హమ్మామ్‌కు వెళ్ళిరారాదూ? రాజు లందరికీ కలిపినా లేనంత డబ్బు ఉండగా నీకు ఉడుపులకు కొదవేమున్నదీ?" అన్నాడు.

నేను అతనికి వంగి సలాంచేసి, స్నానశాలకు వెళ్ళి, ఏళ్ల తరబడి ఒంటిని ఆశ్రయించుకున్న మురికినంతా ఒక్క దివ్యమైన స్నానంతో వదిలించుకున్నాను.

తరువాత అద్భుతమైన దుస్తులు ధరించి నేను వెళ్ళి ఎదురుగా నిలబడే సరికి ఆ యువకుడు, "ఇప్పుడు నాకు కావలసినట్టున్నావు" అన్నాడు. నా అదృష్టం తిరిగినందుకుంటూ నేను అతని సరసన కూర్చున్నాను.

కొంచెంసేపయాక అతను నా భుజంతట్టి, "రాజు కూతురు రంజాన్ చంద్రుడికన్న రంజుగా ఉంటుంది ఆమెను పెళ్ళాడతావా ఏం?" అన్నాడు.

"ఆమెదే ఆభ్యంతరం?" అన్నాను.

"అలా అయితే, లేచి బయలుదేరు. ఈ పొట్లం తీసుకొని కైరో సుల్తాను వద్దకు వెళ్ళి, ఆయన కుమార్తెను పెళ్ళాడవచ్చినట్టు చెప్పు. ఆమె నీకు రాసిపెట్టి ఉన్నది సుల్తాను నిన్ను చూస్తూనే తన కుమార్తె నియ్యటానికి సిద్ధపడతాడు. కాని ఈ పొట్లం రాజు గారి కియ్యకుండా ఏమీ అనకు."

పొట్లం ఒక బానిసచేత పట్టించుకుని నేను రాజభవనానికి వెళ్లాను. అక్కడి కొళ్జాలూ, భటులూ నా దుస్తులూ, వాలకమూ చూసి దిగ్భ్రమచెంది, ఏమి సెలవు అని అతి మర్యాదగా అడిగి, నేను సుల్తానుగారికి కానుక తెస్తున్నానని చెప్పగానే, లాంఛనాలన్నీ ముగించి నన్ను సుల్తానుగారి సన్నిధికి చేర్చారు.

నేను ఏమాత్రమూ బెదరిపోక, పుట్టింది లగాయతూ రాజులతో భుజాలు రాసుకుని తిరిగినవాడిలాగా, సుల్తానుకు గంభీర ప్రణామం చేశాను. ఆయన నన్ను ఆదరపూర్వకంగా పలకరించగానే కానుక ఆయనకు అందిస్తూ, "మహారాజా, ఈ చిన్న కానుక స్వీకరించండి. ఇది నా పేద స్థాయికి తగినదేగాని, తమ స్థాయికితగినది కాదు," అన్నాను.

సుల్తాను తన పెద్ద వజీరుచేత



పొట్లం విప్పదీయించి, అందులో నమ్మశక్యంగాని ఉత్తమజాతి రత్నాలను చూసి అమితాశ్చర్యంతో, "మంచిది? నీ కోరిక ఏమిటో చెప్పు. కానుక లియ్యటంలో రాజులు ఎవరికీ తీసిపోరు," అన్నాడు.

"మహారాజా, నాకు తమ పెద్ద కుమార్తె నిచ్చి పెళ్లిచెయ్యండి," అన్నాను.

సుల్తాను నాకేసి చాలాసేపు తేరిపార జూసి, "మంచిది!" అని, తన పెద్ద వజీరుకేసి తిరిగి, "ఈ మహా సియ్యాజ్ఞి గురించి ఏమంటారు?" అని అడిగాడు.

"అతను అలాంటి కోరిక కోరదగనివాడు కాడు. కాని ముందుగా పరీక్షించి చూడటం మంచిదనుకుంటాను," అన్నాడు పెద్దవజీరు.

'ఎలా?" అని సుల్తాను అడిగాడు.

"మీ రత్నాగారంలో ఉన్న మేలి రత్నాలన్నిటిలోనూ ఉత్తమమైనదిగా ఎంచి, అలాటిదే మరొకటి రాజకుమార్తెకు కానుకగా తెమ్మనండి," అన్నాడు వజీరు

నాకు గుండె పీచుపీచుమంటున్నా పైకి బింకంపోతూ, ఆ షరతుమీద నాకు రాజకుమార్తె నిచ్చి పెళ్లిచేస్తారా అని సుల్తాను నడిగాను

ఆయన తనవద్దనున్న గొప్ప వజ్రం తెప్పించి నాకు చూపుతూ, "ఇదే మాదిరి వజ్రాన్ని తెచ్చినట్టయితే నా కూతురు నీదే!'' అన్నాడు.

నేను ఆ వజ్రాన్ని అమిత జాగ్రత్తగా పరిశీలించి, అన్ని వివరాలూ మనసులో పెట్టుకొని, మర్నాడు వస్తానని చెప్పి, సెలవుపుచ్చుకుని వచ్చేశాను.

నేను తిరిగి రాగానే ఆ యువకుడు, "నీ పెళ్లిప్రయత్నంఎంతదాకావచ్చింది?" అని అడిగాడు.

నేను జరిగినదంతా అతనికి చెప్పి, నేను చూసిన వజ్రాన్ని వర్ణించాను.

"అదేమంత పెద్ద సమస్య కాదులే. ఈ రోజుకు చేసేదేమీలేదు. రేపు ఉదయం, నువు చూసిన వజ్రాంలాటివి పది తీసుకుపోయి ఇద్దువుగానిలే," అన్నాడు యువకుడు.

మర్నాడు తెల్లవారుతూనే అతను మా భవనం వెనక ఉన్న తోటలోకి వెళ్లి ఒక గంట తరవాత, పావురం గుడ్డంత ప్రమాణంలో ఉండే వజ్రాలు, సుల్తానువద్ద నేను చూసిన వజ్రం లాటివే, పది తెచ్చాడు.

నేను వాటిని తీసుకుని రాజభవనానికి వెళ్లి, సుల్తాను ముందు నిలబడి, ''నా పేదరికాన్ని మన్నించాలి. నా నా దగ్గిర ఈ పది వజ్రాలే ఉన్నాయి. అందులో మీకు నచ్చినది ఒకటి తీసుకుని, మిగిలినవి అవతల పారెయ్యండి,'' అన్నాను. ఇలా అంటూ నేను నా వెంట తెచ్చిన పెట్టె తెరిచి చూపాను. అందులో ఉన్న పది వజ్రాలూ తన వజ్రంలాటివేనని చూడగానే సుల్తాను సింహాసనంమీద చేరగిలబడిపోయాడు.

ఆయన చెయ్యి ఊపి వజీరును, "ఏంచెయ్యాలిప్పుడు?" అన్నట్టు అడిగాడు.

"పిల్లనిచ్చెయ్యండి!" అన్నట్టు వజీరు తలా, చెయ్యీ ఎగరేశాడు.

వెంటనే పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించటానికి ఉత్తరువులు జారీ అయాయి. కాజీ, సాక్షులూ పిలవబడ్డారు. వివాహపత్రం రాశారు. ఆ పత్రాన్ని నాకు చూపిస్తే, నేను దాన్ని నా వెంట తెచ్చిన మర్కట యువకుడికి చూపాను. నాకు రాయటమూ, చదవడమూ రాదని తెలిసి అతను దాన్ని పైకి చదివాడు.

తరువాత అతను నన్ను అవతలికి

తీసుకుపోయి, "మహమ్మద్, ఇప్పుడు నువ్వు సుల్తాను కూతుర్ని చట్టరీత్యా పెళ్ళాడావు. కాని నువ్వు నాకు ఒక్క విషయం మాట ఇయ్యాలి," అన్నాడు.

"నా ప్రాణం కావాలన్నా సిదే!" అన్నాను.

"అలా అయితే, నేను చెప్పినదాకా నీ భార్యను అంటకు. ఆమె కన్యాత్వం పోకముందే నాకు ఆమెవల్ల కొంత పని కావాలి," అన్నాడు యువకుడు నవ్వుతూ.

గర్భాధానపు గదిలో నేను రాజకుమార్తెకు దూరంగా కూర్చున్నాను. నేత్రావధానంతో తృప్తిపడ్డానేగాని ఆమెను తాకలేదు. మరుసటి రాత్రీ, మూడో రాత్రీ కూడా అలాగే గడిచింది.

ప్రతిసారీ తెల్లవారగానే రాణి వచ్చి విచారించడమూ, రాజకుమార్తె ఏమీ జరగలేదని చెప్పటమూ జరిగింది.

నాలుగోరోజు ఉదయం రాణీ పెద్ద పెట్టున ఏడుస్తూ," ఎందుకిలా మనకు అవమానం తెస్తున్నాడు? నీ దగ్గరికి ఎందుకు రాడు? బంధువుల దగ్గిరా, బానిసల దగ్గిరా ఎంత అప్రతిష్ఠ! ఏమేమి దోషాలు అంటగట్టుతారో గదా!" అన్నది.

ఆవిడ వెళ్ళి సుల్తాను దగ్గిర తన గోడు చెప్పుకున్నది.

"ఇవాళ రాత్రి పిల్లకు కన్నె చెర విడకపోయిందో, వాడి పీక కోసేస్తాను," అని సుల్తాను శపథం చేశాడు.

నేను వెళ్ళి మర్కటయువకుడితో నాకు వచ్చిన బెడద చెప్పుకున్నాను.

సమయం ఆసన్నమయింది, మహమ్మద్. నేను చెప్పినట్టు చెయ్యి. నీ భార్య కుడిచేతికి ఒక కంకణం ఉన్నది. నువ్వు ఆమెను పొందటానికి పూర్వం ఆ కంకణం అడిగి పుచ్చుకుని, తెచ్చి నాకిచ్చెయ్యి. ఆ తరువాత నువ్వు ఆమెతో యథేచ్ఛగా సుఖించు," అన్నాడు యువకుడు

ఆ రాత్రి గదిలో నేనూ, ఆమె ఒంటరిగా ఉన్నప్పుడు ఆమెతో "ప్రియా, ఈ రాత్రి మనం సుఖించాలని కోరికగా ఉన్నదా?" అన్నాను

"ఉన్నది," అన్నదామె

"అలా అయితే నీ కుడిచేతి కంకణం తీసి ఇయ్యి." అన్నాను

ఆమె ఆ కంకణాన్ని ఊడదీసి నాకిచ్చింది. నేను ఏదో వంక చెప్పి. వెంటనే వస్తానంటూ, వెళ్ళి ఆ కంకణాన్ని మర్కటయువకుడికి ఇచ్చాను.

అతను దాన్ని తీసుకుని తృప్తిగా శ్వాస విడిచి, "ఇక నువ్వు నీ భార్య వద్దకు వెళ్ళవచ్చు," అన్నాడు. నేను అందరికీ సంతృప్తికరంగా నీ భార్య కన్యాత్వాన్ని భంగంచెయ్యటానికి శరవేగంతో తిరిగివచ్చాను.

ఆమె పక్కమీద నా కోసం ఎదురు చూస్తూ సిద్ధంగా ఉన్నది. కాని నేను ఆమెకేసి అడుగు వేసేటంతలో అంతా చీకటి అయిపోయింది. నేను పాడుపడిన కొంపలో కిటికీ నేలమీద పడుకుని ఉన్నాను. రాజోచితమైన నా దుస్తులు పోయి నా ఒంటిమీద అతుకులబొంతలే మిగిలాయి. నా నెత్తిన సాధువుల గుడ్డా, నా పక్కన చేతికర్రా ఉన్నాయి.

'నేను మేలుకున్నానా, నిద్ర పోతున్నానా? సాధువునా? రాజ కుమారుణ్ణా?' అనుకున్నాను.

నేను లేచి నిలబడి, మర్కట యువకుడిలాగా ఒళ్లంతా విదిలించు కున్నాను. కాని ఏమీ లాభం లేక పోయింది.

మతిచెడి, వీధుల వెంట తిరుగుతూ, ఒక సందులో బర్బరీ దేశపు మూర్‌ను చూశాను. అతను ఒక చాపమీద కూర్చుని ఉన్నాడు. అతని ముందు చిన్న తివాసీమీద ఏవో పత్రాలూ, జ్యోతిష పరికరాలూ ఉన్నాయి.

అతన్ని చూడగానే నాకు పరమా నందం కలిగింది. నేను అతని ముందు చతికిలబడి, నా జాతకం చెప్పమన్నాను.

అతను సూదుల్లాటి చూపులతో నన్ను చూసి, "సాధూ! భార్యనుంచి వేరుచెయ్యబడ్డది నువ్వేనా?'' అని అడిగాడు.

''యా అల్లా! అవును!" అన్నాను.

"అభాగ్యుడా, నువు అయిదు దిరహములిచ్చి కొన్న మర్కట యువకుడు మామూలు మనిషికాడు. వాడొక దుష్టపిశాచి. వాడికి సుల్తాను కుమార్తెమీద భరించరానంత మోహం పుట్టింది. కాని ఆమె కుడిచేతికి కంకణం రూపంలో ఉన్న రక్షమూలంగా ఆమెను సమీపించటం వాడికి సాధ్యంకాలేదు. అందుచేత ఆ రక్షనుసంగ్రహించటానికి నిన్ను వాడుకున్నాడు. అయితే వాణ్ణి నిర్మూలించగలనని నా ఆశ!" అన్నాడు మూర్.

అతను కాగితంమీద ఏవో అక్షరాలు రాసి నాకిచ్చి, "నీ అదృష్టాన్ని నమ్ముకో. ఈ కాగితం తీసుకుని నేను చెప్పిన చోటికి వెళ్లు. అటుగా ఒక దళం పోతూ నీకు కనిపిస్తుంది. ఈ కాగితాన్ని ఆ దళాధిపతికి ఇయ్యి. నీకు అదృష్టం కలిసివచ్చేదాకా నాకు ఏ బహు మానమూ ఇయ్యనక్కర్లేదు," అన్నాడు.

నేను అతనికి ధన్యవాదాలు చెప్పి, అతను చెప్పిన ప్రకారం ఆ రాత్రీ, మర్నాడు పగలూ నడిచి, మర్నాడు రాత్రికి ఒక ఎడారిప్రాంతం చేరాను. అక్కడ గడ్డి తప్ప ఏమీలేదు. నేను అక్కడ కూర్చుని కాగలదానికి వేచి ఉండగా గబ్బిలాలు ఎగురుతున్న చప్పుడులాంటిది వినిపించింది, కాని ఏమీ కనిపించలేదు. నాకు గుండెలో నుంచి దడపుట్టుకొచ్చింది.



ఇంతలో నాకు కదిలిపోతున్న కాగడాలు కనిపించాయి. అవి దూరంగా పోతున్నాయి గాని, వాటిని పట్టుకున్న చేతులూ, వ్యక్తులూ కనిపించలేదు. అయితే కాగడాలు హెచ్చుగా ఉన్న ప్రాంతంలో ఒక ఆసనంమీద పోతున్న రాజును చూశాను. నా పక్కగా పోతూ ఆయన నాకేసి తీక్ష్ణంగా చూశాడు. కాని భయంతో మోకాళ్లు వణికిపోతూ, నే నాయనను పలకరించలేకపోయాను.

ఆయనే నన్ను పలకరించి, "నామిత్రుడు గిబర్ఫరీ మూర్ నాకు రాసిన లేఖ ఎక్కడ అని అడిగాడు.

నేను కాస్త ధైర్యం తెచ్చుకుని, ముందుకు వెళ్లి, ఆయనకు కాగితం ఇచ్చాను.

అతను వెంటనే ఊరేగింపును నిలిపి, దివిటీల వెలుతురులో కాగితాన్ని చదివి, "అత్రష్, శీఘ్రంగా కైరోకు వెళ్లి, ఫలాని పిశాచిని గొలుసులతో బంధించి తీసుకురా!" అని ఎవరినో ఆజ్ఞాపించాడు.

ఒక గంటకల్లా నా మర్కట యువకుణ్ణి అదృశ్యహస్తాలు లాక్కొచ్చి రాజు ముందు నిలబెట్టాయి.

"ఈ మనిషి నోటి ముందు కబళాన్ని ఎందుకు కాజేశావు? దాన్ని

నువే ఎందుకు కబళించావు?" అని రాజు మర్కటయువకుణ్ణి అడిగాడు

"ఆ కబళానికి ఏ అపాయమూ కలగ లేదు. అది నా కోసం సిద్ధంచేసుకున్న కబళమే," అన్నాడు మర్కట యువకుడు.

"అలా అయితే రక్షాకంకణం అతనికి తిరిగి ఇచ్చెయ్యి. లేదా నీ అంతు చూస్తాను," అన్నాడు రాజు.

"అది నా దగ్గిరే ఉన్నది. దాన్ని నానుంచి ఎవరూ తీసుకోలేరు!" అన్నాడు పిశాచిగాడు నిక్కుగా. వాడు తన నోరు పెద్దదిగా తెరిచి, కమ్మరి కొలిమిలాగా మండే ఆ గొంతులోకి కంకణం వేసేశాడు.

రేరాజు నింపాదిగా చెయ్యి చాచి పిశాచి కంఠం పట్టుకుని కిందికి నొక్క సాగాడు. పిశాచి అణగారి గుమ్మడి కాయ విచ్చినట్టు విచ్చుకున్నాడు. రాజు అజ్ఞపై ఏదో కనపడని చెయ్యి ఆ శిధి లాలనుంచి కంకణాన్ని తీసి నాకిచ్చింది.

అన్నా, ఆ కంకణాన్ని నేను పట్టు కున్న మరుక్షణమే ఆ రాజూ, దివిటీలూ అన్నీ అదృశ్యమైపోయి, నేను రాజో చితమైన దుస్తులు ధరించి పడకగదిలో ఉన్నాను. నా భార్యశయ్యమీద నిద్ర పోతున్నది. నేను ఆమె చేతికి కంకణం తొడగగానే ఆమె సంతోషంతో కేక పెట్టుతూ మేలుకున్నది. నేను ఏమీ జరగనట్టే ఆమె పక్కలో పడుకున్నాను. తరవాత జరగవలసినదేదో జరిగి పోయింది.

నేను తిరిగి వచ్చినందుకూ, తమ కుమార్తె కన్నెచెర విడిచినందుకూ, మర్నాడు ఉదయం రాజూ, రాణీ ఎంతో సంబరపడి, నేను ఏమైనానన్న సంగతి కూడా విచారించటం మరిచిపోయారు.

తరవాత మేం సుఖంగా జీవించాం. సుల్తానుగారు, అంటే నా మామగారు, వారసుడు లేకుండా చనిపోతూ రాజ్యం నాకు రాసిపోయాడు ఆ విధంగా నేను ఈ స్థితికి వచ్చాను. అన్ని ఘనతలూ అల్లాకే చెందుతాయి!

* * *

తన కథ ఈ విధంగా చెప్పిన సుల్తాను మహమ్మద్ తన కొత్త మిత్రుడి ముఖాన అవిశ్వాసంతో కూడిన ఆశ్చర్యం చూసి, "అన్నా, ఆశ్చర్యం దేనికి? విధి ప్రకారం జరిగి తీరుతుంది. అల్లా నిర్దేశించినట్టయితే అసాధ్యం ఏదీలేదు నేను, నీ దృష్టిలో తక్కువ కావటానికి కూడా జంకకుండా, జరిగినది జరిగినట్టు ఎందుకు చెప్పా నంటే, నా తార్కాణంవల్ల నీకు మనశ్శాంతి కలుగుతుందనీ, నువు నా స్నేహాన్ని నిశ్చల చిత్తంతో ఆమోదిస్తావనీనూ. అన్నా, నీకు స్థిరత్వం కలగగలందులకు నా పెద్ద వజీరు పదవి ఇస్తాను. నువు హమేషా నా కుడిపార్శ్వాన ఉండి, అన్ని

విషయాలలోనూ నాకు నీ అనుభవంతో సలహాలిస్తూ ఉండు. నీకు తెలియకుండా రాజ్యంలో ఏదీ జరగదు," అన్నాడు.

సుల్తాన్ మహ్మూద్ అమీర్‌లనూ, తన ఉన్నతోద్యోగులనూ పిలిపించి, నిండు సభలో యాత్రికుడికి గౌరవ లాంఛనాలతో పెద్ద వజీరుగా నియమించాడు. ఈ కొత్త పెద్దవజీరు రోజూ సభచేస్తూ, నిష్పక్షపాతంగానూ, న్యాయంగానూ నిర్ణయాలు చేస్తూ ప్రజాభిమానానికి పాత్రుడయాడు. రాజ్యం నాలుగు మూలలనుంచీ న్యాయం కోరేవారు అతని వద్దకు పరిగెత్తుకుంటూ వచ్చి, అతని నిర్ణయాలనూ, తీర్పులను తెగమెచ్చుకునేవారు. తీరిక ఉన్నప్పుడల్లా అతను సుల్తానుతో కాలక్షేపం చేసేవాడు. వారిద్దరి మధ్యా మైత్రి నానాటికీ వర్ధిల్లుతూ వచ్చింది.

ఒకనాడు సుల్తాన్ మహ్మూద్‌కు మనోవైకల్యం పట్టుకున్నది. అతను తన వజీరు దగ్గిరికి వెళ్లి, "అన్నా నా మనసు ఏమీ బాగాలేదు," అన్నాడు.

"మహారాజా, మనోవికారాలన్నీ మనసులో పుడతాయి. అయినా ఒక్కొక్కసారి బాహ్యకారణాలు వాటిని ఉపశమనం చెయ్యవచ్చు. వినోదాలేమన్నా ప్రయత్నించి చూశారా?'' అని వజీరు అడిగాడు.

"అన్నిరకాల, అన్ని రంగుల మణులతోనూ ఆడుకుని చూశాను. నా జనానాకు వెళ్లి అన్ని రకాల ఆడవాళ్లనూ అవలోకించాను. కాని నా మనస్సును కుంగదీసే భారం తొలగలేదు. అందుచేత నీ దగ్గిరికి వచ్చాను. నాకేదైనా చికిత్స నువే చూడాలి,'' అన్నాడు సుల్తాన్.

"మనం ఒక్కసారి మారిస్తాన్‌కు వెళ్లి, అక్కడి పిచ్చివాళ్లను చూస్తే ఎలా ఉంటుందంటారు? ఇద్దరమూ వెళ్లి పిచ్చివాళ్లను సందర్శింతామని అనుకున్నామేగాని, వెళ్లటం పడలేదు. నా ఉద్దేశంలో, మామూలు మనుషుల కన్న పిచ్చివాళ్ల గ్రహణశక్తి మహా సూక్ష్మంగా ఉంటుంది. మనం చూడలేని వ్యత్యాసాలూ, సంబంధాలూ వాళ్లకు ఇట్టే స్ఫురిస్తాయి. వాళ్లకు వింతదృశ్యాలు కూడా కనిపిస్తాయి," అన్నాడు వజీర్.

"మనం ఇప్పుడే మారిస్తాన్‌కు పోదాం," అన్నాడు సుల్తాన్.

ఇద్దరూ రాజభవనంనుంచి, వెంట ఎవరూ లేకుండా బయలుదేరి, త్వరలోనే మారిస్తాన్ చేరారు. అక్కడ గదులూ, పడకలూ శూన్యంగా ఉన్నాయి. కాపలావాళ్లు, రక్షకాధికారి మాత్రమే వారికి కనిపించారు. ఒక్క పిచ్చివాడు కూడా మచ్చుకైనాలేడు.

పిచ్చివాడు ఒక్కడైనా లేకపోవటానికి కారణమేమిటని సుల్తాన్ రక్షకాధికారిని అడిగాడు.

"చాలాకాలంగా కొత్తవాళ్లెవరూ రావటంలేదు. అందుకు కారణం మనుషులలో మనోవికాసం క్షీణించటం కావచ్చు. అయినా మీకు ముగ్గురు పిచ్చివాళ్లను పరిచయం చేయగలను. వాళ్లను ఇక్కడికి తెచ్చినవాళ్లు ఘరానా మనుషులు. వాళ్లను ఎవరూ చూడరాదన్న ఆంక్షకూడా ఉన్నది. వాళ్లు గొప్ప జ్ఞానులనటానికి సందేహంలేదు. ఎందుచేతనంటే వాళ్లు అస్తమానమూ ఉద్గ్రంధాలు చదువుతూ ఉంటారు," అన్నాడు రక్షకాధికారి.

అతను వజీరు, సుల్తానులకు పెదగా ఉన్న ఒక భవనానికి తీసుకుపోయి, తలుపు తెరిచి, మర్యాదగా అవతలికి తప్పుకున్నాడు.

లోపల ముగ్గురు యువకులున్నారు. వారిని గోడలకు బిగించిన గొలుసులతో కట్టిపెట్టారు. వారిలో ఒకడు ఏదో గ్రంధంపైకి చదువుతున్నాడు. మిగిలిన ఇద్దరూ వింటున్నారు. ముగ్గురూ మంచి యౌవనంలో, బలిష్ఠంగా ఉన్నారు. వారిలో ఉన్మాదలక్షణాలేవీ పొడగట్టడం లేదు.

సుల్తాను తన అనుచరుడికేసి తిరిగి, "ఈ యువకుల కథలు వినదగినవై ఉండాలి కాదూ!" అన్నాడు.

తరవాత ఆయన ఆ యువకులకేసి తిరిగి, 'మిమ్మల్ని పిచ్చివాళ్లనా ఇక్కడ పెట్టారు!" అని అడిగాడు.

"మహారాజా మేంఏ రకానికి చెందిన పిచ్చితోనూ బాధపడుతున్నవాళ్లం కాము మేం వెర్రిబాగులవాళ్లమూ, మూఢులమూ కూడా కాము. మా జీవిత కథలు ఎంత చిత్రమైనవంటే తెలివిగలవాళ్లకు అందులో నేర్చుకోవలసినది ఎంతైనా ఉన్నది," అన్నాడు గ్రంథ పఠనం చేస్తున్నవాడు.

"మేం వినటానికి సిద్ధంగా ఉన్నాం!" అన్నాడు సుల్తాను. ఆయన వజీరుతో బాటు నేలమీద కూర్చున్నాడు.

అప్పుడా పిచ్చివాడు ఇలా తన కథ ఆరంభించాడు.

ఇంతవరకు చెప్పి మంత్రి కుమార్తె తెల్లవారుతూ ఉండటం గమనించి, మౌనం వహించింది.






కైరో మహానగరంలో మారూఫ్ అనే చెప్పులుకుట్టే వాడుండేవాడు. వాడు విశాలహృదయంగల సజ్జనుడు. కాని వాడి భార్య ఫాతిమా గంపగయ్యాళి. ఆమె తన భర్త బతుకు దుఃఖభాజనం చెయ్యటమేగాక, తెలిసినవారందరికీ కంటిలో నలుసులా ఉండేది. ఆమె పెట్టే శాపనార్థాలతోనూ, తిట్లతోనూ మొగుడికి పగలు శాంతీ, రాత్రి నిద్రా ఉండేది కాదు. రాను రాను ఆమె మారూఫ్‌కు సింహస్వప్నమయింది. అతనికి దారిద్ర్యమన్నా భయంలేదు గాని, తన పరువుగురించి భయపడేవాడు. అందుచేత కందిరీగలాటి తన భార్య చేత పాట్లు పడలేక, అతను తన సంపాదన అంతా తెచ్చి ఆమె చేతిలో పోసేవాడు. ఏ రోజునన్నా కర్మజాలక డబ్బులు ఎక్కువ రాకపోతే ఆ రాత్రి

అతను తన భార్య కీచుగొంతుతో విప్పే పంచాగం కట్టను చెవులు గడియలు పడేలా ఆలకించవలసి వచ్చేది.

ఒకరోజు ఫాతిమా తన భర్తవద్దకు వచ్చి, "మారూఫ్! ఈ రాత్రికి నాకు కునాఫా రొట్టె తీసుకురా. తేనె ఓడు తూండాలి! ఏమనుకున్నావో!" అన్నది.

"అల్లా అనుగ్రహిస్తే అలాగే నీకు కునాఫా తెస్తాను. కాని ఈ క్షణంలో నా దగ్గిర రాగిడబ్బు లేదు. అల్లా నన్ను కరుణించవచ్చు," అన్నాడు మారూఫ్.

"మధ్యలో అల్లా అంటా వేమిటి? అల్లా వరం ఇచ్చేదాకా నేను వేచి ఉండాలా? తేనెఓడే కునాఫా తీసుకు రాకపోయావో ఈ రాత్రి నీకు కాళరాత్రే! అల్లా సంతృప్తికోసం నేను రొట్టె తినటం మానేదిలేదు," అని ఆ గయ్యాళిది కీచుగొంతుతో అరిచింది.

మారూఫ్ నిట్టూర్పువిడిచి, మొహాన చెమటలు కార్చుతూ, "అల్లా దయామయుడు!" అన్నాడు.

అతను ఆ రోజు బజారులో తన దుకాణం తెరిచి, చేతులెత్తి ప్రార్థనచేస్తూ, "భగవంతుడా, ఇవాళ కునాఫా కొనటానికి డబ్బులు దొరికేటట్టు చేసి, నన్ను ఆ ఆడదాని బారినుంచి కాపాడు!" అన్నాడు.

కాని ఆ రోజు ఒక్కడుకూడా చెప్పులు మరమ్మతు చేయించుకోటానికి రాలేదు. ఇంత రొట్టెముక్క కొనుక్కుని తినటానికైనా ఆ రోజు అతనికి సంపాదన లేకపోయింది. అతను వణుకుతున్న చేతులతో దుకాణానికి తాళంపెట్టి, వణుకుతున్న కాళ్ళతో ఇంటిదారి పట్టాడు.

అతను ఇంటికి వెళ్లేదారిలో ఒక మిఠాయి దుకాణం ఉన్నది. ఆ దుకాణం వాడి చెప్పులు మారూఫ్ ఎన్నోసార్లు మరమ్మతు చేశాడు. మారూఫ్ పుట్టెడు దిగులు భుజానవేసుకుని పోతూండటం చూసి మిఠాయివాడు అతన్ని కేకేసి పిలిచి, "అయ్యా, మారూఫ్! ఎందుకు విచారంతో కుంగిపోయి ఉన్నావు? ఏమిటి నీ బాధ? ఇలా వచ్చి కూర్చుని, కొంచెం విశ్రాంతి తీసుకుని, సంగతేమిటో చెప్పు," అన్నాడు.

"శక్తి అంతా దయామయుడైన అల్లాదే! నా దురదృష్టం, నాకు పీక్కు తినటానికింత ఎండురొట్టె ముక్కకూడా దొరక్కుండా చేసింది," అని, మిఠాయివాడు ఒత్తిడి చేసినమీదట తన భార్య కోరికను, దాన్ని తీర్చటానికి తన అసమర్థతనూ వ్యక్తంచేశాడు.

మిఠాయివాడు అంతా విని నిర్మలంగా నవ్వి, "నీ భార్యకు ఎన్ని ఔన్సుల కునాఫా కావాలో చెప్పరాదా?" అన్నాడు.

"అయిదు ఔన్సులయితే చాలేమో," అన్నాడు మారూఫ్.

"అంతేగద? నీకు అయిదు ఔన్సుల కునాఫా ఇస్తాను. దాని ఖరీదు అల్లా

ఎప్పుడు నీ చేతికి అందిస్తే అప్పుడే ఇయ్యి," అంటూ మిఠాయివాడు పెద్ద కునాఫా ముక్క కోసి ఒక పళ్లెంలో పెట్టి, దానిచుట్టూ పాలమీగడా, పాకమూ పోశాడు. దాన్ని అతను మారూఫ్‌కు అందిస్తూ "ఇది రాజోచితమైనది! చూడు, అందులో నేను తేనెకు బదులు చక్కెర పాకం పోశాను. ఈ మార్పువల్ల దాని రుచి హెచ్చుతుంది," అన్నాడు.

రెండు రుచులూ ఎరగని చెప్పులు కుట్టేవాడు మిఠాయివాడి చెయ్యి ముద్దు పెట్టుకోబోయాడు. కాని మిఠాయివాడు అతన్ని వారించి, "ఈ కునాఫా నీ భార్యకు రాసిపెట్టి ఉన్నది. నువుకూడా ఇంకా ఏమీ తినలేదు గనక, ఈ జున్నూ, రొట్టే తీసుకో. అల్లా దీన్ని నీకోసం కేటాయించాడు," అంటూ వేడి వేడి రొట్టెనూ, జున్ను అట్టనూ ఆకుల్లో చుట్టి మారూఫ్‌కు ఇచ్చాడు.

జన్మలో ఎన్నడూ అంతటి ఐశ్వర్యానికి నోచుకోని మారూఫ్‌కు కృతజ్ఞత తెలుపుకునేటందుకు మాటలు రాలేదు. అందుచేత తన కృతజ్ఞతను కళ్లెత్తి ఆకాశానికి ప్రదర్శించాడు.

అతను ఇంట్లో అడుగుపెడుతుండగానే అతని భార్య కర్కశమైన కంఠంతో, "కునాఫా తెచ్చావా ?" అని అడిగింది.

"అల్లా అనుగ్రహంవల్ల, ఇదుగో, తెచ్చాను," అంటూ అతను కునాఫా తెచ్చిన పళ్ళాన్ని ఆమెముందు పెట్టాడు.

కాని ఆ పాపిష్టిది దాన్ని చూస్తూనే కోపంతో కెవ్వున అరిచి, తన దవడ మీద కొట్టుకుంటూ, "నీకు అల్లా శాపంతగలా! తేనెతో తీసుకురమ్మని చెప్పలేదూ ? నా మీద కసికొద్దీ చక్కెర పాకం తెస్తావా ? నా కా మాటి తేడా తెలీదనుకున్నావా ? నేను అడిగినదానికి వ్యతిరేకంగా చేసి నన్ను త్వరగా చంపేద్దామనుకుంటున్నావా, కుక్కగాడా ?" అని ధుమధుమలాడింది.

అనుకున్నదానికి పూర్తిగా విరుద్ధంగా జరిగేసరికి, మారూఫ్ బిత్తరపోయి, మాట తడబడుతూ, "ఈ కునాఫా నేను కొన్నది కాదు. అల్లా అనుగ్రహంలాంటి మిఠాయివాడొకడు నా మీద దయతలిచి, దీన్ని అరువిచ్చాడు," అన్నాడు.

కాని ఆ గయ్యాళిది మాట విని పించుకోకుండా, "ఈ బొల్లికబుర్లు నా దగ్గిర పారవు! నీ వెధవ కునాఫా తీసుకుపో," అంటూ కునాఫా పళ్లాన్ని విసిరికొట్టి, అచ్చమైన తేనెలో ముంచిన కునాఫాను తీసుకురమ్మన్నది. ఇలా మాటలతో పోనియ్యక ఆమె తన మొగుడి దవడమీద బలంకొద్దీ కొట్టింది. దానితో రక్తం కారి అతని గడ్డమూ, చొక్కా తడిశాయి.

ఇంత అయాక ఓర్పు ఒక్క పిసరు తగ్గి, మారూఫ్ ఆమెతలకేసి చెయ్యి

విసిరాడు. దానితో ఆమె మరింత రెచ్చిపోయి, అతన్ని గడ్డంపట్టి ఊపుతూ, "ముసల్మానులారా, రక్షించండి! నన్ను చంపేస్తున్నాడు!" అని కేకలు పెట్టింది.

చుట్టుపక్కలవాళ్లు పరిగెత్తుకుంటూ వచ్చి, మారూఫ్ గడ్డాన్ని ఫాతిమా పట్టునుంచి అతికష్టంమీద విడిపించి, ఆమె సంగతి బాగా తెలిసినవాళ్లే గనక ఆమెను తలవాచేలా చివాట్లుపెట్టి, చక్కెరపాకంతో మేమంతా కునాఫా తింటున్నాం కాదూ? అదే నిజానికి ఎక్కువ రుచి. నీ మొగుడు ఏం అపచారం చేశాడని అతని ముఖం పగలగొట్టావు?" అని నానారకాల శాపనార్థాలూపెట్టి, వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిపోయినదాకా ఒక మూల బెల్లంకొట్టిన రాయిలాగా కూర్చున్న ఆ గయ్యాళిది తన మొగుణ్ణి చూసి, "నలుగురినీ పిలిచి, నన్ను నానా మాటలూ అనిపిస్తావా? చూస్తూ ఉండు! చూస్తూ ఉండు!" అన్నది.

ఆమె పులిలాగా తనకేసి కోర చూపులు చూస్తూంటే, అభాగ్యుడు మారూఫ్ ఎగిరిపోయిన పళ్లెం పెంకులనుంచి కునాఫా తీసి, తన ఇంటి పళ్లెంలో శుద్ధంగా పెట్టి, తన భార్యకు అందిస్తూ, "కొంచెం తిను. రేపు అల్లా అనుగ్రహిస్తే ఇంకోరకం తెస్తాను," అన్నాడు.

ఆమె ఒక్క తన్ను తన్ని, "పో అవతలికి! అల్లా అనుగ్రహిస్తే రేపు నీ అంతు చూస్తాను," అన్నది.

తన భార్యతో రాజీపడటమంటే చెప్పులకు మాసికలు వెయ్యటమంత తేలిక కాదని గ్రహించి, దౌర్భాగ్యుడు మారూఫ్, తన ఆకలిబాధ గుర్తుకొచ్చి, తాపీగా కూర్చుని ముందు కునాఫా, తరవాత రొట్టే, తరవాత జున్నూ, ఒక్క నలుసు మిగలకుండా ఆరగించేశాడు. అతను తింటున్నంత సేపూ అతని పెళ్లాం, "నీ కడుపు పగలా! తిన్నది పొట్టలో విషం అయిపోనూ!" అని శాపర్థాలు పెడుతూనే ఉన్నది. అతను ఈ దీవనలకు జవాబు చెప్పలేదు. ఆమె మరింత రెచ్చిపోయి, ఇంట్లోఉన్న కర్రసామాను తన మొగుడిమీద విసిరి అలిసిపోయి మంచమీదవాలి నిద్రపోయి, నిద్రలో తెల్లవార్లూ అతన్ని శాపవార్థాలు పెడుతూనే ఉండిపోయింది.

మారూఫ్ మర్నాడు పెందలాడే లేచి, త్వరత్వరగా బట్టలు వేసుకుని, దుకాణం తెరిచి, అల్లా అనుగ్రహంవల్ల ఆ రోజైనా తగినంత డబ్బు వస్తే, తన భార్య గొంతెమ్మ కోరిక తీర్చుదామనుకున్నాడు. కాని ఇంతలోనే ఇద్దరు రక్షకభటులు వచ్చి, కాజీగారి ఉత్తరువు మీద అతన్ని పట్టుకుని అతన్ని పెడరెక్కలువిరిచి కట్టి, న్యాయస్థానానికి తీసుకుపోయారు.

కాజీగారి సమక్షం చేరుతూనే అతను తన భార్యను చూశాడు. ఆమె ఒక చేతికి కట్టు కట్టుకుని, తలకు రక్తపు మాసిక చుట్టుకుని నిలబడిఉన్నది. కాజీ బెదిరిపోయిన చెప్పులుకుట్టేవాణ్ణి చూసి, "ఇలారా! నీకు అల్లా భయంలేదా? ఈ ఆడకూతురిమీద చెయ్యి చేసుకుని చేతులు విరిచి, పన్ను ఊడగొట్టుతావా?" అని అడిగాడు.

తన కాళ్ళకింద భూమి పగిలి, తాను పాతాళానికి పోగలిగితే బాగుండు ననిపించింది మారూఫ్‌కు. శాంతి కాముకుడూ, పరువుమీద అభిమానమూ గలవాడు కావటంచేత, అతను తన ఇరుగు పొరుగువాళ్ళను సాక్ష్యం పిలవలేదు. అందుచేత అతను ఏమీ అనలేదు. అతని మౌనం అంగీకారమే అనుకుని కాజీ, అతని అంకాళ్లమీద నూరు కర్రదెబ్బలు కొట్టమని తీర్పు ఇచ్చాడు. అతను శిక్ష పొందుతూంటే ఫాతిమా కళ్లారా చూసి ఆనందించింది.

న్యాయస్థానంనుంచి మారూఫ్ నైల్ నదీ తీరాన గల ఒక పాడుపడిన ఇంటికి దేకుంటూ వెళ్ళి తన పాదాల వాపు తగ్గినదాకా అక్కడే ఉండిపోయాడు. అతను చావటానికైనా సిద్ధమేగాని తన ఇంటికి తిరిగి వెళ్ళటానికి సిద్ధంగాలేడు తిరిగి నడిచే స్థితి రాగానే అతను నదిమీది పడవవాడి కింద పనికి కుదిరి, నది దిగువన దమియెట్టా చేరుకుని, మధ్యధరా సముద్రంలో తిరిగే ఒక చిన్న వర్తకనౌకలో తెరచాపల మరమ్మతు పనివాడుగా చేరి, తన భవిష్యత్తును అల్లా పరం చేశాడు.

చాలా వారాలు సముద్రంలో ప్రయాణించి ఆ నౌక తుఫానులో చిక్కుకుని, మునిగిపోయింది. అందులో అందరూ పోయారు. కాని అల్లా అనుగ్రహంవల్ల, నీటిలో కొట్టుకుంటున్న మారూఫ్ చేతికి పెద్ద తెరచాప స్తంభపు ఖండం ఒకటి చిక్కింది. ప్రాణంమీద తీపి ఎక్కడలేని బలమూ తెస్తుంది. అలా వచ్చిన బలంతో అతను ఆ దుంగమీద ఎక్కి కూర్చుని, కాళ్ళను తెడ్లలాగా ఉపయోగించాడు. అయితే కెరటాలు అతన్ని బంతిలాగా అటూ ఇటూ విసిరి, ఆడుకున్నాయి అతను ఒక పగలూ, రాత్రీ అలా కొట్టుకులాడి, రెండోరోజు ఉదయానికి ఒక సముద్ర తీర పట్టణం చేరుకున్నాడు.

అతను సముద్రతీరంలో పడుకుని అలాగే నిద్రపోయాడు. అతనికి తిరిగి మెలకువ వచ్చేసరికి, ఖరీదైన దుస్తులు ధరించిన ఒక పెద్దమనిషి అతని మీదికి వంగి, అతన్ని పరీక్షిస్తున్నాడు. ఆ పెద్దమనిషివెంట ఇద్దరు బానిసలు, చేతులు కట్టుకుని నిలబడి ఉన్నారు.

చెప్పులు కుట్టేవాడు కళ్ళు తెరవటం చూసి ఆ పెద్దమనిషి, అల్లా పేర అతనికి గట్టిగా స్వాగతం చెప్పి, గొంతు

తగ్గించి, "మీది ఏ దేశం ? ఏ నగరం ? నీ దుస్తులు చూస్తే ఈజిప్టువాడిలాగా ఉన్నావు," అన్నాడు.

"అవును బాబూ, నేను ఈజిప్టువాణ్ణి. కైరోలోనే పుట్టి పెరిగాను.

"కైరోలో ఏ వీధిలో ఉండేవాడివని అడిగితే తప్పు కాదుగద ?"

"ఎర్రవీధి, బాబూ."

"ఆ వీధిలో నీకు ఎవరెవరు తెలుసు? నీ వృత్తి ఏమిటి ?"

"నాకు తెలిసినవాళ్లు నావంటి సాదా మనుషులే. అయినా వాళ్లు పరువు, మర్యాదలు గలవాళ్లే. నేను చెప్పులు మరమ్మతు చేస్తాను," అంటూ మారూఫ్ కొంతమంది పేర్లు చెప్పాడు.

అతని జవాబులు వింటున్నకొద్దీ పెద్దమనిషి ముఖం వికసిస్తూవచ్చింది.

"అన్నా, అత్తర్లు అమ్మే షేక్ అహ్మద్ నీకు తెలుసా ?" అని అతను అడిగాడు.

"అల్లా నిన్ను వృద్ధిచెయ్యా ! ఆయన మా పొరుగువాడే. మా ఇళ్ళ మధ్య గోడే అడ్డం !"

"ఆయన బాగున్నారా ?"

"అల్లా దయవల్ల బాగానే ఉన్నారు."

"ఆయన కిప్పు డెంతమంది పిల్లలు?"

"ఇప్పటికి ముగ్గురే. దేవుడు వాళ్లకు మేలుచెయ్యాలి !– ముస్తఫా, ముహమ్మద్, అలీ."

"వాళ్ళు ఏం చేస్తూంటారు ?"

"పెద్దవాడు ముస్తఫా విద్యాబోధ చేస్తాడు. మంచి పండితుడని పేరు తెచ్చుకున్నాడు. ఖురాన్ కంఠస్థం చేశాడు. దాన్ని అతను ఏడు విధాలుగా చదవగలడు. రెండోవాడు ముహమ్మద్ తండ్రిలాగే మందులూ, అత్తర్లూ అమ్ముతాడు. పెద్దాయన అతనికోసం తన దుకాణానికి దగ్గిరలోనే మరో దుకాణం ఏర్పాటుచేశాడు. ఎందుకంటే ముహమ్మద్‌కు కొడుకు కలిగాడు. ఇక చిన్నవాడు అలీ మాటకు వస్తే– దేవుడు వాణ్ణి చల్లగా చూడాలి– వాడు నా బాల్యమిత్రుడు. రోజూ ఇద్దరమూ కలిసి అనేక పోకిరీ ఆటలు ఆడేవాళ్ళం. అయితే వాడు ఒక క్రిష్టియన్ కుర్రాడితో చెయ్యగూడని పనిచేసి, క్రిష్టియన్ల ఆగ్రహానికి భయపడి, పారిపోయాడు. ఇరవై ఏళ్ళుగా వాడి జాడ లేదు. అల్లా వాణ్ణి చల్లగా చూడాలి !"

ఈ మాటలు వింటూనే ఆ పెద్ద మనిషి మారూఫ్‌ను కౌగలించుకుని, ఏడుస్తూ, "అల్లా మహిమ ! ఓ మారూఫ్, నేనే అలీని, అహ్మద్ కొడుకును," అన్నాడు.

[ సశేషం ]




(గత సంచిక తరువాయి)

ఉభయుల పారవశ్యమూ కొంత తగ్గినాక అలీ మారూఫ్‌ను, "నువ్విక్కడికెలా వచ్చావు ?" అని అడిగాడు. అతను ఒక రోజల్లా తిండి తినలేదని తెలియగానే అలీ మారూఫ్‌ను తన కంచరగాడిదపైన తన వెనక ఎక్కించుకుని, రాజభవనంలాంటి ఇంటికి తీసుకువెళ్ళాడు. అక్కడ అతని నౌకర్లు మారూఫ్‌కు షోడశోపచారాలూ చేశారు.

అలీ తన చిన్ననాటి మిత్రుణ్ణి మళ్ళీ కలుసుకుని మాట్లాడటం మర్నాడు ఉదయందాకా పడలేదు. కాని ఆ తరవాత ఇద్దరూ తాపీగా కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు. తన పెళ్ళి అయిన అనంతరం తాను అనుభవించిన నరక

యాతనల నన్నిటినీ మారూఫ్ తన మిత్రుడికి చెప్పాడు.

తాను ఉన్నది ఇఖ్తియాన్ అర్ ఒరిసేకోనసీ, అల్లా అనుగ్రహంవల్ల తనకు బాగా కలిసి వచ్చిందనీ, ప్రస్తుతం నగరంలో తనను మించిన ఘనత వర్తకుడూ, ఉన్నతిగలవాడూ లేడని అలీ చెప్పాడు.

ఇద్దరూ ఒకరి గొడవలు ఒకరు విన్నాక అలీ, "అన్నా, మారూఫ్! అల్లా నాకు సమకూర్చిన సంపద నిజానికి నాదికాదు. అల్లా తరపున దానికి నేను రక్షకుణ్ణి మాత్రమే. అందులో హెచ్చు భాగం నీ పరం చెయ్యటంకన్న మంచి పని ఏముందీ ?" అని మారూఫ్‌కు వెయ్యి బంగారు దీనారాలుగల సంచీ ఇచ్చి, అతనికి మంచి బట్టలు కట్టబెట్టి, "రేపు ఉదయం నువ్వు నా కంచర గాడిదలలో శ్రేష్ఠమైన దానిమీద అంగళ్ళ వీధికి రా. వర్తక శ్రేష్ఠులమధ్య నేను నీకు కనిపిస్తాను. నిన్ను చూడగానే నేను లేచి నీకు అభివాదనంచేసి, నీ కంచర గాడిద పగ్గాలు పట్టుకుని, నీ చేతులు ముద్దుపెట్టుకుని, నీకు సకల మర్యాదలూ చేస్తాను. ఇలా చెయ్యటం వల్ల అందరికీ నీమీద మంచి గురి ఏర్పడుతుంది. అది బలపడేటందుకు నేను మంచి దుకాణం ఒకటి నీ పరం చేస్తాను. అతి త్వరలోనే నీకు ముఖ్యమైన వారందరితోటి పరిచయం అవుతుంది. తరవాత అల్లా అనుగ్రహంవల్ల నువు పైకి వచ్చి, ధనంతోబాటు లభ్యమయ్యే ప్రశాంత జీవనం అనుభవిస్తావు.

తన మిత్రుడికి ఎలా కృతజ్ఞత తెలపాలో మారూఫ్‌కు తెలియలేదు. అతను అలీ బట్టల కొంగు ముద్దుపెట్టుకోబోతే అలీ నివారించి అతన్ని కౌగలించుకున్నాడు. తరవాత వాళ్ళు చిన్ననాటి ముచ్చట్లతో కాలక్షేపంచేసి, తరవాత పడుకుని నిద్రపోయారు.

మర్నాడు ఉదయం మారూఫ్ దేశాంతరంనుంచి వచ్చిన గొప్ప వర్తకుడిలాగా దివ్యమైన దుస్తులు ధరించి, మంచి బూడిదరంగు కంచరగాడిదమీద అనుకున్న వేళకు అంగళ్ళ బజారుకు వెళ్ళాడు. అక్కడ అలీ తాను ముందే నిర్ణయించిన విధంగా నాటకం ఆడాడు. అది చూసి అక్కడి వర్తకుల కందరికీ మారూఫ్‌మీద అమితమైన గౌరవభావం ఏర్పడింది అలీ అతని చేతులు ముద్దు పెట్టుకుని, భక్తిగా అతన్ని కంచర గాడిదమీదినుంచి తెచ్చి, తన దుకాణం ముందువేసిన ఆసనంమీద కూర్చోబెట్టగానే, వర్తకులు ఒకరి తరవాత ఒకరుగా అలీవద్దకు వచ్చి, చిన్న గొంతుతో, "వీరెవరో పెద్ద వర్తకుడిలాగున్నారు ?" అని అడగసాగారు.

అలీ వారి అజ్ఞానానికి జాలిపడుతున్నట్టుగా "పెద్ద వర్తకుడా ? ప్రపంచానికంతకూ వర్తకాగ్రేసరుడు. ప్రపంచ

మంతటా ఆయనకున్న దుకాణాలూ, గిడ్డంగులూ లెక్కించ సాధ్యంకాదు. ఆయనతో పోల్చితే నేను సామాన్య మైన వీధి బేరగాణ్ణి! ఈజిప్టు, యెమెన్‌లు మొదలుకుని, ఇండియా, చీనా దూరతీరాలదాకా ప్రతి నగరం లోనూ ఆయన భాగస్వాములూ, ఏజెంట్లూ వర్తక కార్యాలయాలూ ఎంతో గొప్పగా చూడబడతాయి. అయనను బాగా తెలిసినమీదట ఆయన ఎలాటి వాడో మీకే తెలుస్తుంది", అన్నాడు.

ఈ పొగడ్త విన్నమీదట వర్తకు లందరూ మారూఫ్ చుట్టూచేరి, అతనికి బ్రహ్మరథం పట్టినంతపని చేశారు— అభినందించారు, స్వాగతం తెలిపారు. అందరూ అతన్ని భోజనానికి ఆహ్వానిం చారు. మారూఫ్ చిరునవ్వుతో వారిఆహ్వా నాలను నిరాకరిస్తూ, తన మిత్రుడైన అలీ ఆహ్వానాన్ని ముందుగానే స్వీక రించినట్టు వారికి చెప్పాడు.

కొత్తగా వచ్చినవారు వర్తకుల పెద్దను చూడబోవటం అనవాయితీ. అయినప్పటికీ వర్తకులపెద్దే మారూఫ్ దర్శనంచేసుకునేటందుకు వచ్చి, వర్త మాన ధరవరలు ఎలా ఉన్నదీ, అక్కడి ప్రధాన పరిశ్రమలేవైనదీ విన్నవించాడు. తరవాత అతను ఆగంత కుడికి వర్తకంలో సహాయపడే ఉద్దే శంతో, "తమవద్ద పసుపుబట్ట తానులు చాలా ఉంటాయనుకుంటాను? ఈ నగరంలో పసుపురంగు బట్టకు మంచి గిరాకీ ఉన్నది", అన్నాడు.

మారూఫ్ ఏమాత్రమూ తడుము కోకుండా, "పచ్చబట్టా? నావద్ద పుష్క లంగా ఉన్నదనుకుంటాను", అన్నాడు.

"రక్తవర్ణం గుడ్డ?"

"రక్తవర్ణం గుడ్డ ఎవరికీ లేదన బోను. ప్రపంచంలోకెల్లా మేలురకం రక్తవర్ణం గుడ్డ మావద్ద ఉంటుందని ప్రతీతి."

అలా ఎన్ని ప్రశ్నలు వేసినా అతను, "కొల్లలు! కొల్లలు!" అంటూ వచ్చాడు.

చివరకు వర్తకుల పెద్ద జంకుతూ, "దయచేసి మాకు కొన్ని నమూనాలు చూపగలరా?" అని అడిగాడు.

"తప్పకుండా! మా బిడారు దిగ నియ్యండి! తప్పక చూపుతాను. కొద్ది రోజులలో వెయ్యి ఒంటెలమీద సరుకు దిగబోతున్నది", అన్నాడు మారూఫ్.

ఆ మాట విన్నవాళ్ళు దిగ్భ్రమ చెందారు.

కాని త్వరలోనే ఇంతకన్న దిగ్భ్రమ కలిగించే సంఘటన ఒకటి జరిగింది. ఒక బిచ్చగాడు అటుగా వచ్చి, ప్రతి వర్తకుడికేసీ చెయ్యి చాచాడు. కొందరు వాడికి రాగికాసు లిచ్చారు. కొందరు రాగి అరకాసు లిచ్చారు. చాలామంది, "అల్లా నీకు మేలుచెయ్యాలి!" అన్న ఆశీర్వాదంతో తృప్తిపడ్డారు. కాని వాడు

మారూఫ్‌కేసి చెయ్యి చాచగానే అతను సంచీనుంచి గుప్పెడు బంగారు దీనార్లు తీసి, రాగిడబ్బు లిస్తున్నంత నిర్ల క్ష్యంగా ఇచ్చాడు. ఆ తరవాత అక్కడ నిశ్శబ్దం ఏర్పడింది. ఎవరిమటుకు వాళ్లు. 'ఇతను ఎంత ధనవంతుడై ఉండాలి !' అనుకున్నారు.

మారూఫ్ ఖ్యాతి ఇలా గంటలమీద వృద్ధిపొంది, రాజుదాకా వెళ్ళింది. రాజు వజీర్‌ను పిలిచి, "ఎవరో పరదేశీ వర్తకుడి బిడారు ఒకటి మహా గొప్పది మన నగరానికి రాబోతున్నదట. ఈ రాకతో నగరంలో ఉండే తోడేలు వెధవలు మరింత ధనం సంపాదించుకోవటం నా కిష్టంలేదు. వాళ్ళు అది వరకే డబ్బుతో కొవ్వి ఉన్నారు. ఈసారి యేంలాభం పొందుదాం— నా భార్యా, నా కుమార్తే, నేనూ !" అన్నాడు.

"అందులో ఇబ్బంది ఏమీలేదు. కాని బిడారు వచ్చి దిగేదాకా మనం ఏమీ చేయవలసినపని ఉండదుగదా ?" అన్నాడు వివేకి అయిన వజీరు.

ఈ మాటకు రాజు ఆగ్రహించి, "నీ కేమైనా పిచ్చా ? కుక్కలు కబళించినాకనా మాంసం కొనేది ? ఆ ధనిక వర్తకుణ్ణి నా సముఖానికి పిలిపించు. నేను అతనితో మాట్లాడతాను", అన్నాడు.

వజీర్ మారూఫ్‌ను పిలిపించాడు. అతను రాజుకు వంగి సలాంచేసి, ప్రశంసాపూర్వకంగా స్తోత్రంచేశాడు. అతని భాషా, మర్యాదా చూసి ముచ్చటపడి రాజు, అతని వ్యాపారం గురించీ, సంపద గురించీ అనేక ప్రశ్నలు వేశాడు.

అన్నిటికీ సమాధానంగా మారూఫ్ చిరునవ్వు నవ్వి, "నా బిడారు దిగినప్పుడు ఏలినవారు చూసి సంతోషిస్తారు", అన్నాడు.

అందుచేత రాజుకు అతనిలో నమ్మకం కుదిరింది. అయినా అతన్ని పరీక్షించటానికి ఆయన, కనీసం వెయ్యి దీనారాలు ఖరీదుచేసే అద్భుతమైన ముత్యాన్ని చూపించి, "మీ బిడారు వెంట ఇలాటి ముత్యాలు వస్తున్నాయా?" అని అడిగాడు.

మారూఫ్ ఆ ముత్యాన్ని చేతబట్టుకుని తృణీకారభావంతో పరీక్షించి, నేలకేసి కొట్టి, తన మడమతో తొక్కేసి చితిపాడు.

రాజు గాభరాగా, "ఏమిటి నువు చేస్తున్నది ? వెయ్యి దీనారాల విలువ చేసే ముత్యాన్ని నాశనం చేశావు !" అన్నాడు.

"నిజంగానే అది అంత విలువా చేస్తుంది. అయితే నా బిడారు వెంట అంతకన్న మేలైన ముత్యాలు గోతాలకు గోతాలు వస్తున్నాయి", అన్నాడు చెప్పులు కుట్టేవాడు నవ్వుతూ.




ఆ మాట విని రాజుకు వల్లమాలిన కాపీనం పట్టుకున్నది. "వీణ్ణి ఎలాగైనా నా కూతురికి ముడి పెట్టాలి", అనుకున్నాడాయన.

ఆయన మారూఫ్‌తో, "ఓ, మహాశయా! నాకు ఒకే కూతురు. నువు మా దేశంలో అడుగు పెట్టినందుకు నీ గౌరవార్థం నా కూతుర్ని ఇచ్చి పెళ్ళి చేస్తాను. నా అనంతరం ఈ రాజ్యాన్ని నువ్వే ఏలవచ్చు. ఏమంటావు?" అన్నాడు.

మారూఫ్ చాలా నమ్రంగానూ, వివేచనతోనూ, "రాజుగారు ఈ బానిసను చాలా గౌరవిస్తున్నారు. కాని, మహారాజా, పెళ్ళి గురించి ఆలోచించే ముందు నా పెద్ద బిడారు రానివ్వటం మంచిదిగదా? మీ కుమార్తెలాంటి వధువుకు ఇచ్చే కట్నాలూ, కానుకలూ భరించగలస్థితిలో ఇప్పుడు నేను లేను. నేను నా భార్యకు కనీసం పదికోట్ల దీనారాలైనా ఇయ్యవలసి ఉంటుంది. తరవాత బీదసాదలకు పదిలక్షల దీనారాలు ధర్మం చెయ్యవలసి ఉంటుంది. అదిగాక కానుకలు తెచ్చేవారికీ, విందు వినోదాలకూ పదేసి లక్షల దీనారాలు ఖర్చుచేయాలి. అంతఃపుర స్త్రీలందరికీ నూరేసి పెద్ద ముత్యాలుగల హారాలు బహూకరించాలి. మీకూ, అత్తగారికీ తగిన బహుమానాలు ఇచ్చుకోవాలి. నా బిడారు వచ్చి చేరితేగాని ఇంత ఖర్చు నేను భరించలేను."

మారూఫ్ ఔదార్యంకన్న అతను ఇచ్చిన జాబితా రాజును ఎక్కువగా వివశుణ్ణి చేసింది. ఆయన మారూఫ్‌తో, "లేదు, లేదు. పెళ్ళి ఖర్చంతా నేనే

పెట్టుకుంటాను. నా కూతురికి ఇవ్వ దలచినది నీ బిడారు వచ్చినాక ఇచ్చు కుందువుగాని. పెళ్ళిమాత్రం వెంటనే జరిగి తీరాలి. నీకు ఎంత కావలిస్తే అంత ఖజానానుంచి స్వేచ్ఛగా తీసుకో. ఏమీ సంకోచించవద్దు, నాయనా! నాదంతా నీదే!" అన్నాడు

ఆయన వజీరుకేసి తిరిగి, "నా కుమార్తెను వెంటనే అమీర్ మారూఫ్ కిచ్చి పెళ్ళిచెయ్యటం గురించి మాట్లా డాలి, షేక్ అల్ ఇస్లామ్‌ను పిలిపిం చండి", అన్నాడు.

వజీర్ అసంతృప్తిగా తలవంచి, బదులు చెప్పలేదు. రాజుకు ఓర్పు పోవటం చూసి, వజీర్ దగ్గరగా వచ్చి, రాజు చెవిలో రహస్యంగా, "మహా రాజా, వీడి వరస నాకు నచ్చలేదు. వీడివల్ల దర్బారుకు ఖ్యాతిరాదు. అసలు వాడికి బిడారంటూ ఉన్నట్టు రుజు వయినదాకానైనా వేచి ఉందాం తమ కుమార్తెను తీసుకుపోయి దారే పోయేవాడి కియ్యటం భావ్యంకాదు", అన్నాడు.

రాజు కళ్ళు చీకట్లు కమ్మాయి. ఆయన కోపంతో, "ద్రోహీ, నా కూతురిని నువ్వే పెళ్ళాడాలన్న దుర్బుద్ధితో ఇలా మాట్లాడుతున్నావు. కాని అలాటి ఎత్తులు పారవు. ఈ మహా సంపన్నుడిమీద నా మనసు విరిచే ప్రయత్నాలు చేశావో, నీకు నామ రూపాలు లేకుండా చేస్తాను ... లేక నా కూతురుకు ఎన్నటికీ పెళ్ళికాకుండా నాకు గుదిబండలాగా ఉండిపోవాలను కుంటున్నావా? ఇంతకన్న యోగ్యుడూ, వివేకీ అయిన అల్లుడు నాకు ఎలా దొరుకుతాడు? ఇతను నా కూతుర్ని ప్రేమగా చూసుకోవటమేగాక, మనం దరికీ ఐశ్వర్యం కలిగిస్తాడు. వెళ్ళి షేక్ అల్ ఇస్లామ్‌ను వెంటనే పిలుచు కురా!" అన్నాడు.

చేసేది లేక వజీరు వెళ్ళి షేక్ అల్ ఇస్లామ్‌ను పిలుచుకు వచ్చాడు. ఆయన రాజకుమార్తెకూ, మారూఫ్‌కూ పెళ్ళి నిశ్చయపత్రం తయారుచేశాడు.

రాజుగారి ఉత్తర్వుపై నగరమంతా అలంకరణలూ, దీపాలంకరణలూ చేశారు. ఎక్కడ చూసినా వేడుకల కోలాహం చెలరేగింది. చెప్పులు కుట్టే మారూఫ్ రాజప్రాంగణంలో సింహాసనం మీద కూర్చున్నాడు. వీరగీతాలు పాడేవాళ్ళూ, కుస్తీలు పట్టేవాళ్ళూ, ఆడేవాళ్ళూ, డప్పులవాళ్ళూ, హాస్య గాళ్ళూ, పగటి వేషాలవాళ్ళూ, దర్బారు ప్రముఖులకు వినోదాలు కలిగించారు. మారూఫ్ వజీర్‌చేత బంగారు నాణాల సంచులు తెప్పిస్తూనే ఉన్నాడు, వినోద గాళ్ళమీదికి విరజిమ్ముతూనే ఉన్నాడు. ఖజానానుంచి మారూఫ్‌వద్దకు బంగారు నాణాల సంచులు మొయ్యటంలో వజీరుకు క్షణమైనా విశ్రాంతి లేక

ఆకలేసినప్పుడల్లా తినాలనిపించడమే కాకుండా,
తినాలనిపించినప్పుడల్లా ఆకలేసినట్టౌతుంటుంది డాక్టర్!




పోయింది. ఈ ఒళ్ళు తెలీని ఉత్సవాలు మూడురోజులు దాటి నాలుగోరాత్రి చాలా పొద్దుపోయినదాకా సాగాయి. అదే గర్భధానపు రాత్రి.

రాజుగారు పెళ్ళికూతురి ఊరేగింపు చాలా ఘనంగా ఉండేటట్టు ఏర్పాటు చేశారు. ఆమె వెళ్లేటప్పుడు ప్రతి స్త్రీ కూడా ఆమెమీద కానుకలు వర్షించింది. ఆ కానుకలను రాజకుమార్తె చెలికత్తెలు భద్రపరిచారు. కాని ఆమె గర్భాధానపు గది చేరేసరికి మారూఫ్ ఒక మూలచేరి, "పీడమీద పీడమీద పీడమీద పీడ! ఏమన్నా జరగనీ, నా తప్పేమీలేదు! ఇది విధిరా చెప్పులు కుట్టేవాడా, పెళ్ళాంచేత తన్నులు తిన్నవాడా, ఓ మారూఫ్, కోతి వెధవా!" అని గొణుక్కున్నాడు.

గదిలో ఇద్దరూ మిగిలిపోయినాక రాజకుమార్తె మంచంమీద, పట్టు పరదాల లోపల సుఖంగా పడుకున్నది. మారూఫ్ నేలమీద కూర్చుని నిస్పృహతో చేతులు కొట్టుకున్నాడు.

అతను తనవద్దకు వచ్చే ప్రయత్నం చెయ్యకపోవటం చూసి, ఆమె తలను పరదాల బయటికిపెట్టి, "ఎందుకంత పెడపెడగా, విచారంగా ఉన్నారు?" అని అడిగింది.

(సశేషం)

# జ్ఞానోదయం

బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు



విశ్వనాధం పార్కులో కూర్చుంటే పదిమందీ చేరడం, ఏదో విషయాన్ని లేవదీసి ఆయనను వాదనలోకి దించడం, ఆయన వాగ్ధాటికి వారంతా అచ్చెరువొందడం, కొందరికి జ్ఞానోదయం కలగడం జరుగుతూ వుంటుంది. అయితే ఈ విధంగా జరగడానికి పార్కే అవసరంలేదు. కాఫీక్లబ్బులు, కిళ్లీదుకాణాలు, నిర్మానుష్యమైన సందులో వుండే రోడ్డుప్రక్క కానాలు మొదలైనవికూడా వారికి చర్చావేదికలే. రాజకీయాలు, సాంఘిక సమస్యలు మొదలుకుని అమ్మవారి పండుగ వరకూ, మనస్తత్వ శాస్త్రం మొదలుకుని పాకశాస్త్రం

వరకూ, ఆటంబాంబులు మొదలుకుని అప్పడాల వరకూ ఈ భగవత్ సృష్టి లోని ప్రతి విషయమూ వారి చర్చనీ యాంశమే.

ఒకనాడు సాయంత్రం విశ్వనాథం నిద్రలేచి కొంచెంమాసిన పంచ, కొంచెం చిరిగిన చొక్కా, తన తండ్రి వది లిన ఆస్తిగా పరిగణించకుండావేసుకుని, భార్య కాఫీ తెచ్చి యిస్తుందేమోనని నిరీ క్షించి, ఆశాభంగం గలిగి, పార్కుకు మేముకూడా వస్తామని పట్టుబట్టిన తన యిద్దరు పిల్లలనూ గట్టిగా మందలించి వీధిలోకి బయలుదేరాడు. ఉదయం పది గంటలకు నాలుగు మెతుకులు తిన్నది మొదలు పచ్చిమంచినీళ్లయినా పుచ్చు కోకపోవడంవల్ల తనకు ఆకలివేస్తు న్నట్లు హఠాత్తుగా గ్రహించినవాడై తన ఆధ్యాత్మిక చింతనకు భంగంకలిగి, నడిబజారులో నిలబడి దిక్కులు కలయ జూశాడు. ఎదురుగుండా కాఫీ హోటలు కనబడగా, అప్రయత్నపూర్వకంగా జేబులు తడుముకుని, నిరాశనుపొంది కాఫీ ఇప్పించగల ధర్మదాత ఎవడైనా వున్నాడా అనే ఆలోచనలో పడ్డాడు. అదృష్టవశాత్తూ ముగ్గురు స్నేహితులు త్రిమూర్తులవలె ప్రత్యక్షమైనారు. వారు గురుతుల్యుడైన విశ్వనాథాన్ని పలక రించి, యోగక్షేమము లడిగి, ఆయనింకా కాఫీ సేవించలేదని గ్రహించినవారై ముగ్గురూ మూడణాలు చందావేసుకుని ఆయనను తృప్తి పరచారు. దివ్యౌషధం వలె ఆకలిని చంపే పరబ్రహ్మ స్వరూప మైన కాఫీని సేవించిన విశ్వనాథానికి ఆ రోజుకు కాఫీ సమస్య పరిష్కారం కావడంతో తన జీవిత సమస్య పరిష్కా రమైనంత ఆత్మ సంతృప్తి కలిగి, హుషారుగా మిత్రులతో సహా పార్కు చెరువు గట్టుకు చేరుకున్నాడు.

పార్కు రేడియోలో పంచవర్షప్రణా ళికమీద ప్రసంగం మొదలైంది. తృతీయ పంచవర్ష ప్రణాళికలో ఏ ఏ ప్రాజెక్టులు అమలు జరుగుతాయో, వాటి మూలంగా ఎంతమందికి ఉద్యో గాలు దొరుకుతాయో వివరిస్తున్నాడు ఉపన్యాసకుడు.

ముగ్గురు మిత్రులలో ఒకడు వ్యాఖ్యానం ఆరంభించాడు. ''ఉద్యోగాలు, ఉద్యోగాలు అంటారు, కానీ ఎక్కడు న్నాయి ఉద్యోగాలు చెప్పండి !"

"ఒట్టి కబుర్లు కానీ నిరుద్యోగ సమ స్యను మనవాళ్ళు ఈ జన్మలో పరిష్క రించగలరా ?" అన్నాడు విశ్వనాథం.

"అలాగ కాదులెండి, అప్పుడే ప్రాజె క్టులు వస్తున్నాయిగదా; క్రమేణా, నిరు ద్యోగ సమస్య కూడా పరిష్కారం అవు తుంది" మరి.

"ప్రాజెక్టులు, ఫాక్టరీలు నిర్మిస్తే కూలీలకు ఉద్యోగాలు దొరుకుతాయి. కాని బి. ఎ. లు, ఎం. ఏ. లు చదువు కున్నవారి గతేమిటి ? ఒకవేపు జనాభా

కూడా పెరుగుతున్నదాయెను" అన్నాడు విశ్వనాథం.

"ప్రతివాడూ బి. ఏ. పాసయి ఆఫీసరు కావాలనుకుంటూంటే ఈ సమస్య ఎప్పటికీ పరిష్కారం కాదు. వివిధ వృత్తులు నేర్చుకోవాలి మరి."

"అన్నట్లు విశ్వనాథంగారూ, మీ ఉద్యోగ ప్రయత్నం ఏమయింది?" అని ప్రశ్నించాడు అందులో ఒకడు.

"ఏ ఉద్యోగం ?"

"అదే స్కూలు టీచరు పోస్టుకు అర్జీ పెడదామనుకున్నారు కదూ ?"

"అదా, ఒట్టి వెధవ ఉద్యోగం, ఫస్టు ఫారం వాళ్లకి పాఠం చెప్పాలిట. ఆ గుంట వెధవలకి ఓ అంటే నా రాదు. హెడ్‌మాష్టరొక వ్యూలు. వాడికింద నేను పనిచేయాలిట. అయినా ఫస్టుఫారం వాళ్ళకి మనం చెప్పేదేముంటుంది చెప్పండి". అన్నాడు విశ్వనాథం.

"అవునులెండి, మీరు చెప్పే విషయాలు హెడ్మాష్టరుకే బోధపడవు అయినా ఈ మన వెధవ సొసైటీలో తాహతుకు తగిన ఉద్యోగం దొరకడం కష్టం."

"అందుకేనండీ తాలూకా కచ్చేరి గుమస్తాగిరికీ నాకూ మరీ పడిందికాదు. మనకు తగిన జాబ్ దొరికితేగానీ చెయ్యడానికి ఇంటరెస్టు ఉండదు. మొన్న మా జిల్లాకలెక్టరు కనబడి, కొన్ని పెద్ద పోస్టులు రానున్నాయి, మీరు రాకూడదా అన్నాడు. మీ వంటి వారంతా ప్రభుత్వానికి తోడ్పడాలిమరి అన్నాడు. సరేలే ఎలాగా రాజధాని వెళుతున్నాను గదా, మంత్రులతో చర్చిస్తానులే అనేశాను."

"ఏమిటీ, జిల్లా కలెక్టరుగారు మీకు బాగా పరిచయమా ?"

"ఆ, నా క్లాసుమేటే, పాపం, ఒక్కి శంఠ సుమండీ. అదృష్టం బాగుండి మంచి ఉద్యోగ మయిందిగానీ అయితే మంచివాడు లెండి, మనమంటే చాలా గౌరవం."

"అయితే హైదరాబాదు వెళ్లే ప్లాను వున్నదన్నమాట."

"వెళ్లాలండి, నలుగురినీ కలుసుకుంటే వాళ్లే చూపిస్తారేదైనా సరియైన

"అయితే విశ్వనాథంగారూ మావాడు బి. ఏ. పాసయి ఊరికే ఉన్నాడు. వాడికేదైనా ఆధరువు చూపిద్దురూ, మీరుణం ఎప్పుడూ తీర్చుకోలేను."

"అలాగే, తప్పకుండా చూద్దాము."

బాగా చీకటి పడ్డది. పార్కులో జనం పలచబడ్డారు. చలివేయడం మొదలుపెట్టింది. మంచు పడుతున్నట్లుంది. బీడీలు ఆరిపోయాయి. విశ్వనాథంగారికి గుండెల్లో చలి మొదలైంది. నలుగురూ లేచి నడక ప్రారంభించారు. బజారులో వున్న గంట స్తంభంవైపు చూసి ఒక మిత్రుడు "ఇంకా ఏదైనా కాలేదండీ, శీతాకాలం పొద్దుమరి. ఇప్పటి




నుండి యిళ్లకి వెళ్ళి చేసేదేముంది ? విశ్వనాథంగారి యింట్లో ఓ పావుగంట కూర్చుని పోదాం" అన్నాడు.

"తప్పకుండా రండి" అన్నాడు విశ్వనాథం.

అంతా విశ్వనాథం ఇంటికి చేరుకునే సరికి వీధిచావడి చీకటిగా వుంది. పిల్లలు వాకిట్లో ఆడుతున్నారు. లాంతరు వెలిగించాలనుకున్నాడు విశ్వనాథం. కాని ఎవరిదగ్గరా అగ్గిపెట్టె లేదు. విశ్వనాథం భార్యను కేకవేశాడు, అగ్గిపెట్టె తెమ్మని ఆమె వంటింట్లోంచి చిరాకుగా వచ్చి "అగ్గిపెట్టె అయిపోయింది. పొరుగింట్లో నుంచి నిప్పుతెచ్చి పొయ్యి అంటించాను. వెళ్లి కొనుక్కురండి" అంది.

"అగ్గిపెట్టె కూడా నేనే తేవాలా, బజారునుంచి తెప్పించలేకపోయావూ ? ఇంతోటిపని నేనే చెయ్యాలా ?"

"కాళ్లు అరిగేటట్లు ఊరికే తిరక్కపోకపోనీ ఇంతకంటే ఘనకార్యం చెయ్యరాదూ, అగ్గిపుల్లలు కూడా పొరుగింటి వాళ్ళను ముష్టెత్తుకునే ఖర్మేనా తప్పుతుంది."

"ఛీ నోరుముయ్యి, నోటికొచ్చినట్లు పేలుతున్నావు.''

"మీ కర్మం ఎలాగో ఏడవండి''" అని ఆవిడ లోపలికి వెళ్ళిపోయింది.

ముగ్గురు మిత్రులు ఈ సీనంతాచూసి, విశ్వనాథంగారివద్ద సెలవు తీసుకుని, జారుకున్నారు.

విశ్వనాథంగారిక్కి తల నరికినంత పనయింది. మిత్రులముందు తనకింత అవమానం ! తన ప్రతిష్ఠకెంత దెబ్బ ! మళ్ళీ రేపు వాళ్ళకి తన మొహం ఎలా చూపెట్టగలడు. ఆయనకి కోపంతో వళ్లు మండింది.

అంతట్లో భార్య వచ్చి ప్రమిదలో దీపంతెచ్చి అక్కడ పెట్టింది.

"నిన్ను చంపినా పాపంలేదు. స్నేహితులు ఇంటికొస్తే వాళ్లముందు నోటి కొచ్చినట్టూ ప్రేలుతావేం?''

"ఎవరు వాళ్ళు, కారుచీకటిలో ఎవరున్నారో, ఎవరు వచ్చారో నాకేం తెలీదు" అన్నదామె.

"అయినా నీ నోరుకు హద్దూ ఆపూ లేదుసుమా, వాళ్లేమనుకుంటారు ?"

"మళ్ళీ అదేమాటా, ఇంతకీ ఎవరా వెధవలు? పనీ, పాటూ ఉన్నవాడెవడు మీతో స్నేహం చేస్తాడు."

"ఛీ నోరుముయ్యి, నోటికొచ్చినట్టు వాగేవంటే చంపేస్తాను."

"ఆ పని చెయ్యండి, హాయిగా పోతాను. ఆ చావేదో రావడం లేదనే ఏడుస్తున్నాను."

"ఛీ వెధవింట్లో ఒక్క నిమిషం మనసుకు శాంతి లేదు. నేను చస్తే ఇక ఈ ఇంట్లో వుండను, మీరంతా కట్టకట్టుకుని ఏట్లో పడండి, నే పోతాను." అని విశ్వనాథం వీరావేశమెత్తి, మళ్ళీ కండువా భుజానవేసుకుని వీధిలోకి వెళ్ళిపోయాడు. ఆవిడ నిర్ఘాంతపోయిచూస్తూ నిలబడింది.

ఆ రాత్రి అమె భోజనం చెయ్యలేదు. పిల్లలకు పెట్టి నిద్రపుచ్చింది. ఈ రాత్ర ప్పుడు, ఆకలితో చలిలో ఎక్కడికి వెళ్లేరు ? భోజనానికి రమ్మని ఎవరు పిలిచి పెడతారు ? ఎవరాదరిస్తారు ? నే నెంత పాపిష్టిదాన్ని, ఆయన మనసు ఎందుకు నొప్పించాను? పాపం, ఆయన పసిపిల్లాడిలా ప్రతిదానికీ నామీదే ఆధార పడతారు, ఎంత పెట్టినా దానితో తృప్తి పడతారు. ఈ చీకట్లో ఎక్కడికి వెళ్లను? ఎక్కడ వెదకను? భగవంతుడా, నా కెందుకీ శిక్ష విధించావు?" ఆమె తల గడలో తల పెట్టుకుని ఏడ్చింది. తులసి కోటదగ్గరకు వెళ్లి సాష్టాంగపడి "తల్లీ ఆయన్ని కాపాడు, మళ్ళీ సురక్షితంగా ఇల్లుచేర్చు తల్లీ" అని ప్రార్థించింది.

విశ్వనాథం ఆ రాత్రి వీధిలో కొంత దూరం నడిచాక ఎక్కడికి వెళ్ళాలో తెలియక తిన్నగా రైలుస్టేషనుకు వెళ్లి, వెయిటింగు హాలులో కండువా తలక్రింద పెట్టుకుని పడుకున్నాడు. ఒకవేపు ఆకలీ యింకోవేపు చలీ శరీరాన్ని బాధ పెట్టాయి. ఎలాగో ఆ రాత్రి గడిపి, ఉదయాన్నే అక్కడే కాలకృత్యాలు తీర్చుకుని ఒక మిత్రుని ఇంటివేపు బయలు దేరాడు.

ఆ మిత్రుడు వీధి వసారాలో నులక మంచంమీద కూర్చుని కాఫీ తాగుతున్నాడు. అంత ఉదయమే విశ్వనాథం రావడంచూసి, ఏదో అవసర ముండే వచ్చి వుంటాడని గ్రహించి కొంచెం ముభావంగా "ఏమండీ, ఇలా వచ్చారు?" అని పలకరించాడు. బి. ఏ. పాసయిన తన కొడుక్కి విశ్వనాథం పెద్దలతోను



మిత్రులతోను మాట్లాడి ఉద్యోగమిప్పిస్తా డనే ఆశ ఈ మిత్రుడికి యిప్పుడు పూర్తిగా పోయింది. ప్రస్తుతం ఎందు కోసం వచ్చాడా అనే సందేహానికి నివృత్తి కలిగింది.

"సమయానికే వచ్చా నన్నమాట. ఏమదృష్టం, ఏమదృష్టం. తెప్పించండి రామూర్తిగారూ మనకూ ఒక గ్లాసు" అన్నాడు విశ్వనాథం. ఇక వీడు వదిలే ట్టులేడని గ్రహించినవాడై ఆ మిత్రుడు ఒక గ్లాసు కాఫీ ఇచ్చి, ఒక బీడీకూడా దానంచేసి, ఏవేవో అబద్ధాలు చెప్పి విశ్వనాథాన్ని సాగనంపేడు.

విశ్వనాథం తక్కిన మిత్రుల్నికూడా కలిశాడుగాని వాళ్ళుకూడా అతి ముఖావంగా వున్నారు. ఆయనకి ఎక్కడా ఒక కానీ అయినా అప్పు పుట్టలేదు. చేయగలిగినదేమీ లేక సాయంత్రం

వరకూ ఊళ్ళో వీధులన్నీ తిరిగి చీకటి పడేసరికి మళ్ళీ రైలుస్టేషను చేరుకున్నాడు.

నిన్న రాత్రినుండి కడుపులో బ్రహ్మ పదార్థం పడకపోవడం వల్లను, ఎండలో పగలల్లా నగరంలో వృషభంలా తిరగడంవల్లనూ, కాళ్ళూ చేతులూ లాక్కొస్తున్నాయి. చలి ఎముకలు కొరుకుతూ వుంది. ఈ రాత్రి ఇక్కడ గడవడం కష్టంగా తోచిందాయనకు. అసలు ఎన్నాళ్ళిలా రైలుస్టేషను నివాసం? ఎన్నాళ్ళీ కటిక ఉపవాసం? చేతిలో కానీలేదు. వచ్చే ఆధారంలేదు, అవకాశం లేదు. ఈ మాసిన గడ్డంతో, మాసిన బట్టలతో పీక్కుపోయిన మొహంతో వున్న తనకు ఎవరు ఉద్యోగ మిస్తారు? పిచ్చివాడిలా వున్న తన్ను చూడగానే గెంటివేస్తారు? తను ఎంత నికృష్టజీవితం గడుపుతున్నాడో అతనికి తెలిసింది. ఏదైనా పని చేసి, బతుకుతెరువు చూసుకోవాలి, పిల్లలకు చదువు చెప్పించాలి. కుటుంబాన్ని పోషించాలి. ఇన్నాళ్ళూ తన కుటుంబాన్ని ఎవరు పోషిస్తున్నారు? ఇంటిలో ఎలా గడుస్తూంది? తనకు ఇంటిలో రెండుపూటలా భోజనం ఎలా వస్తూంది? ఇన్నాళ్ళకి ఇప్పుడే అతనికి ప్రశ్నలు బయలుదేరేయి! కాని వాటికి జవాబు దొరకలేదు.

ఆయన లేచి మళ్ళీ నడక ప్రారంభించాడు. చెప్పులు లేకపోవడంవల్ల పాదాలలో రాళ్ళు గుచ్చుకుంటూవుంటే మెల్లగా కుంటుతూ అడుగులు వేస్తున్నాడు. రాత్రి పది గంటలకే రోడ్లమీద జనసంచారం తగ్గిపోయింది. తిన్నగా తన యింటి గుమ్మం దగ్గర అతని శరీరం నిలబడిపోయింది.

వీధి వసారాలోకి వెళ్ళి తలుపు తోశాడు. కొనఊపిరితో వున్న లోపలి గొళ్ళెం వూడి క్రిందపడింది. లోపల భార్య కనబడలేదు. పిల్లలు మాత్రం గదిలో నిద్రపోతున్నారు. తిన్నగా పెరట్లోకి వెళ్ళాడు. భార్య దీపం పెట్టుకుని, వొడియాలు పెడుతూంది. చాపల మీద అప్పడాలు ఆరబెట్టి వున్నాయి. అంత చలిలోనూ భార్య నుదుట పట్టిన చెమట దీపపు కాంతికి మెరుస్తూంది.

ఆమె తలయెత్తి చూసింది. "అమ్మయ్య వచ్చారా" అంది. ఆమె కళ్ళలో ఆనందం, దుఃఖం అతనికి కనిపించాయి. ఆమెకు కళ్ళలో నీళ్లు తిరిగాయి.

"రండి భోజనానికి, వడ్డిస్తాను" అంది మామూలుగా. ఆమె రోజూ తనకు భోజనం ఎలా పెట్టగలుగుతూందో అన్నది అతనికి యీనాడు అర్థమయింది.

# జీతానికి అటూ ఇటూ



పాలకోడేటి సత్యనారాయణరావు

ఆ పర్సులో డబ్బు తీసి ఖర్చు పెడుతోంటే, మనసు మూలల్లోంచి బాధ కలగటం సూర్యారావుకు తెలుస్తూనే ఉంది. అయినా అది పట్టించుకోకుండా చేతిలోని వందరూపాయలనోటు కౌంటర్‌లోకి అందించాడు. కౌంటర్లోని వ్యక్తి సూర్యార్రావు బిల్లుచేసిన డబ్బుతీసుకొని మిగతా డబ్బును రెండుసార్లు లెక్కవేసి సూర్యారావుకు అందించాడు.

ఆ తర్వాత – ఆ చిల్లరనోట్లు ఎలా ఖర్చయిపోయాయో సూర్యారావుకు తెలీలేదు. ఏ ఖర్చుచూసినా అత్యవసరమైందిగానే, ఏదీ వాయిదా వేయలేని ఖర్చుగానే కనపడటంతో తప్పనిసరి అయిపోయింది అతనికి. ఖర్చుపెట్టనంతసేపూ నోట్లు ఘనపదార్థంగా ఉన్నవి. ఖర్చుపెట్టటంఆరంభించగానే ఆవిరిలాగా ఏ గాలిలో కలిసిపోయాయో తెలీలేదు.

ఇంటికొచ్చాడు ఇంటికొచ్చేసరికి ఇంట్లో – అతను కట్టాల్సిన చిట్ డబ్బులు కట్టటం మరిచిపోయాడనీ, ఇలా మర్చిపోతే తమకు కోర్టుకు వెళ్ళటం

వినా ఇంకో మార్గంలేదని ఆ కంపెనీ వాళ్ళు పంపించిన నోటీసు అతనికోసం వేచి చూస్తోంది.

—సూర్యారావుకు నీరసమొచ్చింది.

కష్టాలన్నీ కూడ బలుక్కొనే వస్తాయా ?

లేకపోతే, ఇది తన జీవితంలో వచ్చిన పెద్ద పరీక్షా ? అతనికేం అర్థం కాలేదు.

ఆ కంపెనీ వాళ్ళ నోటీసు ఒకసారికి రెండుసార్లు చదివాడు. రెండోసారి చదువుతోంటే అతనికి భయంవేసింది—కోర్టుకు...అంటే—వద్దు, ఆ గతి తనకు పట్టటం దౌర్భాగ్యమే అవుతుంది అనుకున్నాడు సూర్యారావు. అది తప్పించుకోవాలంటే...?

ఎక్కడుంది మార్గం ?

జీతం రావాలంటే ఇంకా ఇరవై రోజులు కావాలి. కానీ వాళ్ళు ఇరవై రోజులు ఆగరు ఆగదల్చుకోనట్లు స్పష్టంగా నోటీసు పంపారు.

అంటే...తను ఆ డబ్బు వెంటనే కట్టాల్సి ఉంటుంది – సూర్యారావుకు నీరసం వచ్చింది.

భర్త ఉత్తరం చదువుకుంటోంటే, టీ కాయటానికి వెళ్ళింది సూర్యారావు భార్య మీనాక్షి. మీనాక్షి వంటఇంట్లోనే ఉందన్నసంగతి ఇంకోసారి ధృడపర్చుకొని, జేబులోంచి పర్సుతీశాడు సూర్యారావు.

పర్సులో ఇంకో అయిదువందల అరవై రూపాయలున్నాయి. తను చిట్ ఫండ్ కంపెనీలో కట్టాల్సింది నూటనలభై రూపాయలే ! కానీ... ఇది అన్యాయం అని మనసు మరోసారి అరవటం అతనికి తెలుస్తూనే ఉంది.

మీనాక్షి ఇచ్చిన టీ తాగి, జోళ్ళు వేసుకొని, బయటకు నడుస్తూ అన్నాడు సూర్యారావు—"ఇపుడే ఓ అరగంటలో వస్తా !"

అన్నట్లుగానే ఓ అరగంటలో తిరిగి వచ్చాడు కూడాను—పర్సులో నాలుగు వందల ఇరవై రూపాయలే ఉన్నాయి అన్నది అతనికి తెలుసు. కానీ ఇంటికి రాగానే పర్సుతీసి మళ్ళీ అంతా లెక్కలేసి పెట్టాడు—నాలుగువందల ఇరవై రూపాయలు, ఇంకొంచెం చిల్లరా ఉంది. వాటితోబాటుగా ఏవో రెండు కాగితాలు, వాటిమీద ఏవో లెక్కలు, ఇంకో విజిటింగ్‌కార్డు ఉన్నాయి పర్సులో.

విజిటింగ్ కార్డు తీసిచూసాడు—ఆ కార్డుమీద 'కె. నాగరాజ్' అనే పేరు అతని అడ్రసూ ఉన్నాయి.

*　*　*

"నా పేరే నాగరాజ్" అన్నాడతను సూర్యారావును చూస్తూ.

సూర్యారావు ఒక్క క్షణం అలాగే నిలబడి ఆ తర్వాత అన్నాడు—"నా పేరు సూర్యారావు."

"కూర్చోండి."




సూర్యారావు కూర్చున్న తర్వాత మరొక్కసారి ఆలోచించాడు — తను చేస్తున్నది మంచిపనా, కాదా అనేది. తను తెలివితక్కువపని చేస్తున్నాడనే అనుమానంకూడా కలిగింది అతనికి.

నెమ్మదిగా అన్నాడు... "మీ పర్సు నాకు దొరికింది."

నాగరాజు సూర్యారావుకేసి చూశాడు

"మొన్న... సీ తా ఫ ల్ మం డి బస్సులో...ఇదుగో !..." అని జేబులోంచి పర్సుతీసి నాగరాజు ముందు పెట్టాడు సూర్యారావు.

నాగరాజు పర్సు అందుకొన్నాడు. పర్సుతీస్తోంటే అన్నాడు సూర్యారావే మళ్ళీ: "క్షమించండి—పర్సు దొరికినపుడు అందులో ఆరు వందలు ఉండేవి. అత్యవసరం అయిపోయి నేనో రెండు వందలు ఖర్చుపెట్టుకోవాల్సి వచ్చింది."

నాగరాజు కనుబొమలు ముడిపడ్డాయి.

"మీరు అపార్థం చేసుకోకండి—పర్సు దొరికాక, తెచ్చిఇచ్చేయాలనే అనుకొన్నాను. కానీ నాకొచ్చిన అవసరాలు అలాటివి — తప్పలేకపోయింది, ఇప్పుడందులోనాలుగుగొందలేఉన్నాయి.

నాగరాజుకూ అందులో నాలుగొందలే కనబడ్డాయి.

తనకేసి తీవ్రంగా చూస్తున్న నాగరాజు చూపులను తప్పించుకొంటూ తలవంచుకొని అన్నాడు సూర్యారావు: "పర్సు పోగొట్టుకున్నది మీరు. నాకు దొరికింది. నాకుకాక ఇంకెవరికి దొరికినా మీకు తిరిగి వచ్చేదికాదు. కానీ, నా పద్ధతివేరు. ఈడబ్బులు ఖర్చుపెట్టేసుకొంటే అది నా బతుక్కే మచ్చ అవుతుందన్నది నాకు తెలుసు. అందుకే—

పర్సులో ఉన్న మీ విజిటింగ్ కార్డును బట్టి, మిమ్మల్ని వెతుక్కొంటూవచ్చాను. ఇకపోతే, నేను ఖర్చు పెట్టిన రెండు వందల సంగతి—చెప్పాగదా, నా పరిస్థితి అలా వచ్చింది. నాకొక్క నెల రోజులు టైం ఇస్తే, మీ డబ్బు మీకు నేనే తెచ్చిస్తాను !" సూర్యారావు చెప్పటం ఆపి, నాగరాజ్ కేసి చూశాడు.

నాగరాజ్ చూపుల్లోంచి వస్తున్న ఆ ప్రశ్నలను ఎదుర్కొంటూ అన్నాడు—"మీకు నామీద నమ్మకం కుదిరినట్లుగా లేదు."

నాగరాజ్ క్షణం ఆగి అన్నాడు—"నమ్మకం కుదరకకాదు..."

"...మీకు కావాలంటే నా అడ్రసు రాసిస్తా. ఖచ్చితంగా ఒకేనెల—నెలలోగానే ఇచ్చేస్తా!"

నాగరాజ్ ఏమనుకొన్నాడో క్షణం తర్వాత, డ్రాయరు తెరిచి అందులోంచి ఓ కాగితం అందించాడు సూర్యారావుకు సూర్యారావు ఆ కాగితంమీద తన ఇంటి అడ్రసు, ఆఫీసు అడ్రసూ వివరంగా రాసి నాగరాజ్‌కు అందించాడు. నాగరాజ్ ఆ కాగితాన్ని ఒకసారి చదువుకొని, మడతపెట్టుకొని జేబులో పెట్టుకొన్నాడు.

"వస్తానండీ — మళ్ళీ కనిపిస్తాను" అని చెప్పి సూర్యారావు బయటకు నడిచాడు.

సూర్యారావు పూర్తిగా కనుమరుగయ్యేంతవరకూ ఆగి, ఆ తర్వాత మళ్ళీ ఆ పర్సు అందుకొన్నాడు నాగరాజ్.

ఆ పర్సులోకి తనపేరు, అడ్రసూ ఉన్న ఆ విజిటింగ్ కార్డు ఎలా వచ్చిందా అని క్షణం ఆలోచించాడు నాగరాజ్ ఆపుడతనికి గుర్తొచ్చింది—వారంరోజుల కిందట తను వెళ్ళినపుడు తన స్నేహితుడు ఆఫీసులో లేకపోతే, పక్కసీటతనికి తన విజిటింగ్ కార్డు ఇచ్చివచ్చిన సంగతి !

—అంటే ఈ పర్సు ఆ మహానుభావుడిదన్నమాట! అనుకొన్నాడు నాగరాజ్.

—సాయంత్రం అయిదింటికి ఆఫీసు అయిపోయాక, ఇంటికి వెళ్లేటపుడు, నాగరాజ్ ఆ పర్సులోని నాలుగువందలు జేబులో పెట్టుకొని, ఆ ఖాళీ పర్సును మునిసిపాల్టీ చెత్తకుండీలో పారవేసేటపుడు, అతని ఆలోచనలన్నీ వచ్చే నెల సూర్యారావు తెచ్చి ఇవ్వాల్సిన ఆ రెండువందల రూపాయలమీదే ఉన్నాయి !






ఆలయ ఆవరణలో, గలగలా గంతులేస్తూ ఆడుకొంటున్న చిన్నారి పాపల్ని చూస్తూ కూచున్నాను, నేను. 'శివ-విష్ణు' ఆలయంలోని నవగ్రహాలని పదిరోజులుగా ప్రదక్షిణచేస్తున్న నేను, అక్కడి పరిసరాలకి చిరపరిచితురాలి నయ్యాను. మా చంటిపాప, సుమ, పుట్టి నప్పటినుండి నాకేదో నలతగావుంటోంది. నలభై రోజులు నవగ్రహ ప్రదక్షిణచేస్తే, నా ఆరోగ్యం కుదుటపడుతుందన్న ఆశతో - పక్కింటి మామ్మగారు చెప్పి నప్పటినుండి మొదలెట్టాను. "ఎవ్వారేది చెప్తే - అది ఆచరించడమేనా-?" అంటారు, శ్రీవారు. కానీ, కోవెల కారణంగానయినా కాస్తా కాలు కదిపినట్లుం టుందన్న ఉద్దేశ్యముతో, సాయంకాలాలు ఇలా బయలుదేరుతున్నాను.

ఆడుకుంటున్న పాపలలో, మా పెద్ద పాప స్వర్ణ కూడా వుంది. "చీకటిపడి పోయింది, ఇక వెళ్దామేస్వర్ణా-" అంటూ,

కేశేసాను. కానీ, నా చూపులుమాత్రం గుడి ముఖద్వారంవేపు తచ్చాడుతున్నాయ్. రోజూ నేను వచ్చిన కాస్సేపటికల్లా వచ్చి, నా వెంట వెంట తిరుగుతూ, నవగ్రహ ప్రదక్షిణచేసే ఆ పాప ఎందుకో ఇంకా రాలేదు. రోజూ, ఆ అమ్మాయితో ముచ్చటలాడటం అలవాటయిన నాకేంటో వెలితిగా వుంది. ఆ అమ్మాయితో – అదే పూర్ణిమతో – పరిచయమే, నాకు భలే గమ్మత్తుగా, ఆసక్తిదాయకంగా జరిగింది.

ఆరోజు నేను నవగ్రహమందిరంలోకి వెళ్ళి, గిన్నెలోని నూనె పైనుండే దీపంలో వంచి, వత్తి కూడా అందులోనే వేసి వెనక్కి తిరిగాను. ఇంతలో "అత్తయ్యగారండీ! నా గిన్నెలోని నూనె కూడా వంచరూ..." అంటూ, నా చేతికి నూనె గిన్నె అందించింది, నా ప్రక్కనున్న బాలిక. "ఇంత చిన్నపిల్లచేత నూనె గిన్నె యిచ్చి పంపారెందుకబ్బా!" అనుకుంటూ, నూనె గిన్నె అందుకున్నాను నేను. నూనె వంచి ఇచ్చిన గిన్నెను, జాగ్రత్తగా చేతిలోకి తీసుకుంది ఆ పాప. నేను ప్రదక్షిణ మొదలెట్టగానే, నా వెనకే తిరుగుతూ, ఒక్కొక్క ప్రదక్షిణకి, ఒక్కొక్క పైసా చొప్పున మూల గ్రహాలమీద విసిరేయసాగింది. "అమ్మో! పిల్ల చిన్నదయినా, భక్తి లావే...!" విస్తుపోయాను, నేను.

ప్రదక్షిణలు పూర్తిగావించుకొని, విభూతి, కుంకుమలు తీసికొని ఆంజనేయ స్వాములవారి మందిరానికి ముంగిటవున్న ఎత్తైన మంటపంమీద కూచున్నాను. ఆరోజు ఎందుచేతనో, మా పాప–స్వర్ణ–నాతో గుడికి రాలేదు. నేను ఒక్కదాన్నే కూచునివుంటే, ఏమనుకుందో ఏమో – ఆ అమ్మాయి కూడా వచ్చి నా పక్కనే కూచుంది. పాపకి మహావుంటే – పదేండ్లుంటాయేమో! బక్కపల్చగా, తెల్లగా వుంది. ముఖంలో, కళ్ళుమాత్రం కొట్టొచ్చినట్లు పెద్దగా వున్నాయ్. అరచేతిలోని కుంకుమా – విభూతి కలిసిపోకుండా కాగితపు ముక్కలతో అతి జాగ్రత్తగా చిన్నచిన్న పొట్లాలు కట్టింది.

"నీ పేరేంటి పాపా...!" అన్నాను

"పూర్ణిమ" అంది, అరచేతిలో మిగిలిపోయిన విభూతిని నుదుటికి, పొట్టకి రాసుకుంటూ.

ఆ పిల్లకు, దేవుడిపైగల భక్తి శ్రద్ధలకు – చెప్పద్దూ – నాకు బలే ముచ్చటేసింది.

"ఏం పాపా! నువ్వొక్కతెవే వచ్చావు...? పెద్దవాళ్లెవరూ రాలేదా?" అన్నాను, నేను.

"లేదండీ. అయినా ఎవరొస్తారండీ అత్తయ్యగారూ! నాన్నమ్మకేమో మోకాళ్ళనొప్పి; అమ్మకి ఇంట్లో చేసినంత పని–పైగా ఇంతదూరం నడవగలదాండీ, అమ్మ?"

''ఎక్కడేంటి పాపా, మీ ఇల్లు?''

"క్రిసెంట్ పార్క్ స్ట్రీట్ లేదండి... అక్కడ..."

"ఓహో ... మా ఇంటికి వెళ్ళేదారి లోనే అన్నమాట! అక్కడినుండి నువ్వొక్కదానివే వస్తావా...?"

"ఔనండీ. నవగ్రహాలని శ్రద్ధగా చుట్టే-మనం కోరుకున్నవన్నీ జరుగుతాయట కదండీ...! అలా అని మా ఇంటికి వచ్చే శాస్త్రులుగారు చెప్పారులెండి...'' కళ్ళు ఇంతింతవిచేసి చెప్తున్న ఆ చిన్నారి పూర్ణిమను చూస్తే నాకు ముద్దేసింది.

"అబ్బో...! ఏంవిటో నీకోరిక...?"

"నా కోరికాండి-! అబ్బే ఏం లేదు లెండి అత్తయ్యగారూ-!" బోల్డు సిగ్గుపడిపోతూ అంది, పూర్ణిమ. కొంపదీసి మంచి మొగుడికోసరం ఇప్పటినుండే దీక్షపూని ప్రదక్షిణములు చేయడంలేదు కదా ఈ పిల్ల! — అనిపించింది నాకు.

ఏమనుకుందో ఏమో - అంతలోకే అందుకొని, "మరేనండి అత్తయ్యగారూ! నాకో చెల్లెలో-తమ్ముడో పుట్టాలని ఇలా దేవుడికి ప్రదక్షిణలు చేస్తున్నానండీ-" చిక్కటి చిరునవ్వుని జోడించి చెప్తున్న పూర్ణిమ మాటలకు నాహృదయం స్పందించింది. పాపం, తన తరువాత పిల్లలు లేక కాబోలు - ఈ చిన్ని హృదయం తల్లడిల్లుతూంది...!

"నువ్వొక్కదానివేనామ్మా, మీ వాళ్ళకి?" అనవసరపు ప్రశ్నే అయినా, ప్రసంగం పొడిగించడానికి వేశాను.

"ఔనండీ-" ఠంగున లేచినుంచుంటూ అంది పూర్ణిమ. "వస్తానండి అత్తయ్యగారూ, ఆలస్యమయితే అమ్మ కంగారు పడుతుంది-" వెళ్ళిపోతూ అంది, పూర్ణిమ. అలా వెళుతున్న ఆ అమ్మాయి ముఖంలో ఏదో నెప్పుజాలని అర్ధన - దాని వెనుక కన్పించే తృప్తి నాకు గోచరమయ్యాయ్.

అలా మొదలయిన మా పరిచయం దినదినాభివృద్ధి చెందింది. ఒక్కరోజు నేను వెళ్ళడం ఆలస్యమయినా, పూర్ణిమ రావడం ఆలస్యమయినా, ఇద్దరం ఒకరి కోసరం ఒకరం నిరీక్షిస్తూ వుండేవారం.

''ఇక వెళ్దామే అమ్మా...!" అంటూ స్వర్ణ వచ్చి నా ప్రక్కన నిలుచుంది. దాని స్నేహితురాండ్రందరూ వెళ్ళినట్లున్నారు - ఇక ఇంటి ధ్యాస పట్టుకుంది అమ్మాయిగార్కి. లేవబోతున్న నేను, గబగబా గుడిలోకి వస్తున్న పూర్ణిమను చూసి ఆగిపోయాను. నన్ను చూసి, "అత్తయ్యగారూ! ఒక్క నిముషం వుండండి. ఇప్పుడే వచ్చేస్తాను..." అంటూ, గుడిలోకి పరుగు తీసింది పూర్ణిమ. పూర్ణిమ ఈడుదే అయినా మా స్వర్ణకి గుడిచుట్టడాలు, కుంకుమ విభూతులు పెట్టుకోవడాలు ఏమీ పట్టవు. ఎంత సేపూ ఆట - లేకుంటే చదువు. ఆట

లాడి విసుగపుట్టించేదేమో - పూర్ణిమ వెంబడి గుడి కెళ్ళింది స్వర్ణకూడా.

కాస్సేపటికి ఇద్దరూ నా దగ్గరికి వచ్చారు.

"ఏం పూర్ణిమా! ఇంతాలస్యం...?" అన్నాను నా ప్రక్కనే కూచుంటున్న పూర్ణిమను చూస్తూ.

"ఏం లేదండీ అత్తయ్యగారూ! అమ్మకి ఒంట్లో బాగోలేక చాలాసేపు లేవకుండా పడుకుంది. అందుకని..." ఏదో చెప్పలేకపోతున్న ఆ పిల్ల కండ్లలో, నీళ్ళు ఇప్పుడో-అప్పుడో అన్నట్లు తొంగి చూస్తున్నాయ్.

"ఎందుకమ్మా దా ప రి క ం ఈ అత్తయ్యచెంత!" అంటూ ఆప్యాయంగా దగ్గిరికి తీసుకున్నాను, పూర్ణిమని.

అంతే, పూర్ణిమ నా ఒళ్లోపడి వెక్కి వెక్కి ఏడ్చింది. ఈ హటాత్సంఘటనకి నేను తెల్లబోయాను. స్వర్ణ బిక్కముఖం వేసికొని నా ప్రక్క కూచుంది. కాస్సేపటికి పూర్ణిమ లేచి కూచుని స్కర్టు అంచులతో కళ్ళు తుడుచుకుంది.

"ఏం పాపా! మీ అమ్మకి బాగో లేదా?" అన్నాను. కాదన్నట్లు తల వూపింది పూర్ణిమ. మళ్ళీ ఏమనుకుందో ఏమో, నెమ్మదిగా వెనక్కి తిరిగి, బ్లౌజు ఎత్తి వీపు చూపింది.

ఆశ్చర్యం! తెల్లటి వీపుమీద ఎర్రటి వాతలు!

నాకేం అర్థంకాక, పూర్ణిమకేసి బాధగా చూశాను.

"మరండి - మా నా న్న మ్మ ఈ వుదయం వేడివేడిగా ఏడట్లు వేసిందండీ అత్తయ్యగారూ! మరీ వేడివి వేసిందేమో - వాతలు పడ్డాయండీ. అది చూసి అమ్మ ఏడ్చింది." పూర్ణిమ ఏడుపుతో సంతోషాణ్ణి జోడిస్తూ నివేదించింది.

"ఎందుకమ్మా ఏడట్లువేయడం...?" తెల్లబోతూ, అడిగాను

"అయ్యో! నిజంగా మీకు తెలీదాండి అత్తయ్యగారూ! (జాలిగా నాకేసి చూస్తూ) మా అమ్మకి పుట్టిన పిల్లలందరూ పురిట్లోనే చచ్చిపోతున్నారుగా. నా వెన్ను కాలితే అమ్మకి కడుపు చలువయి పిల్లలు బ్రతకొచ్చుగా. అందుకని...!"

"అందుకని - నీ వీపుమీద వాతలా! అయ్యో రామ! మరి, మీ అమ్మా, నాన్నగారూ చూస్తూ వూర్కుండిపోయారా?

"అమ్మ ఏడుస్తూ వద్దంటే వద్దంది. నాన్నగారింట్లో లేరు అయినా, అమ్మ పిచ్చిగాని, ఈ వా త లె ం త కా ల ముంటాయ్ అత్తయ్యగారూ! ఇంతలో మానిపోవూ! ఎంచక్కా తమ్ముడో - చెల్లెలో పుడ్తారుగా. ఆ ఆశతోనే ఈ కష్టాణ్ణి ఆనందంగా అనుభవిస్తాను అత్తయ్యగారూ-" పదేండ్ల అమాయకపు బాలిక అరువదేండ్ల అనుభవాన్ని పుడికి పుచ్చుకుని మాట్లాడుతుంటే, నాకు దుఃఖం ముంచుకొచ్చింది.




''పోన్లేమ్మా ! ఇంటికెళ్ళగానే కాస్త కొబ్బరినూనె సున్నపుతేట రాసుకో. అయినా, ఇలా వాతలు వేయించు కుంటారా ?'' – ఇక అక్కడ కూచోలేక లేచిపోయాను.

ఆ రాత్రి పడుకున్నానేకాని నా ఆలోచనలన్నీ ఆ అమాయకపు బాలిక పూర్ణిమ చుట్టే తచ్చాడుతున్నాయ్. తొలి చూలు పిల్ల తర్వాత, పిల్లలు దక్కక పోతే పెద్ద పిల్ల వెన్ను మంచిదికాదనడం విన్నాను. కానీ, ఇంతలా నమ్మి, ఇంత ఘోరంగ వ్యవహరిస్తారని వూహించలేక పోయాను. కండ్లు అలా మూయగానే ఆ పచ్చటి వీపు, ఎర్రటి వాతలు ప్రత్యక్ష మవసాగాయ్. నిద్రరాక మసలుతూ, ఆ రాత్రే నిశ్చయించుకున్నాను, ఏమైనా సరే, పూర్ణిమ తల్లిని కలిసి మాట్లాడా లని. ఆ నిశ్చయాని కొచ్చాక కాస్త కన్ను మూయగలిగాను.

* * *

''పద పూర్ణిమా ! నేను కూడ మీ యింటికి వస్తాను,'' అన్నాను గుడి బయటకు వస్తూ.

"నిజంగానేనా అత్తయ్యగారూ ! పదండి...'' బోల్డు సంతోషపడిపోతూ, నాముందు నడిచింది పూర్ణిమ.

ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ నడక సాగించామ్. పూర్ణిమ ఎంతో హుషారుగా మాట్లాడేస్తుంది. ఆ రోజు మా చంటిది, సుమ, కూడా నాతో వచ్చింది గుడికి. దాన్ని బలవంతంగా నా చేతుల్లోంచి లాక్కొని తను ఎత్తుకుంది పూర్ణిమ. పూర్ణిమ చంక నెక్కి కేరింతలు కొట్ట సాగింది సుమ.

"అత్తయ్యగారూ ! ఈ పాపని రోజూ మా ఇంటికి తీసికెళ్తానండి." అంది, మురిపెంగ పూర్ణిమ.

"ఊఁ... అలాగే..." అన్నాను నేను నవ్వుతూ.

హెన్సుమెన్ రోడ్డు మలుపు తిరిగి, క్రెసంట్ పార్క్ స్ట్రీటువేపు దారి తీసింది పూర్ణిమ. ఒక పెద్ద ఇంటిముందు ఆగి, గేటు తెరిచి, "రండి అత్తయ్యగారూ –" అంది పూర్ణిమ, క్రిందికి జారిపోతున్న సుమని, మళ్ళీ చంకలోకి లాక్కొంటూ. ఏడ్పుకి సిద్ధమవుతున్న సుమని, పూర్ణిమ వద్దనుండి అందుకొని, "పెద్ద ఇల్లేనే" అనుకుంటూ, పూర్ణిమని అనుసరించాను. కాని పూర్ణిమ తిన్నగా వెళ్ళక ప్రక్కకి దారితీసింది. ఓహో... ఔట్ హౌసులో నన్నమాట వీళ్ళుండేది. త్యాగరాయనగర్‌లో కొందరు భాగ్యవంతులు, వారి భవంతుల వెనుకవేపు చిన్న చిన్న గదులు కట్టించి, అద్దెకు ఇస్తుంటారు. ఇలా చేయడంవల్ల ఇంటి గల వాళ్ళకి కాస్త మాట సాయం, మరి కొంత ఆర్థిక సాయం.

మూడు గదులున్న చిన్న పోర్షన్ లోకి, రివ్వున దూసుకుపోయింది పూర్ణిమ. "అమ్మా ! కోవెల అత్తయ్య గారంటూవుంటానే ఆ అత్తయ్యగారొచ్చారమ్మా – నిన్ను చూడ్డానికి..." పూర్ణిమ మాటలు విని, ఓ ముప్ఫై సంవత్సరాలున్న స్త్రీ బయటకువచ్చింది. "రండి... అంటూ, నన్నాహ్వానిస్తున్న పూర్ణిమ తల్లికేసి చూశాను. బహుశా ఆవిడకి ముప్ఫై ఏండ్లు కూడా వుండవేమో అనిపించింది. అచ్చుగ్రుద్దినట్లు పూర్ణిమనే పోలివుంది. నీరసంగావున్న ఆవిడ గర్భవతి అని గ్రహించాను. పూర్ణిమ గబగబా రెండు మోడాలు తెచ్చి వరండాలో వేసింది. ఇద్దరం కూచున్నాము

"మీ పాప పూర్ణిమకి భలే దైవభక్తండీ ! క్రమం తప్పకుండా గుడికి వస్తుంది." అంటూ నవ్వుతూ నా ప్రసంగాణ్ణి ప్రారంభించాను. తల్లి చెవిలో ఏదో గుసగుసలు పోతోంది, పూర్ణిమ. ఆవిడ నవ్వుతూ, "చూడండి, మా పాపకి మీ పాప బాగుందట. అలాంటి పాప కావాలనే తను గుడికి వెళ్తూందిట..." చెబుతూ చెబుతూనే ఆవిడ ముఖం వెల వెల పోవడం గమనించాను. మంచినీళ్ళకై పేచీపెట్టున్న సుమని పూర్ణిమకి అప్ప చెప్పాను.

"ఏమండీ ! మీ పేరు నాకు తెలియదు. మిమ్మల్ని చూడ్డం కూడా ఇదే ప్రథమం. కానీ, పూర్ణిమతో కొన్ని నెలలుగా నాకున్న పరిచయాన్ని ఆధారం చేసుకొని, మీరు నాకు చాలా ఆప్తులన్న భావనతో మిమ్మల్నొకటి అడుగదలచాను..." అన్నాను

"ముఖంలో కాస్త ఆశ్చర్యం కనబరుస్తూ, "తప్పక..." అన్నట్లు తల తిప్పి నా వంక చూసింది.

"పాపం చిన్నపిల్ల కదా, అంతలా వాతలు పెట్టారెందుకండీ పూర్ణిమ వీపు మీద...!"

నా మాటలు పూర్తికాకమునుపే, ఆవిడ నయనాలు అశ్రుపూరితము లయ్యాయ్. మాటలు రాక, కన్నీటిని పైటకొంగుతో తుడిచేసుకొంటున్న పూర్ణిమ అమ్మని, మళ్ళీ నేనే పలుక రించాను.

"క్షమించండి. మీ పాప వీపుమీది వాతల్ని గుర్తుచేసి మిమ్మల్ని బాధపెట్టి నట్లున్నాను. పోనీలెండి, ఇంతకూ మీ పేరు తెలుసుకోవచ్చునా?"

"కృష్ణవేణి."

'నా పేరు లక్ష్మి'-మా వారి ఉద్యోగం మేముంటున్న ఇల్లు, వీధి, ఇత్యాది వివ రాలన్నీ ఎరుకపరిచాను కృష్ణవేణికి.

కొద్దిగా కోలుకున్న కృష్ణవేణి మాట్లాడసాగింది. "కొద్ది దినాల సాన్ని హిత్యానికే మా పాప పట్ల మీకంత బాధగావుంది కదా, ఇక కన్నతల్లిని నా కెంత ఆవేదన వుంటుందో వూహించండి అక్కయ్యగారూ! ఏమని చెప్పను...? ప్రతి తడవా నాకు గర్భం రావడం, ఎన లేని ఆశలు పెంచుకోవడం, మా ఆశా పాశాలకు గ్రొడ్డలివేటులా, పుట్టిన శిశువు పురిటిలోనే మరణించడం అలవాటై పోయింది. మా పెండ్లయిన సంవత్స రానికే పుట్టిన ఈ పూర్ణిమని చూడండి. చక్కగా, ఆరోగ్యంగ వుంది. తర్వాత పుట్టిన ఇద్దరు పిల్లలూ - ఇద్దరూ మగ పిల్లలే - పుట్టీపుట్టగానే కన్నుమూసారు. ఏటేటా శిశువును మోయడం నా వంతు- అపనిందను మోయడం నా కన్నకూతురు వంతు అవుతున్నది. పూర్ణిమ వెన్ను మంచిది కాదంటుంది మా అత్తయ్య. నష్టజాతకురాలంటూ తిట్టిపోస్తారు, మా మామగారు చూశారుగా నిన్న; పసిదన్న దయాదాక్షిణ్యం లేకుండా పూర్ణిమ వెన్ను మీద ఎంతలా వాతలు పెట్టారో!-" పెల్లుబికి వస్తున్న దుఃఖాణ్ణి ఆపుకోలేక పోయింది కృష్ణవేణి

ఈ మూర్ఖపు ముసలమ్మల అర్థంలేని మూఢనమ్మకాలకి - చెప్పొద్దూ - నాకు ఒళ్ళు మండుకొచ్చింది. వీళ్ళసలు సరిగ్గా డాక్టరుకి చూపించారో లేదో...? అదే ముక్క కృష్ణవేణితో అన్నాను.

"అదేం లేదండీ. చూపిస్తూనే వున్నాం ప్రతి తడవ. మా తల్లిగారి వూరు కాళహస్తికి దగ్గరగా వున్న వెంకటాపురం. బస్తీకాకపోయినా, పెద్ద పల్లెటూరే ఆ వూర్లో కాన్పులెన్నోచేసి అనుభవం గడించిన నర్సమ్మ కూడా వుంది. అయినా, పెద్దపిల్ల అక్కడేగా పుట్టింది. మరొక్క విషయం. నావి చాలా సులభమైన కాన్పులు..."

"కాన్పు సులభమైనంత మాత్రాన పిల్లలు ఆరోగ్యంగా పుట్టారని ఎక్క డుందండీ? అయినా, రెండు తడవలు

అలా జరిగాక మీరు కాస్త జాగ్రత్త పడాలి'' అన్నాను

"అందుకేనండీ ఈ మారు మద్రాసు లోనే పురుడు పోసుకుంటాను," అంది, కృష్ణవేణి.

''అయితే ఇకనేం, మీరు ధైర్యంగా వుండొచ్చు. ఈ మారు పూర్ణిమ ఓ 'అక్క' అవడం ఖాయం. చీకటి పడు లోంది ఇక వెళ్ళివస్తానండి. పూర్ణిమను తోడుతీసుకొని మా ఇంటికోమారు రండి..."

''అలాగే...తప్పక వస్తాను...''

సుమని తీసికొని, ఇంటిదారి పట్టాను నేను. నీలకంఠ మెహతా స్ట్రీటులోవుండే మా ఇల్లు, పూర్ణిమ వాళ్ళ ఇంటికి చాలా దగ్గర. పది నిముషాల్లో ఇల్లు చేరుకున్నాను.

గుడినుంచి అప్పుడప్పుడు పూర్ణిమ వాళ్ళింటికి వెళ్ళి కృష్ణవేణి ఆరోగ్య సమాచారాలు కనుక్కుంటూ వుండే దాన్ని. అలా వెళ్తున్న నాకోమారు, పూర్ణిమ నాయనమ్మను చూచే భాగ్యం కూడా కల్గింది ఆవిడ, పూర్ణిమ కనబడితే చాలు కళ్ళల్లో నిప్పులు పోసుకునేది. సుమని ఎత్తుకు తిరుగుతున్న పూర్ణిమని చూసి "అంతేలే...! ఈ దరిద్రపుగొట్టు ముఖానికి పరాయి పిల్లల్ని ఎత్తి మోసే భాగ్యమేలే-" అంటూ ఈసడించుకొనేది. వాళ్ళ నాయనమ్మని తప్పించుక తిరిగే, పూర్ణిమ ఖిన్నవదనాన్ని చూసినపుడల్లా నాకు భరించరాని బాధ కల్గేది

ఆ రోజున, సుమని పొరపాటున క్రింద పడవేసిన రోజున, ముసలమ్మ మరీ గొడవచేసింది. "నీ స్వంత తమ్ముళ్ళను పొట్టన పెట్టుకుంది చాలక, పరాయమ్మ కన్నబిడ్డల నెందుకే ఎత్తి కుదేస్తావ్!" అంటూ టక్కుటక్కున ఆ పిల్ల నెత్తిమీద మొట్టికాయల వర్షం కురిపించింది. కృష్ణవేణి గ్రుడ్ల నీరు కక్కుకుంటూ పూర్ణిమని దగ్గరికి తీసుకుంది. ఊరుకోండలేక నేనే, "అదేంటి మామ్మగారూ! పిల్లలెపుడూ క్రిందపడరా యేంటి...? పూర్ణిమను ఏమీ అనకండి." అంటూ సర్దిచెప్పాను. పువ్వుల్లాంటి పసిపాపల లేత మనస్సులను ఈ పెద్దవారు ఎంత నిర్దాక్షిణ్యంగ నలిపివేస్తారో!

పూర్ణిమవాళ్ళ కుటుంబంతో నాకు స్నేహం ఎంత పెరిగిపోయిందంటే, కృష్ణవేణి కాన్పు విషయంలో చెప్ప లేనంత శ్రద్ధ తీసికోవడం మొదలెట్టాను. పూర్ణిమకి ఎలాగయినా సరే, ఈ మారు ఓ చెల్లో - తమ్ముడో దక్కేటట్లు చేయాలి. 'అత్తయ్యగారూ! ఇదుగోండి నా చిన్నారి చెల్లి!' అంటూ, తన చిట్టి చెల్లెల్ని నాకు చూపిస్తున్నప్పుడు ఆ పిల్ల సుందర వదనంలోని మందహాస వీచికలను చూచి ఆనందించాలి.

కృష్ణవేణ్నినీ ఎగ్మూర్ హాస్పిటల్లో చేర్పిస్తే మంచిదేమో అనిపించింది నాకు.



ఎంచేతనంటే, అక్కడ పీడియాట్రీషియన్‌గా పనిచేసే డాక్టర్ కరుణాకర్, మా వారికి బాగా తెలిసినవారు. ఈ మాటే మా వారి చెవిలో వూదాను.

"ఓ...దానికేం... వాడికి చెబుతా కానీ, మీ స్నేహితురాలి వివరాలన్నీ ఇవ్వు మరి..." అన్నారు, మా వారు.

రోజులు దొర్లుతున్నాయ్. గుడిలో కానీ, వీధిలో కానీ చిన్నపిల్లలు కంట బడితే చాలు, వారిని ఆబగ చూసేది పూర్ణిమ. నేనది గమనిస్తూ, "ఇంకెన్నాళ్ళులే...నీకూ ఓ చెల్లాయి వస్తుంది. అప్పుడు ఈ అత్తయ్యని మరిచిపోతావు కదూ...!" ఉడికిస్తూ, అనేదాన్ని. "పోండి అత్తయ్యగారూ...!" అనే దా అమ్మాయి, నవ్వుతూ.

* * *

నా గుడి చుట్టడాలు పూర్తయ్యాయ్. గుడికి వెళ్ళడమైతే మానేశాను కాని, కృష్ణవేణి వాళ్ళ ఇంటికి నాలుగైదు రోజుల కొకమారైనా వెళ్ళకపోతే తోచేది కాదు. ఆ రోజు వుదయం అలవాటుగా

వాళ్ళింటికి బయలుదేరాను. వాకిట్లో నిల బడి, బిక్కు బిక్కుమంటూ ఏదో ఆలో చిస్తోంది పూర్ణిమ. ఆ పిల్లను చూడగానే, "అమ్మ ఏదమ్మా ?" అన్నాను.

"అమ్మని ఇందాకనే హాస్పిటల్‌కి తీసి కెళ్ళారండి అత్తయ్యగారూ," అంది, భయం భయంగా.

"మరి, నాయనమ్మ ఎక్కడ ?"

"గుడి కెళ్ళిందండీ - అర్చన చేయిం చుక రావడానికి..."

"నా దంతా దురదృష్ట జాతకమట అత్తయ్యగారూ. అందుకని నాయనమ్మ నన్ను వద్దంది. నాకు భయంగా వుందండి అత్తయ్యగారూ. అమ్మకి ఈ తడవ పుట్టిన పాప బ్రతకాలి. లేకుంటే నన్ను మా నాయనమ్మ చంపేస్తుందటండీ..." బావురుమంటూన్న పూర్ణిమని, ఒళ్లోకి తీసికొన్నాను.

"ఊర్కో - ఏడవకమ్మా. పాప ఎందుకు చచ్చిపోతుంది ? ఈ మారు అలా జరుగదు. మునుపంటే మీ మామయ్యగారి వూర్లో వైద్యసదుపా యాలు లేక, పుట్టిన ఇద్దరు పిల్లలు చచ్చి పోయారు. ఇప్పుడలా ఎందుకు జరుగు తుంది...? నీకేం భయం లేదులే. నేను వచ్చి వెళ్ళానని మీ నాయనమ్మతో చెప్పు..." పూర్ణిమని ఓదార్చి, ఇంటి ముఖం పట్టాను.

మా వారు ఆఫీసుకు వెళ్ళేందుకు తయారై, నా కోసరం చూస్తున్నట్లు న్నారు. ఆదరాబాదరగా వచ్చిన నన్ను చూసి, "ఏంటోయ్ అదొలా వున్నావ్..? మీ స్నేహితురాలి కేమయింది ?" అన్నారు

"కృష్ణవేణిని ఈ వుదయమే హాస్పి టల్‌కి తీసుకువెళ్ళారుట.. ఈ దినమే కాన్పు కావచ్చునేమో !" అన్నాను.

"ఈజ్ ఇట్...?" ఏం ఫరవాలేదు లక్ష్మీ. డాక్టర్ కరుణాకర్ మీ స్నేహితు రాల్ని ఇదివరకే పరీక్షించాడట నేను ఆఫీసుకి వెళ్ళగానే మళ్ళీ ఓమారు ఫోన్ చేసి కనుక్కుంటాలే. నీ పని - అదీ ముగించుకొని హాస్పిటల్‌కి ఓమారు వెళ్ళి రాకూడదూ...! సో...ఐ షెల్ గో..." బయటకు నడిచారు, మా వారు

వంట ముగించుకొని, పక్కింటివారికి సుమని అప్పచెప్పి, హాస్పిటల్‌కి ప్రయాణ మయ్యాను నేను. ఆటో చిక్కడం ఎలా కష్టం కాలేదో - ఎగ్మూర్ హాస్పిటల్ లోని ప్రసూతివార్డు కనుక్కోవడం కూడా, అట్టే కష్టంకాలేదు నాకు. ప్రసూతివార్డులోని ప్రతి మంచం ప్రక్కన ఓ ఊయల. నిదురోతున్న శిశువులు కొందరు ఊరకనే ఏడుస్తున్న పిల్లలు మరికొందరు. అందర్నీ చూచు కుంటూ కృష్ణవేణి పడుకొనివున్న పక్క కేసి నడిచాను. కృష్ణవేణి మగతగా అటు తిరిగి పడుకొనివుంది ప్రక్కనే వున్న ఉయ్యాలలోకి ఆత్రంగా చూశాను ఖాళీ తొట్టి నన్ను వెక్కిరించినట్లనిపించింది.




నివ్వెరపోయాను. గుండె ఒక్క మారు ఆగిపోయినట్లనిపించింది. తమాయించుకొని ప్రక్కకి తిరిగాను. ప్రక్కపడకలోని బాలెంతరాలు నా వివర్ణ వదనాన్ని గమనించి, నవ్వుతూ "బేబీ కోసరం చూస్తున్నారా...? ప్రసవమైనప్పటినుండి బేబీని బయటకు తేనే లేదండి. అదేదో రక్తం ఇస్తున్నారుట" అంది.

ఇంతలో సుడిగాలిలా దూసుకు వచ్చింది పూర్ణిమ. "అత్తయ్యగారూ ! నాకు తమ్ముడు–బుల్లి తమ్ముడు పుట్టాడట ! అంతేకాదు అత్తయ్యగారూ, నా తమ్ముడికి ఇకనేం ప్రమాదం లేదట – ఇందాకనే డాక్టరుగారు చూ నాయనమ్మతో చెప్పారు..." నన్ను గట్టిగా వాటేసుకుంటూ, అంది పూర్ణిమ.

పూర్ణిమ ముఖంలో, తొలిసారిగా, పూర్ణిమ వెన్నెలలు గాంచిన నా కళ్ళు ఆనందబాష్పాలతో నిండాయి.

"మీ నాయనమ్మగారెక్కడ...?" అన్నాను.

"ఇందాకనే ఇంటికెళ్ళింది. మళ్ళీ ఓ గంటలో వస్తానంది."

మగతగా నిదరోతున్న కృష్ణవేణిని లేప మనస్కరించలేదు. ఆనందంతో నిండిన హృదయంతో – "పూర్ణిమా, అమ్మ లేచాక నేనొచ్చి వెళ్ళానని చెప్పు..." అంటూ, ప్రసూతివార్డు నుంచి బయటకు నడిచాను.

ఆ సాయంత్రం ఇంటిపనులు ముగించుకొని, శ్రీవారికై ఎదురుచూస్తూ కూచున్నాను. మా ఇంట్లో ఏదో శుభం జరిగినంత సంబరంగా వుంది నాకు. మా

వారువచ్చిందే, పూర్ణిమకి తమ్ముడు పుట్టాడన్న శుభవార్తని వారి చెవిలో వెయ్యాలి...

నిరీక్షిస్తున్న శ్రీవారు రానే వచ్చారు. వాకిట్లోంచే, "కంగ్రాచ్యులేషన్స్... పూర్ణిమకి తమ్ముడు పుట్టాడు ... ఆరోగ్యంగా వున్నాట్ట..." అంటూ వచ్చారు.

"నేనే ఆ శుభవార్తను మీ చెవిలో వేద్దామని వువ్విళ్ళూరుతుంటే... మీరే చెప్పేశారే..." నవ్వుతూ, అన్నాను.

"ఇందాక డాక్టర్ కరుణాకర్ క్లబ్బులో కలిసాడు..." టై లూస్ చేసి కుంటూ, సోఫాలో చేరగిలబడి అన్నారు, శ్రీవారు.

బ్రూ కాఫీ సేవిస్తున్న శ్రీవారికేసి చూస్తూ అన్నాను. "ఇంతకీ కృష్ణవేణిది కాదండి అదృష్టం; పూర్ణిమదే! పాపం, ఆ పిల్ల తమ్ముడికోసరం ఎంత పాటు పడ్డది! అయినా మన ఛాదస్తాలంటూ అంతలా తీసిపారేస్తాముకదా! వెన్నె చలవకి ఏడట్లు వేసిందని వాళ్ళ నాయనమ్మని ఎంతగానో తిట్టుకున్నాను. కానీ, ఇప్పుడనిపిస్తోంది – పూర్ణిమ నిజంగా దురదృష్ట జాత ఎందుకు కాకూడదా – అని. పుట్టిన బిడ్డ లక్షణంగా వున్నాడంటే ఏడట్ల ప్రభావమే కాకూడదా!?..."

మాటల మధ్యలో ఉలిక్కిపడ్డట్లు నావేపు చూసి, మా వారు పక పకా నవ్వడం మొదలెట్టారు.

"అన్నీ చెప్పవేం లక్ష్మీ...! పూర్ణిమ, నవగ్రహాల చుట్టిన పుణ్యమే కావచ్చు, వేయించుకున్న వాతల ప్రభావమే కావచ్చు–లేక–వాళ్ళ నాయనమ్మ శాస్త్రుల వారిని పిలిపించి–చేయించిన 'శాంతి'యే కారణం కావచ్చు... ఇంకేదో కావచ్చు. కానీ, అసలు కారణం తెలిస్తే నీవు నిర్ఘాంతపోతావ్...! అదేవిఁటో తెలుసా? పుట్టిన బిడ్డ బ్రతకడానికి కారణం నీవే...!"

"ఏవిఁటి...! నేనా...!!"

"ఊఁ...నువ్వు పట్టుబట్టబట్టి ఈ కేసు కరుణాకర్ చేబట్టాడు. అతని హస్తవాసి వల్లే ఈ బిడ్డడు బ్రతికాడు! కృష్ణవేణికి పుట్టిన బిడ్డ 'రీసెస్ బేబీ' అట–"

"అంటే!" అన్నాను, ఏమీ అర్థమవక.

"నా ఇంజనీరింగ్ బుర్రకే పూర్తిగా అర్థం కాలేదు. మరి నీ లిటరేచర్ బుర్రకి ఎలా అర్థమై చస్తుందిలే..."

"అబ్బ విసిగించక వివరాలు చెబుదురూ!"

"అంత ఓపికా – నాలెడ్జి నా కెక్కడున్నాయ్ – అదో ఆ టీపాయ్ మీద ఇందాక కరుణాకర్ ఇచ్చిన సైన్స్ జర్నల్ పడేశాను. అందులో పదమూడవ పేజీ తెరిచి చదువు..." ఆర్డర్ జారీచేసి లోనికి జారుకున్నారు శ్రీవారు.

ఆదరాబాదరాగా టేపాయ్ మీదున్న సైన్స్ జర్నల్ తెరిచి పదమూడవ పుట లోని వ్యాసాన్ని చదవడం మొదలె ట్టాను.

"రీసెస్ పసి పిల్లలు (Rhesus babies).

* * *

పుట్టబోయే శిశువుల్ని రీసెస్ ప్రమాదంనుంచి తప్పించే వైద్య పద్ధతులు, ఆధునిక వైద్యవిజ్ఞానంవల్ల మన కిప్పుడు లభ్యమవుతున్నాయి. తల్లి యొక్క రక్తాణువులు, పుట్టబోయే శిశువు యొక్క ఎర్ర రక్తాణుష్టలను విరిచివేసే కారణంగా, శిశువు కామెర్లతో జన్మించ డమో, మృత శిశువుగా పుట్టడమో జరుగు తుంటుంది. ఈలాంటి శిశువులను రీసెస్ శిశువులని, ఈ వ్యాధిని 'హేమోలిటిక్ ఎనీమియా' (Haemolytic anaemia) అని, అంటారు.

భార్యా భర్తల రక్తంలోగల, రక్త వైరుధ్యం ఇందుకు కారణం. మానవ రక్తాన్ని అనేకరకాలుగా విభజింప వచ్చును. ఉదాహరణకు ఏ బి ఓ(ABO) సిస్టమ్ తీసుకొందాం. 'ఓ' గ్రూపు రక్తం గలవారికి 'ఏ', లేక 'బి' లేక 'ఏ బి' రక్తపు గ్రూపులు పనికిరావు. ఎందుచేత నంటే, 'ఓ' గ్రూపు రక్తం గలవారిలో 'ఏంటిబాడీస్' (Anti bodies) అన బడే సూక్ష్మరేణువులు వుంటాయి. ఇవి, దానంగా గ్రహింపబడ్డ విరుద్ధ రక్తంలోని కణములకు అతుక్కొని వాటిని హరింప జేస్తాయి.

మానవ కోటిలో నూటికి ఎనభై ఐదు మంది రక్తంలో రీసెస్ అనబడే సూక్ష్మ రేణువులు వుంటాయి. వీళ్ళందరిని రీసెస్ పాజిటివ్ (Rh+) వ్యక్తులంటూ వ్యవహ రిస్తాము. రక్తంలో రీసెస్ సూక్ష్మరేణు వులు లేని వ్యక్తుల్ని రీసెస్ నెగెటివ్ (Rh —) వ్యక్తులుగా వ్యవహరిస్తాము. ఆర్. హెచ్. పాజిటివ్ వ్యక్తి యొక్క రక్తాన్ని, ఆర్. హెచ్. నెగెటివ్ వ్యక్తికి ఇచ్చామనుకుందాము. రెండవ వ్యక్తి రక్తం ఏంటిబాడీసెని తయారుచేస్తుంది. ఈ తయారైన నిరోధం రేణువులు,ఆర్. హెచ్. పాజిటివ్ రక్తకణాల్ని నాశనం చేస్తాయి.

సర్వసాధారణంగా ఆర్.హెచ్. నెగెటివ్ స్త్రీ, ఆర్.హెచ్. పాజిటివ్ శిశువును పొంది వుంటుంది. శిశువు జననమొందే సమయంలో శిశువుయొక్క ఆర్.హెచ్. పాజిటివ్ రక్తం, ఏ కొద్దిగానైనా తల్లి యొక్క రక్తప్రసరణలోకి జారుకుం టుంది. తత్కారణముగా, తల్లియొక్క ఆర్.హెచ్. నెగెటివ్, రక్తం, శిశువు నుండి పొందిన ఆర్.హెచ్. పాజిటివ్ రక్తానికి విరుద్ధంగా, ఏంటిబాడీస్‌ని తయారుచేస్తుంది. తల్లిలో, ఈ నిరోధక రేణువులు తయారవ్వకముందే ప్రథమ శిశువు జన్మించడము వలన, ఆ శిశువుకు

ఏంటిబాడీస్ వలన ప్రమాదము లేదు కానీ, తరువాత పుట్టబోయే శిశువులకు, వాటివలన ఎంతేని ప్రమాదంవుంది. ప్రథమ సంతానం తరువాత తల్లిరక్తంలో అత్యధికంగా విస్తరిల్లి, రక్తంయొక్క పసుపురంగు ద్రవపదార్థంలో(ప్లాస్మాలో) విలీనమై, బిడ్డపిండంలో ప్రవేశించి, బిడ్డ యొక్క ఆర్.హెచ్. పాజిటివ్ రక్త కణాల్ని నాశనం చేస్తాయి. ఈ రక్త క్షీణత కారణంగా, పుట్టినపుడు నార్మల్‌గా కనిపించే శిశువు, పుట్టిన కొద్దికాలానికే విపరీతమైన కామెర్ల వ్యాధికి గురియై అకాల మరణం చెందుతుంది. బిడ్డ పుట్టిన వెంటనే, బిడ్డలోని క్షీణరక్తపు స్థానే ఆర్.హెచ్.నెగెటివ్ రక్తాన్ని మార్పిడిచేయడం వలన, ఆ బిడ్డను బ్రతికించవచ్చును.

భార్యాభర్తల మధ్య ఈలాంటి రక్త వైరుధ్యం వున్న కారణంగా పై ప్రమాదాలు సంభవిస్తాయి. కాన్పులు దగ్గిర దగ్గిరగా ఏర్పడ్డకొద్దీ, ఈ రక్తవైరుధ్యం అధికమవుతుంది. కాన్పులు దూరమయ్యే కొద్దీ వైరుధ్యం తగ్గిపోతుంది.

ఏది ఏమైనా, గర్భిణీ స్త్రీలందరూ తప్పనిసరిగా ఆచరించవలసిన పని ఒకటుంది. అది వారి రక్తంలోని రీసెస్+ గ్రూపింగ్ తెల్సుకునేందుకు డాక్టర్లచేత పరీక్షచేయించుకోవడమే. నూటికి పది హేనుమంది స్త్రీలు ఆర్.హెచ్. నెగెటివ్ రక్తాన్ని పొందివుంటారు. అలాంటి స్త్రీలకి తొలి కాన్పు తర్వాత ఏంటి-డి Anti-D) అన్న ఇంజెక్షన్ ఇచ్చి మలి కాన్పుల శిశువులను మరణం పాలు కాకుండా కాపాడవచ్చును........."

* * *

అర్థమైపోయింది. కృష్ణవేణికి పూర్ణిమ తరువాత పుట్టిన ఇద్దరు మగ పిల్లలూ దక్కకుండా పోవడంలోని కీలకం తెలిసిపోయింది నాకు.

చిన్నారి పూర్ణిమ తానుచేయని దురదృష్ట జాతగా ఆడిపాలైంది. అందుకే ఆ పసిదానిపై నాకు ఎనలేని ప్రేమాభిమానాలు - సానుభూతీ.

ఆఖరుకి తానో అందాల తమ్మునికి పూర్వజగా నిలిచి, అందరి మెప్పులు పొందింది.





# డేటింగ్

'రేపు సాయంత్రం శర్మగారింటికి వసామని చెప్పాం'. కామాక్షమ్మగారు ఉపోద్ఘాతంగా అన్నారు.

'నాతో చెప్పడ మెందుకూ?' బింకంగా జవాబిచ్చాడు రఘు, పెరుగన్నం కెలుకుతూ.

చిన్నగా నవ్వుకున్నారు కామాక్షమ్మగారు. 'నీవు రాకపోతే ఎలా? శర్మగారు నాలుగు నెల్లుగా చూస్తున్నారు, నీవు ఢిల్లీ నుండి ఎప్పుడువస్తావా అని. నీకునచ్చితే ఈ నెల్లోనే ... '

'నచ్చలేదనిచెప్పేయండి.' గడుసుగా అడ్డుతగిలాడు రఘు.

'ఏం, నచ్చకపోవడానికి? మరీ బెట్టు చేయ కన్నయ్యా. మా ఫ్రెండును వేలెత్తి వంక చూపించలేవు తెలుసా.

ప్రకాశరావు

చక్కగా వుంటుంది—నీవు కథల్లో వ్రాస్తావే, అలినీలవేణి, అపరంజి బొమ్మ, అందాలభరిణ అంటూ...'

'హే! మీ ఫ్రండు సంగతి నాకు తెలీదు. వూరికే నా జోలికి రాకు. అంత చక్కగా వుంటే నాకేం? ఆ గోడ కూడావుంది చక్కగా.' ఉరిమిచూశాడు రఘు చెల్లెలివేపు.

'నీవు వూరుకోవమ్మా, సరోజా. మంచిబాబువుకదూ. రఘూ అంత దూరంలో ఒంటరిగా ఎన్నాళ్లని వుంటావు? నీవో ఇంటివాడివైతే మా బాధ్యత తీరిపోతుంది. వాళ్లమ్మాయి సరోజ క్లాసుమేటట. నిజంగా బావుంటుంది, నీకు తగ్గట్టుగా బాగా బారు.'

'నీదేనా చామన ఛాయ కాని మా ఫ్రండు మల్లెమొగ్గలా వుంటుంది తెలుసా!' సరోజ ఉడికిస్తూ అంది.

రఘు విరుచుకు పడేవాడే కాని ఇంతలో పరంధామయ్యగారు రావడంతో గబగబా చేయి కడిగేసుకుని బయట కెళ్లాడు, కళ్లతోనే సరోజను బెదిరిస్తూ.

తల్లితోనైతే గారాలుపోయాడు కాని తండ్రి 'ఏరా! రేపు వెళ్తావా?' అంటే 'అలాగే నాన్నా!' అని బుద్ధిమంతుళ్లా తలవూపాడు రఘు

శర్మగారింటినుండి తిరిగి వచ్చిం తరవాత మరీ ఆటలు పట్టించింది సరోజ.

'అన్నయ్యా, మా ఫ్రండే నయం. నాలుగుసార్లుచూసింది నీవేపు. కాని నీవు తలేనా ఎత్తి చూళ్లేదు సరిగా, నీవేమేం అడుగుతావోనని చాలా అనుకున్నా కాని అసలు ఏం మాట్లాడలేదేం నీవు?'

'మనవా ళ్లింకా ఈ పెళ్లి చూపులో అని పాతికమంది గుంపులో కూర్చోబెడతారు. వీధిలో వాళ్లందరినీ పోగుచేసుకుని, ఆ బొమ్మల మధ్య మీ ఫ్రండు ఎక్కడా కనిపించలేదు, ఇక. ఏ బొమ్మగారినేం అడగాలో తెలీక నోరుమూసు క్కూర్చున్నా.' విసుక్కున్నాడు రఘు.

'మరేం చేద్దాం చెప్మా? మా ఫ్రండు ఫోటో తెప్పించనా, నిన్ను డైరక్టుగా చూట్టం కుదరలేదుట మా అన్నయ్యకు అని...'

'చత్వారమనుకుంటుంది మీ ఫ్రండు. చూడుసరూ! ఓ చిన్న పనిచేసిపెడతావూ బంగారు తల్లివి కాని. కాస్త ఫోనుచేసి మీ ఫ్రండును పిలు.'

'ఎందుకేం?' కొంటెగా అడిగింది 'జ.

'కాస్త పనుంది కానీ, ప్లీస్.'

'చూడన్నయ్యా, నాకు ప్లానంతా చెబితే గాని పిలవను- నీవు ఫోన్లో ఏమేనా అంటే నాకు చీవాట్లు వడ్డిస్తారు' పెద్ద ఆరిందాలా సరోజ పోజు.

సరోజతో దెబ్బలాడి ప్రయోజనం లేదని ప్లానంతా క్లుప్తంగా చెప్పాడు రఘు.

అదంతా విని, 'అమ్మో! ఏమో నను కున్నా. ఫరవాలేదు. అయిడియా బాగానే వుందికానీ మా రేఖను సరిగా చూడలేదు లేదుకదా నీవు. మరి ఎలా గుర్తుపడతావు? నన్నుకూడా వెంటపెట్టుకెళ్తేగాని మా ఫ్రెండురాదు.' మడత పేచీవేసింది సరోజ.

దేవుడా! అనుకున్నాడు రఘు. కాని సరోజ ఒక్క మిల్లీమీటరు కూడా తగ్గకపోవడంతో అసలుకు మోసం వస్తూందని ఒప్పేసుకున్నాడు పైగా సరోజ చెప్పిందాంట్లో పాయింటు బలంగా వుందికూడా.

'నీ పేరు చెప్పకు. రాధ అనో, ఫ్రెండ్ అనో చెప్పేయ్. ఇలాగని వాళ్ల వాళ్లకు తెలిస్తే బావుండదు.' కంగారుగా అన్నాడు రఘు చెల్లెలు డయల్ చేస్తూంటే

'హలో...కాస్త రేఖను పిలుస్తారా... నేను రేఖ ఫ్రెండును... హలో...' రఘుకు ఫోనందించింది సరోజ.

గంభీరంగా మొదలెట్టాడు రఘు. 'హలో' గీతేనా మాట్లాడేది...'

'గీత కాదు, రేఖ'— సరోజ మౌత్ పీస్ మూసి సరిదిద్దింది.

'హలో, ఐ ఏం సారీ. చూడండి రూపా. నేను రఘును మాట్లాడుతున్నాను.'

'ఎవరూ? ఏ రఘు మీరు?' కలకంఠి ప్రశ్న.

'ఖర్మ! నా పేరుకూడా తెలీదు' మౌతెపీసు మూసి గొణుక్కున్నాడు రఘు

'నేను పరంధామయ్యగారి అబ్బాయిని, సరోజ అన్నయ్యను' తన పూర్తి వివరాలు చెప్పుకున్నాడు రఘు.

'ఆఁ! ఆఁ... అయాం సారీ, నేనే నండీ రేఖను మాట్లాడుతున్నాను. నాన్నగారిని పిలవమంటారా? ఇంట్లోనే వున్నారు మేడమీద.'

'బతికించారు!' మనసులో అనుకున్నాడు.

'చూడండి రేఖా. సాయంత్రం ఆరింటికి కోఠీలో కలుసుకోగలరా?... ఏంలేదు...వూరికే మీతో మాట్లాడాలని ...సరోజా...సరోజ కూడా వస్తూంది. —థాంక్యూ!' ఫోను పెట్టేసి సరోజ చూడకుండా మొహాన పట్టిన చెమట తుడుచుకున్నాడు రఘు.

'ఏ? నన్ను కూడా రమ్మంది కదూ!' సరోజ ఆత్రుత.

'నీకు తగ్గట్టుగానే వుంది మీ ఫ్రెండు,' రఘు రుసరుస. 'కాని అమ్మతో చెప్పకేం ప్లీజ్. సాయంత్రం షాపింగ్ కని బయల్దేరదాం. సరేనా?'

ఎందుకేనా మంచిదని మళ్ళీ సరోజతో ఫోను చేయించాడు రఘు.

'హలో...నేను సరోజను...ఊఁ!... మా అన్నయ్య చెప్పింది అర్థమైందా?... అలాగే నేను కూడా వస్తా, మరేం

ఫరవాలేదు ఇంట్లో ఎవరికే చెప్పకేం అని చెప్పమన్నాడు మా అన్నయ్య... సరే...డోంట్ మెన్షన్.'

తీరా కోఠీకెళ్ళి ఇటూ అటూ చూస్తూంటే సరోజ చూపించింది రఘుకు.

'అదో రేఖ. వాళ్ళన్నయ్యతో వచ్చింది'.

వళ్ళు మండింది రఘుకు—తను ఫోన్లో చెప్పిందేమిటి, ఈ ఎస్కార్ట్ వ్యవహారమేమిటి?

'హలో రఘూ!' అంటూ వచ్చాడు రేఖ అన్నయ్య. 'నాకార్జెంటు పని వుంది. మీరు ఇంటిదగ్గర దిగబెడతారా రేఖను. నేనూ వచ్చేవాడినే కాని...ఆహా! థాంక్యూ—వస్తానమ్మా. హేవ్ ఏ నైస్ టైమ్'.

ఫరవాలేదు, కాస్తలో కాస్త నయం. రఘుకు గుండె దడదడ లాడుతూంది అయినా. ఈ అమ్మాయి టముకువేసి మరీ వచ్చినట్టుగా వుందే- ఇంట్లో తెలిస్తే నాన్న ఏమనుకుంటారు? చివాట్లేసినా వేయవచ్చు...'బుద్ధిమంతుడిలా కబుర్లు చెబుతూ ఈ షికార్లేమిటి?' అని అమ్మ నిలదీసి ఇక తన ప్రమేయం లేకుండా స్థిరపరిచి కూర్చో వెధవా అని పీటల మీద కూలేసినా కూలేయవచ్చు

రఘు ఇలా ఆలోచనలతో సతమతమవుతూంటే సరోజ, రేఖ ఏ చీకూ చింతా లేనట్టు టాక్సీ వెనక సీట్లో కూర్చుని పాత స్నేహితురాళ్ళ చిఠా తిరగేస్తున్నారు. అసలు సరోజను వెంట తేవడం తనతప్పు. వాళ్ళిద్దరూ కూర్చుని కబుర్లేసుకోవడానికా తాను ఇంత రిస్కు తీసుకుని జాగత్తగా ప్లానువేసి ఈవిడను పిలిచింది.

నౌబత్‌పహాడ్ మీద రూఫ్‌గార్డన్ రెస్టారెంట్‌లో ఐస్‌క్రీం చప్పరిస్తూ కూడా వాళ్ళిద్దరే కబుర్లేసుకుంటూంటే ఇక భరించలేక రెండుసార్లు గొంతు సవరించుకొని అడ్డుపడ్డాడు రఘు—

'మీకు నా పేరు కూడా తెలీదా?'

'తెలుసండీ.కానీ ఒక్కసారిగా సరోజ ఏం పలక్కుండా ఫోను మీ కందించేస్తే కంగారుపడ్డాను.' నమ్రతగా జవాబిచ్చింది రేఖ, కళ్ళు దించుకునే.

'మీ అన్నయ్యను వెంటేసుకు వచ్చారేం? సరోజ చెప్పలేదూ— ఇలాని ఎవ్వరితో చెప్పవద్దని' నిలదీశాడు రఘు.

'మా అన్నయ్యే మొదట ఫోనందుకుని నన్ను పిలిచాడు. మీరు మాట్లాడుతూంటే పక్కనే వున్నాడు మరి'—

అదిరిపడ్డాడు రఘు. 'అంటే మీ ఇంట్లో అందరికీ చెప్పారా నేనిలా ఫోను చేశానని?'

బుద్ధిమంతురాల్లా తలూపింది రేఖ అవునన్నట్టుగా. సరోజ నోట్లో రుమాలు కుక్కుకుని కాలాపహాడ్ మీది వెంకటేశ్వరస్వామి ఆలయం వేపు




ఒకకంటఅన్నయ్యా అవస్థను గమనిస్తూనే.

కాసేపాగి అంది రేఖ, 'మనింట్లో ఆడపిల్లను ఒంటరిగా ఇల్లు కదలనిస్తారా? ఎటు వెళ్తున్నానో, ఎప్పుడు వస్తానో ఖచ్చితంగా చెబితేగాని పర్మిషన్ దొరకదు'.

జుత్తు పీక్కోవాలనిపించింది రఘుకు తనకది మొదట తట్టినందుకు. మన దేశం ఇంత వెనకపడివుందేం అని తిట్టుకున్నాడు. బొమ్మలాటలా అమ్మాయినీ అబ్బాయినీ కూర్చోపెట్టి అంతా చుట్టూతా చేరి 'ఇక చూసుకోండి — నచ్చినట్టేనా' అంటారు కాని, పెళ్ళంటే ఇద్దరూ మన స్తత్వాన్నీ అభిరుచులనూ తెలుసుకుని మరీ ఒప్పుకోవాలనేనా అనిపించదు. మాట్లాడుకోవడం సంగతి దేముడెరుగు. తనకు సరిగా చూట్టం కూడా పడలేదు. పైగా తాను ఇనీషియేటివ్ తీసుకొని ఫోనుచేసి డేట్‌కోసం అడిగితే అమ్మాయిగారు 'మీరు మీ చెల్లాయిని తీసుకు రండి, నేను మా అన్నయ్యను వెంటే సుకువస్తా'—ఇదీ వరస. పైగా సరోజతోనే డేట్ అయినట్టుగా ఒహటే గలగల.

రఘు ఈ షాక్‌లోంచి తేరుకునేలోగా మళ్ళీ కబుర్లలో పడ్డారు రేఖా, సరోజా.

'మన లతహబ్బీకి ఈ మధ్యే ప్రమోషన్ వచ్చింది తెలుసా. కాని'...

'అవును. మొన్న సుమతీ వాళ్ళింట్లో చూశాను. బాగా లావెక్కిపోయింది కదూ...'

'...ఎందుకో వాళ్ళ ఇన్‌లాస్‌తో సరిగా పడదట. వాళ్ళ మదరిన్‌లా'...

ఇలా సాగిపోతూంది వాళ్ళ సంభాషణ. కాస్సేపు పళ్ళు నూరుకున్నాడు

రఘు చేసేదేంలేక. అసలు ఈ డేట్ తనకా సరోజకా కూడా అర్థం కాలేదు. ఇద్దరి మధ్యా తను ఒక్క ముక్కా మాటాడలేకపోతున్నాడు. మధ్యలో మంచినీళ్ళు తాగడానికని రేఖ కాస్సేపు మాట్లాడ్డం ఆపేస్తే సరోజను నెమ్మదిగా చేతిమీద గోకి మొదలెట్టాడు—

'మీరు స్టడీస్ కంటిన్యూ చేయాలను కుంటున్నారా?'

'తెలీదండీ - బహుశ చేయనేమో' సరోజవేపు చూస్తూ జవాబిచ్చింది రేఖ.

'సంగీతం వచ్చునా మీకు?'

'రాదండి.'

ఇంకేం మాట్లాడాలో తెలీలేదు రఘుకు. తనేమాత్రం ఆగినా మళ్ళీ ఇద్దరూ కబుర్లలో పడతారు. ఇక తన పని ఖాళీ.

'ఢిల్లీ చూశారా ఎప్పుడేనా?'

'మొన్న డిసెంబర్లో ట్రేడ్ ఫేర్ చూట్టాని కెళ్ళాం'.

'ఎలావుంది ఢిల్లీ మీకు?'

'చలి బాగా ఎక్కువ. ట్రేడ్ ఫేర్ బాగానే వుంది. ఢిల్లీ కూడా ఫరవాలేదు.

ముక్తసరిగా జవాబివ్వడం ఈ అమ్మాయి దగ్గిరే నేర్చుకోవాలి అను కున్నాడు రఘు.

ఇంతలో రేఖ గడియారంవేపు ఓ సారి చూసుకుని 'వెళ్ళాలి' అన్నట్టుగా తలాడించింది సరోజవేపు.

రామచంద్రా! అనుకున్నాడు రఘు.

'వాళ్ళన్నయ్య ఎనిమిదింటివరకల్లా రమ్మన్నాడట' సరోజ సమర్థింపు.

పోయిన గంటన్నరలో తాను మాట్లాడింది వెరసి నాలుగున్నర నిము షాలు. ఇదీ తన మొదటి డేటు— బహుశ చివరిది కూడా నేమో. కసిగా అనుకున్నాడు బిల్లు ప్లేట్లో వదులుతూ.

చీకట్లో టాక్సీ కోసం అరగంట సేపు తచ్చాడి, టాక్సీవాలా షరతు లన్నింటికీ తలఒగ్గి మొదట రేఖ వాళ్ళింటి అడ్రసు ఇచ్చాడు. ఇంటి ముందు టాక్సీ ఆగగానే ప్రతి కిటికీ లోంచీ ఒక్కో తలకాయ బయటకు చూస్తూ వుండటం గమనించి హడలి పోయాడు రఘు ఇంట్లోంచి గబ గబా వస్తూన్న రేఖ అన్నయ్యను గమనించి తారెత్తిపోయి, రేఖ కిందికి దిగగానే 'జల్దీ చలో' అని టాక్సీవాలాను ప్రార్థించి ఆమీద అత్యంత సమయ స్ఫూర్తితో 'చాలా థాంక్స్ రేఖా' అని ధన్యవాదాలు చెప్పుకున్నాడు. టాక్సీ వాలా కూడా ఉద్దండపిండం. కన్ను మూసి తెరిచేంతలో టాక్సీ కాచీగుడా చౌరస్తా చేరుకుంది. 'హమ్మయ్య' ఫ్రీగా వూపిరి పీల్చుకోగలిగాడు రఘు

'మనదేశంలో డేటింగు పనికిరాదు.' ఘాటుగా అనుకున్నాడు రఘు, రేఖ మెళ్ళో మూడు ముళ్ళు వేస్తూ.



## 1

## ప్రస్తావన

పూర్వం టర్కీదేశంలో అజాద్ బఖ్త్ అని ఒక గొప్పరాజు ఉండేవాడు.ఆయన రాజధాని ఇస్తాన్‌బుల్. ఆయన పాలనలో దేశం సుభిక్షంగా ఉండేది. ప్రజలు సంతుష్టులుగా ఉండేవారు. వారికి పగళ్ళు వినోదంలోనూ, రాత్రులువిశ్రాంతిలోనూ గడిచేవి. ఎక్కడా దొంగల భయం ఉండేదికాదు. అహోరాత్రాలు ఇళ్ళ వాకిళ్లు తెరిచేవుండేవి. వర్తకులూ, ప్రయాణీకులూ యథేచ్ఛగా బంగారం వెంట తీసుకుపోయేవారు.

ఆ రాజుకింద అనేకవేల నగరాలుండేవి. ఎందరో సామంతులు ఆయనకు కప్పం చెల్లించేవారు. ఆయన ఎంతో దైవభక్తి గలవాడు. ఆయనకు అన్ని సుఖాలూ ఉండేవి. కాని సంతానంమటుకు లేదు. అది మాత్రం ఆయనకు విచార కారణంగా ఉండేది. ఆయన దైవధ్యానం చేసిన అనంతరం ప్రతిసారీ "ఈశ్వరా, నామీద నీ అపార కరుణను ప్రసరింప జేసినవాడివి, నా ఇల్లు వెలగటాని కొక

చిన్న దీపాన్ని ఎందుకు ప్రసాదించావు కావు? నా పేరు ఎలా చిరస్థాయి అవుతుంది? వార్ధక్యంలో నాకు చేయూత ఎవరిస్తారు? నీవద్దలేనిది ఏదీలేదుగదా?నాకొక యోగ్యుడైన కుమారుణ్ణి ఇచ్చి, నా పేరుకూ, రాజ్యానికీ వారసులను ప్రసాదించు," అని వేడుకునేవాడు.

ఇలా సంతానంకోసం ఎదురుచూస్తూ ఉండగానే రాజుకు నలభై ఏళ్ళునిండాయి. ఒకనాడాయన తన అద్దాల గదిలో ప్రార్థన ముగించి, తావళా తిప్పుతూ ఉండగా, ఆయనకు ఒక అద్దంలో తన తలలో వెండితీగలాగా మెరిసిపోతున్న నెరసిన వెంట్రుక ఒకటి పొడగట్టింది.

ఆ తెల్ల వెంట్రుకను చూడగానే ఆయనకళ్లు చెమ్మగిల్లాయి. ఆయన తనలోతాను, "అయ్యో, నీ జీవితమంతా వ్యర్థంచేసుకున్నావు. ఐహిక సుఖాల కోసం ప్రపంచాన్ని తలకిందులు చేశావు. ఎన్నో దేశాలు జయించావు. నీకేమి ఒరిగింది? మరెవరో వంశంవాళ్లు నీ సంపదను అలాములూ, పలాములూ చేసేస్తారు. మృత్యువు నీకు హెచ్చరిక పంపింది. నువు మరి కొన్నిఏళ్లు జీవించినప్పటికీ, నీ శరీరదార్ఢ్యం తరిగిపోతుంది. నీ సింహాసనంమీద నీ పిల్లలు కూర్చోరన్నది స్పష్టం. ఏదో ఒకనాడు సమస్తమూ విడిచిపెట్టి మృత్యువువద్దకు పోయేతీరాలి. ఇప్పుడే సర్వసంగపరిత్యాగం చేసి మిగిలి ఉన్న ఆయుఃకాలాన్ని సృష్టికర్తను స్మరించుకోవటంలో గడపటం మేలు," అనుకున్నాడు.

ఇలా నిర్ణయించుకుని ఆయన తన తోటలోకి దిగివెళ్ళాడు. ఆయన తన దర్బారీయులెవరూ తనవద్దకు రాకూడదనీ వారు దివాణంలో కూర్చుని రాజకార్యాలు చూసుకుంటూ ఉండాలనీ

తరవాత చాలారోజులపాటు ఆయన తన అభ్యంతర గృహానికి వెళ్ళి, అక్కడ ప్రార్థనచేసుకునే తివాసీ పరుచుకుని, ప్రార్థనలుచేస్తూ, విలపిస్తూ, నిట్టూర్పులు పుచ్చుతూ చాలారోజులు ఉండిపోయాడు. ఆయన పగలంతా నిరాహారంగా ఉండి, సాయంకాలంవేళ ఒక కర్జూరం తిని, మూడుగ్లాసుల నీరు తాగేవాడు. పగలూ, రాత్రీ ప్రార్థనల తివాసీపైనే పడుకునేవాడు.

ఈ సంగతి ముందు ప్రజలకు తెలిసి క్రమంగా సామ్రాజ్యమంతటాపొక్కింది. రాజుగారు సన్యాసం పుచ్చుకున్నారు. అన్నివైపులా ఆయన శత్రువులూ,తిరుగుబాటుదార్లూ తలఎత్తి, రాజధిక్కారం సాగించారు. కోరినవాళ్ళు తమకు అందుబాటులో ఉన్న పరగణాలను స్వాధీనం చేసుకుని రాజద్రోహం చేశారు. రాజప్రతినిధుల శాసనాలు పరగణాలలో అమలుకావటం మానేశాయి. అరాజకం విజృంభించింది.

దివాణంలోని ఉద్యోగులందరూ సమావేశమై, కర్తవ్యం ఆలోచించారు. అందరికన్నా వజీరు గొప్పజ్ఞానీ, రాజుకు అత్యంత సన్నిహితుడూ, అందరికీ తలవంటివాడూ గనక, ఆయన అభిప్రాయం తెలుసుకోవటానికి అందరూ కలిసి వజీరు వద్దకు వెళ్ళారు. వెళ్ళి "పరిస్థితులను అరికట్టకపోతే, సామ్రాజ్యం ఛిన్నాభిన్నమవుతుంది. ఎంతో శ్రమపడి నిర్మించినది అతి సులువుగా కుప్పకూలిపోతుంది. దాన్ని పునర్నిర్మించటం మాటలుకాదు," అన్నారు.

వజీరు వయోవృద్ధుడూ, మహాజ్ఞాని కూడానూ. "రాజుగారు మనకు దర్శనం నిరాకరించారు. అయినా మనం వారి దర్శనం చేసుకుందాం. నేనుకూడా మీ వెంట వస్తాను", అన్నాడు.

ఆయన వారి నందరినీ కచేరీ సభలో ఉండమని, తాను రాజుగారి అభ్యంతర గృహం ప్రవేశించి, కొజ్జాలతో రాజుగారికి ఇలా కబురు పంపాడు. "ముసలి బానిసకు రాజుగారి దర్శనం చాలా కాలంగా లేక కళ్ళు కాయలు కాచాయి. ఏలినవారి పాదాలు కళ్ళకద్దుకుని మనశ్శాంతి పొందగోరుతున్నాడు."

ఈ విజ్ఞాపన అందినాక, తన వజీరు తనకు చేసిన చిరకాలసేవా, ప్రభుభక్తీ, విశ్వాసమూ, వివేకమూ ఎరిగినవాడై ఉండికూడా, కొంత సేపు సంకోచించిన మీదటనే ఆయనను లోపలికి ప్రవేశపెట్టమన్నాడు.

ఎలాగైతేనేం వజీరు రాజసమ్ముఖానికి వచ్చి, ఆయనకు ప్రణామంచేసి, చేతులు కట్టుకుని నిలబడ్డాడు. ఆయన కంటికి రాజుగారిరూపం పూర్తిగా మారిపోయినట్టు కనిపించింది. ఎడతెగని శోకంతో రాజుగారి కళ్ళు గుంటలు పడిపోయాయి. ఆయన ముఖం పాలిపోయి ఉన్నది. అది చూసి వజీరు ఆత్మనిగ్రహం కోల్పోయి, పరిగెత్తుకుంటూ వెళ్ళి రాజుగారి పాదాల మీద పడిపోయాడు.

రాజు వజీరుతలను తన చేతులతో పైకెత్తి, "నన్ను చూశావు, తృప్తికలిగింది కదః ఇకవెళ్ళిపో. నా ఏకాంతాన్ని భంగపరచక రాజ్యపాలన చెయ్యి,"అన్నాడు.

వజీరు పెద్దపెట్టున ఏడ్చి, "తమరు అనుగ్రహిస్తే ఈ దాసుడు రాజ్యపాలన చేయగలడు. కాని ఏలినవారు ఆకస్మికంగా సర్వసంగపరిత్యాగం చెయ్యడంతో సామ్రాజ్యమంతటా శైథిల్యం ఏర్పడింది. ఇది అశుభానికే దారితీస్తుంది. మీకు ఈ చింత అయినచో ఎందుకు కలిగినదీ తెలియజెప్పినట్టయితే, ఈ దాసుడు ఏం చెయ్యాలిసిందీ ఆలోచించే అవకాశం ఉంటుంది. తమరునాకుహోదా ఇచ్చినది ఇలాటి పరిస్థితులనుఎదుర్కొనటానికే కదః తమరు నిశ్చింతగా కాలం గడుపుతూ ఉంటే వీడు సామాన్యులను పరిష్కరిస్తాడు. ఈ సమస్య లన్నీ

ఏలికవారే ఎదురొక్కవలసి వస్తే ఇక మేమంతా దేనికి?" అన్నాడు.

రాజు ఇలా చెప్పాడు.

"నువు చెప్పినదంతా నిజమే. కాని నామనసును దహించే చింతకు చికిత్స లేదు. నా జీవితమంతా దేశాలనుజయించే కఠినకార్యంలోవ్యయపరిచి ఈ వయసుకు చేరుకున్నాను. ఇప్పుడు నా ముందు మృత్యువు తప్ప ఏమీలేదు. నా కా మృత్యువునుంచి సందేశంకూడా అందింది నా వెంట్రుకలు తెల్లబడిపోతున్నాయి. ఇంతవరకు నాకు ఒక్క కుమారుడైనా కలగలేదు. నా మనసుకు స్వస్థతచేకూర లేదు. ఆ కారణంచేత నా గృహం విచారంతో నిండిపోయింది. నేను సర్వసంగ పరిత్యాగం చేశాను. నా దేశాన్ని, సంపదనూ కోరినవాళ్ళు తీసుకోవచ్చు. వాటితో నాకు పనిలేదు. ఇంతేకాదు, ఏదో ఒకరోజున నేను అరణ్యాలకువెళ్ళి పోయి ఎవరికీ నా ముఖం చూపకుండా జీవితశేషం వెళ్ళబుచ్చుదా మనుకుంటు న్నాను. నాకు నచ్చినచోటు ఒకటిచూసు కుని, అక్కడ ప్రాయోపవేశంచేసి, భగవద్ధ్యానంలో ఉండిపోతాను. మరో లోకంలోనైనా భగవంతుడు నాకు ఆనందం చేకూర్చుతాడేమో. ఈ ప్రపంచాన్ని పూర్తిగాచూశాను. ఇందులో నాకు సౌఖ్యం కనిపించలేదు."

ఇలా చెప్పి రాజు పెద్దనిట్టూర్పువిడిచి మౌనం వహించాడు.

వజీరు ఈ మహారాజు తండ్రికాలం నుంచీ ఉన్నవాడు. మహారాజు చిన్న వాడుగా ఉన్నప్పుడు ఎత్తుకుని ఆడిం చాడు. అంతేగాక గొప్ప జ్ఞానీ, కార్య దీక్షాతత్పరుడూనూ. ఆయన రాజుతో ఇలా అన్నాడు.

"భగవంతుడి దయపట్ల నిరాశ చెందటం చాలా పొరపాటు. ఒక్క చిటికెలో పద్దెనిమిదివేల జాతుల ప్రాణు లను సృష్టించినవాడికి తమకు పిల్లల నివ్వటం ఒక లెక్కలోనిది కాదు మహా రాజా, మీరే అపోహలను మనసునుంచి పారదోలండి. లేని పక్షంలో ప్రజలు సంక్షోభానికి గురఅవుతారు. మీరూ, మీ పూర్వులూ ఎంతో శ్రమపడి నిర్మించిన ఈ సామ్రాజ్యం క్షణంలో విచ్ఛిన్న మవుతుంది. ఆ నింద మీ మీద పడు తుంది. అంతేగాక, కడపటి దినం ఈశ్వరుడు తమరిని నిందిస్తాడు. 'నేను నిన్ను రాజునుచేసి, నా ప్రాణులను నీ సంరక్షణలో పెట్టాను. నా కారుణ్యంలో విశ్వాసంలేక నువు నీ బాధ్యతనుత్యజించి నీ ప్రజలను గాలికి వదిలేశావు.' దీనికి తమరు ఏం సమాధానం చెప్పుకుంటారు. అప్పుడు తమదైవభక్తీ, ప్రార్థనలూ అక్కరకురావుగదా! దేవుడిముందు తమ ప్రవర్తనమాత్రమే విచారణకు వస్తుంది. నేను తమరిని తప్పు పట్టుతున్నానని ఆగ్రహించకండి. అడవులలో సంచరిస్తూ ఇల్లూ వాకిలీ లేకుండా జీవించేవారు




మునులూ, సన్యాసులూ మాత్రమేగాని, రాజులుకారు. తమరు తమహోదాకు తగినట్టు మసులుకోవాలి. ఈశ్వరుణ్ణిస్మరించి ధ్యానించటానికి అడవులే అవసరంలేదు.

"'నీ వెంటనే ఉన్న భగవంతుడికోసం అరణ్యంలో వెతుకుతావెందుకు?' అన్న సూక్తి తమరు వినే ఉంటారు. తమరు నా సలహా పాటించి, అనుక్షణమూ భగవంతుడిపైన మనస్సుఉంచి, రోజూ ఆయనను ధ్యానించండి. పగలంతా రాచకార్యాలుచూసి, పేదలకూఅనాథలకూ న్యాయం చెయ్యండి. తమ నీడన భగవంతుడి బిడ్డలకు సుఖశాంతులు కలిగించండి. రాత్రివేళ దైవధ్యానంచేసి, పైగంబర్ ఆశీస్సులుకోరి, ఐహిక వాంఛలకూ భయాలకూ అతీతులైన ఫకీర్ల సహకారం పొందండి అనాథ శిశువులకూ ఖైదీలకూ, సంతానం అధికంగా గలవారికీ, దిక్కులేని వితంతువులకూ రోజూ అన్నదానం చెయ్యండి. ఇలాటి పుణ్యకార్యాలతో భగవంతుడు సంతృప్తి చెందితే, తమ ప్రగాఢవాంఛ ఈడేరవచ్చు. ఇందువల్ల ఏలినవారికి మానసికమైన ఆనందమూ, ఆత్మశాంతికూడా లభించగలవు. భగవంతుడి అనుగ్రహంకోసం ఎదురు చూడండి. అది ఆయన తలచుకొంటే లభించటానికి క్షణంపట్టదు."

పకీరు బోధలు రాజుతలకు బాగా ఎక్కాయి. ఆయనకు ఆ మాటలు విని పూర్తిధైర్యం వచ్చింది.

"సరే, నువుచెప్పినట్టేచేసి, కర్తవ్యం భగవంతుడికే వదులుదాం" అన్నాడాయన.

"రాజోద్యోగు లందరూ ఏలినవారి కోసం ప్రార్థనలు చేస్తున్నారు. తమ దీన స్థితిని గురించి వారికి మతులుపోయి,

నిరాశ అలుముకొన్నది. తమ ముఖార విందం ఒక్కసారి చూసినట్టయితే వారికి మనశ్శాంతి కలుగుతుంది. వారందరూ ఆపతల వేచిఉన్నారు," అని వజీరు రాజుతో చెప్పాడు.

"రేపు సభచేస్తాను. అందరినీ రమ్మను,'' అన్నాడు రాజు.

వజీరు ఈ మాటకు పరమానంద భరితుడై, చేయెత్తి రాజును ఆశీర్వదిస్తూ, "తమ సింహాసనమూ, కిరీటమూ ఆచంద్రతారార్కం ఉండాలి"అన్నాడు.

ఆయన రాజువద్ద సెలవుపుచ్చుకుని, దర్బారీయులకు ఈ శుభవార్త తెలిపాడు. తేలికపడిన మనస్సులతో అందరూ తమ ఇళ్లకు వెళ్లిపోయారు. మర్నాడు రాజుగారు సభచేస్తున్న వార్త విని నగర మంతా ఉత్సాహంచెందింది.

మర్నాడు ఉదయం రాజోద్యోగు లందరూ, అమీర్లు మొదలుకుని సేవ కుల దాకా ప్రతిఒక్కరూ. సభకువచ్చి, తమ తమ స్థానాలలో నిలబడి రాజుగారి దర్శనంకోసం చూడసాగారు. మొదటి జాము ముగిసేసరికల్లా సింహాసనం వెనకఉన్న తెర పైకి లేచింది. రాజుగారు వచ్చి సింహాసనంమీద కూర్చున్నాడు. నౌబత్ఖానానుంచి మంగళవాద్యాలు వినవచ్చాయి. సభికులందరూ, రాజుకు ప్రణామములుచేసి, నజర్లు అర్పించుకుని, రాజుగారినుంచి తమతమ హోదాలకు అనుగుణంగా బహుమతులు పొందారు. వారి మనస్సులు ఆనందంతో నిండి పోయాయి

మిట్టమధ్యాహ్నం కాగానే రాజు లేచి తన భవనానికి వెళ్ళిపోయి, భోజనంచేసి విశ్రాంతి తీసుకున్నాడు. ఇదే విధంగా ప్రతి ఉదయం సభచేసి, అపరాహ్ణాలు ప్రార్థనలోనూ. పఠనంలోనూ గడప నిశ్చయించుకున్నాడు రాజు.

"ఏ విధంగానూ ఉపశమనరికాని మనఃక్లేశాలు గలవాడు, వాటిని విధికి వదిలేసి, చచ్చిపోయినవారి సమాధులను సందర్శించి, వారి ఆత్మశాంతికోసం భగవంతుణ్ణి ప్రార్థించాలి. అందుకుగాను పైగంబర్ సహాయం అర్థించాలి: తనను తాను పరమాణువుకన్న అల్పుడుగా భావించి, మానవ మూర్ఖత్వాన్ని విస్మ రించి, సృష్టిలోని మాయనుగూర్చి విల పించి, ఈశ్వరశక్తిని చూసి దిగ్భ్రమ చెందాలి. నాకు పూర్వం ఎంతటి మహా చక్రవర్తులూ, మహాసంపన్నులూ పుట్ట లేదు? కాలచక్రం వారిని మట్టిలో కలప లేదా? కబీరు విసురుతున్న తిరగలిని చూసి శోకిస్తూ, 'అయ్యో, ఆ రెండురాళ్ల పీడన నుంచి తప్పించుకున్నవారు లేరు గదు!' అని యధార్థం అన్నాడట. వెన కటి మహామహుల తాలూకు గుప్పెడు బూడిద తప్ప ఏమీ మిగలలేదు. వారు తమ ఆస్తులనూ, సర్వస్వాన్నీ, పిల్ల లనూ, మిత్రులనూ, సేవకులనూ, గుర్రా లనూ, ఏనుగులనూ వదిలేసి ఏకాంతంగా

శయనించారు. ఈ ఐహిక ప్రయోజనాలేవీ వారికి అక్కరకు రాలేదు. వారి పేర్లుకూడా ఎవరికీ తెలియవు. వారెవరో, సమాధిలో వారు ఏ స్థితిలో ఉన్నారో కూడా తెలియదు. వారిని ఏ క్రిములూ, కీటకాలూ, చీమలూ, పాములూ తిన్నాయో ఈశ్వరుడితో వారు తమ లావాదేవీలు ఎలా పరిష్కరించుకున్నారో తెలియరాదు. ఈ విధంగా ఆలోచించుకున్నవాడు, ప్రపంచాన్ని ఒక ప్రహసనంగా చూడాలి. అప్పుడు అతని హృదయం వికసించి, ఎన్నటికీ వాడిపోకుండా ఉంటుంది.

ఈ వాక్యాలను రాజు ఒకనాడు ఏదో గ్రంథంలో చదివి, వజీరు చెప్పిన సలహా కూడా ఇదే ధోరణిలో ఉండటం గ్రహించాడు. దీనిని అమలుచెయ్యాలని ఆయనకు అనిపించింది. గుర్రాన్ని ఆరోహించి, పరివారాన్ని వెంటబెట్టుకుని రాజసంగా వెళ్లటం భావ్యం కాదు; అందుచేత ఆయన తన దుస్తులు మార్చుకుని, రాత్రివేళ సమాధులను చూడటానికో, లేదా ఏ ఫకీరును చూడటానికో వెళ్లి, తెల్లవార్లూ జాగరం ఉండనిశ్చయించాడు.

ఈ నిశ్చయానికి వచ్చి రాజు ఒక రాత్రి ముతకబట్టలు ధరించి, కొంత డబ్బు వెంటతీసుకుని, ఎవరికీ తెలియకుండా కోటనుంచి వెలువడి, మైదానాల మీదుగా నడుచుకుంటూ సమాధులుండే స్థలాన్ని చేరుకుని, చిత్తశుద్ధితో ధ్యానం చేస్తూ ఉండగా, తీవ్రమైన తుఫానుగాలి వీచసాగింది.

అకస్మాత్తుగా ఆయనకు దూరంలో ఒక జ్వాల వేగుచుక్కలాగా ప్రకాశిస్తూ కనబడింది. దాన్ని చూసి ఆయన, ఈ గాలిలో, ఈ చీకటిలో ఆ జ్వాల ప్రకాశిస్తున్నదంటే దానికేదో కారణం ఉండాలి. అది ఏ పుణ్యాత్ముడో వెలిగించినది కావచ్చు. ఏమైనా నేను వెళ్లి, దాని సంగతి తెలుసుకోవాలి. ఈ దీపం నా యింట దీపాన్ని వెలిగించవచ్చు," అనుకున్నాడు.

రాజు ఆ దీపాన్ని సమీపిస్తూ దాని సమీపంలో నలుగురు ఫకీర్లను చూశాడు. వాళ్ళు బైరాగి తొడుగులు ధరించి, మోకాళ్ళమీద తలలు వాల్చుకుని, మౌనంగా పరధ్యానంలో ఉన్నారు. వారిని చూస్తూంటే, దేశభ్రష్టులూ, జాతిభ్రష్టులూ, స్నేహితులులేని ఒంటరిగాళ్లూ విచారసాగరంలో పూర్తిగా మునిగిపోయి, ఆశాలేశంలేక, ఏమిచేయాలో తెలియకుండా పోయినవాళ్లూ స్ఫురించారు.

నలుగురుఫకీర్లూ ఒకే భంగిమలో, శిలాప్రతిమల్లాగా కూర్చునిఉన్నారు వారి ముందు ఒక రాతిమీద దీపం బాగా ప్రకాశిస్తూ వెలుగుతున్నది. ఎవరో దానికి అడ్డుపెట్టినట్టుగా గాలి ఆ దీపాన్ని సోకటంలేదు. దానికి ఆరిపోయే ప్రమాదం ఏమీలేదు.

ఈ దృశ్యం చూడగానే రాజుకు, వాళ్ళు మహాత్ములనీ, వారి దయవల్ల తన కోరిక సిద్ధిస్తుందనీ నమ్మకం కుదిరి మోడుపడిపోయిన ఆయన హృదయం చిగురించింది. వాళ్ళమధ్యకు వెళ్ళి, వారితో చేరిపోయి, వారికి తన కథ చెబితే, వాళ్ళు తనపై జాలిదలిచి, తమ ప్రార్థనలద్వారా భగవంతుడి కృప తనపై ప్రసరించేటట్టు చేయవచ్చు.

ఈ ఆశతో ఆయన ముందుకు పోబోయేసరికి ఆయన అంతరాత్మ ఇలా హెచ్చరించింది :

"మూఢుడా, తొందరపడకు! కొంచెం నిదానించు! వారు ఎవరో, ఎక్కడి నుంచి వచ్చారో, ఎక్కడికి పోతున్నారో నీకేంతెలుసు ? వాళ్ళు మనిషిరూపంలో కలిసి కూర్చునిఉన్న భూతాలో, అడవి పిశాచాలో, నీకేమైనా తెలుసునా? ఎలా చూసినా తొందరపడి వారి మధ్యకు పోవటమూ, వారి ఏకాంతాన్ని భగ్నం చెయ్యటమూ అనుచితం! ప్రస్తుతానికి ఒకమూల దాగిఉండి, ఈ ఫకీర్ల చరిత్ర తెలుసుకో !''

చివరకు రాజు అలాగే చేశాడు. ఆయన నిశ్శబ్దంగా వారిని సమీపించి, ఒకమూల దాక్కున్నాడు. ఫకీర్లు రాజు రాక ఎరగరు. వాళ్ళు తలఎత్తి ఆయనను చూడలేదు. వాళ్ళు ఏంమాట్లాడుకుంటారో వినాలని రాజు పొంచిఉన్నాడు.

ఉన్నట్లుండి ఫకీర్లలో ఒకడు తుమ్మి, "ఖుదా హాఫిజ్ !"(దేవుడు రక్షించాలి) అన్నాడు. ఈ చప్పుడుకు మిగిలిన ఫకీర్లు మేలుకుని, దీపం వత్తి సరిచేశారు. వారందరూ తమతమ చదరలమీద కూర్చుని, తమ హుక్కాలు అంటించి, పీల్చసాగారు.

వారిలో ఒకడు ఇలా అన్నాడు :

''బాధలో సహచరులై, ప్రపంచ యాత్ర చేస్తున్న మిత్రులారా, మనం నలుగురమూ కాలచక్రం తిప్పగా ఎన్నో దేశాలు తిరిగి, దైవికంగా ఇవాళ ఇక్కడ కలుసుకున్నాం. రేపు ఏం జరుగుతుందో మనం కలిసేఉంటామో, విడిపోతామో తెలియదు. రాత్రి భారమైనది. పెందలాడే నిద్రపోవటం అనుచితం. అంతకన్న మనం మన మన అనుభవాలు ఉన్నవి ఉన్నట్టుగా ఒకరికొకరం చెప్పుకోవటం మేలు. రాత్రి కబుర్లలో గడిచిపోతుంది. శేషం ఏమైనా మిగిలిఉంటే మనం విశ్రాంతి తీసుకోవచ్చు."

''పెద్దాయనా, నువు ఆజ్ఞాపించినట్టే చేద్దాం. ముందు నీ కథ ఏమిటో, నువు ఎవరెవరిని చూశావో చెప్పు. మేం విని బాగుపడతాం,'' అన్నారు మిగిలినఫకీర్లు.

## 2

### మొదటి ఫకీరు కథ

మొదటి ఫకీరు తలఎత్తి, విశ్రాంతిగా కూర్చుని తన అనుభవాలు ఇలా చెప్పనారంభించాడు.



నేను నాకు, సంప్రాప్తమైన కష్టాలు వివరిస్తాను, వినండి.

"మిత్రులారా, నా జన్మస్థానం సుఖప్రదమైన అరేబియా. మా పూర్వీకులంత కూడా ఆ దేశమే. ఈ భ్రష్టుడి తండ్రి వర్తకులకు ప్రముఖుడు. ఆయనపేరు ఖోజా అహ్మద్. ఆయన మహాధనికుడు. ఆయనకాలంలో ఆయనకన్న ధనికుడైన వర్తకుడుగాని, షరాబుగాని లేడు. అనేక నగరాలలో ఆయనకు వర్తకకేంద్రాలుండేవి; ఆయన మనుషులుండి సమస్తమైన విక్రయవస్తువులూ కొని అమ్ముతుండేవారు. ఆయన గిడ్డంగులలో అన్ని దేశాల సరుకులూ ఉండేవి. ఆయన ఖజానాలో వేలకొద్దీ వెండి, బంగారం నగలుండేవి

ఆయనకు ఇద్దరు బిడ్డలు. ఒకడు ఈ దేశ యాత్రికుడైన ఫకీరు. రెండవది ఆడపిల్ల. మా తండ్రి ఆమెను తాను బతికిఉండగానే మరొక నగరానికి చెందిన వర్తకుడి కుమారుడి కిచ్చి వివాహం చేశాడు. ఆమె అత్తవారింట ఉంటూ వచ్చింది.

అంతులేని సంపదఉండి, ఒకే కొడుకు గల తండ్రి చూపే గారాబానికి పరిమితి ఏముంటుందిగనక ! ఈ దేశదిమ్మరి తల్లిదండ్రుల నీడన ఎంతో గారాబంగా పెరిగాడు. నేను చదవటమూ, రాయటమూ, సైనికవిద్యలూ నేర్చుకున్నాను. అలాగే వ్యాపార రహస్యాలు కూడా నేర్చుకున్నాను. నేను పధ్నాలుగేళ్ళదాకా

సిరిసౌఖ్యాలలో ఓలలాడుతూ, ప్రాపం చిక బాధల పొడ ఎరగకుండా పెరిగాను.

ఆకస్మికంగా, దైవనిర్ణయంప్రకారం నా తల్లిదండ్రులిద్దరూ ఒకేసారి పోయారు. నేను పొందిన మనోవేదన వర్ణనాతీతం. ఉన్నట్టుండి నేను అనాథనైపోయాను. నన్ను కనిపెట్టిఉండే కుటుంబపెద్ద ఎవరూ లేరు. పిడుగుపాటుగా వచ్చిన ఈ కష్టంతో నేను అహోరాత్రాలు ఏడ్చాను. ఇలా నలభై రోజులు గడిచాయి. నలభయ్యోరోజున, నా తల్లిదండ్రులకు ఉత్తర క్రియలు జరపటానికి మా బంధు మిత్రగతాల వారందరూ వచ్చారు. నేను చనిపోయినవారికోసం ప్రార్థనలు చేసిన అనంతరం వాళ్లు నా నెత్తికి నా తండ్రి పాగాచుట్టి, నాకు బోధించవలసిన నీతు లన్నీ బోధించి, అందరి తల్లిదండ్రులూ పొయ్యేవాళ్ళేననీ, నేనూ ఒకనాడు ఆ దారినే వెళ్ళాలనీ చెప్పి, "నీ ఆస్తి కంతకూ ఇక నువే యజమానివి. నీ తండ్రి స్థానంలోకి నువు వచ్చావు. వ్యాపారవ్యవహారాలలో జాగ్రత్త, మెళ కువ కలిగి మసులుకో!" అని హెచ్చ రించారు. వాళ్ళు నన్ను ఈ విధంగా ఓదార్చి వెళ్ళిపోయారు.

"నా తండ్రికింద పనిచేసినవారంతా వచ్చి నన్ను చూశారు. వాళ్ళు నాకు నజర్లు సమర్పించి, ఖజానాలలోని, నగదూ, గిడ్డంగులలోని సరుకూ స్వయంగా చూసుకోమన్నారు. నేనుఖజానా లోని సంపద అంతా కళ్ళారా చూసే సరికి నా మనసు విస్తరించి, నా భావా లన్నీ మారిపోయాయి. దివాన్‌ఖానా (చూడవచ్చే పురుషులను కూర్చోబెట్టే చోటు) అమర్చమని ఉత్తరు విచ్చాను. నౌకర్లు తివాసీలు పరిచి, పరదాలు కట్టి దివాన్‌ఖానా అమర్చారు. నేను అంద మైన నౌకర్లను పనిలో పెట్టుకుని వారి చేత విలువగల దుస్తులు ధరింపజేశాను.

"ఈ బైరాగివాడు తన ఐశ్వర్యాన్ని స్వాధీనంచేసుకుని, తండ్రి ఖాళీచేసిన కుర్చీలో కూర్చున్నదే తడవుగా పరాన్న భుక్కులూ, ఇచ్చకాలవాళ్లూ, టక్కుల మారివాళ్ళూ నా చుట్టూ మూగారు. వాళ్లే నాకు అభిమానులూ, మిత్రులూ అయారు. అస్తమానం వాళ్లను నా వెంట ఉంచుకునేవాణ్ణి. ఎక్కడెక్కడి ఊసులు, అబద్ధాలు చెప్పి వాళ్ళు నన్ను రంజింపజేసేవారు. మంచి యౌవనంలో ఉన్న నేను మేలురకం సారాలు సేక రించాలనీ, నాతోపాటు తాగటానికి అందమైన ఆడవాళ్లను ఆహ్వానించాలనీ, వివిధ భోగాలలో ఓలలాడాలనీ వాళ్ళు నన్ను ఒత్తిడిచేశారు. నాలో ఉన్న పాప స్వభావం విజృంభించింది. నేను వారి దుర్బోధలు విని అస్తమానమూ తాగుడూ, నృత్యమూ, సంగీతమూ, జూదమూ గురించే ఆలోచించసాగాను. రాను రాను నేను వర్తకాన్ని, నా సొంత వ్యవహారాలనూ పూర్తిగా వదిలివేసి, నేను

స్త్రీలలోనూ, ద ర్వ్య య ం లో నూ చిక్కుకుపోయాను. నా నౌకర్లూ, దుస్స హవాసులూ నా అజ్ఞానాన్ని గుర్తించి నా సొత్తంతా కొల్లగొట్ట నారంభించారు. నేను చేసే ఖర్చుకు ఎటునుంచి వచ్చినదీ ఎటు పోయినదీ లెక్కలేదు. ఇతరుల ఆస్తిపట్ల ఎవరికీ దయాదాక్షిణ్యా లుండవు. నావద్దనేక నిధులు ఉండినా నా ధారాళమైన ఖర్చుకు చాలి వుండేవికావు. కొద్ది సంవత్సరాల కాలంలో నాకుండినవారంతా పోయి, నెత్తికి గుడ్డకుళాయీ, నడుముకు ఒక పీలికా మిగిలాయి. నా కోసం తమ రక్తం ధారపోస్తామని ప్రమాణాలు చేసిన మిత్రు లందరూ మాయమయ్యారు. వీధిలో వాళ్ళు నాకు తటస్థపడినప్పటికీ ముఖాలు తప్పించారు. నా నౌకర్లందరూ నన్ను విడిచి వెళ్ళిపోయారు. నా దుస్థితికి సానుభూతి తెలిపేటందుకైనా ఒక్కడు కూడా మిగలలేదు. చింతా పశ్చాత్తా పమూ మాత్రమే నాకు తోడుగా ఉండి పోయాయి. నేను తాగే నీటికి రుచి కలి గించటానికి నలుసంత ఆహారం కూడా లేకుండా పోయింది. రెండు మూడు కటిక ఉపవాసాల అనంతరం ఆకలి బాధ భరించటం నాకు అసాధ్య మయింది.

గత్యంతరంలేని కారణంచేత, నేను ముఖానికి మునుగువేసుకుని మా చెల్లెలు ఇంటికి పోదామనుకున్నాను. కాని నాకే సిగ్గయింది. ఎందుకంటే, నా తండ్రి పోయిన అనంతరం నేను నా చెల్లెలితో ఎలాటి బాంధవ్యమూ నెరపలేదు, కనీసం ఉత్తరం ముక్కఅయినా రాయలేదు. నన్ను ఓదార్చుతూ ఆమె ప్రేమపూర్వ కంగా రెండుమూడుసార్లు రాసిందిగాని ఐశ్వర్యమదంలో నేను ఆమెకు సమాధా నాలు రాయలేదు. నా అసభ్యప్రవర్తనకు నాకే సిగ్గువేసి నాకు ఆమెను చూడబుద్ధి కాలేదు. కాని నాకు తలదాచుకునే టందుకు మరే ఇల్లూ లేదు. జేబులో చిల్లి గవ్వలేకుండా, కాలినడకన మా చెల్లె లుండే నగరంచేరి, వాళ్ల ఇంటికి వెళ్లాను.

నేను బికారినైపోవటం చూసి నా చెల్లెలు నన్నుకావిలించుకుని, బావురుమని ఏడ్చింది. నేను క్షేమంగా చేరినందుకు ఆమె పేదలకు ఏవేవో దానాలు ఆనవా యితీప్రకారం చేసి "అన్నా, నిన్ను చూసి ఆనందంగానే ఉన్నది గాని, ఇంత ఘోరస్థితికి ఎలా దిగజారావు?" అని నాతో అన్నది. నేనేం చెప్పను? గుడ్ల నీరు కుక్కుకుని మౌనంగా ఉండి పోయాను.

నా చెల్లెలు ప్రేమగా నన్ను స్నానా నికి పంపి, నాకు అందమైన దుస్తులు కట్టబెట్టింది. నాకు తన గదిపక్కనే చక్కనిగది ఏర్పాటుచేసింది. పొద్దున షర్బతూ, పానకమూ, మిఠాయితిన్నాను మధ్యాహ్నం పళ్ల పెరుగులూ, తాజాపళ్లూ తిన్నాను. సాయంకాలం పలావూ,

కబాబులూ, కమ్మని రొట్టె తిన్నాను. నా చెల్లెలు నా భోజనం పూర్తిఅయిన దాకా ఉండి, తరవాత తనగదికి వెళ్ళిపోయింది అన్నివిధాలా ఆమె నా పట్ల శ్రద్ధవహించి, కల్లోలితమైన నా మనసుకు సుఖం కలిగించింది. ఈపాటి శాంతి లభించినందుకు నేను దేవుడికి ధన్యవాదాలు చెప్పుకున్నాను. ఈ ప్రశాంతిలో నాకు ఎన్నో మాసాలు గడిచి పోయాయి. నేను నా గదిదాటి బయటికి వెళ్లవలసిన అవసరంలేదు.

నన్ను తల్లిలాగా చూసుకుంటూ వచ్చిన నాచెల్లెలు ఒకనాడు నాతో ఇలా అన్నది.

"అన్నా, నువు నాకు కన్నులపండగ లాటివాడివి. మన తల్లిదండ్రులకు ప్రతి రూపానివి. నీ రాకవల్ల నా హృదయం నిండిపోయింది. నిన్ను చూసినప్పుడల్లా నాకు అంతులేని ఆనందం కలుగుతుంది. నాకు నువు ఎంతో ఆనందం చేకూర్చావు. కాని భగవంతుడు పురుషులను సృష్టించినది పనిచెయ్యటానికి—సోమరిగా కూర్చోటానికి కాదు. ఇల్లు కదలకుండా కూర్చున్నవాణ్ణి లోకం ఆడిపోసుకుంటుంది. ముఖ్యంగా ఈ నగరంవాళ్ళు, చిన్నా పెద్దా అందరూ, నువు నా దగ్గర ఊరికే ఉండటంచూసి, 'ఈ మనిషి తన కున్నదంతా తగలేసుకుని, బావమరిది పడేసే ఎంగిలిమెతుకులు తిని బతుకుతున్నాడు,' అంటారు. నేను మానాభిమానాలు లేనట్టు కనబడటం మనకు అవమానకారణం అవుతుంది. మన తల్లిదండ్రుల ప్రతిష్ఠకు భంగకరంకూడాను. లేనిపక్షంలో నిన్ను నా గుండెల్లో దాచుకుని నా చర్మంతో నీకు చెప్పులు కుట్టింతును! ఇప్పుడు నీకు నా సలహా ఏమిటంటే, నువు దేశాటన చెయ్యి. దేవుడి దయవల్ల నీకిప్పుడున్న దుర్దశా, దారిద్ర్యమూ తొలగిపోయి, సుఖమూ, సంతోషమూ కలగవచ్చు."

ఈ మాటలు నాకు సిగ్గుతెచ్చేవిగా ఉన్నప్పటికీ, ఆమె ఇచ్చిన సలహా నాకు నచ్చింది. నే నామెతో "మంచిది. ఇప్పుడు నువ్వే నాకు మాతృస్థానం. నువు ఏం చెయ్యమంటే అది చేస్తాను,'' అన్నాను.

నా చెల్లెలు నా నిశ్చయం తెలుసుకుని ఇంట్లోకివెళ్ళి, తన ఆడబానిసలచేత మోయించి యాభైసంచుల బంగారం తెచ్చి నా ముందుంచి, ''సార్థనాంకులు దమాస్కస్ బయలుదేరబోతున్నారు. ఈ డబ్బుతో సరుకునుకొని, నమ్మకస్థుడైన వర్తకుడిపరంచేసి రసీదుపుచ్చుకో. నువుకూడా దమాస్కస్ వెళ్ళు. అక్కడికి క్షేమంగాచేరి వర్తకుడినుంచి నీ సరుకులు అమ్మగా వచ్చిన డబ్బు పుచ్చుకో. అందులో నీకు లాభం వస్తుంది లేదా, నీ సరుకును నువే లాభసాటిగా అమ్ముకో" అన్నది.

నేనాడబ్బు తీసుకుని, పెద్దబజారుకు వెళ్ళి, దమాస్కసులో మంచి ధరపలికే



సరుకులు కొన్నాను. తరవాత నేనా సరుకులను ఒక వర్తకశ్రేష్ఠుడి పరంచేసి, వాటికి రసీదు పుచ్చుకున్నాను. ఆ వర్తకుడు ఒక నౌకమీద సముద్రమార్గాన డమాస్కస్‌కు బయలుదేరి వెళ్ళాడు. నేను భూమార్గాన వెళ్ళ నిశ్చయించాను. నేను నా చెల్లెలివద్ద సెలవుపుచ్చుకునేటప్పుడు ఆమె నాకు విలువైన దుస్తులూ, రత్నఖచితమైన జీనుతోసహా ఒక దివ్యమైన గుర్రమూ ఇచ్చింది. ఆమె మిఠాయి సరుకుగల తోలుసంచీ, నీటికూజా గుర్రానికి తగిలించింది; శుభం కలగటానికి నా ముఖానికి ఒక వెండిరూపాయి అతికించి, "ఇక కదులు. నిన్ను భగవంతుడి రక్షణ కింద పంపుతున్నాను. వెళ్ళేటప్పుడు నీవు చూపించేవాడివి. క్షేమంగా తిరిగి నీ ముఖం చూపించు," అన్నది.

నేనుకూడా వీడ్కోలు చెప్పి, "నీ శుభాకాంక్షలను సంతోషంగా స్వీకరిస్తున్నాను. దేవుడు నిన్నుకూడా కాపాడాలి," అన్నాను.

నేను బయటికి వచ్చి, గుర్రంఎక్కి భగవంతుడే నాకు రక్ష అనుకుని, ముందుకు కదిలాను. నేను మజిలీవిడిచి మజిలీలో ఆగుతూ, త్వరలోనే డమాస్కస్ శివార్లు చేరుకున్నాను. నేను నగర ద్వారం చేరేసరికి చాలా పొద్దుపోయి ఉండటంవల్ల కాపలావాళ్ళు తలుపులు మూసేశారు.

"దయచేసి తలుపులు తెరవండి.



నాకూ నా గుర్రానికీ కూడా తిండి అవస రంగా కావాలి," అని నేను వాళ్ళను బతిమాలాను.

"ఇంత పొద్దుపోయి తలుపులు తెరవ టానికి అనుమతి లేదు. ముందుగా రాలేక పోయావా?" అని కాపలావాళ్ళు తలు పుల అవతలినుంచి కటువుగా అన్నారు

ఈ సమాధానం విన్నాక నేను నగర ప్రాకారపు గోడకింద బట్టలుపరిచి కూర్చు న్నాను. కాని నిద్రపోకుండా ఉండగలం దులకు మధ్య మధ్య లేచి, ఫచార్లు చెయ్యవలిసివచ్చింది.

అర్ధరాత్రి అయింది. అంతటా నిశ్శ బ్దంగా ఉంది. ప్రాకారం పైనుంచి ఒక పెద్ద పెట్టె కిందికి దిగుతూఉండటం నా కంట పడింది. వెన్నెలలో ఈ దృశ్యం చూసి నేను, దేవుడు నాపై జాలితలచి నాకోసం నిధి పంపాడుకాబోలునని ఆశ



పడ్డాను. ఆ పెట్టె నేలను తాకగానే, నేను భయంభయంగా దానిని సమీపించాను. అది కొయ్యపెట్టె. దురాశకొద్దీ నేను దాని మూత తెరిచాను. లోపల ఒక స్త్రీ ఉన్నది. ఆమె అందంచూస్తే మతిపోయేలాగున్నది. అయితే ఆమె గాయపడి, తన రక్తంలోనే తడిసి ముద్దఅయి, కళ్లు మూసుకుని, దుర్భరమైన బాధ అనుభవిస్తున్నది. ఆ దృశ్యం చూడగానే నా గుండె అవిసి పోయింది.

ఆమె పెదవులు విప్పి ఇలా అన్నది.

"ఎంత ద్రోహం! ఎంత క్రూరం! నేను చూపిన అపేక్షకూ, దయకూ ఇదా ప్రతిఫలం? ఇంకొకపోటు పొడిచి నీ పని పూర్తిచేసుకో. న్యాయాన్యాయాలు దేవుడే చూస్తాడు."

ఇలా అని ఆమె స్పృహలేనిస్థితిలో కూడా ఆమె తన పైబట్టకొంగు ముఖం మీదికి లాక్కున్నది ఆమెకేసి చూస్తూ

ఆమె అన్నమాటలు వినేసరికి నాకు ఒళ్లు వేడెక్కిపోయింది. ఇంత అందమైన స్త్రీని పొడిచినవాడు ఎలాటి రాక్షసుడై ఉండాలి! ఏ భూతంఆవహించి వాడిచేత ఈ పని చేయించిఉంటుంది? వాణ్ణి ఆమె ఇంకా ప్రేమిస్తూనే ఉన్నది: చావబోతూ కూడా వాణ్ణే కలవరిస్తున్నది!

నేనీమాటలు గొణగటం ఆమెకు వినపడినట్టుంది. ఆమె తన ముఖంమీది ముసుగు తొలగించి, నాకేసి చూసింది. మా చూపులు కలిశాయి. నేను మూర్ఛపోయినంత పనిచేశాను. నా గుండెలలో ఆరాటం కలిగింది. అతి కష్టంమీద, వణుకుతున్న మోకాళ్లపై కూర్చుని, లేని సాహసం తెచ్చుకుని, "నిజంచెప్పు. నువు ఎవరు? ఈ ఘోరం ఎలా జరిగింది? వివరంగా చెప్పి నా ఆరాటం పోగొట్టు," అన్నాను.

నేనిలా అనేసరికి, మాట్లాడే త్రాణ లేకపోయినాకూడా, ఆమె బలహీనంగా "దేవుడి దయ! ఎలా మాట్లాడను? గాయాలతో నీరసించాను. నాకింక కొద్ది క్షణాలే మిగిలిఉన్నాయి. నా ఆత్మ వెళ్ళిపోయాక నన్ను ఈ పెట్టెతోనే పాతిపెట్టి మంచివాళ్ళనోటా, చెడ్డవాళ్ళనోటా నా పేరు నానకుండా చెయ్యి. నీ పుణ్యం ఊరికేపోదు," అన్నది.

ఆ రాత్రివేళ నేను ఎలాటి చికిత్సా చెయ్యలేదు. ఆ పెట్టెను నేనున్న చోటికి తెచ్చి తెల్లవారటానికి గంటలు లెక్కపెట్టసాగాను. తెల్లవారగానే నగరంలోకి వెళ్ళి, ఈ అందాలరాశికి చికిత్సచేయించటానికి శాయశక్తులా ప్రయత్నిద్దామని నిశ్చయించుకున్నాను.

మిగిలినరాత్రి నాకు ఎంతకూ గడవనట్టు తోచింది. ఎప్పుడు తెల్లవారుతుందా అని నేను ముళ్ళమీద ఉన్నాను. చివరకు తెల్లవారింది. కోడి కూసింది. మనుషుల కంఠాలు వినిపించసాగాయి. నేను ఉదయపు ప్రార్థన ముగించి, కొయ్యపెట్టెను నా గుర్రానికి కట్టుకుని, నగరద్వారాలు తెరుస్తుండగా నగరం ప్రవేశించాను. అద్దెకు ఇల్లు ఎక్కడ దొరుకుతుందని కనిపించినవాడినల్లా అడిగి, ఎంతోసేపు అన్వేషించినమీదట, నాకు మంచి అందమైనఇల్లు దొరికింది. అందులోకిప్రవేశించగానే ముందుగా నేను ఆ అందగత్తెను పెట్టెనుంచి పైకితీసి, గదిలో మెత్తని పక్కమీద పడుకోబెట్టాను. తరవాత ఆమెకు నౌకరును ఒకణ్ణి కాపలా ఉంచి శస్త్రవైద్యుడి కోసం వెతుకుతూ బయలుదేరాను.

"ఈ నగరంలో గొప్ప శస్త్రవైద్యుడెవరు? ఎక్కడ ఉంటాడు?" అని దారిలో తగిలిన ప్రతివాణ్ణీ అడిగాను.

"ఈ పేటలోనే ఒక మంగలి ఉన్నాడు శస్త్రచికిత్సలోనూ, వైద్యంలోనూ అందెవేసిన చెయ్యి. శవాన్ని తీసుకుపోయి అతనిముందు పెడితే ఏదో




వైద్యంచేసి బతికించగల దన్నమాట. అతనిపేరు ఈసా," అని ఒక మనిషి నాకు చెప్పాడు.

ఈ చల్లనిమాట చెవినిపడగానే, ఈసా ఇంటిగుర్తులు తెలుసుకొని, కొంచెం శ్రమపడి వెతికినమీదట ఇల్లు పట్టుకున్నాను. ఇంటిముందు వసారాలో తెల్లటి గడ్డంతో ఒక మనిషి కూర్చొని ఉన్నాడు. అతని చెంత అనేకమంది కల్వాలలో మందులు నూరుతున్నారు.

ఆయనకు ఆనందం కలగటం కోసం నేను ఎంతో గౌరవంగా సలాంచేసి, "మీ పేరు ప్రఖ్యాతులు విని, మీ సహాయం అర్థించవచ్చాను. జరిగిన దేమిటంటే, నేను మాదేశంనుంచి వర్తకం నిమిత్తం బయలుదేరుతూ, ప్రేమపాత్రురాలైన నా భార్యను వెంట తెచ్చాను. నేసి నగరం చేరేసరికి చీకటి పడింది. కొత్తదేశాలు రాత్రివేళ ప్రయాణించటం క్షేమంకాదని మైదానంలో ఒక చెట్టుకింద మజిలీ చేసాను. వేకువఝాములో దొంగలు దాడి చేసి, నా సొత్తంతా కాజేసి, నగలమీద ఆశకొద్దీ నాభార్యపైన కూడా చెయ్యిచేసుకున్నారు, దుర్మార్గులు. ఒంటరిగాణ్ణి. నేను వారిని నిరోధించలేక పోయాను. అతి శ్రమమీద మిగతా రాత్రి గడిపి, నా భార్యకు నా చేతనైన సహాయం చేశాను తెల్లవారగానే నగరంలోకి వచ్చి ఒక ఇల్లు అద్దెకు తీసుకుని, గాయపడిన నా భార్యను అందులోఉంచి, మీ సహాయం కోసం ఇలా వచ్చాను. శస్త్ర వైద్యంలో మీకు దేవుడు అపారప్రావీణ్యం

ప్రసాదించాడు. ఈ అభాగ్య ప్రయాణికు డిపైకనికరంఉంచి, మా పేదఇంటికిదయ చేసి, నా భార్యను బతికించగలరేమో చూడండి. అలా చేసినట్టయితే మీకుతీరని యశస్సు చేకూరుతుంది. నేను జీవితాంతం మీకు రుణపడి ఉంటాను," అన్నాను.

ఈసా దయాపరుడు; ధర్మాత్ముడు. ఆయన నా దురదృష్టానికి జాలిపడి, నా వెంట నా యింటికి వచ్చాడు. ఆయన ఆ స్త్రీ గాయాలు పరీక్షించి, "భగవంతుడి అనుగ్రహంవల్ల ఈమె గాయాలు నలభై రోజుల లోపలనే నయమై ఈమె శుచిస్నానం చెయ్యగలుగుతుంది," అని నాకు ధైర్యం ఇచ్చాడు.

ఆ పుణ్యాత్ముడు ఆమె గాయాలన్నిటినీ వేపాకురసంతో కడిగి, శుభ్రం చేశాడు. కుట్లువేయవలసిన గాయాలకు కుట్లువేశాడు. మిగిలిన గాయాలమీద తన పెట్టెనుంచి తీసిన పలాస్త్రి పట్టీలు వేశాడు. తరవాత ఆయన అన్నిగాయాలకూ కట్లు కట్టి,ఎంతో దయగా, "నేను ఉదయమూ, సాయంకాలమూ వచ్చి చూసిపోతూ ఉంటాను. ఆమెను ఎంతమాత్రమూ కదలకుండా ఉంచాలి. లేకపోతే కుట్లు ఊడిపోగలవు. ఆమెకు ఆహారంగా కోడిజావ కొంచెం కొంచెంగా ఇవ్వాలి. వైద్యముష్క ఆకుల రసంతో పన్నీరు చేర్చి తరచుగా తాగిస్తే మనిషి నీరసించిపోకుండా ఉంటుంది," అన్నాడు.

ఇలా చెప్పి ఆయనవెళ్ళిపోయేటప్పుడు నేనాయనకు చేతులుజోడించి నమస్కారం చేసి కృతజ్ఞత తెలుపుకుని, "మీరు నాకు ప్రాణం పోశారు. గాయాలనుంచి ఆమె కోలుకుంటుందని నేను అనుకోలేదు. దేవుడు మిమ్మల్ని కలకాలం కాపాడాలి!" అని చెప్పి ఆయనకు అత్తరూ, తాంబూలమూ ఇచ్చాను. ఆయన సెలవు పుచ్చుకున్నాడు

క్రూరహింసకు గురిఅయిన ఆ స్త్రీని నేను అహోరాత్రులు కంటికిరెప్పలాగా కాపాడాను. నా విశ్రాంతి గురించి ఆలోచించటం మహా పాపంగా తోచింది. ఆమె కోలుకోవాలని రోజూ దేవుణ్ణి వేడుకున్నాను. అదృష్టవశాన, నా సరుకులు తీసుకునివెళ్ళిన వర్తకుడు ఈ సమయంలోనే వచ్చి చేరాడు. ఆయన నా సరుకు యావత్తూ నాపరంచేశాడు. వాటిని నేను నాకు చేతనైన విధంగా అమ్మి, ఆ డబ్బుతోగాయపడిన సుందరికిమందులూ, మాకులూ కొన్నాను. ఆమెకు ఆ స్థితిలో అవసరమైన అన్ని సౌకర్యాలూ, సదుపాయాలూ ఏర్పాటుచేశాను.

పాపం, వైద్యుడు ~~ప్రతిపూటా వచ్చి~~ చూస్తూవచ్చాడు. త్వరలోనే గాయాలన్నీ పూడి, మాననారంభించాయి. మరికొద్దిరోజుల అనంతరం ఆమె శుచిస్నానం చేసింది. నాలో కలిగిన ఆనందం ఏమని చెప్పను! నేను ఈసాకు ఖరీదైన బట్టలు పెట్టి, సంచీడు బంగారునాణాలు, ఆయ



నకు సమర్పించాను. అందమైన రత్న కంబళాలు పరిపించి, దానిమీద విలువ గల బాలీసు పరిపించి, దానిపై సౌందర్యవతిని పడుకోబెట్టాను. పేదలకు విరివిగా దానాలు చేశాను. ఆ రోజు నాకు ప్రపంచరాజ్యాధిపత్యం లభించినంత ఆనందం కలిగింది.

కోలుకున్నమీదట ఆమె శరీరచ్ఛాయ గులాబీలుపూసింది. ఆమెముఖం చంద్రుడిలాగా ప్రకాశించింది. ఆమె కళ్ళలో జ్యోతులు వెలిగాయి. ఆమెకేసి చూస్తూం నాకు కళ్ళు చెదిరాయి. నేను ఆమె సేవకు పూనుకుని, ఆమె చెప్పినదల్లా శ్రద్ధగా చేశాను.

ఆమె నాకేసి చూడటం తటస్థించినప్పుడు, సౌందర్యాతిశయంతోనూ, అధికారంతోనూ, "జాగ్రత్త, నా సదభిప్రాయం దక్కించుకోవాలంటే, నా



ఆదేశాలు పాటించటంలో తటపటాయించకు. నేనేది చెబితే అది తక్షణమే అడ్డుపుల్లలు వెయ్యకుండా చేసెయ్యి. నా ఉద్దేశాలకు నీ ఉద్దేశాలు అడ్డుపెట్టకు. నీ దూరంలోనువు ఉండు. తొందరపడ్డావో అనుభవిస్తావు,'' అన్నది.

ఆమె ఇంత అహంకారంగా మాట్లాడినా, ఆమె నాకు రుణపడిఉన్న సంగతి ఆమెకు పూర్తిగా తెలుసు. నేను ఏమి చెయ్యదలచినా ఆమె ఆమోదం పొందిమరీ చేశాను. ఆమె ఆజ్ఞలను సంతోషంగా శిరసావహించాను.

ఈ విచిత్ర కైంకర్యం అనేక మాసాల పాటు సాగింది. ఆమె ఏమి కావాలన్నా మరుక్షణం సంపాదించాను. ఈ దీర్ఘ కాలంలో నేను సరుకులూ, రత్నాలూ అమ్మగా వచ్చిన ధనమంతా ఆమె అవసరాలు తీర్చటంకింద వ్యయమై



పోయింది. దేశంకానిదేశంలో నన్ను ఎవరూ ఎరగనిచోట, అప్పుచేసి ఆమెను పోషించాలంటే నన్ను నమ్మేవారెవరు?

చిట్టచివరకు మా నిత్యావసరాలకు కూడా డబ్బులేకుండాపోయి నేను ఏమీ చెయ్యలేని స్థితిలోపడ్డాను. ఈ ఆదుర్దా నన్ను పీల్చసాగింది. నాముఖం వివర్ణమయింది. కాని నా ఆవేదన చెప్పుకోవటానికి ఎవరున్నారు? పేదవాడి బాధ" వాణ్ణే పీడిస్తుంది.

ఒకనాడు ఆ సుందరాంగి నాకువచ్చిన కష్టాన్నితానే గ్రహించి, "ఓ యువకుడా, నువు నాకు చేసినసేవలు నా హృదయఫలకంమీద శిలాక్షరాలలాగా నిలిచిపోయాయి. అయితే నేను నీకిప్పుడు ప్రత్యుపకారంచేసే స్థితిలోలేను. అవసర

మైన ఖర్చుకు డబ్బు కావాలంటే విచారించకు. నాకు కలమూ, కాగితమూ, సిరా ఇయ్యి," అన్నది.

అప్పుడు నాకు అనిపించింది: ఈమె ఏదేశపు రాజకుమార్తో అయిఉంటుంది; లేకపోతే నాతో అంత గర్వంగానూ, అంత ఆత్మవిశ్వాసంతోనూ మాట్లాడలేదు. నేనప్పుడే కాగితమూ, కలమూ, సిరా తెచ్చి ఆమెముందు పెట్టాను. ఆమె ఒక ఉత్తరం రాసి, సీలువేసి నాచేతికిచ్చి, "కోటసమీపంలో త్రిపోలియా (మూడు ఆర్చిలుగల ద్వారం) పక్కగాఉన్న సందులో పెద్ద భవంతి ఉన్నది. దాని యజమాని సీదీబహర్. ఈ ఉత్తరాన్ని అతనికి ఇయ్యి," అన్నది.

ఆమె చెప్పిన గుర్తులను బట్టి వెళ్ళి, భవంతి చేరుకుని, పనివాడిచేత ఉత్తరం వార్త లోపలికి పంపాను. అది లోపలికి చేరిన మరుక్షణం ఒక అందమైన నీగ్రో యువకుడు మెరిసే తలపాగా ధరించి నా వద్దకు వచ్చి, ఉత్తరం తీసుకుని. ఏమీ అనకుండా, ఏమీ అడగకుండా, లోపలికి వెళ్ళిపోయాడు. కొద్దిసేపట్లో వాడు తిరిగి వచ్చాడు. వాడివెంట బానిసలు పదకొండు పళ్ళాలు మోసుకువచ్చారు. వాటిపైన ముద్ద జరీగుడ్డలు కప్పిఉన్నాయి.

"ఈ యువకుడివెంట వెళ్ళి, ఈ పళ్ళాలు ఇచ్చిరండి," అని ఆ నీగ్రో యువకుడు బానిసలతో అన్నాడు.

నేను సలాముచేసి ఆయువకుడివద్ద సెలవు పుచ్చుకుని, పళ్ళాలతోసహా బానిసలను మాయింటికి తెచ్చాను. వాళ్ళను బయటినుంచే వెనక్కు పంపి, పళ్ళాలను లోపలికి పట్టుకుపోయి సుందరాంగి ముందుంచాను.

వాటిని చూసి ఆమె నాతో, "ఆపళ్ళాలలో ఉన్న పదకొండు సంచుల బంగారమూ తీసుకుని, అవసరమైన ఖర్చులకు వాడు," అన్నది.

నేను ఆమె చెప్పిన ప్రకారమే ఆ బంగారం తీసుకుని తక్షణావసరాలకు వాడాను. నా మనసు చాలా తేలికపడింది. నాలో నేను, "ఈశ్వరా! ఇదేం చిత్రం! ఎవడో అపరిచితుడు ఒక కాగితంముక్క ఆధారంగా, నేనెవరో ఎరగకుండా ఎలాటి ప్రశ్నలూ వెయ్యకుండా ఇంత బంగారం ఇవ్వటమేమిటి?" అనుకున్నాను. నేనా సుందరిని ప్రశ్నించరాదు. తన విషయాలలో జోక్యం కలుగజేసుకోవద్దని ఆమె ముందే హెచ్చరించింది. ఈ తెగని ఆలోచనలు నాకు ఊపిరి సలపకుండా చేశాయి. నాలో భయాన్ని కూడా రేపాయి. (సశేషం)




నేను ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి పక్క ఇళ్ళవాళ్ళు పోట్లాడుకుంటున్నారు. నా భార్య మా వాకిట్లో నిలబడి వింటూ వుంది.

మా ఇంటి ప్రక్క ఇళ్ళు, వరుసగా ఒక యింటిని ఒక ఇల్లు ఆనుకొని లేవు. ఒకే ఇల్లు మా ఇంటిని ఆనుకొనివుంది. రెండవ ఇల్లు దానికి ఎదురుగావుంది. అందుకని మా వాకిటిలో నిలబడితే రెండిళ్లూ చక్కగా కనబడతై.

నేను వచ్చేటప్పటికి వాళ్ళు పోట్లాడు కుంటున్నారని చెప్పాను. వాళ్ళ రెండిళ్ళ మధ్యా ఒక పెద్ద గుమ్మడికాయ వుంది. అది వడియాలు పెట్టుకోటానికి పనికి వచ్చే బూడిదగుమ్మడికాయ. గుమ్మడి కాయకు అవతల ప్రక్క ఆ ఇంటి వాళ్లూ ఇవతల ప్రక్క ఈ ఇంటివాళ్లూ నిలబడి పోట్లాడుకుంటున్నారు. అవతల యిల్లు ఒక స్కూలు మేస్టరుది; ఇవతల యిల్లు ఒక గవర్నమెంటు ఆఫీసరుది.

స్కూలు మేస్టరు ఇంటిలో వున్నట్లు లేడు. అతని భార్యా, కూతురూ, కొడుకూ, గుమ్మడికాయకు అవతల నిలబడి పోట్లాడుతున్నారు. గవర్న మెంటు ఆఫీసరు ఇంటిలోనే వున్నాడు. కాని అతను బయటకు రాలేదు అతని తరఫున అతని నౌకర్లు పోట్లాడు తున్నారు.

"ఈ గుమ్మడికాయ మీది. మీరు తీసుకోవలసిందే: మా అయ్యగారుకూడా ఈమాటే అన్నారు." అంటున్నాడు నౌకరు, ఆఫీసరు తరఫున.

"పాపం మీ రెంత అపేక్షపడి దొంగతనంగా కోసుకున్నారో: కోసు కున్నవాళ్ళే తీసుకోవాలి," అంటున్నది మేస్టరు భార్య.

"ఈ దొంగముండ చేసింది," అంటు న్నాడు నౌకరు అంట్లుతోమే పిల్లని ఉద్దేశించి.

"యజమానికి తెలియకుండా అదెం దుకు చేస్తుంది? దాని కోసం అదిచేస్తే తన యింటికే తీసుకుపోయేది. మీ ఇంటిలో ఎందుకు పెడుతుంది?" అంటున్నది మేస్టరుకూతురు.

"ఆ మాటే అనొద్దనేది." అంటు న్నాడు నౌకరు.

"చెయ్యగాలేనిది అంటే తప్పా?" అంటున్నది మేస్టరు భార్య.

"నోరు పారేసుకోకండి. ఈ కాయ మీది. మీరు తీసుకోండి," అంటున్నాడు నౌకరు.

"పాపం యెంత అపేక్షపడి దొంగ తనంగా కోసుకున్నారో మీరే తీసు కోండి," అంటున్నది మేస్టరుభార్య.

ఇంతలో నన్ను చూచినట్లున్నారు. ఒక్క క్షణం మాటలు ఆగినై. నేను ఈ తగాదా వినీవిననట్టు లోపలకు వెళ్లాను. బయట తగాదా నేను ఇంటిలో అడుగు పెట్టగానే మళ్ళీ సాగింది.

మా పక్కఇంటి నౌకర్లు ఇరుగు వాళ్ళతో చీటికీ మాటికీ కజ్జాకు దిగటం మామూలే: ఆఫీసరు నౌకర్లు, పుర ప్రముఖులకంటే కూడా అనేక రెట్లు గొప్పని నౌకర్ల ఉద్దేశం. అందుకని ఎవర్ని పడితే వాళ్ళని గదమాయించటం, ఎవ్వరితో పడితే వాళ్ళతో పోట్లాడటం వాళ్ళకి మామూలే: కాని 'ఈ గుమ్మడి కాయ మీరు తీసుకోవాలంటే మీరు తీసు కోవా'లని పోట్లాడుకోవటం మాత్రం నాకు చిత్రంగా వుంది.

ఆ మధ్య నా ఎరుకలో యిటువంటి తగాదే ఒకటి జరిగింది. దమనకశాస్త్రి అనే ఒకాయన, కరటకశాస్త్రి అనే మరొక ఆయన్ని వందరూపాయలు అప్పు అడిగాడు. కరటకశాస్త్రి వడ్డీగిడ్డీ తాను తీసుకోననీ, ఫలాని రోజుకల్లా తిరిగి యిచ్చివెయ్యాలనీ చెప్పి, అప్పు ఇచ్చాడు. కాని, దమనకశాస్త్రి ఆ నోట్లని తీరా యింటికి తీసుకువెళ్ళి

PRABHANJAN

లెక్కపెట్టుకునేసరికి, నూరు రూపాయిలకు బదులు నూట అయిదు రూపాయిలున్నాయి. అతను కంగారుపడి వెంటనే కరటకశాస్త్రి దగ్గరకువెళ్ళి "మీరు పొరపాట్న అయిదు రూపాయిలు ఎక్కువ ఇచ్చారు. తీసుకోండి," అన్నాడు. ఈ మాటకు కరటకశాస్త్రి ఉలిక్కిపడ్డాడు. దమనకశాస్త్రి ముఖంలోకి నిశితంగా చూస్తూ, నేను ఎప్పుడూ పొరపాటుపడను. నా డెబ్బయి ఏళ్ళ జీవితంలోడూ ఏనా పొరపాటుపడ లేదు.ఇకముందుపడను. నేను వందరూపాయిలే యిచ్చాను. ఆ అయిదు రూపాయిలకూ నాకూ యెటువంటి సంబంధమూ లేదు," అని చెప్పాడు.

"నేను సరాసరి ఇంటికివెళ్ళి లెక్కపెట్టుకున్నాను. ఇంకెక్కడికీ వెళ్ళలేదు కూడాను. లెక్కపెట్టుకునేటప్పటికి నూట అయిదు రూపాయిలున్నాయి. ఈ అయిదు రూపాయిలు మీవే. లేకపోతే నాదగ్గరకు యెలా వస్తాయి? ఇవి మీరు తీసుకుని నాకు చిత్తశాంతిని కలిగించండి" అన్నాడు. దానికి కరటకశాస్త్రి "నీకు చిత్తశాంతిని కలిగించి నా చిత్తశాంతిని పోగొట్టుకోమంటావా?" అని అడిగాడు. "ఈ అయిదు రూపాయిలు తీసుకుని వచ్చేజన్మలో కుక్కగానో నక్కగానో పుట్టి నీ యింటి ముంగిట కాపలా కాయమంటావా?" అన్నాడు.

"నాతో ఆ పని చేయించుకోటానికే మీరీ ఎత్తు వేశారు. అసలు మీ దగ్గరకు డబ్బుకోసం రావటమే నా తప్పు!" అన్నాడు దమనకశాస్త్రి.

వీరీవిధంగా కరటకశాస్త్రి ఇంటి

అరుగుమీద కూర్చొని పోట్లాడుకుంటూ వుండే పోగైనజనం వినలేక ఆ అయిదు రూపాయిలూ భగవదార్పితం చేసేటట్లు రాజీచేశారు. "గుమ్మడికాయ నువ్వు తీసుకోవాలంటే నువ్వు తీసుకోవాలనే" ఈ తగాదా నాకు పై సంఘటనను జ్ఞాపకానికి తెచ్చింది. నాలో నాకే నవ్వొచ్చింది. ఇంటిలో నిలబడి తగాదాను పర్యవేక్షిస్తున్న నా భార్య లోపలకు వచ్చింది. రావటంలో ముసిముసినవ్వులు నవ్వుకుంటూ వచ్చింది.

"ఏమిటా గోల?" అని అడిగాను.

"అదేనండి...నిన్న మీతో చెప్పాను చూడండి. మేస్టరుగారి భార్య ఇంటి మీదకు గుమ్మడితీగ పాకించుకొనిగుమ్మడి కాయలు కాయిస్తూ వుందనీ, ఆ తీగె రెండు గుమ్మడి కాయలు కాసిందనీ..."

"అవును" అన్నాను నేను జ్ఞాపకం చేసుకుంటూ.

"పాపం, అందులో ఒక కాయ నిన్న రాత్రి ఎవ్వరో కోసుకు వెళ్ళారట. రోజూ ఆబిడకు నిద్రమంచంమీదనుంచి లేచీలేవగానే నిచ్చెనవేసుకొని ఒకసారి రెండు గుమ్మడికాయల్నీ చూసుకోవటం అలవాటు. ఇవ్వాళ ప్రొద్దున్న లేచి చూసేటప్పటికి ఏముంది? గుమ్మడి కాయని కప్పిన గడ్డి గడ్డిగానేవుంది. గుమ్మడికాయ లేదు..."

"ఎవ్వరో కోసుకువెళ్ళి వుంటారు" అన్నాను నేను.

"అది సరేలెండి..." అన్నది నా భార్య... "ఎవ్వరూ కోసుకు వెళ్ళకుండా ఎలా గుమ్మడికాయ మాయమవుతుంది లెండి కాని, పాపం ఆ ఇల్లాలు ఆ గుమ్మడికాయమీద అనేక ఆశలు పెట్టుకుకూచుంది. ఆమె అల్లుడికి వడియాలు అంటే తగని యిష్టమట. వడియాలు వుంటే ఏ కూరా అక్కరలేదట. ఈ గుమ్మడికాయ యివాళో రేపో కోసి వడియాలు పెట్టి అల్లుడికి పంపాలని గుమ్మడి పాదు పెట్టినప్పటినుంచీ అనుకుంటూ వుంది ఆమె. నిజానికి గుమ్మడిపాదు పెట్టింది కూడా అందుకేనట! అటువంటి ఆమెకు గుమ్మడికాయ కనబడకపోయే టప్పటికి ఏముంది? వొక్కసారి గుండె గుభేలుమన్నది. కళ్ళు తిరిగి నిచ్చెన మీద నుంచి పడిపోతాననే అనిపించిందట. కూతుర్ని పిలుద్దామంటే నోటివెంట మాట వస్తేగా..."

"పాపం" అన్నాను నేను. నాకైతే యిప్పుడు సరిగ్గా జ్ఞాపకం లేదుగాని, వొక్క నిట్టూర్పు కూడా విడిచి వుంటాను. ఎందుకంటే నాకు నిజంగా జాలివేసింది. పెంచినవాళ్ళ మనస్సులను తీగెలూ కాయలూ ఎట్లా పెనవేసుకుంటయ్యో నాకు తెలుసు.

"అది సరే, గుమ్మడికాయ మధ్యన పెట్టుకొని, కృష్ణభగవానుని మధ్యనపెట్టుకొని పోట్లాడే కౌరవ పాండవులకుమల్లే, దొడ్డిలో ఆ తగాదా ఏమిటి?"అన్నాను.







"మరి చెప్పేదంతా వినండి. కాయ కనపడకుండా పోయేసరికి ఆమెకు తలచుకున్నకొద్దీ దుఃఖం పొర్లిపొర్లి వచ్చిందట. ఎవ్వరు కోసివుంటారా అని ఆలోచించిందట. కాని ఎవర్ని అనుమానిస్తుంది? పక్కయింటి గవర్నమెంటు ఆఫీసర్‌ని అనుమానిస్తుందా? మనల్ని అనుమానిస్తుందా? ఏమీతోచక దుఃఖం ఆపుకోలేక కోసుకువెళ్ళిన వాళ్లని నోటికి వచ్చినట్టు తిట్టటం మొదలుపెట్టింది. వాళ్ళు నాశనం అవుతారన్నది. వాళ్ల పెళ్లాలు నాశనం అవుతారన్నది. వాళ్ల పిల్లలు నాశనం అవుతారన్నది. ఆమె నోరు చేసుకుంటే ఎట్లా చేసుకుంటుందో మీకు తెలుసుగా! పాపం వడియాలు, అల్లుడూ జ్ఞాపకం వొచ్చారేమో, పైన పైనాలు పెట్టి అటు పధ్నాలుగుతరాల వాళ్ళనీ ఇటు పధ్నాలుగు తరాల వాళ్లనీ దుమ్మెత్తి పోసింది.

పాపం మన పక్కయింటి ఆఫీసరు ఈ తిట్లను వినలేకపోయాడు కాబోలు, 'అట్లా నోరు చేసుకోవద్దను. కాయ తీసుకోమను' అని చెప్పి ఇంట్లోనుంచి గుమ్మడికాయ నౌకరుచేతికిచ్చి పంపించాడు. సరిగ్గా ఆ గుమ్మడికాయే. తెంపిన తొడిమ ఆరనన్నా ఆరలేదు."

"అదేమిటే? ఆయన దగ్గరకు యెట్లా వచ్చింది?" అని ఆశ్చర్యంగా అడిగాను. గవర్నమెంటు ఆఫీసరు గుమ్మడికాయను దొంగిలించాడని నేను నమ్మలేక అడిగాను.

"అది నా కెట్లా తెలుస్తుంది? ఆయన మాత్రం 'నౌకరిముండ చేసింది. ఈ దొంగముండతో చచ్చేరోజు వచ్చింది'

అన్నాడు మా అందరికీ వినబడేటట్టు" అన్నది నా భార్య.

"పాపం, నిజమే అయివుంటుంది" అన్నాను నేను.

"నౌకరిది దొంగిలిస్తే అది తన ఇంటికి తీసుకువెళ్తుందిగాని, వీళ్ళ కెందుకు యిస్తుంది! గుమ్మడికాయ చేదయ్యా? చేదైతేఎందుకు దొంగిలిస్తుంది. అన్నది మేష్టారిగారి కూతురు."

"అయితే ఆ ఆఫీసరే దొంగిలించా డంటావా ఏమిటి?"

"ఆయన్ని ఎవ్వరంటారు? ఆయన మంచివాడే."

అకస్మాత్తుగా ఆఫీసరుభార్య జ్ఞాపకం వొచ్చింది నాకు. ఆవిడమీద ఏమాత్రం సద్భావం లేదు నా భార్యకి. ఆవిడ ఇంట్లో నౌకర్లతో, ఇరుగు పొరుగు వాళ్ళతో కజ్జాలూ తగాదాలూ ప్రోత్స హిస్తూ వుంటుందని ఆమె నమ్మకం.

"నౌకర్లతో ఆబిడ చేయించి వుంటుందంటావా ఏమిటి" అని అడిగాను.

"నే ననటం ఏమిటి? ఊరంతా అంటు న్నారు. ఇది తప్పకుండా ఆబిడగారి పనే. మాష్టరుగారి ఇంటిమీద గుమ్మడి కాయ లున్నాయని వాళ్ళకి తెలియాలి; మనకు తెలియాలి. ఇంకెవ్వరికి తెలు స్తుంది?"

"ఈ మాటలు నువ్వు గిట్టక అనే మాటలు" అన్నాను నేను... "ఆబిడ చేయిస్తే ఆయన నౌకరిమీద ఎందుకు పెట్టేవాడు? ఆబిడని నానా చీవాట్లూ వేసే వాడు" అన్నాను.

"చీవాట్లు వేసి బ్రతకనే ఆబిడ గారితో?" అన్నది నా భార్య.

"పోనీ మెదలకుండానైనా వూరుకునే వాడు. తమ తప్పు బయటపెట్టుకునే వాడా? తాను మెదలకుండా వూరుకుంటే ఎవ్వరేం చేసేవారు?"

"ఊరుకునేవాడే! కాని ఆవిడగారు ఊరుకోనిస్తేగా?" అన్నది నా భార్య.

ఈ మాటకు నాకు నిజంగా కష్టం వేసింది. దొంగతనం చేయించిందీ ఆబిడే. ఆ దొంగతనం బయటపెట్టించిందీ ఆబిడే అంటూవుంటే ఏమనాలి?

"అదేమిటి అట్లా అంటావు. తాను చేయించిన దొంగతనం, తన భర్తతో బయటపెట్టించిందంటావా?" అని అడి గాను.

"ఆ మాట నే నెట్లా అంటాను" అన్నది నా భార్య.

"మరదేగా నువ్వనేది?"

"అది కాదు. ఆ గుమ్మడికాయ ఉంచు కోలేకపోవటానికి కారణం వుంది. మీకు తెలుసుగా ఆవిడగారికి తన కొడు కంటే ఎంత ప్రీతో?"

"తెలియకేం?" అన్నాను. పిల్లల కోసం ఆమె నొయ్యని నోమూ, చెయ్యని పూజా, దర్శించని దేవళం లేదని నాకు తెలుసు. చివరికి ఆమె నోముల




పంటగా ఈ పిల్లవాడు ఇటీవలే కలిగాడు

"దానివల్ల గుమ్మడికాయ దాచుకో లేకపోయింది. మాస్టరుగారి భార్య మాటి మాటికీ 'కోసినవాళ్ళ కడుపులు కాలు! తీసినవాళ్ళ పిల్లలు నాశనం కాను!' అంటూవుంటే భరించలేకపోయింది. పస్తాయిస్తే లాభంలేదనుకొని, నౌకరి దానిమీద పెట్టి 'వాళ్ళకాయ వాళ్ళకిచ్చి వెయ్యండి' అని భర్తతో చెప్పి వుంటుంది. ఆ పిచ్చాయన నిజమే అని నమ్మి బయటపడ్డాడు" అన్నది.

నేను ఆలోచనలో పడ్డాను. నా భార్య చెప్పింది నిజం కావచ్చు అనుకున్నాను. ఆఫీసరు భార్య ఇటువంటి పనులకు సమర్థురాలే. ఒకరోజు మా పిల్లలు ఏదో చేశారనే కోపంతో తన పనిదాంతో ఊడ్చిన కసవు సరిహద్దు గోడమీదుగా మా దొడ్లోకి వేయించటం నేను కళ్ళారా చూశాను. తన వాకిట్లో నిలబడి పని దాంతో ఈ పని చేయిస్తూవుంది. నన్ను చూచి చటుక్కున లోపలకు వెళ్ళింది. ఇటువంటివి నేను చాలా చూశాను. అందుకని 'బహుశా నా భార్య చెప్పిన మాటలు నిజమే అయివుండవచ్చు' అనిపించింది నాకు.

"అదిసరే. వాళ్ళు ఏ కారణంవల్లయినాకానీ, గుమ్మడికాయ ఇచ్చివేసినప్పుడు సంతోషంగా, తీసుకోక 'ఎంత అపేక్షపడి కోసుకున్నారో మీరే తీసుకోండి' అని మొండిపట్టు పట్టుకు కూర్చుంటారేం? మాస్టరుగారి భార్య, కూతురూను" అని అడిగాను.

"కసి తీరక!" అన్నది నా భార్య.

నాకు అర్థంకాలేదు. "ఇందులో కసి తీరేదేముంది?" అని అడిగాను.

"ప్రొద్దున్నుంచీ ఆమె ఏడ్చిన ఏడ్పుకి కాయఇవ్వగానే తీసుకు ఊరుకుంటే యెట్లా సరిపోతుంది? అప్పటిదాకా అన్న మాటలన్నీ పిల్లిమీదా, కుక్కమీదా పెట్టి అనే: ఒక్క మాటకూడా సరాసరి అనకపోయె... కాయ యివ్వగానే తీసుకుంటే వాళ్ళని ఒక్కమాట కూడాఅనటానికివీల్లేదాయె...అనకుండా వూరుకోబుద్ధి పుట్టదాయె!"

"అందుకని 'మీరే తీసుకోండి' అంటూ అనవలసిన మాటలన్నీ అని తన అక్కసు తీర్చుకుందన్నమాట."

"అవునండీ. ఎవరికైనా కడుపుమంట చల్లారాల్సిందేగదా!" అన్నది నా భార్య.

"చల్లారాల్సిందే" అని నేను నా భార్యతో యేకీభవించాను. "చివరికి కథ ఎట్లా ముగిసింది?" అని అడిగాను.

"ఏదోలెండి - నేనే రాజీచేశాను" అన్నది నా భార్య

"ఎట్లా?"

"ఎట్లా యేముంది? వారికి తెలిసే యిది జరిగివుంటుం దనుకుందాం... మీరు అనుకుంటున్నట్లు నౌకర్లతో ఆవిడగారే చేయించి వుంటారని అనుకుందాం. అయినా 'మేము ఎరగం; నౌకరుది చేసి వుంటుంది' అని వారన్నప్పుడు దాన్ని మీరు ఇంకా సాగదియ్యటం ధర్మం కాదు. మీ కాయ మీరు తీసుకోవటమే ధర్మం అని మాస్టరుగారి భార్యకు చెప్పాను" అన్నది.

"ఆపట్న ఆమె తీసుకుందా?"

"అంత తేలిగ్గా తీసుకుంటుందా? 'పోనీ, యజమానులకు తెలియకుండా ఆ నౌకరుది యింతపనికి దిగి వుండదని మీరైనా ఒప్పుకుంటారా? మీరు ఒప్పుకుంటే నాకు అదే చాలు. గుమ్మడికాయ తీసుకోవటానికి మా కెట్టి ఆక్షేపణా లేదు...' అన్నది మాస్టరుగారి భార్య ఎట్టాగో ఒకట్లా ముగుస్తుంది గదా అని. 'నేను ఒప్పుకుంటాను అనుకోండి' అన్నాను. 'అయితే సరే. నా కదేచాలు పదిమందికీ తెలిసి ఉండాలనే, నే కోరేది' అన్నది మాస్టరుగారి భార్య. అని గుమ్మడికాయ తీసుకుంది"

నా భార్య రాజీపరచిన పద్ధతి నేను శ్రద్ధగా విన్నాను. విని "అయితే ఈ అవకాశం పురస్కరించుకొని ఆఫీసరు భార్యగారి మీద నీకున్న కసికూడా తీర్చుకున్నా వన్నమాట?" అన్నాను.

ఈ మాటలకు నా భార్య కళ్ళు తళుక్కున మెరిసినై. ముసి ముసి నవ్వులు వొలకపోసుకుంటూ - "లేకపోతే, పెద్ద రాణీని అనుకుంటుంది!" అన్నది. అని అంతటితో ఆగక "చూడండీ అల్లుడితోపాటు మనకుకూడా కొన్ని వడియాలు పెట్టిస్తానన్నది మాస్టరుగారి భార్య" అని చెప్పింది.




చిన్న తనంలో తొలిసారి 'వోడ్ హౌస్' నవల చదివి నప్పుడు తనకు ఏడుపు వచ్చిందని బుచ్చిబాబు ఎక్కడో వ్రాసినట్లు జ్ఞాపకం. నేనూ చిన్నతనంలో 'వోడ్‌హౌస్' నవల ఒకటి 'డామ్‌సెల్ ఇన్ డిస్ట్రెస్' అన్నది చదివాను. అది చదివినప్పుడు నాకు నిజంగా అసహ్యం వేసింది.

చిన్నతనంలో, జీవితప్రాంగణంలో అప్పుడప్పుడే ప్రవేశిస్తున్నప్పుడు వోడ్ హౌస్ సున్నితపు హాస్యం బహుశా తాన్ని చవిచూసి రకరకాల మనుష్యుల మనస్తత్వాన్ని అవగాహన చేసుకున్నాకా 'వోడ్‌హౌస్' నచ్చుతాడు. ఇప్పుడైతే నేను 'వోడ్‌హౌస్' నవల చదువుతున్నప్పుడు తెరలు తెరలుగా నవ్వు వస్తుంది. మనస్సు తేలికపడి హాయిగా ఉంటుంది.

'వోడ్‌హౌస్' నవలలో మనకుతరచు బెర్టీవూస్టరు కనుపిస్తాడు. అతని ప్రవర్తన ఉదాహరణప్రాయంగా చెప్పాలంటే ఇలా ఉంటుంది. వూస్టరు తనస్నేహితుని

కొంటాడేమో నాస్నేహితుడు అని నా బెంగ.

ఇంకొకమారు హైదరాబాదు వెళ్లాను. హైదరాబాదు వెళ్ళినప్పుడల్లా మాపెద తల్లి కూతురుగారి యింట్లో దిగడం నాకు రివాజు. ఆ మారూ అలాగేచేశాను. మా మేనత్త కొడుకు ఆ మధ్యనే బదిలీ అయి వచ్చాడు హైదరాబాదు. పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు. వాడిని చూసి చాలా రోజులు అయింది. ఆఫీసులో కలుసుకున్నాను. "మా పిల్లల్ని నువ్వు చూడనే లేదు. మా యింటికి ఒక్క మారు రా" అన్నాడు. 'ఎప్పుడురాను?' అన్నాను. 'రేపు' అన్నాడు. 'ఎన్ని గంటలకు' అన్నాను. 'సాయంత్రం ఏడు గంటలకురా' అన్నాడు.

నాకు స్వయంగా మేనత్త కొడుకు. సాయంత్రం ఏడుగంటలకు వాళ్ల ఇంటికి రమ్మంటే ఏమనుకోను? భోజనానికే అనుకొన్నాను.

మర్నాడు బయలుదేరేటప్పుడు మా అక్కయ్యతో చెప్పాను— మా మేనత్త కొడుకు ఇంటికి భోజనానికి వెడుతున్నా ననీ, నా కోసం వంటచెయ్యవద్దనీ.

చాలాదూరంగా ఉన్న వాళ్లింటికి వాకబు చేసుకుంటూ వెళ్ళేను. వాళ్లు చాలా ఆప్యాయంగా పలకరించేరు. వాళ్ల పెళ్లిలో మాత్రమే చూశా నామెను. మళ్ళీ చూడలేదు. ఇదే చూడటం. చాలా పరి చయంగా కలివిడిగా మాట్లాడింది. వెళ్ల గానే కాఫీ ఇచ్చింది. ఇంతలేటుగా కాఫీ ఎందుకు, అలవాటు లేదన్నాను. పళ్ల రసం ఇచ్చింది. ఇది మాత్రం ఇప్పు డెందుకు? అన్నాను. 'భోజనానికిముందు' అని మాత్రం అనలేదు.

సుమారు రెండుగంటలపాటు ప్రపం చంలోని వ్యవహారాలన్నీ చర్చించాము. తొమ్మిదిగంటలు దాటినా వాళ్లు భోజ నానికి తొందరపడుతున్నట్లు లేరు. చివ రకు నేనే సున్నితంగా వాళ్లను తొందర చేస్తే బాగుంటుందని 'ఇక వెడతాను' అన్నాను. 'అవును టైము చాలాఅయింది మళ్లీ హైదరాబాదు వచ్చినప్పుడు మళ్ళీ తప్పకరండి' అన్నారు వాళ్లిద్దరూ.

ఆకలి దంచుతూఉంది. ఇప్పుడేమిటి చెయ్యడం. ఇంటికి వెడితే మా అక్క భోజనం సిద్ధంగాలేకపోయినా వండిపెడు తుంది. కాని ఈమాట...నేనువాళ్లింట్లో భోజనం చెయ్య లేదన్నమాట ఎవరికీ తెలియక పోతేనే మావాడి గౌరవం, నా గౌరవం దక్కుతాయి. తెలిస్తే ఇద్దరికీ నగుబాటే. అందుచేత దారిలోనిహోటల్లో భోజనంచేసి, రాత్రి పదిగంటలకు మా అక్కయ్యగారి యింటికి వచ్చాను.

మా అక్కయ్య "భోజనం చేశా వురా?" అంది. ఆమె ఉద్దేశ్యం మా మేనత్త కొడుకు యింట్లోనని.

నేను "ఆఁ" అన్నాను. ఆమె నన్ను అడిగిన ప్రశ్నకు అది సమాధానమే కదా?



పి.వి.ఆర్. శివ కుమార్

# నీడా-నిజం

"బెల్ మారో భాయ్ ...బెల్ మారో..."

'ఠంగ్... ఠంగ్...' గంట మోగింది. బస్ కదిలింది. బస్ నిండా జనం క్రిక్కిరిసిపోయి ఆ బస్సు భారత దేశానికి ప్రతీకలాగుంది! సీట్లలో కూర్చుని జనం. మధ్యలో నుంచుని జనం. దారిలోనూ, ఫుట్ బోర్డ్ మీదా 'నిలబడ్డ స్థితి' లో జనం!

బయట వ్రేలాడుతున్న వాళ్లందరూ లోపలికి చొరబడాల్లని ప్రయత్నం— అప్పటికే చొరబడినవాళ్ళు బయటివాళ్ల నరికట్టే యత్నం - బ్రతుకులో సోపానాల్నధిరోహించటంలో పోటీలా యిక్కడా మెట్లెక్కడానికి పోటీ! మధ్య తరగతి మెంటాలిటీకి మొదటి రకంగా ప్రదర్శనం!

తూలి పడబోయి, పైనున్న కడ్డీ పట్టుకు, యీడుకుంటూ ముందుకు నడిచాడు అనంతం.

'అబ్బ! డబుల్ డెక్కర్లోగూడా ఎంత రష్షో! మనస్సులోనే అనుకునానిడు.

అప్పుడే ఆఫీసులన్నీ వదిలారు. అందుకే అంతటా రష్! రెండు బస్సులు వరసాగ్గా వెళ్ళినా స్టాపులో మరో బస్‌కి సరిపడ్డ జనం!

'కోనై జీ కోనై టికేట్ లేనేకా ?'

అరుచుకుంటూ జనంలో తిరుగుతున్నాడు కండక్టర్. పూర్తి డబ్బులిచ్చిన వాళ్ళకి కసకసా టికెట్లు కోసేస్తున్నాడు. అర్ధ ఛార్జియో, పది పైసలో చేతిలో పెట్టిన వాళ్ళవంక ఆదరంగా చూస్తూ ఆ డబ్బుల్ని బాగ్‌లో వేసేసుకు ముందుకి సాగిపోతున్నాడు.

'వెధవ్వేషాలూ... వెధవ జనమూనూ! మళ్ళీ మాటాడిస్తే ఒకోడూ దేశోద్ధారకుల్లా ఖబుర్లు! బస్ కొనొచ్చే సరికల్లా కండక్టర్ లాలూచీ? గవర్మెంటు నెత్తికి చెయ్యి! గవర్మెంటెవరిదో... మన్దికాదూ ?'

తనకంత చొరవ లేదన్న బాధతో, మనసులోనే తిట్టుకున్నాడు అనంతం.

'ఆప్ లియే సాబ్ ? ఆప్ లియే ?' వరసాగ్గా అడుగుతూ వస్తున్నాడు.

చెయ్యి పెట్టాడు అనంతం. చిల్లర పదిహేను పైసలూ వేళ్ళకి తగిలింది.

'ఎలా ? చిక్కడపల్లికి టికెట్టు యిరవయ్యయిదు పైసలు. వెధవ పది పైసల కోసం, ఉన్న ఒక్క అయిదు రూపాయల నోటూ మార్చాలి!'

పోనీ, 'కామ్'గా పదిపైసలు మాత్రం చేతిలో పెట్టేసి, టికెట్ అడక్కుండా వూరుకొంటే ?

అమ్మో!... మధ్య దార్లో ఏ చెకింగ్ కలక్టార్రి వస్తే... ఎలాగూ రాడు! ఆ సంగతెలిసీ, అనంతమలా చెయ్యలేడు. అంత ధైర్యమే వుంటే, అసలంత సేపాలోచించనే... చించడు.

"టికెట్ లియే సాబ్ ?"

కండక్టర్ మాటల్తో వులిక్కిపడి, అప్రయత్నంగానే, జేబులోని ఐదురూపాయల నోటు తీసి అందించాడు:

"చిక్కడ పల్లికి ఒకటి."

"చిల్లర లేదు సాబ్..."

"నాదగ్గిరా లేదయ్యా..." చికాగ్గా అన్నాడు అనంతం.

"అయితే జర వుండండి. మల్లయిస్తా."

టికెట్ చింపి, పెన్సిల్తో వెనకాల 4-75 అని వేసి, ఇనిషియల్ చేసి చేతిలో పెట్టి ముందుకు సాగిపోయాడు కండక్టర్. నాలుగు సార్లు వెనకదంతా చూసి, భద్రంగా జేబులో పెట్టుకున్నాడనంతం.

'లిబర్టీ...' కండక్టర్ పొలికేక.

కిటికీ లోంచి తొంగి చూశాడు.

'డబల్‌డెక్కర్లోయీ రూట్నరావటం యిదే మొదలు. లిబర్టీ టాకీస్ యింత చిన్నగా వుందేం? పయిన్నించి చూడబట్టా? ఇంతకీ ఏం సినిమా ఆడుతోంది? 'వరల్డ్ బై నైట్'...అర్ధనగ్న




సుందరుల అర్ధరాత్రి చర్యల్ని చూపిస్తాడు గావును! పైగా, 'ఏ' సర్టిఫికెట్ ఒకటి! అంటే ప్రత్యేకంగా పిన్నలకి ఆహ్వానం! వీళ్ళుకదూ జనాభా నిలా చెడగొడుతోంది?'

బస్సు కదిలింది... ఆలోచనలూ కదిలాయి.

'ఇంత కష్టపడీ వెళ్తే, యింతకీ సత్యం యింట్లో వుంటాడా? ఏమోఁ! వాణ్ణి నమ్మిచావలేం! ఒక్క క్షణం కొంపలో తగులడ్డు! ఆఫీసొదిలిన కాణ్ణించీ భద్రతా ఏజంటులా ఒకటే తిరుగుడు!... ఏ రోడ్లు సర్వే చేస్తాడో ఏమో! ఏమో, వాడిస్తానన్న డబ్బు మీద ఆశపెట్టుకునే వెళ్తున్నాడు తను!

నెల యింకా పదిహేన్రోజులన్నా కాలేదు – లేదా – యింకా పదిహేన్రోజులన్నా గడవాలి. అప్పుడే పైసలేదు చేతిలో! మధ్యాహ్నం ఫోనుచేసి అడిగాడు తను, ఓ యాభై వుంటే సర్దమని! అయిదు నిముషాలు నాన్చి, నాన్చి అన్నాడు:

"సాయింత్రం యింటికెరా. మా ఆవిడ దగ్గర అడుగుతా, నాదగ్గరేవుఁంది?.." అవటాని!

జోరూకా గులాం గాడు! ఆవిడో ఇందిరాగాంధి! తన్నివేళ కరుణిస్తుందో, ఆంధ్రప్రదేశాన్నిలా తిరస్కరించి పారేస్తుందో! ఆవిడగాని యివ్వనందా, ఇహ తన పని గోవింద! ఈ వున్న అయిదు రూపాయలతో ఎన్నాళ్ళు...

అరె! అయిదు రూపాయలు!... అవును, అయిదు రూపాయలు! ఇంకా చిల్లరివ్వలేదేం యీ కండక్టరు? ఎంత దూరముంది చిక్కడపల్లి యింకా?

హిమాయత్‌నగర్ టర్నింగ్ తీసుకుంటోంది బస్.

'మరో మూడు స్టాపులున్నాయి, ఫర్వాలేదు. అయినా, యింకా ఎందుకివ్వలేదు చెప్మా వీడు? ఏమో... ఈ బస్ కండక్టర్లని నమ్మటానికి వీల్లేదు మర్చిపోతామేమో, ఎగేద్దామనే ఎత్తు! ఛ... ఛ... అవినీతి యింత దారుణంగా ప్రబలిపోబట్టే లోకమిలా తగులడిపోతోంది. ప్రతి వాడికీ కావాలి డబ్బు. మళ్ళీ, కష్టపడటాని కెవడికీ వొళ్ళొంగదు.

అందుకని కాదూ యీ లాట్రీల వాళ్ళూ, గుర్రాల వాళ్ళూ యింతలా డబ్బులు పోసుకుంటోంది!

ప్రతి వాడికీ నెల మొదట్లో వచ్చే జీతం మీదికన్నా, ఆ నెల్లోవచ్చే లాటరీ ఫలితాల మీదే దృష్టి.

'అయ్యోరాత! యింకా చిల్లరివ్వడేం వీడు? అసలెక్కడున్నాడు?'

పక్కవాడి మీంచి వొంగి మరీ చూశాడు బస్సంతా, అనంతం.

'అరె, ఏడీ? మొత్తం బస్సులో ఎక్కడా లేడే? కొంపదీసి బస్సుగాని దిగిపోలేదు గద!

తన ఖంగారుగానీ, ఎలాదిగుతాడు?

ఏమో, కింది కండక్టర్‌కి డ్యూటీ వప్పజెప్పి, మళ్ళీ తిరిగొచ్చేటప్పు డెక్కుతానన్జెప్పి...

సాధ్యమేనా యిలా?

ఛ. ఛో... వెధవనుమానాలూ నువ్వూనూ! ఈ రోజుల్లో ఏది సాధ్యం కాదు? వాళ్ళిద్దరికే సవాలక్ష లాలూచీ లుంటై! యీ అయిదు రూపాయిల్లో వాడికో రెండు వాటా పెడితేసరి. అయిపోయింది. ఆ అయిదు రూపాయల నోటూ పోయినట్టే! యిప్పుడెలా? చేతిలో పదిహేను పైసలకి మించి మరో గూడా లేదే, ఎంత హీనమైన పరిస్థితి!

ఈ టికెట్టు పట్టుకెళ్ళి, ఆర్టీవో ఆఫీసులో అడిగితే?

ఏమో, 'ఈ' కోడి గిలుకుడు 'ఫలానా కండక్టరు సంతకమే' నని ఏమిటి రుజువు?నువ్వు గీసుకొచ్చావ్వేపో' మ్మని తరిమితే?

ఛ... ఛ... బుద్ధితక్కువై చిల్లర లేకుండా బస్సెక్కాను! అయిదు రూపాయలూ అర్పణ!

ఛీ... సత్యానికి చోట్లేకండాపోయిందీ లోకంలో. నీతికి, నిజాయితీకి కాలం తీరిపోయింది.

చూద్దాం, ఒహవేళ వాడు క్రిందనే వున్నా వున్నాడేమ్మో! అరె, అప్పుడే 'వెంకటేశ' వొచ్చేసిందే! ఇహ ఒక్క స్టాపుందంతే – త్వరపడాలి.'

గబ గబ సీట్లోంచి లేచి, గుమ్మం దగ్గరకు నడిచాడు. మెట్లు సగం దిగాడు...

'ఆర్నీ! మెట్ల కిందే నిలబడున్నాడు కండక్టర్! ఓరి వెధవా, నువ్విక్కడే వున్నావూ? ఇహనెట్లా తప్పించుకు పోతావో చూసాను.'

ఎవఁయ్యోయ్, నాచిల్లర డబ్బులు. పొలికేకపెట్టా డనంతం.

ఉలిక్కి పడి చూశాడు కండక్టర్. బస్సులో జనం మెట్ల మీది జనం గూడా వింతగా చూశారు అనంతాన్ని.

'ఏడిశారు. ఎలాచూస్తే ఎ వ డి క్కావాలి? ఒక్క పైస యిస్తాడా వూరికే, వీళ్ళలో ఎవడైనా?'

"ఇస్తా నుండవయ్యా! గట్ల పరేశా నైతవేంది?" కసిర్నట్టుగా అన్నాడు కండకర్.

కసుర్తాడు. కసరడూ మరి! కొట్టే శాననుకున్న అయిదు రూపాయలూ దొరక్కుండా పోయె! ఎదురుగుండా లేకుంటే, బస్సు రద్దీలో మర్చిపోతానను కున్నాడు గావును. నేనా? హుఁ—

జనాన్ని నెట్టుకుంటూ మెట్లుదిగే సరికి, చిక్కడపల్లి స్టాపు రానే వచ్చింది.

"లేలో సాబ్ ఆప్‌కీ పెసా..."

చెయ్యి చాపాడు అనంతం.

అరే, అదేమిటి! అయిదు రూపాయల నోటులో మరో కొన్ని రూపాయి నోట్లు పెట్టి యిస్తున్నాడు?... ఏమోలే, ముందు అందుకుంటే సరి. దిగాలి గబ గబ... టికెట్టు అతడి చేతిలో పెట్టి, గబుక్కున డబ్బు అందుకు హడావిడిగా దిగిపోయాడు అనంతం.

బస్సు కదిలి పోయింది దుమ్ము రేపు కుంటూ. అగరు ధూమంలా తోచిందా దుమ్ము అనంతానికి.

చటుక్కున గుప్పిడితెరచి చూశాడు. అయిదు రూపాయల నోటు, అందులో మరోనాలుగు రూపాయి నోట్లు, ఆపైన మూడు పావలా బిళ్లలు!

'అహ్హహ్హా! వెధవ! పది రూపాయల నోటిచ్చా ననుకున్నాడు గావును. వొదిలి పోయింది తెగులు. (!?)

ఆహా! యివాళ లేచి ఎవడి మొహం చూశానో గానీ— అయిదు రూపా యలు... అప్పళంగా... లాభం."

ఆనందంగా ఆ డబ్బు జేబులో పెట్టుకుని, అరగంట నుంచీ ఆలో చిస్తున్న 'సత్యం' కోసం నడక సాగిం చాడు అనంతం.



# చుట్టాలొస్తున్నారు జాగ్రత్త!

సాయంత్రం ఇల్లు జేరగానే కరెంటు లేదని తిట్టుకుంటూ బూట్లు విప్పి విసుగ్గా పారేసిన రవి ఈ నాడు మరి కాస్త 'టెంపో'లో ఉన్నట్లు గ్రహించింది లలిత.

గ్లాసునిండా నీళ్ళందించి అలాగే నుంచున్న భార్యకొక ఇన్‌లెండ్ కవరు అందించి ఆమె ముఖంలో మారబోయే రంగులకోసం ఆత్రంగా చూస్తున్నాడు

నొసలు చిట్లించి పెదాలు వికృతంగా వొంచి అంది : "మీ ఫ్రెండ్‌కు కనీసపు మర్యాదలు కూడా తెలిసినట్లు లేవు" అంటూ ఉత్తరం తిరిగిచ్చేసింది. ఆ కనీసపు మర్యాద ఉండబట్టే తన బావ- అంటే తన భర్త అంటే రవికిఉద్యోగం ఇప్పించిన సంగతి తెలిసినా ఆ క్షణంలో విస్మరించింది. ఉత్తరాన్ని భాగవతం చదివే పోజులో చేతులు వ్రేళ్ళుతిప్పుతూ భావయుక్తంగా చదివి, వుండ మూలకు విసిరేసింది.

రవి-ప్రసాదులు కలిసి విశాఖలో ఎం. ఏ. చదివారు. ప్రాణస్నేహితుల్లా మసలారు. ప్రసాద్ వేసవి సెలవుల్లో రవి దగ్గరకొస్తున్నట్లు- వచ్చే సోమవారమే భార్యాపుత్రుల సమేతంగా భోపాల్‌నుంచి దక్షిణ ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నట్లు వార్త తెచ్చిందా లేఖ.

"ఏం చేద్దాం?" అని ఇద్దరు ఆలోచించటం మొదలుపెట్టారు.

"వాళ్ళకు వాళ్ళవాళ్ళెవళ్ళూ లేరా?" విసుగ్గా అడిగింది లలిత.

"ఉన్నారనుకో. లత తలిదండ్రులు అండమాన్స్‌లో ఉన్నారు. ఆయన కక్కడ ఉద్యోగం. ప్రసాదుకు ఒక అక్కయ్య కొచ్చిన్‌లో ఉంది."

"ఓహో-గతిలేక మనపాలబడ్తున్నారన్నమాట. కొచ్చిన్‌కు వెళ్ళరాదూ?"

"రాశాడుగా-లత హైద్రాబాద్ చూచినట్లుంటుందని!"

"తప్పించుకోలేమా? ఏదో ఒకటి రాసేద్దాం."

"ఊహు...ఏమన్నా అనుకొంటాడు. అసలు నాకొక్క భయం. వాడు చాలా భోళామనిషి. బాగా డబ్బుంది. అటువంటివారి దర్జాలు-తిరుగుళ్ళు-సరదాలు మనబోటివాళ్ళం భరించగలమా అని".

నలుగురు పిల్లలు! పెద్దలిద్దరు! ఈ సిటీలో లింగులింగుమంటూ మనకొచ్చే



ఆరువందల రూపాయలలో కాస్త వెన కేసుకున్నాము. వీళ్ళ రాకతో ఆ డబ్బంతా హరించుకుపోవలసిందేనా?" సవాలు చేస్తున్నట్టు ప్రశ్నించిదామె.

ఆమె మాటల్లో ఎంతేనా యదార్థ ముంది. "ఉహు–హరించుకు పోవటానికి వీల్లేదు". ఆ ఇరువురు చాలా సేపు ఖర్చు లెలా తగ్గించుకోవాలో ఆలోచిస్తూ కూర్చున్నారు. ఒక రాగాన పడగానే తృప్తిగా లేచారు.

*　　*

సికింద్రాబాద్ స్టేషన్‌లో దిగి రవి రానికారణంగా వారు ఆరుగురు పని పిల్లవాడితోసహా టాక్సీలు చేయించుకుని రవి ఇల్లు జేరారు.

రవి కదలకుండా "హల్లో – ఎదురు చూస్తూ కూర్చున్నాను ప్రసాద్..." ప్రసాద్ కరుకుగా అన్నాడు. "ఎదురు చూస్తూ కూర్చుంటే స్టేషన్ చేరతా నను కున్నావా?" అంటూ వరండాలో కొచ్చే సరికి కాలికి పెద్ద కట్టుతో కూర్చున్న రవి కనిపించాడు. ప్రసాద్ అడక్క

ముందే అందుకున్నాడు "మొన్న పాదం తొలగించింది. కాస్త బెణికింది. "అంతే కదా," అంటూ కరచాలనం చేశాడు. పరిచయాలయ్యాయి.

కుందనపు బొమ్మలా మెరిసిపోతున్న లతను మరీ మరీ చూడబుద్ధి వేస్తుంది. అలా చూడకూడదని సర్ది చెప్పుకుంది లలిత

వాళ్లకు కేటాయించిన గదిలో సామాను సర్దించింది లలిత. అందరికీ కాఫీలు అందించింది. ఒక్కొక్కరు స్నానంచేసి ఇవతలి కొస్తుంటే ప్రసాద్, రవి కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.

"ఈ సంవత్సరం హైద్రాబాద్ ఏమీ బాగులేదనుకో, నీళ్ళు సరిగా రావు. పవర్ కట్ ఒకటి- తాజా కూరగాయల ధరలు మండిపోతున్నాయనుకో - ఇక పాలా? ఒక్క సీసా దొరుకుతుంది. దానిని పెరుగుకోసం ఉంచి అముల్ తో కాఫీ చేస్తున్నాము. కాస్త ముందుగా రాసి ఉంటే టైం బాగులేదని రాసేసేవాణ్ణి. మీకు అన్నీ వసతిగా ఉండవేమో అని భయంగా ఉంది," చాల ఫీలవుతున్నట్లు ముఖం మార్చి చెప్పాడు.

ప్రసాద్ తేలికగా నవ్వేశాడు "దట్స్ ఆల్ రైట్. వచ్చింది తింటానికి కాదుగా? వేసవిలోతప్ప మరోటైంలో సెలవు పెడ్తే కష్టం. పిల్లల చదువులు పాడవుతాయి. బావుల్లోంచి మైలుదూరం నించి నీళ్ల తెచ్చుకోవాలంటే - మరి తెల్లవారు ఝామున అంతా బిందెలు తీసుకుని..."

రవి అతని మాటల కడ్డుతగిలి నవ్వేశాడు. ప్రసాద్ కూడ నవ్వాడు. లత ఒక్కొక్కరికి గుడ్డలువేసి బైటికి పంపింది. చంటివాడు మాత్రం వెంటనే నిద్రపోయాడు.

లలిత "ఏమున్నా కావాలంటే కేక వెయ్యండి. ఒరే చంద్రం- అమ్మగార్కి ఏమేమి కావాలో చూడు" అని ఓ నవ్వు నవ్వేసి వెళ్ళింది. లలితను చూచి లత చాలా ఆశ్చర్యపోయింది.

మెడలో నల్లపూసలు-పసుపుత్రాడు- చేతులకు నీరుపట్టిన పాత ఏడురాళ్ల కమ్మలు తప్ప ఏమీలేవు! పాపం - లేవు కాబోలు అనుకుంది.

పిల్లలు ఆరుగురు ఎంతో సర్దాగా కేకలేసూ ఆడుకుంటున్నారు. ప్లేట్లలో టిఫిన్ సర్ది అతిథుల్ని పిల్చింది. రవి మెల్లగా కుంటుకుంటూవచ్చి కూర్చున్నాడు. రెండేసి ఇడ్లీలు,పచ్చడిఉన్నాయి ఆరేప్లేట్లు, తనపిల్లలుకూడ తినటానికి రాగానే లలిత కసురుకుంది. "ఇందాక నేగా తిన్నారు. మళ్లీ వచ్చారేం? పొండి..."

"రెండేసేగా?" అన్నాడొకడు.

"వెధవా! రెండేసిగాక పల్లెటూరి బైతులా పది తిందామనుకున్నారా? పొండి...తర్వాత అరటిపండిస్తా గాని" వాళ్లు మరేమన్నా అంటారేమోనని

ఉరిమి చూచింది. నాల్గురోజులుగా తల్లి అనవసరంగా ఎందుకిలా గద్దించి మాట్లాడుతున్నదో తెలియక-క్రితంరోజు తొడపాశం గుర్తు కొచ్చి ముగ్గురూ పారి పోయారు."

లత నోరు తెరచుకుని ఇదంతా చూచి మెల్లగా అంది, "చిన్న పిల్లలు. పోసీ మరో రెండు తింటారు. వాళ్ళు ఎగిరే దానికి-అరిచే దానికి ఎప్పుడో అవి అరిగి పోయే ఉంటాయి."

"ఒద్దులెండి, పండ్లిస్తాను" అని బైటి కెళ్ళి మూడు పండ్లిచ్చి వచ్చేసింది. అంతా పెట్టిన రెండు ఇడ్లీలు తిన్నారు-మరి రెండేసి వేసుకున్నారు. ఇంకా తినాలని ఉన్నా అక్కడ ఎక్స్ట్రా ఏమీ లేవు. పిల్లల ఆకలి, వారి తిండితీరు తెలిసిన లత గబగబ వెళ్లి చేయి కడుక్కొని తాను తెచ్చిన ఒక మిఠాయిడబ్బా తెచ్చి ప్లేటునిండాపెట్టి అందరికీ మూడేసి చొప్పున అందించింది. బైట ఉన్న పిల్లలుకూడావచ్చి తినేసి వెళ్లారు. మరో తెరవని డబ్బా నిండుగా అలాగే బల్లమీద పెడ్తూ, "ఇందులో గులాబ్‌జాం లున్నాయి. భద్రం చెయ్యండి" అంది. "అయ్యో ఇవన్నీ దేనికి?" అని అంటూనే వాటిని భద్రం చేసింది లలిత.

అక్కడే కూర్చుని మాట్లాడుకుంటున్నారు. మాటల సందర్భంలో లలిత అన్నది లతతో "ఆపరేషన్ చేయించుకున్నప్పటి నించి ఒకటే నీరసం. ఆరు నెలలు పూర్తిగా రెస్ట్ అంటారు. మన కెక్కడ కుదుర్తుంది చెప్పండి? అలాగే ఏదో సర్దుకుపోతున్నాను."

"లలిత అనారోగ్యంగా ఉన్నట్లుఅనిపించటం లేదు. నాగానే బలంగా కనబడుతోంది. ఈ సంసారాన్ని పిల్లల్ని దిద్దుకునేసరికి ఎవరికి నీరసమనిపించదు? పాపం" అనుకుంది లత.

అటు రవి ప్రసాద్‌ను హెచ్చరిస్తున్నాడు. "నేనూ సెలవుపెట్టాను. మీతో పాటు తిరగలేనురా. కాని బస్‌రూట్స్ ఆ నంబర్లు అన్నీ వివరాలు చెప్పగలను. నాల్గురోజులైతే ఆ తర్వాత మెల్లగా వెళ్లి రావచ్చు. ఎన్నాళ్లకనివచ్చారు? నెల రోజులుంటారుగా?"

"చూద్దాం, ఇంకా ఏప్లాన్ వేసుకో లేదు. పది పదిహేను రోజులుండాలని. అక్కయ్య దగ్గరికెళ్దామనివుంది. ఏమో" అంటూ మాటలు నాన్చాడు.

"అదేమిటి పది-పదిహే నంటావు? ఐనా అదంతా ఇప్పుడెందుకులే, తర్వాత చూచుకోవచ్చు. రెస్ట్ తీసుకో-వంటింట్లో ఏంకావాలో ఓ మాట కనుక్కుంటాను"

ప్రసాద్ ఇవతలి కొచ్చేశాడు. ఏమేమి కూరగాయలు-సరకులు తేవాలో రవికి చెబుతోంది. ప్రసాద్ అంతగా పట్టించుకోలేదు. ఒక్క కునుకు దీసి లేచేసరికి పదకొండు గంటలైంది.

టీ త్రాగాలనిపించినా ఎందుకులెమ్మని వూరుకున్నాడు. మెల్లగా వచ్చి

ముందర గదిలో కూర్చుని రేడియో ఆన్ చేశాడు. ఏ శబ్దం రాలేదు. రవి వచ్చి నవ్వుతూ అన్నాడు. "అది అలసి పోయింది ప్రసాద్. షాప్ కెళ్లాలి,ఎప్పుడో తీరిక సమయంలో తీసుకెళ్ళాలి" మెల్లగా కూర్చున్నాడు.

"ఏమిటి ప్రోగ్రాం?"

"సాయంత్రం ఎక్కడికి కెళ్తే బాగుం టుందటావు?''

నాలుగైదు పేర్లు చెప్పాడు రవి. "పబ్లిక్ గార్డెన్స్‌కు వెళ్ళండి. బావుం టుంది"... అలా కబుర్లలో పడి పోయారు.

పన్నెండు దాటింది. వంటింట్లోంచి పోపు వాసనలు - చుయ్ — సయ్‌మనే చప్పుళ్ళు వినవస్తున్నా భోజనం చేయ టానికి పిలుపు మాత్రం రావడంలేదు. చంటివాణ్ణి వేసుకుని లత హాయిగా నిద్ర పోతోంది. పిల్లలు ఆట చాలించి ఆవు రావురుమంటూ వచ్చి కూర్చున్నారు.

"ఆకలేస్తోంది" - అంటున్నా అటు రవిగాని ఇటు లలితగాని మా ట లు విన్పించుకున్నట్లు లేరు. ప్రసాద్‌మాత్రం "అయిపోయింది లెండి, అత్తయ్య పిలు స్తుంది" అంటూ వారికి ఆశకల్పించాడు. పిల్లలకే కాదు - ప్రసాద్‌కు కూడ ఆక లేస్తోంది. సెలవురోజులు— ఖాళీగా ఉన్న సమయం - తిండిమీదే ధ్యానం కావాలి! పన్నెండున్నర - ఒంటిగంట — ఇంకా వంట అయినట్లు లేదు. లతకు మెలకువ వచ్చింది. సిగ్గుపడింది టైముచూచి. గబ గబ లేచి వెళ్ళింది. పిల్లలు నిద్రపోతు న్నారు. భోంచేశారు కాబోలు ననుకుంది. తనను నిద్రపోతున్నందుకు లేపలేదను కుంది. ముఖం కడుక్కుని లలిత దగ్గర కెళ్ళింది. అప్పటికిగాని పరిస్థితి అర్థంకాలే దామెకు.

వడ్డించి పిల్చేసరికి ఒంటిగంటన్న రైంది. అక్కడ రకరకాల పిండివంటలు లేవు. అతి మామూలు భోజనం. పప్పు— చారు - ఒక వేపుడు — ఒక పచ్చడి. ఈ మాత్రం దానికింత టైంతీసుకుందేం లలిత? ఇదీ ఒక 'కళ' కాబోలు నను కున్నారు. భోజనం చెయ్యబోతే ఏదో ఒక రుచి లోపించినట్లు - లేక ఎక్కువై నట్లో ఉంది. రవి మామూలుగా తృప్తిగా తిని లేచాడు. ఇల్లాంటి తిండి తిండే సునాయాసంగా 'డయట్' చేసి సన్నబడ వచ్చనుకున్నాడు ప్రసాద్. పిల్లల్ని నిద్ర లేపుకొస్తే ఆ మత్తులో సరిగ్గా తినలేక పోయారు. అందునా కారం ఎక్కువో లేక పులుపెక్కువో అయినందువల్ల అసలుకన్నా తక్కువ తిని మళ్ళీ పరి గెత్తి వెళ్ళిపోయి పడుకున్నారు.

ఆ సాయంత్రం టాక్సీలో పబ్లిక్ గార్డెన్స్‌కు వెళ్లారు. తల్లి తండ్రి లేకుండా రవి వాళ్ళ నౌకరు లేకుండా వాళ్ళ ముగ్గురిపిల్లల్ని కూడ వెంట తీసుకెళ్ళి టంతో వారు నానా అవస్థలు పడవలసి వ చ్చిం ది! అందరు ఎ ని మి ది

సంవత్సరాల లోపువారే! వీళ్లను కూడ తీసుకెళ్ళు ప్రసాద్ అంటే - "ఓ-కె" అన్నాడు. తీరా వెళ్లాకగాని అసలు సాధకబాధకాలు తెలిసాయి కావు. హాయిగా ఆ చల్లగాలిలో రంగు రంగు పూవులతో విరాజిల్లుతోన్న గార్డెన్స్‌లో (ఫరవాలేదు - వేసవి అయినా శ్రద్ధగానే పెంచుతున్నారు!) కూర్చుని ఇహ లోక బాధల కతీతంగా కూర్చోవాలను కున్న ప్రసాద్ లతలు అనుక్షణం ఈ ఐహికబాధలకే తమకాలం వ్యయం చేయ వలసివచ్చినందు కమితంగా బాధపడ్డారు. "పోనీలే పాపం - వాడికి కాలు బాగా లేదు. బావుంటే కూడావచ్చి ఎంతో సాయపడేవాడు. ఆమె-లలిత పల్లెటూరి పిల్ల - ఏదీ అమర్చుకోవటంగాని- అతిథులకు సదుపాయాలు చేయటంగానీ తెలియనట్లుంది. పల్లెటూర్లో తిన్నట్లు పెడ్తోందా తిండి. పాపం ఆ రవి ఎలా నెగ్గుకొస్తున్నాడో పాపం!" అని విచా రించాడు.

అనుకున్నట్లు మూడు గంట లుండ కుండా గంటన్నర కంతా ఇంటికి తిరి గొచ్చారు. టాక్సీ శబ్దం విన్న రవి-లతలు ముసిముసిగా నవ్వుకున్నారు! అంతవరకు బాగానే నాటకం ఆడుతు న్నారు.

పదిమంది ఇంట్లో అడుగుపెట్టగానే అదొక సంత బజారులా తయారయింది. రవి కాలికి ఆవనూనె రాసి మర్దన చేస్తోంది లలిత. ఆ దృశ్యం చూచి ప్రసాద్ అమితంగా ఆనందించాడు. "పోనీ పాపం ఏదో సేవ చేస్తోంది" అను కున్నాడు.

"వీళ్లు ఐస్‌క్రీం మాత్రం తిన్నారు. త్వరగా భోజనం పెట్టేస్తే పడుకుంటారు" అంది లత.

"అయ్యో - మేము అక్కడికెళ్తే కడుపునిండా ఏదో కొనిపెట్టేసి హాయిగా ఇంటి కొస్తాము. ఏమీ తినకుండానే పడు కుంటారు. నేను — వారు మజ్జిగన్నం తింటే తింటాం లేకపోతే లేదు." లతతో అంటుంటే రవి చిరుగా నవ్వుతూ వింటు న్నాడు.

"ఎందుకో రవీ - పిల్లలకి బజారు సరకు కొనిపెట్టటం అలవాటులేదు మాకు. లేనిపోని జబ్బులొస్తాయని భయం. అసలు ఈ వెధవ ఐస్‌క్రీంకూడా తినటం ఇష్టంలేదు. కానీ ఏం చెయ్యను - ఆరు గురు ఒకటే వేదించారు. ఆ చంటివాడు కూడా వాళ్ళు తింటుంటే కావాలని ఎగ బ్రాకుతుంటే!"

"అయ్యో - అప్పుడప్పుడు ఆ వెధవ బజారుసరుకే వారికి పెట్టాలి. కాస్త కాస్త ఇన్‌ఫెక్షన్‌కు పిల్లల శరీరాలు అలవాటు పడి ఇమ్యూనిటీని పొందుతాయి," అని గలగల నవ్వాడు.

"ఇలా కూర్చుంటే కాదు. ఏదో ఒకటి వండు లలితా" అని ఆమెను పంపు తుంటే ప్రసాద్ లత గుండెలు గతుక్కు

మన్నాయి. ఒకరినొకరు చూచుకోవాలన్నా ధైర్యం చాలక అతికష్టంతో ఏదో కబుర్లలోకి పడ్డారు.

ఈ పూట కూడా పిల్లలు అర్థాకలితో పడుకున్నారు.

"అమ్మా ఇంత ఆలస్యంగా ఎందుకు వండుతున్నావు'' అని పెద్దాడు అడిగితే కస్సుమని లేచి వాడి చెవినులిమి "మరో మాటు నన్ను ఏమీ అడక్కు, ఫో" అని గద్దించింది. ఆమాటలు ఎవరు వినకుండా జాగ్రత్తపడింది. వాడు కన్నీళ్ళు ఆపుకుంటూ మరో గదిలోకి పరిగెత్తి వెళ్ళిపోయి ఏమీ తినకుండానే నిద్రపోయాడు. లలిత ఎంతో బాధపడినా ఒక్కరోజేలే-ఫరవాలేదని మనసు దిటవుచేసుకుంది.

రాత్రి భోజనాలయ్యేసరికి పది గంటలు దాటింది. వంకాయకూర పెసర పప్పుచారు చేసింది. బాగా పులిసిన మజ్జిగ ఎంతో ఆప్యాయంగా వడ్డిస్తుంటే రవి బాగానే తిన్నాడు. ప్రసాద్ - లత ఆమె కొసరి కొసరి వడ్డిస్తుంటే అతి కష్టంతో తిన్నా కంచాలు ఖాళీచేయలేక పోయారు.

"మీవి మరీ నాజూకుతిళ్ళు అన్నయ్యగారూ" అంటూ నవ్వింది. "ఈవంకాయ కూరుంటే ఇకఏమీ అక్కర్లేదులలితా" అని ఎంతో మెచ్చుకుంటుంటే ఆమె పొంగిపోతూ సిగ్గు అభినయించింది.

ఆ రాత్రి ప్రసాద్-లత "ఒక్కరోజు గడిచింది" అనుకున్నారు.

మరుసటిరోజు "సంకటి" లా ఉన్న ఉప్మాతో సర్దేసింది లలిత. ఇక లాభం లేదనుకుని తొమ్మిదింటికి కల్లా సైట్ సీయింగ్‌కు బయలుదేరారు. వెళ్ళక ముందు రాత్రికే వస్తామని భోజనం సిద్ధంగా ఉంచొద్దని చెప్పి మరీ వెళ్ళారు.

వారు కనుమరుగయ్యాక విరగబడి నవ్వాలనిపించినా పిల్లల ఎదుట బైటపడి పోతామేమో అనుకుని అర్థాంతంగా పరస్పరం చూచుకున్నారు.

ఆ పూట మామూలువంటే అయినా రుచిగానే వండుకు తిన్నారు. అక్కడ వాళ్ళు సరాసరి హోటల్‌కెళ్ళి కడుపు నిండా తిని తిరగటానికి బయలుదేరారు. ఆ రాత్రికూడ భోజనాలు ఆలస్యమే అయ్యాయి కానీ పిల్లలకు బాగాతినిపించి తెచ్చారు-అందుకని వారు నిద్రమత్తులో సరిగ్గా తినకపోయినా వాళ్ళు బాధపడ లేదు.

ఆ రాత్రికి "హమ్మయ్య - రెండు రోజులు గడిచాయి'' అనుకున్నారు. మరుసటిరోజు తెల్లారి రవితో అన్నాడు "నా ఫ్రెండ్ ఒకడు కనిపించాడు. రేపు రాత్రికి భోజనం అక్కడే. బాగా రాత్రి అవుతే అక్కడే పడుకుని తెల్లవారి వస్తాము."

ఆ ప్రొద్దుట పూరీలు అనబడే రొట్టె ముక్కలు, బంగాళదుంపకూర పెట్టింది. కూర చాలాబావుందని రవిమెచ్చుకుంటూ తిన్నాడు. నౌక రుచిన్న లెదర్‌సూట్‌కేస్

చిన్న రెటానేబుట్ట తీసుకురాగా అంతా బయలుదేరి సరాసరి ద్వారకా హోటల్‌కి వెళ్ళారు. అక్కడే పెద్దగది తీసుకుని కాసేపు విశ్రాంతి తీసుకుని సాలార్‌జంగ్ మ్యూజియం చూచి రాత్రికి పడుకుని తెల్లవారి బ్రేక్‌ఫాస్ట్‌చేసి ఇంటికి బయలు దేరారు. ఇల్లు చేరిన వెంటనే "అయ్యో టిఫిన్ చేస్తాను" అని లలిత పంతం పట్టింది – ఆమెను ఆ కార్యక్రమం నించి విరమింపచేస్తాకికి వారికెంతో కష్టమైంది.

"పాపం – ఎంతో చేయాలని వుంటుంది. సరిగా రాదు" అని జాలి పడింది లత.

"రవీ! ఈ రాత్రికి రవీంద్రభారతిలో కూచిపూడి నాట్య ప్రదర్శన జరుగు తోంది. నీకుకష్టమేమో లలితనుపంపించ రాదూ? నువ్వు పిల్లలు ఇంట్లోఉండండి".

రవికి ఆ ఛాన్స్ మిస్‌కావటం ఇష్టం లేదు. కానీ తప్పదు. ఒప్పుకున్నాడు. ఆ సాయంత్రం త్వరగానే వంటముగించి భర్తకన్నీ అప్పగించింది.

లత చక్కగా ముస్తాబై ముత్యాలు కెంపులు పొదిగిన ఆభరణాలు పెట్టు కుని తెల్లక్రేప్‌సిల్క్‌మీద జరీపూలుకుట్టిన చీర, తెల్లరవికె వేసుకుని ఇవతల కొచ్చింది.

ఆ సుందరరూపాన్ని కళ్ళింతింత చేసుకుని చూచింది రవి కూతురు రమ.

పరిగెత్తుకుంటూ తల్లి గదిలో కెళ్ళింది.

ముదర కనకాంబరం రంగు చీరెకు నలుపు జరీఅంచు–బెత్తెడుఉన్న చీరకట్టు కుని తెల్లటి రవికె వేసుకుని రాళ్ళనెక్లెస్ పెట్టుకుంది. ఆమెను తదేకంగా చూస్తూ నుంచుంది ప్రసాద్ కూతురు వినయ. ఎందుకో ఆపిల్లకు అత్త అంత అందంగా కనిపించలేదు.

తల్లినిచూచి ముఖంచిట్లించి 'అమ్మా' అని ఏదో అడగబోయేసరికి లలిత ఒక్క కసురు కసిరి "ఫో, అవతలికి–ఆడుకో పొండి" అంది రమను. తల్లిని ఇంత సాధారణ డ్రస్సులో రమ చూచి ఎరు గదు. ఇవతలికి రాగానే ఆడపిల్లకు ఉక్రోషం వచ్చింది. "వినయా! మా అమ్మకుకూడ ముత్యాల గాజులు – నెక్లెస్ – చెవులకు రింగులు – ఉంగరం– ఉన్నాయి, తెలుసా?" అంది.

పెదాలకు ట్రాన్స్‌పరెంట్ లిప్‌స్టిక్ దిద్దుకుంటున్న లతకు అద్దంలోంచి ఆ పిల్లలు కనబడ్తున్నారు. వారి మాటలు వినవచ్చాయి. వాటికంత ప్రాధాన్యత ఇవ్వలేదు.

కానీ లలితను చూడగానే ఎందుకో ఆ పిల్లమాటలు హృదయాన్ని తట్టినై. 'పాపం–చక్కగాఉన్నా అలంకరించు కోటం రాదు.' అనుకుని లలితను సమీ పించి అన్నది. "మీ రమ ఇప్పుడే అంది మీకు ముత్యాల సెట్టుందని, పెట్టుకోండి. ఇద్దరం సరదాగా ఒకే రకమైన నగలు పెట్టుకుంటే బావుంటుంది."

లలిత పకపక నవ్వి రహస్యంగా అంది "మనం స్నేహితులం. మీకు. చెప్పినాఫరవాలేదు. అవి నకిలీవి" అంది.

"ఓ"- అని మౌనం దాల్చింది లత.

డాన్స్‌ప్రోగ్రాం మూడు గంటలు. అంతాచూచి ఇల్లు జేరేసరికి పదకొండు గంటలైంది. ఏదో తిన్నామనిపించి పడుకున్నారు.

ఆ రాత్రికి అనుకున్నారు నాల్గు రోజులు గడిచిపోయాయి-అని. మరుసటిరోజు రవి ఆఫీసుకు బయలుదేరా లనుకున్నాడు. లలిత తలనొప్పితో లేచింది. రోజూ లత సాయంచేద్దామన్నా లలిత చేయనిచ్చేది కాదు. ఆరోజువద్దన టానికి వీల్లేకపోయింది. లత కాఫీ ఉప్మా చేసింది. మధ్యాహ్నం భోజనం తనే తయారు చేసింది.

లలిత అంతసేపు విశ్రాంతిగ పడుకుంది. రెండేళ్ళయింది తను ఇంత హాయిగాపడుకుని-నాటకం బాగానే ఆడుతున్నామని మురిసిపోయింది. పాపం ప్రసాద్‌కు-లతకు అణుమాత్రంగానైన అనుమానం కలగలేదు.

మధ్యాహ్నం మూడింటికల్లా బయలుదేరి వెళ్ళిపోయారు సైట్‌సీయింగ్‌కు.

"దేవిగారి అలసట తీరిందా?" అని కొంటెగాచూస్తూ అడుగుతుంటే లలిత ముసిముసిగా నవ్వింది. "అప్పుడే సాయంత్రమా?" అని కాఫీ పెట్టడానికి లేచింది.

"కాస్త రుచిగా వండితే ధన్యులం" అంటుంటే లలిత విరగబడి నవ్వింది. "ఇదంతా మనం వేసుకున్న ప్లాన్ అని వాళ్ళకి తెలియనివ్వకుండా బాగానే జరుపుకొస్తున్నాము" అంది ఎంతో గర్వంగా.

అక్కడ లతా - ప్రసాద్‌లు అనుకున్నారు — లలితకు ఒంట్లో కులాసాగా లేదు. నిజమే. ఇంతమందికి వండి వడ్డించటం మామూలువిషయం కాదు. అందునా లలితలాంటి తేగుడు ముఖాని కిది పెద్ద సమస్యే. కనుక మరుసటిరోజు తెల్లవారి హోటల్‌కు పర్మనెంట్‌గా వెళ్ళిపోతే మంచిదనుకున్నారు.

ఆ రాత్రికి రవితో అంటె-రవి ఎంతో నొచ్చుకుంటున్నట్టు నటించాడు. "నెల అని, పదిహేను రోజులని, నాలుగు రోజుల్లో వెళ్తావా?" అని నిష్ఠూరంగా మాట్లాడాడు.

"నువ్వు అర్థంచేసుకోరవీ. టాక్సీలకు రానూ పోనూ బోలెడవుతుంది. మీ ఇల్లు మరీ ఒక కొసకు ఉంది. లలితఆరోగ్యం బాగులేదని లత చెప్పింది. వెళ్ళకముందొకమారు వచ్చి చూచి వెళ్తాంలే" అని ఒప్పించాడు. లలిత చాలా బాధపడినట్లే కనబడ్తూ వారు వెళ్ళటం తనకెంతో అయిష్టమన్నట్లు ముఖం పెట్టుకుని సాగనంపింది.

ప్రసాద్ వెంటనే స్టేషన్‌కెళ్ళి అక్కయ్య కొచ్చిన్‌లో ఉంటే ఆమెను చూడాలని టిక్కెట్లుకొని రిజర్వేషన్ చేయించి వచ్చాడు. మరోవారంలో వారు స్నేహితులనుపిలవటంతోఊరుచూట్టంలో



కాలం గడిపి హాయిగా హోటల్‌లో ఉండి ఆఖరు రోజున గుడ్‌బై చెప్పటానికి రవి ఇంటి కొచ్చారు.

"అంతా బాగానే జరుపుకొచ్చాము. అటు మనం సరిగా చూడలేదన్న నేరం వెయ్యలేదు – ఇటు మనం బ్రతికి బైట పడ్డాము" అనుకున్నారు లలిత–రవిలు.

మరి ఆఖరురోజు సాయంత్రం ఫోంచేసి వెళ్ళమని పట్టుబడ్తే తప్పలేదు వారికి. సంతోషంగానే ఉండిపోయారు.

ఇంతలో బైట రిషా ఆగటం లలిత మేనమామ గలగల వాగుతూ లోపలికి రావటం జరిగిపోయాయి.

లలిత–రవి గుండెలు ఒక్కమాటు అదిరిపడ్డాయి.

"ఈ మనిషినోరు ఊరుకోదే బాబూ కాస్త హింట్ ఇవ్వాలి" అనుకున్నా రెవరికి వారు.

కానీ లోపలి కొస్తూనే ప్రసాద్‌ను చూచి అవాక్కయిపోయి కుర్చీలో కూర్చుండి పోయాడు. ముఖంఆనందంతో విప్పారింది. కాసేపు ఆగి అన్నాడు "నాయనా – నువ్వు అనందరావుగారి కొడుకువి కదూ? నీ పెళ్ళికొచ్చాను. నేను నీకు తెలియదులే. మీ నాన్నగారి హయాంలో మా పల్లెకెంతో మేలుజేశారు.

ధర్మాత్ములు. ఇప్పటికీ వారిమేలు మరిచి పోలేము. అంతేనా? మా రవికి మీనాన్న గారి వల్లేగా ఇంత మంచి ఉద్యోగం వచ్చింది – అబ్బో తెలివికేం తక్కువ లేదు. బాగా సంపాదిస్తున్నాడు... మా ఊళ్లోనే రెండెకరాలు మాగాణి కొని పించాసు...అంతా మీ తండ్రిగారిచలువే. చెప్పేవుంటాడు రవి ... "అమ్మాయ్ లలితా...'' అంటూనే ఉన్నారు. లలిత చెంబునిండా నీళ్ళు తెచ్చి అందించింది.

ఆమెను పలుకరించి ఆమెవేపు చూపు నిల్పి ''ఏమ్మా లలితా నీ నగలన్నీ ఏవీ? అలా బోసిమెడతో ఉన్నావు?"

లలిత వెకిలిగానవ్వి ప్రసాద్ లత వైపు సిగ్గుపడ్తున్నదానిలా చూచి మెల్లగా అంది "ఇక్కడ ప్లాంటు అమ్ముతున్నా రట. బాంక్‌లో పెట్టి డబ్బు తెచ్చారు."

"ఓ... అదా... త్వరగా తెచ్చు కోండి" అంటూ నవ్వేశాడాయన. నాల్గు చెంబులు నీళ్ళుపోసుకుని అప్పుడే వచ్చిన రవి ఈయనను పలుకరించి కుశల ప్రశ్నలు వేశాడు. అతడు బహు మాట కారి- 'నాలుకమీద సరస్వతి సదా నాట్యమాడుతోంది' అనుకుంది లత.

భోజనాలదగ్గర పెళ్ళిళ్ళ ప్రసక్తి వచ్చింది_ఆయనఅంటున్నాడు''శాంతకు పెళ్ళి. వాళ్ళ రాముబావే. నాల్గు నెలలు పోయాక ముహూర్తం పెట్టుకోవాలను కుంటున్నాము. నీవు చేయించుకున్న ముత్యాలసెట్టు–అదే డిజైనులో కావాలట. వాళ్ళ బావే ఇచ్చాడులే డబ్బు. ఎన్ని వేలేమిటి ! మూడు నాల్గువేల మధ్యలో అవుతుందిగా... ఏమిటమ్మా లలితా బొత్తిగా ఇల్లా వండావు? చుట్టాలొచ్చిన వేళ గాభరాతో సరిగా వండలేదా ఏమిటి నీకేం తొందరే...చక్కగా చిటికెలో వందమందికి సంతుష్టిగా పంచభక్ష్య పరమాన్నాలు పెట్టి పంపగల విద్య ఉంటే ఈ పూట నీ చెయ్యి వెనుదిరిగిం దేమిటి?...మీ అక్కయ్య నవనవలాడే వంకాయలు కట్టింది. నీచేతి నూనె వంకాయకూర తిని ఎన్నాళ్ళయింది?...'

ప్రసాద్‌కు, లతకు ఈ మాటల్లోని యదార్థం గ్రహింపుకు రాగానే లెగించి రవి_లలితల వైపు చూచారు. వారిద్దరి ముఖాల్లో భయాందోళనలుగాని – సిగ్గు గాని లేదు. వెకిలిగా నవ్వుతూ ఏదో మాట్లాడుతూ మాటలు తప్పింప చూస్తు న్నారు. ''ఔరా!'' అనుకున్నారు వీళ్ళి ద్దరు.

''నాకేంవచ్చు, కోడలినన్న అభి మానంతో అంటున్నావు" అంటోంది.

ప్రసాద్ అనుకున్నాడు ఇంతటితో ఆగితే బాగుండునని. కానీ అల్లా జరగ లేదు. అతడు ఆస్నేహితు లిద్దర్నీ మరీ ఇరకాటంలో పడేశాడు. "పోయిన సోమ వారం రాముతో నెయ్యి_పూతరేకులు – కొబ్బరికాయలు – ఆవకాయ – మాగాయ అన్నీ మీ అమ్మ పంపితే, చక్కగా అందు కుని ఒక్క ఉత్తరం ముక్కైనా రాశావు

కాదేమమ్మా. ఆవిడ అంపినట్లు తెలిసినా నీ చేతితోరాసిన ఉత్తరంకోసం రోజూ ఎదురు చూస్తూనేఉంది..." ఇక చాలు. వినవలసినదంతా విన్నారు.

రవి-లలిత కొంపమునిగించని ముస లాడిమీద లోలోపల మండిపడ్డారు.

ప్రసాద్, లత తొణకలేదు. మామూలు గానే వెళ్లొస్తామని చెప్పి వెళ్ళిపోయారు.

"కొంప ముంచావు మామయ్యా" అంటూ వాపోయింది. పిల్లలు నిద్ర పోయిన తరువాత-తాము ఎంత నేర్పుగా వారి బెడద వదిలించుకున్నది చెప్పి అతని మాటల వల్ల తమ పన్నాగం బైట పడిందని చెప్పి చాలా బాధపడుతుంటే ఆయన నోరుతెరుచుకుని విన్నాడు.

ఆ పెద్దమనిషిహృదయం తీవ్రంగా బాధపడింది. "స్నేహితుణ్ణి - అందునా ఉద్యోగం దొరక్క రెండేళ్ళు అత్తారింట్లో కూర్చున్న నీకు పిలిచి ఉద్యోగం ఇచ్చి నట్లే ఇప్పించినవాడికి ఎంతచేసినాఋణం తీర్చుకోలేవే! ఎంతపని చేశావు లలితా. ఒకరికొకరుతోడై మంతనాలాడి వారిని వెళ్లగొట్టారన్నమాట. ఏం పాడుబుద్ధిరా బాబూ. స్నేహం అనేది ఎంతో పవిత్ర మైంది, అది నిష్కల్మష హృదయాలనే ఆశ్రయిస్తుంది. స్నేహధర్మం, ఆ అని ర్వచనీయభావం మీలాటివారికేం తెలు స్తుంది! వెళ్లండి. వెళ్లి క్షమాపణకోరండి" అని మొత్తుకున్నా వారిరువురు కదల్లేక పోయారు. ఏం ముఖం పెట్టుకుని వెళ్తారు.

రేపు వారి ప్రయాణం. వ్యవధి వుంది. కాని వారికంత పశ్చాత్తాపం కలగలేదు. అవమానంతో సిగ్గుతో ఇంట్లోనే వుండి పోయారు. క్షమ అర్థించటానికికావలసిన ఔన్నత్యంలేదు వారిలో.

వారంరోజులకు ప్రసాద్ నించి వచ్చిన ఉత్తరాన్నందుకుని కంపిస్తోన్న చేతులతో తెరిచాడు రవి. కొచ్చిన్ నించి వచ్చింది.

"రవీ, మీ మామయ్యను తిట్టుకోవద్దు, ఆయనది నిర్మలమైన హృదయం. అందుకే నాన్నగార్ని గూర్చి మాట్లాడ్తూ కృతజ్ఞతలు వెళ్ళబుచ్చాడు. అతడు మహనీయుడు.

రవీ, స్నేహాన్ని డబ్బుతో లెక్కిం చావు. నీకు చిన్నజీతమని నాకు తెలి యదా? ఇంతమందితో వచ్చి నీచేతఖర్చు చేయిస్తానని ఎలా అనుకున్నావు?

ఆ రోజు సాయంత్రంవరకు నిన్ను నమ్మాను. నీకు తగిన భార్య అనిపించు కుంది లలిత. లతహృదయం గాయ పడింది, క్షోభించింది. నీలాంటివారుంటా రన్న సత్యం ఒకప్పుడు విశ్వసించలేదు గాని ఈనాడు విశ్వసిస్తున్నాను.

జీవిత రంగంలో ఈనాటకాలు రాణించవు, అసలైన జీవిత విధానమే రాణిస్తుంది. 'రవి'




విదేశాలకు వెళ్లే మన చెడుగుడు బృందం లో ఇద్దర్ని తీసి పారేశా!! వాళ్ల స్థానం లో సిన్నా బుజ్జిని తీసుకెళుతున్నా !!!


నా కేమో యిమానం యెక్కాలని బోల్డంత ఆశ!! యిదేశాలకి యెళ్లానికి ఒక్క చాన్సూ దొరికి సావలా!!! కనీసం మనూళ్లో వరదలొచ్చినా బాగుణ్ణు!!!






మర్నాడు సుబ్బరాజు రాగానే రామిరెడ్డి గారు కథవంటి కథ చెబుతా విను అని ఆరంభించాడు.

అనగనగా రెండు రాజ్యాలు. ఒక దాని పేరు శబ్దరాజ్యం. రెండోది నిశ్శబ్ద రాజ్యం.దీనికి ఆరాజ్యం వారీ పేరుపెడితే, దానికి ఈ దేశం వారు ఆ పేరు పెట్టారు. అసాధ్యపువిషయం అందిస్తానని ఆశపెట్టి, అందినట్టే నమ్మించి, దానిచుట్టూరా కవిత్వంపైత్యం అల్లి, ఊహాసౌదచేస్తారని, అందువల్ల అది శబ్దరాజ్యమని వాదం. మీదేశంలో గుప్‌చిప్‌గా ఉంటారు గాబట్టి మీది నిశ్శబ్ద రాజ్యం అన్నారువీరు. మీది ఒకటేపార్టీ. రెండో అభిప్రాయంలేదు అని ఎత్తిపొడిచారు. మీదీ అంతే. అభిప్రాయం ఒకటే గాబట్టి పార్టీలు రెండైనా ఒకటి కిందే లెక్క. మళ్ళీ మూడోది రాకుండా కట్టుదిట్టంచేసి ఇంకోదాని కసలు ఆస్కారం లేనట్టు అభినయిస్తారు. మీవి రెండు పార్టీలయినా వాటి తాత్పర్యం ఒకటే. కాళ్లాగజ్జా కంకాళమ్మా వేగూచుక్కా

వెలగా మొగ్గా మొగ్గాకాదూ నూటికి నీరూ నీరూకాదూ నిమ్మళవాయా...ఆట ఆడి ఏది మంచిదో తేల్చుకోవచ్చుఅంటూ ఇవ తలివాళ్ళు దెప్పిపొడిచారు.

ఒకటిమాత్రం రైటే. ఆ రెండు పార్టీల్లో పేర్లను తప్పిస్తే పెద్దతేడా ఉండదు. ఒకపార్టీలో రెండు గ్రూపు ల్లాటివవి. ఒకటి 'క' మరొకటి 'ఖ.' రెండింటా దుర్మార్గులూ, సన్మార్గులూ కూడా ఉన్నారు.

ఒకసారి ఒక వాడలో ఎన్నికలు వచ్చాయి. క, ఖ పార్టీల టికెట్లుకొని ప్లాటుఫారం ఎక్కిన అభ్యర్థులు ఎవరికీ ఎవరూ ఎందునా తీసిపోనివారే. ఇద్దరూ ఆఫీసులో కుర్రాళ్ళుగా జీవితం ఆరంభించి కంపెనీల డైరెక్టర్లుగా వృద్ధికివచ్చి రాజకీయాల్లోకి దిగజారి పోయారు. పంచవర్ష ప్రణాళికలు వేసు కుని వంతుల ప్రకారం వోసారి వీరూ, వోసారి వారూ అన్నట్టు పదవి కెగిరి ఉట్టికొడుతూ తొలి ప్రణాళికలో వ్యావ సాయకాభివృద్ధి, రెండదానిలో పారి శ్రామికాభివృద్ధి, మూడవదానిలో వర్తక వాణిజ్యాభివృద్ధి, నాలుగవదానిలో అధి కారసామ్రాజ్యాభివృద్ధి సాధించుకున్నారు —సొంతానికి.

ఎక్కువ డబ్బు గడించారన్న నెపంతో పన్నులభారం కొద్దిమంది నెత్తిన వెయ్యడం భావ్యంకాదని వాదించి, ఉత్తరోత్తరా తమ మునిమన వలు గడించే దానిమీదకూడా అక్షేపన్ను పడకుండా కట్టుదిట్టమైన చట్టాలు తెచ్చారు. సామాన్య పౌరులుగా, వర్త కులుగా ఉన్నకాలంలో నూరింట యాభై పాళ్ళు ఆపైగా రాజాగారి ఖజానాకిస్తే, ఇప్పుడు చట్టాలకు చుట్టుతిరిగి దోబూచు లాడించడంద్వారా నూటికి ఐదువంతుల పన్నుతో సరిపెట్టడం మరిగారు. ఊరందరికీ మప్పారు. ఆవిధంగా వారిద్ద రికీ ఆ వాడలో చాలామంది ఎంతో ఋణపడి ఉన్నారు. 'దొంగాట' ఆడ డంలో ఒడుపులు తెలియడమే ప్రజా స్వామ్యంలో తాత్పర్యం అన్న ధర్మాన్ని ప్రతిష్ఠించారు. అందువల్ల తప్పుచెయ్యడం తప్పుకాదనీ, దొరికిపోవడమే తప్పనీ, చేతగానివాడు ఆటలోఉంటే ఆట చెడు తుంది కాబట్టి వాణ్ణి ఖైదులో దాచేసి ఆటచూస్తూ కొత్తఒడుపులు ఆలోచించు కుందుకు సావకాశం కలిగించాలనీ, ఇలా అందరికీ సమానావకాశాలు కలి గించడమే ఈ వ్యవస్థలో గొప్పదనమనీ శాస్త్రం ఏర్పరచారు.దాన్ని చట్టాలమీదకు వ్యాఖ్యానాలుగా రూపొందించి చక్కగా విషయం ప్రస్తరించారు.

ఈ విద్యలో దీని ప్రయోగంలో ఆ ఎన్నికకు నిల్చిన అభ్యర్థులిద్దరూ ఘనులే. అందువల్ల ఎవరికి ఓటు చెయ్యాలీ అన్నది అక్కడి ప్రజలు ఓ పట్టాన తేల్చుకోలేకపోయారు. లాటరీలు వేసుకునీ, కందచీమలచేత ఏదో ఒక




చీటీ ముట్టించి, కాళ్ళాగజ్జా కంకాళమ్మా ఆడీ, రెమ్మలు పట్టుకుని "ఐలైక్ యూ. ఐలైక్ యూనాట్" అంటూ ఒక్కొక్క ఆకే తుంచేసే దొరల పద్ధతిమీదా ఎవరికి ఓటు వెయ్యాలీ, ఫలానవాడికి వెయ్యాలా కూడదా అనే మహా సమస్యను పరిష్కరించుకోసాగారు. ఈ లాటరీ పద్ధతిమీద నమ్మకంలేక సొంతంగా ఆలోచించాలని సరదాపడ్డ జనులు తమచేత 'ఆలోచింపజేయడానికి' సైకాలజిస్టులు—అంటే మన స్తత్వం గ్రహించి మన మనసులోమాట ఏమిటని తమ మనసులో తోచిందే చెప్పి ఒప్పించే ఇంద్రజాలకులన్నమాట— వాళ్ళదగ్గర కెళ్ళారు. మళ్ళీ పాపం ఆ ఖర్చు మీరేం పెట్టుకుంటారని, ఎన్నికల అభ్యర్థులే సొంత ఖర్చుమీద వీధివీధినా సైకాలజిస్టు షాపులు తెరిపించి ఉచిత వసతి ఏర్పరచి, వాళ్ళద్వారా నిర్ణయం చేయించారు.

ఇవన్నీ చూసి ఈ పద్ధతులు అనుసరించడం, వసతులు వాడుకోవడం చేతగాక తికమక పడుతున్న బి. సి. పౌరుడొకడు ఎటూ తేల్చుకోలేక ఇంట్లోనే ఉండిపోయాడు. అవతల పోలింగుకు వేళ పూర్తికావచ్చింది. ఊళ్ళో పిల్లా మేకా అంతా ఓట్లు వేసేశారు. అప్పటికి తేలిన లెక్కలు చూడగానే అంతా హాహాకారాలు చేశారు. అభ్యర్థులిద్దరికీ చెరిసమంగా పడ్డాయి ఓట్లు. ఎవరు గెలిచినట్లు? ఎవరికీ ఏమీ పాలుపోలేదు. ఇంత ప్రయాసా, ఇన్ని లక్షల ఖర్చూ దండగ అయిపోతుంది. ఓటువేసిన వారెవరైనా ఉపసంహరించుకొంటే బాగుండునని తోచింది. ఇంకోగంట టైముందనగా

తిరిగి ప్రచారం సాగింది. ఉధృతంగా, ఈ సారి మీఓటు నాకు వెయ్యండి, నేను మీకు ఫలానాపన్లు చేసి పెడతాను, విదేశాంగ శాఖలో ఉద్యోగం వేయిస్తాను. అందులో మీకు గిట్టనివాళ్ళుంటే వాళ్ళను బర్తరఫ్ చేయిస్తాను. నా ప్రత్యర్థికింత ప్రజ్ఞలేదు అనే ప్రచారం బదులు కొత్త నినాదం ఆరంభమైంది. వాడికేసిన ఓటు లాగేసుకోండి. తూనాబొట్టు అనండి. మీలో ఏ ఒకరైనా మీది తొాసుగు ఓటు అని ప్రకటించండి. నిన్న రాత్రి మూడు ఖూనీలు చేశాననండి. చెప్పరాని పార్టీ మనిషి ననండి. విదేశవాళీ గూఢచారి ననండి. మీరు ఓటేసిన వ్యక్తి ఎంత దుర్మార్గుడో మీకు బొత్తిగా తెలీదు. వాడింట్లో పెద్ద కుక్క వుంది. మీరు అక్కడి కెళ్తే కరుస్తుంది... ఆః మా కుక్కా? మా కుక్కను ఇంకో గంటలో చంపేస్తానుగాః పళ్ళు పీకించేస్తాను... అసలు మీరు ఓటేసినవాడివి కట్టుడు పళ్ళు మీకు తెలుసో తెలీదో. అంతెందుకూ వాళ్ళింట్లోకెళ్ళి ఆ పుస్తకాలు ఓసారి చూస్తేసరి – వాడికి ఓటు వేయడం ఎంత పౌరబాటో, ఎంత దేశద్రోహమో మీకే తెలుస్తుంది. అసలు వాడి ఆస్తెంత. అన్నీ కలిపి పాతిక కార్లు లేవు. వంద మేడలు లేవు. లక్ష ఎకరాలమించి భూమిలేదు. అంతాహంగు బోలెడున్నట్లు. అంచేత ఎలాగైనా వాడికి మీరు వేసిన ఓటు ఉపసంహరించుకోండి... అంటూ శతకోటి విధాల ప్రచారం చేశారు. పోలింగుకు యింకో పది నిమిషాలు టైముందనగా హఠాత్తుగా తెలిసింది – ఒక దౌర్భాగ్యుడు మూర్ఖుడు లేదా ఒక జీనియస్, ఒక దేశ రక్షకుడు ఒక మహా పౌరుడు ఇంతవరకూ ఓటు వెయ్యలేదని తెలిసింది. అతను ఎటూ తేల్చుకో లేక గోళ్ళు తినేస్తున్నాడనీ ఇంకాసేపుంటే వేళ్ళు తినేస్తాడనీ ఆనక ఓటు కాయితం పట్టుకుందుకు వేళ్ళుండవనీ త్వరగావెళ్ళి వాణ్ని కేకేసుకొచ్చి ఓటు వేయించాలని అన్నారు. అయితే కాసేపు ఆగుదాం. "మొండిచేతులతో ఓటు వేసిన పౌరుడు" అని డ్రామెటిక్‌గా ఫోటోలు తియ్యొచ్చు అన్నారు పత్రికలఫోటోగ్రాఫర్లు.ఎడిటర్లు వాళ్ళను బలపరచి సంపాదకీయాలు కూడా రాశారు. లిప్ సర్వీస్‌మన్ పుంజుకున్నాడు. ఈ ధోరణిని హేళనచేస్తూ బ్రిటన్ వ్యంగ్య వ్యాసాలు ప్రసారం చేసింది. ఆ క్రూర సమితి ఊరేగింపులు జరిపింది– ఆ వోటరుచేత గోళ్ళూ వేళ్ళూ తిననివ్వడం ఘోరమని పౌరహక్కుల సమితి మేలుకుని నిరసించింది... ప్రతివాడికీ తనగోళ్ళూ వేళ్ళూ కొరుక్కు తినేహక్కు ఉండాలనీ అది ఓటింగు మీద అతని అభిప్రాయం ప్రకటించడం కిందికి వస్తుంది కాబట్టి రాజ్యాంగరీత్యా అభిప్రాయస్వాతంత్ర్యం రక్షించాలని వాదించింది. గోళ్ళు— రాజ్యాంగం అనే

గ్రంథం త్వరలో ప్రకటిస్తున్నట్లు ప్రకటిం చింది. పాక్ అధ్యక్షుడు అమెరికా ఇండి యాకు తోడ్పడరాదని తీవ్రంగా ప్రక టన చేశారు. రాజాజీ స్వతంత్రపార్టీ లక్ష్యాలను వివరించారు. ఈ లోపల ఎన్నికల అభ్యర్థులు, వారి మందీ మార్బలం ఆ ఓటరు అచూకీ కనుక్కొని వెళ్ళి అతన్ని మోసుకు వచ్చేశారు పోలింగ్ బూత్ దగ్గరికి. 'వెయ్యి. ఓటు వెయ్యి' అన్నారు. ఇద్దరూ తుదిసారిగా చెరొక నిమిషం తమ శక్తిని, వాగ్ధాటిని, బుర్రను వాడేసి ఇరవై సెకండ్లలోనూ అరవై రోజుల ప్రచారసారం ఇమిడ్చి మాట్లాడారు – ఓటు ఎదటి వెధవగారికి ఎందుకు వెయ్యరాదో వివరిస్తూ, చివరికి ఉభయపక్షాల తరఫునా గొప్ప పదవు లలో ఉన్న పెద్దనాయకు లిద్దరిచేతా ఇద్దరి కిద్దరూ ట్రంకు టెలిఫోన్లు తెప్పించి వాటిద్వారా ఓటరుకు చెప్పిం చారు.

ఓటరు బాలట్ కాగితం పట్టుకుని ఒకసారి కళ్ళు మూసుకున్నాడు నీర సంగా. తరువాత భోరున ఏడ్చాడు, చొక్కా తడిసిపోయేలా. ఉత్తర క్షణంలో ఆనందంతో నవ్వాడు. ఉత్సా హంగా లోపలికెళ్ళి ఇట్టే ఓటు వేసి చక్కా వచ్చాడు.

"సుబ్బరాజూ! ఆ వోటరు ముందర ఎందుకు ఏడిచాడు? తరువాత ఎందుకు నవ్వాడు? ఏమిటా కులుకు? ఎందుకా ఆనందం? చెప్పు చూతాం'' అన్నారు రెడ్డిగారు కథ ఆపి.

అసలు ఈ ఎన్నికలలో స్వతంత్రం అనేది చాలాకొద్ది. ఓటరు తనకు నిజంగా యోగ్యుడు అని తోచినవాడికి ఓటు వేసే అవకాశంలేదు. అంగబలం,అర్థబలం ఉండి పోటీకి నిలబడ్డ వారిలో మాత్రమే తనకు నచ్చినవాడిని ఎన్నుకోవచ్చు. ఎవడూ నచ్చకపోతే తన అభిప్రాయం చెప్పే అవకాశంలేదు. ఎందుకూ—

ఈఎన్నికలలో ఇద్దరూ మహాదుష్టులే. అయినా తాను ఓటు చేసి తీరాల్సిన దుర్గతి పట్టినందుకు అతను ఏడిచాడు. పోతే—

"ఇద్దరు వెధవల్లోనూ తన ఓటువల్ల ఎవరో ఒక్కడు మాత్రమే ఎన్నిక అవు తున్నాడుగదా అని ఆనందంతో ఉప్పొంగిపోయి పకాలున నవ్వాడు'' అన్నాడు సుబ్బరాజు.

"ఇంతకూ ఆ వోటరుమీదా, వాడి ఊహమీదా 'నీ అభిప్రాయం ఏమిటి?'' అన్నాడు రెడ్డిగారు, తువాలుతో ముఖం మీద పొయ్యనిచెమటా, పోసిన అభి ప్రాయాలూ తుడిచేసుకుంటూ.

"వాడు వట్టి మూర్ఖుడు. బి. సి. మనిషి. ఇలాటివాణ్ని ఏ అండమానో సైబీరియానో తోలెయ్యాలి" అన్నాడు రాజు.


అప్పుడు
ఇతర దేశాలతో మనల్ని పోల్చి చూస్తే మనం చాలా వెనుక బడి వున్నాం!!


ఆ తరువాత
ఇతర దేశాలతో మనల్ని పోల్చి చూస్తే మనం చాలా వెనుకే బడి వున్నాం!!!


ఇప్పుడూ !!!
ఇతర దేశాలతో మనల్ని పోల్చి చూస్తే మను చాలా వెనుకే బడి వున్నాం!!!!




నేనింకా అవివాహితనే! అయితే సినిమాల్లో వంద సార్లకు పైగా పెళ్లాడాను!!!
మేనక సినీతార

# సావిత్రి

కె.ఆర్.కె. మోహన్

"గోమాతకి జై... గోమాత జిందాబాద్"—నినాదాలు మిన్నుముట్టుతున్నాయి. అఖిలభారత గోసంవర్ధక సంఘంవారు గోవధ నిషేదం కొరకు తలపెట్టిన ఉద్యమంలో భాగంగా ఆరోజు ఆ ప్రదర్శనను నిర్వహిస్తున్నారు. ప్రదర్శన కలెక్టర్ ఆఫీసుముందు జోరుగా సాగుతోంది. బక్కచిక్కిన ఒక ఆవును తెచ్చి ఆ గుంపుముందు పెట్టారు. దాని మెళ్ళో ఒక బంతిపూలదండ వేశారు. దాని ముఖానికి పసుపుపూసి కుంకుమబొట్టు పెట్టారు. కొమ్ములకి రంగు వేశారు. ఆ ప్రదర్శనతోనూ, నినాదాలతోనూ తనకేమీ సంబంధంలేనట్టు నుంచొనివుంది ఆ గోవు. ఆ ఆవు, నడుం మీద చేయివేసి నిమురుతూ ఉధృతంగా నినాదాలను రాకెట్లలాగ వదులుతున్నాడు జైరాందాస్. ఆయన ఆ ఊరిలో పేరుమోసిన పెద్దవ్యాపారి. పేరుకి చేసేవి రకరకాల వ్యాపారాలు కాని వాటి వెనకాల జరిగే అసలు వ్యాపారం వడ్డీవ్యాపారం మారువడ్డీలు వేసే మార్వాడి వ్యాపారం ఆయనే గోసంవర్ధక సంఘపు రాష్ట్ర శాఖకు అధ్యక్షుడు. ఆయన నినాదాలు చేస్తుంటే అనుయాయులంతా వల్లిస్తున్నారు. ఆయన మెళ్ళో దండవేసుకుని ముఖానికి గంధంపూసుకుని, దాని మీద ఈస్టిండియా కంపెనీవాడి అర్థణా కాసంత కుంకుమబొట్టు పెట్టుకుని అవతారమూర్తిలా అభినయిస్తున్నాడు. దగ్గరలోనే వున్న ఒక మేడమీద మైకు ఏర్పాటుచేసి, గోమాత గొప్పదనాన్ని తెలిపే పాట రికార్డును పదేపదే వేస్తున్నారు. ఈ కోలాహలాన్నంతా ఆసక్తితో తిలకిస్తున్నారు, అక్కడ చేరిన జనసమూహం. ఏ అవాంఛనీయ సంఘటనా జరుగకుండా ఉండడంకోసం పోలీసులు జనాన్ని, ప్రదర్శకులనీ సర్దుతున్నారు. ఆ విధంగా సాగింది కొద్ది గంటలపాటు ప్రదర్శన. మరి కొంచెం సేపట్లో కలెక్టరుగారు ఆఫీసుకి వచ్చారు. ఆయన కారు వస్తుంటే ప్రదర్శనలు ఉప్పెనలా నినాదాలు వదిలారు. మరికొంచెంసేపట్లో జైరాందాసు నాయకత్వంలోని ఒక బృందం ఆఫీసులోనికివెళ్ళి కలెక్టర్‌గారికి వినతి పత్రాన్ని సమర్పించి తిరిగివచ్చింది. వెంటనే అక్కడ జేరిన ప్రదర్శనల వారికి జై జై నినాదాలతో స్వాగతం తెలిపారు. వారంతా గోమాతని ముందునిడుకొని, దానిపక్కనే జైరాందాసు నడువగా, మిగిలినవారు వెంటరాగా, 'గోమాతకి జై... గోమాత జిందాబాద్' నినాదాలతో పెద్ద ఊరేగిం

పుగా పురవీధులవెంట వెళ్ళిపోయారు. నాటికి ఆ ప్రదర్శన జయప్రదంగా ముగిసింది.

ఆరోజు ఆదివారం జైరాందాసు దుకాణానికి సెలవు. ఆయన తనఇంటిముందు తోటలో పచార్లు చేస్తున్నాడు. ఒక ప్రక్కన ఎనిమిదేండ్ల మనుమరాలూ, మరొకప్రక్కన ఐదేండ్ల మనుమడూ ఆయనకి చెరొకచేయీ పట్టుకొని తాతగారితో కబుర్లు చెబుతూ నడుస్తున్నారు. వాళ్ళ ముద్దు ముద్దు మాటలతో ఆయనకు బాగాకాలక్షేపం అవుతుంది మనుమరాలు సుమ మొన్నటి ప్రదర్శనను గురించి వివరాలు అడుగుతుంటే జైరాందాసు, దాన్నంతా కాశీమజిలీ కథనిచెప్పినట్లుగా వర్ణించి చెబుతున్నాడు. మనుమడు ఆయన చెప్పేది అర్థమయ్యీ కాక ఏవేవో ప్రశ్నలు వేస్తున్నాడు. జైరాందాస్, గోమాత ఎంత గొప్పదయినదీ అది హిందువులకి ఎంత పవిత్రమైనదీ గట్టిగా నూరిపోస్తున్నాడు, వారు అల్లా మాట్లాడు కుంటూ పశువుల కొట్టంవేపు నడిచారు, పాలవాడు వచ్చి ఆవుకి పాలు పితుకు తున్నాడు. దూడని తల్లిదగ్గరకు రాకుండా గుంజకి కట్టివేశాడు, అది తల్లి దగ్గరికి పోవాలని గుంజుకుంటుంది. 'అంబా', అని అరుస్తోంది. దాని అరుపులకి తల్లడిల్లిపోతుంది తల్లి ఆవు, నిస్సహాయంగా తానుకూడ ప్రతిగా 'అంబా' అని అరుస్తూంది, పాలవాడి కట్టడి నుండి తప్పించుకోవాలని విఫలప్రయత్నం చేస్తూంది.

"ఏరా—గోపిగా—లక్ష్మి ఏమంటోంది? ఇంకా, మకారు చేస్తునేఉందా? దారికేమన్నా వచ్చిందా? అనడిగాడు జైరాందాసు పొదుగు కడుగుతున్న పాలవాడినిచూసి. లక్ష్మి అంటే కొత్తగా కొన్న ఆ ఆవు.

"ఇంకా కొత్త పోలేదండీ బాబయ్యా మకారు చేస్తూనే ఉండాది," అన్నాడు గోపన్న

"ఊ...సరే... పాలెన్ని ఇస్తోంది?" అని తిరిగి ప్రశ్నించాడు జైరాందాస్.

"ఇప్పటికైతే పూటకి మూడు లీటర్లే ఇస్తోందండి. కొంచెం అలవాటైతే ఇంకా ఎక్కువ ఇస్తుందండి" అన్నాడు గోపన్న.

"ఇంతేనా ? అంత డబ్బుపోసికొంటే మూడేనా ఇచ్చేది. పాలు సరిగ్గా పితుకుతున్నావా లేక అన్నీ దూడకే వదిలేస్తున్నావా ?" అని గద్దిస్తూ, అనుమానంగా దూడవంక చూశాడు జైరాందాస్.

"ఎంత మాటయ్యాగోరూ... గోవుల మధ్య పుట్టి పెరిగినవాడిని. చూస్తూ చూస్తూ దూడకి పాలు వదులుతానా, ఇప్పుడు మీరే చూస్తారుగా దూడకి ఎన్ని పాలు వదులుతోందీ" అంటూ పొదుగు కడగటం పూర్తిచేసి, దూడవైపు నడిచాడు గోపన్న.

దూడ కట్టువిప్పి వదిలాడు. చెంగున ఒక్క గంతులో తల్లి దగ్గరకి పరుగెత్తింది దూడ. తలతో పొదుగును క్రుమ్ముతూ తల్లిదగ్గర పాలు కుడవడం మొదలు పెట్టింది. ఆ

బాధ లేకపోగా అలౌకికానందాన్ని అనుభవించసాగింది ఆ తల్లిగోవు. అనిర్వచనీయమైన ఆనందంతో తొణికిసలాడే కళ్ళతో, ఆప్యాయంగా, దూడ ఒంటిని నాక మొదలుపెట్టింది.

గట్టిగా రెండు కడుపులు కుడిచిందో లేదో, బలవంతంగా దూడని ఇవతలికి ఈడ్చుకువచ్చి తిరిగి గుంజకి కట్టేశాడు గోపన్న. చేసేది ఏమీలేక అసహాయంగా గుంజుకోడం మొదలుపెట్టింది దూడ. అది అరవనుకూడా అరవకుండా దాని మూతికి చిక్కం బిగించాడు గోపన్న. తిరిగి వెళ్ళి అవుకి పాలు పితకడం మొదలుపెట్టాడు.

ఎన్ని పాలు వస్తాయా అని ఆసక్తిగా అటే చూడసాగాడు జైరాందాస్.

"తాతా... దూడపాలు తాగడం అవకుండానే లాగేశాడు. దానికి ఆకలి వెయ్యదూ?" అని అడిగింది సుమ. దూడ గుంజుకోడం చూస్తూంటే, ఆ చిన్నారిప్రాణం పంజరంలో పక్షిలా కొట్టుకుంటుంది. సుమ మాటల్తో ఈ లోకంలోకి వచ్చాడు జైరాందాస్. "లేదమ్మా దూడకి ఆ పాలు చాలు." అన్నాడు.

"అదేమిటి తాతా... దానికి కడుపు నిండందే! చూడు అది ఎల్లా కొట్టుకుంటుందో?" అన్నాడు మనుమడు.

"అవును తాతా... ఆకలి తీరకపోతే దూడ చచ్చిపోదూ?" అని వంత కలిపింది సుమ.

"మీకేం తెలీదు కుర్రనన్నాసుల్లారా- దూడ ఎక్కువపాలు త్రాగకూడదు. ఎక్కువ త్రాగితే దానికి అజీర్తిచేసి చచ్చిపోతుంది," అన్నాడు ముసి ముసి నవ్వులు నవ్వుతూ జైరాందాస్.

తాత చెప్పిన విషయం నమ్మలేక, ఏమీ అనలేక ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు మనుమలిద్దరూ.

గోపన్న పాలు పితకడం అయింది. జైరాందాస్ ఎదుటనే కొలిచి చూసాడు. అవి సుమారు మూడు లీటర్లు ఉన్నాయి.

"హుం" అని నిట్టూర్చాడు జైరాందాస్. "ఇల్లా అయితే పెట్టిన పెట్టుబడికి వడ్డీకూడా గిట్టుబడికాదు" అంటూ ముందుకు సాగాడు. మౌనంగా అనుసరించారు మనుమలు.

జైరాందాస్‌కి ఉన్న వ్యాపారాలలో పాల వ్యాపారంకూడా ఒకటి. లక్ష్మి మంచి సంకరజాతి పశువనీ, పూటకి ఎనిమిది లీటర్ల పాలు ఇస్తోందనీ నమ్మకంగా చెప్తే కొన్నాడు. అది మూడు లీటర్లే ఇయ్యడంచూసి, తన పెట్టుబడి దండగేమోననీ, మోసపోయాడేమోననీ. దిగులు పట్టుకుంది. ఆ ఆలోచనలతోనే మౌనంగా ముందుకు నడుస్తూ బాగా ముందుకి సాగాడు. దూడకి కడుపు నిండా పాలు పట్టకపోవడంతో, బరువెక్కిన జాలిగుండెలతో దూడ విషయమే ఆలోచించుకుంటూ మౌనంగా నడుస్తున్నారు ఆ పాపలు.

"తాతా... తాతా... అటుచూడు. తోటలో ఆవుపడి మేస్తోంది" అని గట్టిగా అరిచింది సుమ.

అకస్మాత్తుగా జైరాందాస్ ఆలోచనలకు అనకట్ట పడింది. అవతలఉన్న చిన్నగేటు ఎవరో తీసేసి వెళ్ళిపోయారు. ఒక బక్కచిక్కిన ఆవు తోటలోపడి మేస్తోంది. అటూ ఇటూ చూశాడు జైరాందాస్. ఎవ్వరూ కనిపించలేదు.

"ఒరేయ్ సుబ్బిగా... గోపీ... వెంకడూ...అంతా ఎక్కడ చచ్చార్రా" అంటూ గావుకేక పెట్టాడు - అందర్నీ పేరుపేరునా పిలుస్తూ. దగ్గరలో ఎవరూ లేరేమో, అటు ఎవరూ రాలేదు.

నౌకర్ల అశ్రద్ధని తనలోనే తిట్టుకుంటూ ఆవుదెసగా పరుగు లంకించుకున్నాడు జైరాందాస్. పోతూ పోతూ దారిలో బడిసెకర్రఉంటే దానిని చేత జిక్కించుకున్నాడు.

"ఉష్...ఉష్...నీ మొహంమండా. నిన్ను తగలెయ్యా. నిన్ను బలివెయ్యా." అంటూ తిడుతూ ఆవుని తరమ సాగాడు జైరాందాస్.

యముడిలాగా తరుముకువస్తున్న జైరాందాస్‌ని చూసింది ఆవు. పరుగెత్తాలని ప్రయత్నం చేసింది. కాని దానికి నిలబడడానికే ఓపికలేదు. ఇంక పరుగేం తీస్తుంది!

అంతలోనే వచ్చాడు జైరాందాస్ సుడిగాలిలాగా. కోపం పట్టలేక, చేతిలోనున్న బడితతో దాని నడుంమీద శక్తికొద్దీ బలంగా మోదాడు.

'అంబా' అని అరుస్తూ అక్కడే కుప్పకూలి పోయింది ఆవు.

అప్పటికి సుమ, తమ్ముడూ ఇక్కడికి వచ్చారు. జరిగిన భీభత్సంచూసి మ్రాన్పడిపోయి భయంగా ప్రక్కకి ఒదిగి ఉండిపోయారు.

ఆవు కుప్పకూలి పోవడంతో తాను చేసినదేమిటో అర్థమయింది జైరాందాస్‌కి. ఆవు చచ్చిపోయిందేమోనని భయపడ్డాడు. పేరుపేరునా నౌకర్లందరినీ, పదేపదే పిలిచి గావుకేకలు పెట్టాడు.

అయ్యగారి అంకెలువిని ఏమి జరిగిందోనని పరుగెత్తుకు వచ్చారు నౌకర్లు. పడిపోయివున్న ఆవునీ, ప్రక్కనేవున్న బడితెనీ, వణికిపోతున్న యజమానినీ చూడగానే జరిగిందేమిటో అర్థమయ్యింది వాళ్ళకి.

"అల్లా చూస్తారేమర్రా వెధవల్లారా... అది చచ్చిందేమో చూడండి." అని గర్జించాడు జైరాందాస్.

నౌకర్లు ముగ్గురూ ఆవు దగ్గిరకి పరుగెత్తారు. అది ఏటవాలుగా పడిపోయి, మెడ వ్రేలాడేసి, పై చూపులు చూస్తూ, నాలిక బయటకువచ్చి నురుగులు కారుస్తూ, రొప్పుతోంది.

'అయ్యా... ప్రాణమైతే పోలేదు కాని, దెబ్బ గట్టిగా పడ్డట్టుంది," అన్నాడు గోపన్న.

"అయ్యో దొరా... గోమాత నచ్చి పోనాది. అంత దెబ్బ కొట్టావేం దొరా" అని బాధపడ్డాడు సుబ్బడు. వాడు జైరాందాస్‌దగ్గర పాలేరు. ఆ ఆవుని చూస్తుంటే వాడికి కళ్ళు తిరిగాయి.

"ఏడిశావులే... తన అబ్బసొత్తు దాచిపెట్టినట్లు, పడి మేస్తుంటే కొట్ట

కుండా నెత్తినెట్టుకుంటూరా ?" అని, "ఒరేయి, దాని బయటికి ఈడ్చే యండిరా. ఇక్కడే చస్తుందో ఏమో" అని అరిచాడు.

మరు నిమిషంలో ముగ్గురూ సాయం పట్టి దానిని వీధిలోకి ఈడ్చేశారు. దానిని ఈడవడం అంటేనే ఎంతో బాధపడ్డాడు సుబ్బడు. కాని ఏమీ చేయలేకపోయాడు. బయటికి చేరుస్తుండగానే దాని ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయి, దానికి ముక్తి లభించింది.

గోరక్షక సంఘంవారి వ్యాన్, ఆ దారంటవస్తూ, తనకేమీ పట్టనట్లుగానే, ప్రక్కనుంచి దూసుకుపోయింది.

"గోమాత సచ్చిపోయింది దొరా." అంటూ కళ్ళు వత్తుకున్నాడు సుబ్బడు.

"పోన్లేరా... భూభారం తగ్గింది." అంటూ వెనక్కి మరలాడు జైరాందాస్.

"తాతా...గోమాత తల్లితో సమానం కదూ. దానిని కొట్టడం పాపం కదూ ?" అని అడిగింది సుమ. ఆ మాటలు అంటుంటే ఆ చిన్నారికి దుఃఖం కట్టలు తెంచుకు వచ్చింది.

"చిన్న నన్నాసులు. పాప పుణ్యాల సంగతి మీకేం తెలుసు ?'' అని కసురు కున్నాడు జైరాందాస్.

ఇంక ఆ పాపలు ఏమీ మాట్లాడలేదు.

## 3

కొద్ది రోజులు మౌనంగా గడిచి పోయాయి.

ఆ రోజు ''ఏం దొరా... కబు రెట్టావు ?" అంటూ వచ్చాడు సుబ్బడు

"అప్పన్నా... సావిత్రి వట్టిపోయింది. దానిని ఉంచుకోడం మేత దండుగ దానిని సంతకి తోలుకుపోయి అమ్మే సెయి" అన్నాడు జైరాం.

ఆ మాటలు సుబ్బడు చెవులకి పిడుగులా సోకాయి. ''ఏంటి దొరా నువ్వంటుండావు ! మన సావిత్రినా అమ్మమంటోవి. అది గోమాతే కాదుబాబూ... ఈ ఇంటి మహాలక్ష్మి'' అన్నాడు సుబ్బడు బాధగా.

"ఏడిశాన్లేరా... చెప్పొచ్చావు. వట్టిపోయిన గొడ్డు మహాలక్ష్మేమిటి ? పోనీ అనుకున్నా అది ఈ ఇంటికికాని, నీ ఇంటికి మహలక్ష్మి కాదుగా ? నా మహలక్ష్మిని నేను అమ్మమంటే నీకేమిబాధ?" అన్నాడు జైరాందాస్.

"అంతమాట అనకు దొరా... అది నోరులేని గొడ్డయినా ఇంట్లో మనిషిగా పెరిగింది. ఈ ఇంటికి లక్ష్మిని తెచ్చింది. అయినా ఒట్టిపోయిన గొడ్డుని ఎవరు కొంటారు దొరా ?" అన్నాడు సుబ్బడు ఆవేదనతో.

''ఇంకెవరు ? కసాయి వాడికి అమ్మేయి". అన్నాడు జైరాందాస్ కర్కశంగా.

''దొరా...అంతమాటనకు" అంటూ గుండెలు బాదుకుని ఏడవడం మొదలు పెట్టాడు సుబ్బడు. తేరుకుని ''దొరా... అంతగా అయితే దానిని నేనే తోలుకు పోతాను. దాని ఖరీదు నా జీతంలో పట్టుకోండి'' అన్నాడు.

"ఏమిటోయ్... గొడ్డుమాంసంతినే ముండాకొడుకువి, ఇంత జాలి ఒలక పోస్తావేమిరా?" అన్నాడు జైరాందాస్ వ్యంగ్యంగా.

"అయ్యా, నేను గొడ్డుని తింటాను కాని, చంపి తినను బాబూ'' అన్నాడు సుబ్బడు చెప్పలేని ఆవేదనతో.

''నీతో వాగే తీరిక నాకులేదు. నీవు కొనుక్కో దలుచుకుంటే డెబ్బది రూపా యలు చేతిలోపోసి, ఇంకో రెండు గంటల్లో తోలుకువెళ్ళు. లేదా ఇంకెవరి కైనా అమ్మేస్తాను. సాయంత్రానికి పెద్ద పెద్దవాళ్ళు మన పశువులు చూడ్డానికి వస్తున్నారు. అప్పటికి ఇది ఉండడానికి వీలులేదు. మళ్ళీ చెప్తున్నాను. కావాలను కుంటే పైసలు చేతిలోవేసి పట్టుకుపో. జీతం గీతంలో పట్టుకోమంటే మాత్రం పట్టుకునేదిలేదు. లేకుంటే వేరే అమ్మే స్తాను." అంటూ లోనికిపోయి ధడాలున తలుపేసుకున్నాడు జైరాందాస్.

సుబ్బడు ఆఘమేఘాలమీద ఇంటికి పరిగెత్తాడు. పెళ్ళాం పుస్తెలతాడు తీసు కునివచ్చి అమ్మి పైసలు తీసుకున్నాడు. రొప్పుతూ రోజుతూ తిరిగి జైరాందాస్ ఇంటికి పరుగెత్తుకు వచ్చాడు. "దొరా... ఇదుగో పైసలు పట్టుకొచ్చాను." అంటూ తలుపులు దడదడ కొట్టాడు.

తలుపుతీసి యమదేవతలాగా ఎదు రుగా నిల్చున్నాడు జైరాందాస్.

"నిజంగా పైసలు తెచ్చావేరా? నువ్వేం కొంటావులే అని కసాయివాడికి ఎనభైకి ఇందాకనే అమ్మేశాను," అన్నాడు తాపీగా.

"దొరా... ఎంతపని చేశావు!" అని గట్టిగా అరిచి తిరిగి కబేళావైపు పరుగు లంకించుకున్నాడు సుబ్బడు 'సావిత్రీ' అని వెర్రిగా అరుస్తూ.

## 4

దూరాన కబేళాలోంచి పశువుల అరు పులు వినిపిస్తున్నాయి. వాటిల్లో తన సావిత్రి అరుపు గుర్తుపట్టున్నాడు సుబ్బడు. అడుగులు లేచిపోతున్నా గుండెలు అదిరిపోతున్నా 'సావిత్రీ' అని అరుచుకుంటూ పరుగులెత్తుతున్నాడు సుబ్బడు. ఎట్లాగైతే కబేళా చేరాడు.

ఎదురుగా నేలమీద నెత్తుటి మడు గులో సావిత్రి పడివుంది, తలా మొండెం వేరై. జైరాందాస్ ఉపన్యాస ఝరిలా, దాని మెడనుంచి రక్తం ప్రవహిస్తోంది. దాని కళ్లు దీనంగా సుబ్బడివంకే చూస్తు న్నాయి. 'సావిత్రీ' అంటూ కుప్పకూలి పోయాడు సుబ్బడు. అసలే పరుగెత్తి పరుగెత్తి అలసిపోయాడేమో, అనాయా సంగా ఆవ్వలేచిపోయింది. దూరాన గో సంవర్ధక సంఘంవారు 'గోమాతాకి జై, గోమాతా జిందాబాద్' అనే నినాదాలు మిన్నుముట్టున్నాయి. మైకులో, గోసం రక్షణయొక్క అవశ్యకతగురించి జైరాం దాస్ ఉపన్యాసం వినిపిస్తోంది. అది విని కబేళాలో కత్తులు కణకణమని నవ్వు కుంటున్నాయి.

# ఈ చీరలో నేను బాగున్నానా?



మధురాంతకం రాజారాం

"ఒసే ముత్యాలూ! ఈ చీరలో నేను బాగున్నానా ?"

'నేను' అనబడేది గనుక బాగున్నట్టయితే, అది ఏ చీరలోనైనా బాగానే వుంటుందని ముత్యాలుకు తెలుసు. కానీ ఈ అభిప్రాయాన్ని స్పష్టంగా మాటల్లో పెట్టడానికి కావలసిన భాషాజ్ఞానం ఆమెకు లేదు.

ముత్యాలు మద్రిపల్లెలో పుట్టింది. రెండు, మూడేళ్ళు వయసొచ్చేదాకా ఒంటిపైన బట్టన్నమాట లేకుండా తిరిగింది. చిన్నాన్న పెళ్ళికి వాళ్ళనాన్న చీటీబట్టతో ఒక గౌను కుట్టుకొచ్చిన రోజున ఒక పెద్ద రాజ్యానికి తాను దొరసాని అయిపోయినట్టు సంబరపడిపోయింది. ముత్యాలు జీవితయాత్రలో అది మొదటి మజిలీ అయితే, రెండోమజిలీ తనకోసం ఒక పావడా జాకెట్టూ తయారుకావడం. వారానికొకసారి ఈ పావడా జాకెట్టూ చాకలికి వేయవలసినప్పుడు ఆమె చిన్న చీరముక్క ఒకటి శరీరానికి చుట్టబెట్టుకునేది. అలా మరికొంతకాలం గడిచి, అక్కడ ముత్యాలు పావడాపైన ఓణీ వెయ్యవలసిన అవసరం వచ్చేసరికి యిక్కడ పెదరామాపురంలో మేనత్త కొడుకు మంగపతికి ముకుదాడు అత్యవసరమైపోయిందన్నవర్తమానం వచ్చింది. ఇరవై రెండు రూపాయలుపెట్టి మంగపతి

కొనుక్కొని వెళ్ళిన కోటకొమ్మంచుల ముహూర్తంచీర కట్టుకుని ముత్యాలు బస్సెక్కి చక్కా కొత్తకాపురానికి వచ్చేసింది.

మద్రిపల్లెలో ముత్యాలు చీరకట్టుకునే వాళ్ళనైతే చూచిందిగానీ, ఆచీరలో తాము బాగున్నట్టా, లేనట్టా అని వితర్కించు కునేవాళ్ళని చూచి ఎరగదు.

ఇక్కడ పెదరామాపురంలో గూడా ఈ గొడవ అన్ని యిళ్ళల్లోనూ వున్నట్టు లేదు.

పెదబాబుగారి కోడలు శకుంతలారాణి రోజుకు నాలుగైదుసార్లన్నా దుస్తులు మారుస్తుంది చీర మార్చినప్పుడల్లా యిదేప్రశ్న!

"ఒసే ముత్యాలూ! ఈచీరలో నేను బాగున్నానా?"

తలవంచుకుని తనపనేమిటో తాను చేసుకుంటూ "మీకేమండమ్మా! చాలా బావున్నారు" అంటుంది ముత్యాలు.

"ఒసే వెర్రిమొగమా! నా సంగతి కాదే! నా చీర సంగతి?" అంటుంది శకుంతలారాణి!

ముత్యాలు వెనుదిరిగిచూచి "చీర చాలా బాగుందమ్మా! ఎక్కడకొన్నారు?" అని అడిగితే అప్పటికది శకుంతలారాణికి ఆనందం కలిగించే విషయం.

"ఎప్పుడు కొన్నారు?" అని అడిగితే ఆమెకు కలిగేది పరమానందం.

"ఎంతకు కొన్నారు?" అని అడిగితే యిక బ్రహ్మానందమే!

ఏమీ అడగకపోతే శకుంతలారాణికి నాలుక పెరుక్కోవాలనిపిస్తుంది. జుత్తు పీక్కోవాలనిపిస్తుంది. ఇంకా మాట్లాడితే ఎదుటి మనిషిపైనపడి గోళ్ళతో ముఖం రక్కేయాలనిపిస్తుంది. ఆ వుక్రోషం కొట్టొచ్చినట్టుగా మొహంలో స్పష్టంగానే కనిపిస్తుంది.

ఎందుకు? ఎందుకు?

ముత్యాలుకు సరిగ్గా అర్థంకాదు.

ఒక్కొక్కప్పుడు కాఫీ తీసుకు రమ్మని ముత్యాలుకు పురమాయించి తాను చక్కా మేడపైకి వెళ్ళిపోతుంది శకుంతలారాణి

ముత్యాలు కాఫీగ్లాసుతో శకుంతలారాణిగదిలో అడుగు పెట్టేసరికి ఆగది గదిలావుండదు. ద్రౌపదీవస్త్రాపహరణం తరువాత కౌరవసభలా వుంటుంది.

శ్రీకృష్ణుడు ద్రౌపదికి సప్లయిచేసిన చీరల్లో బహుశా యింతటి వైవిధ్యం కనిపించివుండదు. ఎందుకంటారా? అప్పటికింకా కంచిలో, గద్వాలలో, అలంపురంలో, వెంకటగిరిలో, బొబ్బిలిలో, పుల్లంపేటలో, ధర్మవరంలో, మాధవవరంలో ఈ విధంగా యిన్నిరకాలచీరలు తయారుకానేలేదు.

"ఒక్కొక్క చీరగా మడచి పెడతావా ముత్యాలూ? నేను బీరువాలో సర్దేస్తాను" అంటుంది శకుంతలారాణి.




"అలాగే నందమ్మగారూ!" అంటుంది ముత్యాలు.

చీరలు మడిచిపెడుతూ ముత్యాలు ఆలోచనలో పడుతుంది. దండిగా చీరలున్నాయిగదా అని ఎవరైనా ఒక్కసారిగా నాలుగైదుచీరలు ఒంటికి చుట్టుకుంటారా? ఊహూఁ, అదేం కుదరదు. మరైతే ఒక మనిషికి యిన్ని చీరలెందుకు? పెట్టెలో మ్రగ్గిపోవడానికా? లేదంటే చివరకు చిమటలు తినిపోవడానికా?

హఠాత్తుగా ఆలోచన కడ్డుతగులుతుంది శకుంతలారాణి. "ఇదేం చీరో ఎరుగుదువా ముత్యాలూ?" అంటుంది.

ఆ చీరకేసి తేరపారజూచి "ఇదా! ఆరోజు కరణం కామప్పగారింట్లో పేరంటానికెళ్ళినరోజున మీరు కట్టుకున్న చీరిదే కదండీ" అంటుంది ముత్యాలు.

కరణం కామప్పగారింట్లో పేరంటం జరిగి మూడు మాసాలైవుంటుంది. ఇంకొక మూడు నెలలకుగానీ తానీ చీర కట్టకపోవచ్చు. తనకెన్ని చీరలున్నాయో లోకులకు తెలియడానికి ఈ నిదర్శనం ఒక్కటిచాలు. కానీ ఆశ్చర్యమేమిటంటే ఈ లోకులనేవాళ్ళకు తన చీరల వైభవాన్ని గురించి బొత్తిగా కాబట్టినట్టు లేదు. ఇందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేనట్టు, అప్పటికది చాలా మామూలు విషయమైనట్టు వీళ్ళు ముభావంగా వుండిపోతారు. ఈ లోకుల్లో అగ్రస్థానం

ముత్యాలుదే! సాటి ఆడమనిషి గదా! తనకు కట్టుకోడానికి ముహూర్తం చీరతో సహా కలిపి లెక్కపెట్టినా నాలుగైదింటి కన్నా ఎక్కువలేవుగదా! మరైతే దేన్ని చూచుకునమ్మా దీనికింత బింకం? కించిత్తు అసూయ కనబడదే! కాస్తా అసహనం ప్రకటించదే! ఇదేం మొద్దు మనిషమ్మా ఈ ముత్యాలు?

చీరలు మడతపెడుతూ అప్పు డప్పుడూ తల పైకెత్తి శకుంతలారాణి వైపు చూస్తుంది ముత్యాలు. చాలా అందమైన ముఖం శకుంతలారాణిది! పొంకమైన ఒళ్ళు. పొడుగాటి కురులు. పోతే పూట కొకరకంచీరతో ముస్తాబవు తుందిగూడా! ఇలాంటి అందమైన మనిషి మనసంతా విప్పి, హాయిగా ఒళ్ళు జల్లు మనేలా ఒకసారి నవ్వేస్తే చూడాలన్న కోరిక ముత్యాలుకు తీరకుండానే వుండి పోయింది. కంచిపట్టుచీర సునాయాసంగా కొనగలిగిన మనిషికి కాస్తంత చిరునవ్వు దొరక్కపోయిందా? ఓ చీర కొనడం మానేసి ఆ డబ్బుపెట్టి ముఖం కలకల లాడే మందేదైనా వుంటే కొనుక్కో గూడదా? వీళ్ళకు మేడలున్నాయి. తోట లున్నాయి. కారుంది. కొళాయి తిప్పితే నీళ్ళొస్తాయి. మరనొక్కితే పంకా తిరుగు తుంది. బిస త్రిప్పితే రేడియో పాటందు కుంటుంది ఐనా ఎన్నివుండి ఏంలాభం? చిన్నమ్మగారి ముఖం విప్పారిన పువ్వు. ఆమె మేడలో మసిలే నీడ!

ఆరు మాసాల క్రిందట వరకు ముత్యాలు మేనత్త బంగారమ్మ పెద బాబుగారింట్లో పని చేస్తూవుండేది. కొత్త కోడలు కాపురానికి రాగానే ఆమె తనం తట తానుగా రిటయిరైపోయి, ఆ వుద్యో గాన్ని ముత్యాలుకు అప్పజెప్పింది. చిన్న ప్పటినుంచీ ఒళ్ళువంచి పనిచేయడానికే అలవాటుపడిన ముత్యాలుకు పెదబాబు గారింట్లో పనిచేయడ మేమంత కష్ట సాధ్యంగా కనిపించడంలేదు. ఆమెకు విడ్డూరంగా వున్నదల్లా యిక్కడి మను షుల వాలకమే! ఐనా పెద్దవాళ్ళవూసు మనకెందుకు లెమ్మన్నట్టుగా ఆమె వాళ్ళ మధ్య వీలయినంతవరకూ ఒక మూగ పాత్రగానే వుండిపోయింది. ఐతే అలాంటి ముత్యాలుగూడా ఒక సంద ర్భంలో ఒళ్ళు మరిచిపోయే పరిస్థితి ఏర్పడింది

ఒళ్ళు మరిచినప్పుడు మనిషినోటి గుండావచ్చినమాట ఎలాంటి తీవ్రపరిణా మానికైనా దారితీస్తుంది.

అసలిక్కడ ఏం జరిగిందో చెప్పాలి.

సంకురాత్రి కింక వారంరోజు లుంద నగా శకుంతలారాణి "పండగకు నువ్వు కొత్తచీర కొనుక్కోలేదా ముత్యాలూ?" అని అడిగింది.

ముత్యాలు సిగ్గుపడిపోయింది. పెళ్ళి పీటలపైన తనకు నాతీసుచీర కొనిపెట్టి నందుకు మంగపతిని బంధువులందరూ తలా ఒకమాటన్నారు. తన విలువ

తనకు తెలిసివచ్చాక ముత్యాలు గూడా ఆ చీర తాను కట్టనంటే కట్టనని మారాం చేసింది. ముద్దరాలి ముచ్చటతీర్చి, మరింక గా మురిపాలు దోచుకోవాలని మంగ పతికి గూడా ఒక మంచి బుద్ధి పుట్టింది. అతనెలాగో ఒక యాభై రూపాయలు సంపాదించాడు. టౌనుకు వెళ్ళి నాలు గంగళ్ళు ఎక్కిదిగి, యాభై రూపాయలకు పట్టుచీరలేవీ రావని తెలుసుకున్నాక అరిడొక నైలాన్ చీర తీసుకొచ్చాడు. లేతలేత నీలిమబ్బుల చీర. మబ్బుల వెనుక మెరుస్తూ రంగురంగుల నక్షత్రాలు ఇరుగుపొరుగు అమ్మలక్కలు ఆ చీరలో ముత్యాలు మ బ్బుల్లో చం ద మా మ లాగుంటుందన్నారు.

ముత్యాలుద్వారా ఈ వర్తమానం తెలుసుకున్న శకుంతలారాణి "ఏదీ, ఒకసారి ఆ చీర తెచ్చి చూపెట్టగూడదా ముత్యాలూ !" అంది.

ఆరోజు సాయంకాలమే ముత్యాలు నైలాన్ చీర తీసుకునివెళ్ళి శకుంతలా రాణికి చూపెట్టింది.

కొత్తచీరవైపు చూడగానే శకుంతలా రాణి కళ్ళు మిలమిల మెరిసాయి. ఆమె చీరను తాకి చూచింది. త్రిప్పిచూచింది. పొరలు పొరలుగా విడతీసి శరీరంపైన కప్పుకుని చూచింది. దాని స్పర్శ, రంగు వాసన అన్నీ ఆమెకెంతో యింపితంగా వున్నాయి. తటాలున గదిలోకివెళ్ళి ఆమె క్షణాల్లో చీర మార్చేసుకుంది. నిలువు టద్దంముందు నిలబడి, కొత్త చీరలో తన సోయగం పోతున్న పోకడలన్నీ తనివి తీరా చూచింది. ఈ తతంగమంతా కొన సాగుతూవచ్చిన పదినిమిషాల వ్యవధిలో ఆమె ఈ చీర ముత్యాలుదన్న విషయం మరిచేపోయింది !

ఈ చీర తనదిగాదు ముత్యాలుది. ఆమె వెంట నిలబడివుందన్న విషయం జ్ఞాపకిరాగానే శకుంతలారాణి చీరనిరా బయటికి పరుగెత్తివచ్చింది.

"ఒసే ముత్యాలూ ! మంచిదానివి గదూ ! నేనొక మాట చెబుతాను. వింటావా? మరేంలేదు నాకెందుకో ఈ చీరను విడిచిపెట్టడానికి బుద్ధి పుట్టడం లేదు. దీని వెలెంత ? యాభై రూపాయలా ? నే నింకొక నాలుగో, అయిదో ఎక్కువగానే యిచ్చేస్తాను. అంతగా కావలిస్తే, నువ్వింకొక చీర తెప్పించు కోవచ్చు. ఏమంటావు ముత్యాలూ ! సరేనా ? ఉండు, యిప్పుడే డబ్బు తీసు కొస్తాను..."

ముత్యాలు ముఖం ముడుచుక పోయింది. పండుగలోపల మళ్ళీ యిలాంటి చీర కొనుక్కోడం కుదరక పోవచ్చు. పట్టణానికి వెళ్ళిరావడానికి భర్త బద్ధకించవచ్చు. తనకింత మంచి చీర తెచ్చిపెట్టినందుకు అత్తగారసలే రుసరుస లాడిపోతూవుంది. ఈ సారి ఆవిడ బొత్తిగా ఒప్పుకోక పోవచ్చు.

డబ్బు చేతిలో పెడుతూ "ఏం

ముత్యాలూ! అదోలా వున్నావు? దిగులుగా వుందా?" అంటూ పరామర్శించింది శకుంతలారాణి.

"ఏం దిగుల్లెండి అమ్మగారూ! ఎంత పాతచీర కట్టుకున్నా నా మొగుడికళ్ళకు నేను బాగానే ఉంటాను." అని వెను దిరిగి చూడకుండా గిరుక్కున బయటికి వచ్చేసింది ముత్యాలు!

జరిగిన కథంతా విన్నాడు మంగపతి. కోప్పడవలసింది పోయి, వేడిగా నిట్టూర్చాడు. "అయ్యో, ఎంతపని చేశావు ముత్యాలూ!" అంటూ నొచ్చుకున్నాడు. "అదేం, నేనేం చేశాను మామా?" అంటూ తెల్లబోయింది ముత్యాలు,

మంగపతి వివరించాడు.

శకుంతలారాణికి పెళ్ళయి మూడేళ్ళయింది. భారీ కట్నంతో, బోలెడు చీరలతో, సారెలతో ఆమె కాపురానికి వచ్చింది. అమ్మాయిని చిదిమి దీపం పెట్టుకోవచ్చునని అందరూ అన్నారు. కానీ నట్టింట వెలిగే దీపం కన్నా, చినబాబుకు వీధిదీపాలంటేనే యిష్టం. గంట కొక కాఫీ త్రాగి, నోరు చేదెక్కిన వాడికి కమ్మటి మజ్జిగ రుచిస్తుందా? ఇంటిపట్టున పడివుండి ఎప్పుడూ తనకోసం ఎదురుచూచే పెళ్ళామంటే చినబాబుకు చెప్పరానంత తలనొప్పి! అతని నివాసం హమేషా పట్టణంలోనే! అక్కడతని వ్యామోహాలకు ధూప దీప నైవేద్యాలు సమర్పించే స్నేహితులు దండిగా వున్నారు. స్థిరంగా ఒక బస వుంది. ఆ బసలో తన యిష్టం వచ్చినట్టు తాముండడానికి కావలసిన వెసులుబాట్లన్నీ వున్నాయి...

"చిన్నమ్మ గారికేం మిగిలింది? బీరువా నిండుకూ చీరలు మిగిలాయి. కళ్ళనిండుకూ కన్నీళ్లు మిగిలాయి. చాలనిదానికి పుండుమీద కారం చల్లడానికి నువ్వొకదానివి బయల్దేరావు" అన్నాడు మంగపతి.

ముత్యాలు కొయ్యబొమ్మలా మాన్పడిపోయింది.

పది రోజులు గడిచాయి. ఈ పది రోజుల్లో చిన్నమ్మగారి ఔదార్యం పెదరామాపురంలో యింటింటా చెప్పుకోదగ్గ విషయమైపోయింది. నాకు వాయిల్ చీర యిచ్చిందని ఒకరంటే, నాకు ఫుల్ వాయిల్ చీర యిచ్చిందని ఒకరు, మా అమ్మాయికి రెండు చీరలిచ్చిందని ఒకరంటే, నా కోడలికి మూడు చీరలని యింకొకరు. ఈ చీరలదానం చివరికెక్కడికి దారి తీస్తుందో ఎవరికీ అంతు చిక్కడంలేదు.

చిన్నమ్మగారు పుట్టింటికి వెళ్ళబోతున్నట్టు మాత్రం అక్కడక్కడా చెప్పుకున్నారు.

అత్తింట కాపురం చేస్తున్న కోడళ్ళు పుట్టింటికి వెళ్ళిరావడం సహజమే! శకుంతలారాణి పుట్టింటికి బయల్దేరడంలో గూడా వైపరీత్యమని చెప్పుకోదగ్గదేదీ




కనిపించలేదు. కానీ ఆమె వెళ్ళి చేరినట్టు పుట్టింటినుంచీ వార్త రాకపోవడం యిక్కడివారికి కాస్తా ఆశ్చర్యం కలిగించింది. వారంరోజులు ఓపిక పట్టి వీళ్ళొక టెలిగ్రాం యిచ్చిచూచారు. టెలిగ్రాముకు బదులుగా ఒక మనిషి పరతెంచి వచ్చాడు. శకుంతలారాణి అక్కడికి వెళ్ళనేలేదట. ఈ వర్తమానం తెలియగానే పెదబాబుగారిల్లు కుమ్మరావంలా ఒక వరస లోలోపలే వుడికిపోయింది.

సీతామ్మ వారికోసం జరిగినట్టుగా నాలుగు దిక్కులకూ అన్వేషణ ప్రారంభమైంది.

ఎలాంటి అశుభవార్త వినవలసి వస్తుందోనని శ్రేయోభిలాషులందరూ గుండెలు గుప్పిట్లో పట్టుకుని వేచివుండిపోయారు. ఇంకా నయం! వచ్చింది అశుభవార్తగాదు కానీ శుభవార్తగా భావించడానికి వీల్లేదు. శకుంతలారాణి ఉద్దేశమేమిటో ఆదేవుడికే తెలియాలి. ఆమె చినబాబు ఏ పట్టణంలోనైతే స్థిరంగా మకాంపెట్టి తననివాసకేంద్రాన్ని నెలకొల్పుకుని వున్నాడో అదేపట్టణంలో ఒక బంధువుల యింట మకాంచేసిందట! ఆచూకీ కనిపెట్టిన పెదబాబుగారి మనిషి వెళ్ళిపిలిస్తే రావడంలేదు పొమ్మని చీవాట్లు పెట్టిందట!

చినబాబు కోపదండహ్యామాస మానసుడై పోయివుంటాడని ప్రత్యేకంగా

చెప్పనక్కర్లేదు. అతడు గంటకు అరవై మైళ్ళస్పీడులో–నడచి కాదు, కారులోనే అనుకోండి, వెళ్ళి ఆబంధువులయింట్లో వ్రాలాడు. ఆభార్యాభర్తల సమాగమానికి ప్రత్యక్షి సాక్షు లెవరూలేరు. లేదంటే చాటునమాటున నిలబడి వాళ్ళప్రసంగాన్ని ఎవరైనా వినివుంటే వినివుండవచ్చు–అలాంటి వాళ్ళద్వారా శకుంతలారాణి వాదమేమిటో తెలుసుకోడానికి వీల యింది.

అమ్మాయి ఎక్కడో పుట్టిపెరుగుతుంది ఆత్మీయుడనినమ్మి ఒక మగరాయడి వెంట వచ్చేస్తుంది. యువతీయువకులిద్దరు ఒక కప్పు క్రింద సహజీవనం నెరపడానికి యిష్టపడుతూ చేసుకునే ఒప్పందమే వివాహం. మొగుడైన వాడికి తనకు భార్యంటూ ఒక మనిషివుందన్న స్పృహ లేకపోయిన తర్వాత యింక ఆ ఒప్పందం తగలబడినట్టే ! అలాంటి పరిస్థితిలో భార్యకు రాజభోగాలు జరిగితే జరగవచ్చునుగాక ! కానీ అదంతా మొదటి తరగతి ఖైదీ జీవితంకన్నా మెరుగైందేమీ కాదు. బోలెడు చీరలుండొచ్చు, ఒంటినిండుకూ నగలుండవచ్చు కానీ తన వ్యక్తిత్వానికి విలువలేక పోయాక, తన ఆత్మాభిమానం దివాలా తీశాక అవన్నీ శవానికి చేసిన అలంకారాలు. తల్లిదండ్రుల పుణ్యమా అని తను కొంత వరకూ చదువుకుంది. ఆమాత్రం చదువుకు ఏదైనా వుద్యోగం దొరకక్కపోదు. ఒకరిపైన ఆధారపడకుండా, ఒకరి మోహార్బానీ అక్కర్లేకుండా తన బ్రతుకేదో తాను బ్రతుకుతుంది.

పాపం చినబాబు తన జనానాలో యిలాంటి తిరుగుబాటు చెలరేగుతుందని కలలోనైనా వూహించివుండడు.

ఐనా యిదంతా పాలపొంగు లాంటిదేననీ, తల తిరిగి కవళం నోటిదగ్గరికి రాకపోదనీ అతడు భావించివుండవచ్చు.

మొత్తానికీ అనడమేగాదు. అన్నంత పని గూడాచేసింది శకుంతలారాణి. ఆమెకెక్కడో ఒక వుద్యోగం దొరికింది. చిన్నసంపాదనే ! కానీ ఆమె సంసారం మాత్రం ఏపాటిది ? ఒంటి మనిషి ఇంటద్దెకు యాభైరూపాయలు పోతుంది. మిగిలిన అవసరాల కన్నింటికి కలిసి వందరూపాయలు సరిపోతుంది. పోగా ఆమె నెలసరి జీతంలో యింకా యాభై రూపాయాలు మిగిలేవుంటాయి.

కాలినడక పైన ఆఫీసుకు వెళ్ళివచ్చే భార్య కారుపైన రోడ్లలో బలాదూర్లు తిరిగే భర్త, ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో ఒకచోట ఆ భార్యా భర్తలు ఒకరికొకరు తారసిల్లడం అసంభవమేమీ కాదు. ఒకసారి అదే జరిగింది. శకుంతలారాణి ఆఫీసుకువెళ్తుండగా ఓ కారు సవ్వడిచేయకుండా వచ్చి ఆమె ప్రక్కన ఆగిందట ! విండోలోనుంచీ వెలుపలికి చూసూ చినబాబు "ఇది నీకు





గౌరవప్రదంగా వుందా ?" అని ప్రశ్నించాడట !

"నేనిలా ఆఫీసుకు వెళ్తుండడం గౌరవ ప్రదమే ! మీరు కారులో తిరగడమూ గౌరవ ప్రదమే ! కానీ మనం యిక్కడ ఆగి ఒకరితో ఒకరు యిలా మాట్లాడుకోవడం మాత్రం గౌరవప్రదం కాదు" అంటూ శకుంతలారాణి చరచరా తన దారివెంట తాను వెళ్ళిపోయిందట.

ఇంకొకసారి తెంపుచేసి, చినబాబు శకుంతలారాణి కాపురమున్న యింటికే వెళ్ళాడట. రాత్రి తొమ్మిగంటల వేళ అతడు దబదబా తలుపు బాదాడు. "ఎవరక్కడ?" అని ప్రశ్నిస్తూ కిటికీ తలుపులు తెరిచింది శకుంతలారాణి. "నేనే గానీ ఒకసారి తలుపు తీస్తావా ?" అన్నాడు భర్త. "ఎందుకూ !" అంటూ ఆశ్చర్యం ప్రకటించింది భార్య.

"నీతో ఒకమాట మాట్లాడాలి ?"

"అక్కడుండే మాట్లాడగూడదూ ?"

"తీస్తావా ? తలుపులు బద్దలు చెయ్యమంటావా ?" అంటూ హుంకరించాడట చినబాబు.

శకుంతలారాణి నవ్విందట ! "తలుపులు తెరచిపెట్టుకుని, మీకోసం కాచుకుని కూచున్నప్పుడు మీరు రాలేదు. ఇప్పుడు పదిలంగా గడియపెట్టుకుంటే తలుపులు బద్దలుగొడతా మంటున్నారు. లోకమంతా మీతోడిదేనని అనుకున్నప్పుడు, మీకు నేనొక్కత్తిని వున్నానన్న ఆలోచనే కలగలేదు. ఒకరిపైన ఆధారపడకుండా నేను బ్రతకగలనని నిరూపణ అయిన తర్వాత మీకు నాపైన ఎక్కడలేని ధ్యాస పుట్టుకొచ్చింది." అంటూ ఎద్దేవాచేసిందట !

# ప్రేమగీత

— శార్వరి —

"నువ్వుఉత్త ఫూల్‌వోయ్ కృష్ణా" అన్నది మా ఆవిడ, ఇల్లాలుగా పదవీ స్వీకారం చేయకముందు.

"బొర" అనుకుని బిత్తరపోయి చూస్తుండగా "నువ్వు ఇడియట్‌వి" అన్నది నవ్వుతో ... నవ్వుతూనే మొగుణ్ని వాతలుపెట్టడం పెళ్లాల జన్మ హక్కు.. అయితే మాలతి మా పెళ్లి కాకముందే నాపై ఆ హక్కు సంపాదించుకున్నది.

అందమైన అమ్మాయి వాలుచూపు కోసం, చిరునవ్వు కోసం తిప్పలుపడే వయస్సది. అప్పుడు మనకు ఇష్టమైన అమ్మాయి తిట్టినా కమ్మగానే వుంటుంది.

అసలు మాలతికి నేను మొగుణ్ని ఎలా అయినానన్నది – నాకే ఆశ్చర్యకరమైన విషయం. పెళ్లి అయిన తర్వాత ఫూల్ అనీ, ఇడియట్ అని కోప్పడలేదు.

"అబ్బ మీకేంతెలియదు, మీ రూరుకోండి" అని మెత్తగా నోరుమూయిస్తుంది. రెండిటి ఫోర్సు ఒకటే.

మేం వారాని కోసారి బీచ్‌లో కలుసుకునే వాళ్లం. ప్రేమించుకోవడం అనే

ఘనకార్యం బీచ్‌లోనే జరగాలని నా విశ్వాసం.. వర్షించే ఉద్యానవనం విశ్వాసం. చీకటి పడాక, వెన్నెలలో, సముద్రపు హోరులో మాలతిని లీగల్‌గా ప్రేమించడం ప్రాక్టీస్ చేశాను.

అప్పుడే అలవాటైంది, మాలతి ఏ మాట అన్నా ఒప్పుకుని, నోరుమూసుకోవడం. ఆమె అనకపోతే ఎలావుండేదో గానీ, ఫూల్, ఇడియట్ అని ముద్దుగా పిలిచాక, నిజంగా ఫూల్‌నైనాను. కాకపోతే మాలతి మొగుణ్ని ఎందుకవుతాను.

అసలు ఆ అమ్మాయి నాకు తెలీదు. వైజాగ్ కాలేజీలో ఇంటర్ చదివే అమ్మాయిని, యూనివర్శిటీలో ఎం. ఏ. చదివే నేను ఎందుకు ప్రేమిస్తాను? ఆ ఛాన్సు రావడానికి వీల్లేదుగదా! కానీ వచ్చింది అదే చిక్కు.

మాలతిని నేను డిస్కవర్ చేయలేదు. వాళ్ల నాన్నగారే నన్ను డిస్కవర్ చేసి, నా గుణగణాలు డిస్సెక్ట్ చేసి, అవి వాళ్ల అమ్మడిలోనూ, నాలోనూ సమ నిష్పత్తిలో ఉన్నాయని గుర్తించి, మేంయిద్దరం ఒకటైతే బాగుంటుందనే కనిష్ఠ సామాన్య గుణకారాలేవో వేసి, మానాన్నకు ఫిర్యాదు చేశారు. ఆయనగారు నాకన్న ముందే ఆత్రంగా, నాకు తెలియకుండా, అజ్ఞాతంగా విశాఖపట్నం వచ్చి ఆ దేవదేవిని చూచి, ఉక్కిరిబిక్కిరై దరిమిలా నా గదికి వేంచేసి నన్ను ఉబ్బితబ్బిబ్బు చేసి, చివరకు నా చేత ఓ చిరునవ్వు కక్కించి, తల ఊపించి తిరుగుటపాలో వెళ్ళాడు.

ఇంక మాలతిని ప్రేమించక తప్పలేదు. అంతే అనివార్యంగా ట్రయల్స్ వేసి. వెంటపడి, ఎన్నో ప్రయత్నాలు చేసి, వళ్లు గట్టిపడే వరకు శిక్షించుకోకుండానే ప్రేమించే హక్కు అనాయాసంగా పొందాను.

నేను ఫలానా అని మాలతికి తెలుసు. తాను ఫలానా అని నాకు తెలుసు. మేమిద్దరం అలాగ తెలియనట్లే ఆదివారాలు, టంచనుగా సాయంత్రం సముద్రతీరంలో కలుసుకునే వాళ్లం. అలాగా ట్రయల్ లవ్ ప్రారంభించి, నిజంగానే మాలతిని ప్రేమించేను.

నేను ఎక్కడ ఫూల్‌నైనానంటే మాలతిని అలా బీచ్‌లో కలుసుకుంటున్నప్పుడు ఒక రోజున అడిగాను. ఆ ఒక్క మాట నన్ను జీవితాంతం ఫూల్‌నిచేసింది. అది ఏమిటంటే...

"మాలతీ! నువ్వు ఎవరినైనా ప్రేమించావా?" అని

ఆ మాటకు నావేపు తీవ్రంగా చూచి, తల దించుకుని ఆలస్యంగా ఓ చిరునవ్వు నవ్వి, "మీరు ఎవరినైనా ప్రేమించారా?" అని అడిగింది.

ఆ రోజుల్లో ప్రేమ తినే బ్రతుకుతున్నట్లుగదా... గర్వంగా 'ఓ' అన్నాను

"ఎవరిని?" అన్నది.

"మాక్లాసులో మెర్సీ అనే మెరుపు

తీగ ఉంది. ఆ అమ్మాయిని" అన్నాను గర్వంగా.

నిజానికి మెర్సీకి, తనను నేను ప్రేమిస్తున్నట్లు తెలీదు. ఆ అమ్మాయి అందంగా ఉంటుందని, చలాకీగా ఉంటుందనీ, ప్రేమిద్దామని అనుకున్నాను.

అసలు ప్రపంచంలోని అందమైన ఆడవారందర్నీ ప్రేమించే హక్కు మనకున్నది. అంటే విద్యార్థులకని తాత్పర్యం.

"అయితే మిమ్మల్ని పెళ్లి చేసుకుంటాను" అన్నది మాలతి.

"మరి ప్రేమో !" అన్నాను.

"మెర్సీని ప్రేమించారుగా చాలదూ. నువ్వు ఉత్తఫూల్‌వి కృష్ణా" అన్నది.

ఒకమ్మాయిని ప్రేమిస్తున్నట్లు, మరొక అమ్మాయికి చస్తే చెప్పకూడదనే రహస్యం అప్పుడు నాకు తెలీదు. ఏ ఆడపిల్లా తను ఒకర్ని ప్రేమిస్తే, ఆవిషయం మరొక మగాడికి చస్తే చెప్పదట...చివరికి మొగుడికి కూడా. అసలు మొగుడ్ని ప్రేమిస్తున్న విషయమే ఆ మొగుడికి చెప్పరు ఆడపిల్లలు.

"నిన్ను ప్రేమిస్తున్నాను కృష్ణా" అని మాలతి ఏనాడూ నాకు చెప్పలేదు. అప్పటికీ, ఇప్పటికీ ... ఎప్పుడైనా. హుషారుగాఉండి 'ప్రేమ' సంగతి తెస్తే చాలు "ఫూల్, ఇడియట్" అంటుంది.

పెళ్లి అయిన తర్వాత, ప్రపంచంలో నా మాలతి అంత అందగత్తె మరెవరూ లేరనే నిర్ణయానికి వచ్చాను. అలాగ ఎందుకు వచ్చానో, రాగలిగానో నాకే తెలీదు. పెళ్లి కాకముందు బోలెడుమంది అమ్మాయిలు మహా అందంగా, ఆకర్షణీయంగా కనిపించేవారు. 'ఈ అమ్మాయిని పెళ్లి చేసుకుంటే బాగుండును' అనుకునేవాణ్ని అంతేగానీ "ఈ అమ్మాయిని ప్రేమించాలి" అనుకునేవాణ్ని కాదు. అదొక పెద్ద తప్పిదం. అందమైన అమ్మాయిని ప్రేమించాలిగానీ, పెళ్లాడాలని కోరకూడదు అని "ప్రేమగీత" బోధించింది రాధ. రాధ కథ వేరు

మాలతిని చూస్తుంటే, లోకంలోని అందగత్తెలందరూ ఆమెలోనే కన్పించేవారు. అది ఆరోగ్యకరమైన విషయం. అలా అనిపించకపోతేనే చిక్కు. నీ పెళ్లాం అందగత్తె కాదని నీవు అనుకున్నావా, ఆమెతో సంసారంచేయలేవు ఆ విషయం ఆ ఇల్లాలికి తెలిసిందా నీ జీవితం నరకం అయితీరుతుంది.

ఇంతకీ మెర్సీ సంగతి చెప్పనేలేదు. నాలో మొట్టమొదట ప్రేమ మొలకెత్తింది మెర్సీని చూచాక. అదే నా ఫస్ట్ లవ్ ఎట్ ఫస్ట్ సైట్. ఆ గుమ్మను ఆపాదమస్తకం ప్రేమించాలనుకున్నాను. ప్రేమించాననుకున్నాను. ఆ చిట్టెమ్మ విల్సన్‌ను పెళ్లాడిందని తెలిసి, ఒకరోజు కాఫీ, సిగరెట్లు మానేసి, నిరసన సత్యాగ్రహం చేశాను రహస్యంగా. నా

ప్రేమను బయటపెట్టే లోపలే తొందరపడి, మరొక వెధవకు మనసిచ్చి, పెళ్లాడేసిన మెర్సీని క్షమించి మరచిపోయాను. తర్వాత మెర్సీ నాకు ఎదురుపడ్డా నా అస్తిత్వాన్ని, ఉనికినే గమనించనట్లు పోవడం చూచి ఆడవాళ్ళను, అందునా అందమైన కాలేజీ ఆడపిల్లల్ని ప్రేమించడమంత మతిమాలినపని మరొకటి లేదని తీర్మానం చేసుకుని, ఆ తీర్మానం మీద నేనే ఎన్నా పెద్దా సంతకాలు బరికేశాను.

యవ్వనంలో కలిగే ప్రేమలో ఏదో తాపం ఉంటుంది. నూటికి తొంభై తొమ్మిది యంగ్ ప్రేమాయణాలు బెడిసికొడతాయి. కారణం నేను చెప్పలేను, మీరూ చెప్పలేరు. కనుక మెర్సీ పెళ్ళితో నేను దేవదాసును, మజ్నూను కాలేదు. 'కనీసం ఒక్కసారైనా నా ప్రేమను గురించి చెప్పి ఉండవలసిందని బాధపడ్డాను. చెబితే ఎలా వుండేదో!' 'హాఁ, డియర్' అని నన్నే పెళ్ళాడేదేమోనని వెధవ ఆశ.

మాలతిని కౌగలించుకొని పడుకుని, "మాలా! నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో తెలుసా" అన్నాను ఓసారి. వెంటనే విదిలించికొట్టి, దూరంగాపోయి "అలాటి మాటలు ఎప్పుడూ అనకండి. నాకు ప్రేమ, తేమ అనేవాళ్ళంటే చెడ్డచిరాకు" అన్నది. అంటే మాలతి ఎవరినైనా ప్రేమించిందా! అడిగితే చంపేస్తుంది.

"నేనంటే నీ కిష్టంలేదు..." అని అలిగి పడుకునేవాణ్ని. మాలతి అయిదు నిమిషాల తర్వాత వచ్చి ఊరడించి, లాలించి, మరిపించేది, ఆ వెచ్చని కౌగిలిలో ప్రపంచాన్ని, ప్రేమను మరచి పోయేవాణ్ని. పారవశ్యమే మిగిలేది.

మాలతిని చూస్తుంటే మిగిలినవారు జ్ఞాపకంరారు. మాలతిని పెళ్ళాడిన తర్వాత ఇతర స్త్రీలమీద కోరికే కలగడంలేదు. ఎంతటి దారుణం!

నా రెండవ అడ్వెంచర్ సులోచన తోటే. అదీ అట్టేదూరం పోలేదు. మాటలతో ఆగిపోయింది. మా ఇద్దరి కలయిక అనుకోకుండా జరిగింది. సులోచనకు నేనంటే యిష్టం. నా మాటలంటే ఇష్టం. ఆమె అప్సర. బంగారంవంటి శరీరం. పెద్ద కళ్లు. కార్లలో వచ్చేది. ఆమెకు నాతో కబుర్లాడడం యిష్టం. నా కు ఆమెను అనుభవించాలని కోరిక. కానీ ధైర్యంచేసి ఆమె చేయికూడా పట్టుకోలేకపోయాను. ఏమాత్రం ఛాన్స్ యిచ్చేది కాదు.

నా సులోచన కథకూడా మాలతికి చెప్పాను. అంతా విని ఫక్కున నవ్వింది.

"ఎందుకు నవ్వుతావు మాలతీ" అంటే.

"పాపం...పసివారు" అని మళ్లీ నవ్వింది.

ఇంక ఎప్పుడూ మాలతికి నా ప్రేమ గురించి చెప్పకూడదని ఒట్టు వేసుకున్నాను

మాలతి అందంముందు సులోచన ఎందుకూ కొరగాదని ఆ రాత్రి గ్రహించాను. నా అవసరాలు గ్రహించగలదు మాలతి. సులోచనకు ఆ జ్ఞానం లేదు. ఆపాటి జ్ఞానమేవుంటే యిన్నాళ్ళు దూరంగా ఉంచుతుందా!

ప్రేమ విషయాలలో నేను వట్టి వెధవనని మా ఆవిడ గ్రహించింది. పైకి అమాటనే 'ధ్వనించేటట్లు' వ్యంగ్యంగా విసిరేది.

అసలు తిరుగుడు అంతా రాధను ప్రేమించినప్పుడు. రాధ సెలయేటి కెరటం లాగ గలగలా నవ్వేది. పారే వాగులా తీవ్రంగా ఉండేది. మాలతికి రాధకు చాలా పోలికలున్నాయి. మాలతిని పెండ్లి చేసుకొనకముందే రాధను ప్రేమించాను. ఆమెను చూడకపోతే బ్రతకలేననిపించేది.

ఒకరోజు ఎదురుపడి అడిగాను "రాధా! నన్ను పెళ్ళాడవూ?" అని.

రాధ గమ్మత్తుగా చూచింది.

"ఏం నేనంత అసహ్యంగా ఉన్నానా?" అంది...

"నువ్వు అప్సరసవు. రంభవు..." అన్నాను...

"రంభను, అప్సరసను పెళ్ళాడాలని ఎవరూ అనుకోరు... ప్రేమిస్తారు...




అందమైన అమ్మాయినిచూచి ప్రేమించలేనివాడు..." ఏదో అనబోయింది.

"నిన్ను ప్రేమిస్తున్నాను రాధా... అందుకే పెళ్లాడదలిచాను" భయపడుతూ అన్నాను.

"నాన్సెన్స్... పెళ్ళి... పెళ్ళి అనే వాళ్ళను చూస్తే నాకు చిరాకు. ప్రేమిస్తానంటావ్ నాకేం అభ్యంతరం లేదు. కానీ నువ్వు ముందు ప్రేమమాట చెప్పలేదు కనుక ఇంక నువ్వు ప్రేమిస్తానన్నా ఒప్పుకోను. అందమైన అమ్మాయి దొరికితే ప్రేమించుగానీ, పెళ్ళి బేరం చేయకు మిస్టర్. ప్రమాదం" అని వార్నింగిచ్చింది రాధ.

నా తల తిరిగిపోయింది. తల బొప్పి కట్టింది. ఈ విషయంమాత్రం మాలతికి చెప్పలేదు. చెప్పనుకూడా.

'ఈసారి బ్రూట్' అని తిట్టగలదు. ఈ కథలన్నీ విశాఖపట్నంలో ఉన్నప్పుడు.

దరిమిలా నేను సినిమాలను ఉద్ధరించాలనే సంకల్పంతో మద్రాసు రావడంతో సంసారం మద్రాసుకు ట్రాన్స్ఫర్ అయింది. సినిమావాళ్ళకు స్త్రీ జనంతో చనువు ఎక్కువని అందరికీ తెలిసినంత మా ఆవిడకూ తెలుసు. చాలా మంది అందమైన భామలు నాకోసం వచ్చేవారు. కొందరు సినిమాలలో వేషాలకోసం వచ్చేవారు. నాటకాల అమ్మాయిలు కొందరు. ఏమైతేనే. సీతాకోక చిలకలు చాలా మా యింట్లో వాలుతుంటాయి వాళ్ళతో స్నేహంగానూ, చొరవగానూ ఉండక తప్పదు.

మాలతికి నామీద గొప్ప నమ్మకం.

దేవలోకంనుండి రంభ, ఊర్వశి దిగి వచ్చినా, నేను చలించనని. అంటే అంతటి నిగ్రహం ఉన్నదని ఆమె నమ్మకమా! కాదు. నాకు అంత ధైర్యం లేదని ఆవిడ ధైర్యం.

మాలతికి అన్యాయం చేయాలని నేను ఏనాడూ అనుకోలేదు. నిజానికి పరస్త్రీని నేను చూడలేదు. చూడలేదంటే చూడ లేదనిగాదు, ఎవరితోనూ సంబంధం పెట్టుకోలేదు. నాకు మాలతిని మించిన అందం ఎవరిలోనూ కనిపించదు.

కాని మొన్న ఏం జరిగిందంటే మా ఆవిడ బంధువుల యింటికని వెళ్ళింది. ఆదివారం కావడంవల్ల నేను యింట్లోనే వున్నాను. మాలతి వెళ్ళిన కాసేపటికి ప్రమీలారాణి వచ్చింది. ప్రమీలారాణి ఇప్పుడిప్పుడే సినీమాతారగా స్థిరపడు తున్నది. నాద్వారా నాలుగు కంపెనీలలో వేషాలు వచ్చాయి. ఆ అమ్మాయికి ఆ విశ్వాసం ఉన్నది నాపైన.

ఆ అమ్మాయికి ఓ హిందీపిక్చర్‌లో హీరోయిన్ ఛాన్స్ వచ్చిందట. ఆ విషయం చెప్పడానికే వచ్చింది.

మా ఆవిడ యింట్లో లేకపోవడంతో కాస్త చనువు తీసుకొంది. సంతోషంతో వచ్చి నన్ను కావిలించుకొని, ముద్దు పెట్టు కుంది. అనుకోకుండా వచ్చిన ఆ పొంగుకు నిగ్రహించుకోలేక, నాచేతులు ఆమెనడుం చుట్టాయి. ఆమెచేతులు నా మెడచుట్టూ వేసింది. పరిష్వంగం కాస్త వేడిగానే ఉంది.

బంధువుల యింటికని వెళ్ళిన మాలతి ఆ క్షణంలోనే వచ్చింది. తలుపులు తీసే ఉండడంతో కొంప మునిగింది. ఆ దృశ్యం చూచింది మాలతి.

ఆ రాత్రే పుట్టింటికి ప్రయాణమైంది. ఆమెకు ఎలా నచ్చచెప్పాలో నా కర్థం కాలేదు. పరస్త్రీని కన్నెత్తి చూడననే నమ్మకం ఉన్న మాలతి, ప్రమీలారాణి కౌగిలిలో నన్ను చూచింది. క్షమించ మంటే!

"మాలతీ! నేను నిజంగా ఏ పాపం ఎరగను... నన్ను నమ్మవూ"

ఆ రాత్రి దిగులుగా పడుకున్నాను ఒంటరిగా. మాలతి సత్యభామ అయి, అలకపాన్పు ఎక్కిందని తెలుసు. మామూలుగా వచ్చి, ప్రక్కన చేరింది.

"ఆ అమ్మాయికూడా మిమ్మల్ని ఫూల్ చేసింది" అన్నది. చీకటిలో మాలతి కళ్ళలో ఎప్పటి మెరుపు కని పించింది. ఆ శరీరంలో ఎప్పటి వేడి ఉన్నది.

"ఏం" అన్నాను.

"మీకు పరాయి ఆడవాళ్ళను ప్రేమిం చడం తెలియదు. అందుకని" అన్నది.

ఆమె పెదాలు తమకంతో అందుకో బోయాను...

"నోరు శుభ్రంగా కడుక్కున్నారా, లేదా" అన్నది కిలకిలా నవ్వుతూ...

"అంటే నాకర్థంకాలేదు. అంతేగాదు, మాలతి కౌగిలిలో ?లిగిన మత్తు, ప్రమీల కౌగిలిలో కలగలే దెందుచేత?"

# వెంటాడే భూతం




ఉన్నట్టుండి ఆకాశమంతా మేఘావృతమై పోయింది. దట్టమయిన మబ్బులు అంతటా ఆవరించి వాతావరణమంతా బీభత్సంగా తయారయింది. రివ్వున గాలి...దానితోపాటే చిన్న చిన్న చినుకులు ప్రారంభమయాయి. చీకటి చిక్కగా పులుముకుంది. బస్సు 'బర్ర్' మంటూ గొడవచేస్తోంది.

విసుగ్గా నిట్టూర్చాను. ఉద్యోగరీత్యా ప్రస్తుతం బొబ్బిలి విసిరివేయబడ్డాను. ఇదే మొదటిసారి — యింతకు ముందు ఎప్పుడూ బొబ్బిలి రాలేదు. ఒక్కడ్నే బయలుదేరాను. ఇల్లూ వాకిలీ చూసుకోవాలికదా! మధ్యాహ్నం రెండుగంటలకెక్కిన బస్సు, మధ్యలో రిపేరు వచ్చి గంటన్నర లేటయింది. తీరా, మళ్ళీ బయలుదేరేసరికి, కుండపోతగా యీ వర్షం! ఎవరు చెయ్యివూపినా ఆగిపోతూ పీతనడక సాగిస్తోంది. ఒకటే బోరు. తెచ్చుకున్న వీక్లీని చదువుకుందామనుకుంటే బస్సులో లైట్లు లేవు. వీళ్ళకి పొదుపు చేయాలన్న ఆలోచన కాలం విషయంలో ఎందుకుండదో నాకస్సలర్థం కాదు!

బస్సులో అందరి ముఖాల్లోనూ చిరాకు, అలసట స్పష్టంగా కనిపిస్తున్నాయి.

'బొబ్బిలి ఇంకా ఎంత దూరముంటుందండీ?' అనడిగాను ప్రక్కనున్న వ్యక్తిని. బస్సురొదలో నా మాటలు వినిపించలేదు కాబోలు, పలకలేదు. తట్టి పిలిచాను. ఉలిక్కిపడి నావేపుచూచి తమాయించుకొని అన్నాడు; 'వచ్చేదేనండీ... బహుశా ఓ పావుగంట ప్రయాణం.'

ఈ వర్షం తగ్గేవరకూ బస్సు నడుస్తూ ఉంటే బావుండుననుకొన్నాను.

జేబులోనుంచి సిగరెట్ తీసి వెలిగించాను. నేను సిగరెట్ వెలిగించటం వలన ఎవరికయినా యిబ్బంది కలిగినా, నా దుస్తుల్నీ నన్నూ చూసి ఎవరూ ఆటంకపరచరనే నమ్మకం నాకుంది.

డ్రైవరు దగ్గరున్న అద్దంలోనుంచి రోడ్డుమీదికి చూశాను. హెడ్‌లైట్సు వెలుగులో, కురుస్తున్న వాన — ఎవరో ముత్యాలు వెదజల్లుతున్నట్లుగా ఉంది. వానలో తడుస్తున్న నల్లని తారురోడ్డు — సరస్సులో స్నానంచేస్తున్న అందమైన అమ్మాయి నల్లని పొడుగైన జుత్తు నీటిమీద తేలియాడుతున్నట్టుగా ఉంది.

పావుగంట గడిచాక — అంతదూరంలో మెర్క్యురీదీపాలు కనిపించాయి. సమయానికి ఆఫీసు జీపు రాకపోయినా బస్సెక్కాను తీరా యిది దార్లో యిబ్బందులకు గురిచేసినా, అంతదూరాన గమ్యం చూసేసరికి మనసు తేలికపడింది.

బస్సు మరో రెండు నిమిషాలలో స్టాండులో ఆగింది. బస్సు దిగాను. ఎక్కడా రిక్షాల జాడలేదు. కూలీలుకూడా ఎవరూ లేరు... విసుక్కుంటూ నాలు గడుగులు కదిలానో లేదో, అంతవరకూ చిన్నతుంపర్లుగా పడుతున్న వర్షం మళ్ళీ ఉధృతమై పోయింది పట్టుకున్న సూట్‌కేసూ, చిన్నహోల్డాలూ తడిసి పోతున్నాయి.

ఇంతలో ఎవరో వ్యక్తి తలమీద తువ్వాలు కప్పుకునివచ్చి నా చేతుల్లోనుంచి సామాన్లందుకుంటూ 'వర్షం నావయిపోయింది బాబూ! తగ్గేవరకూ నా కొట్లో కూకుందురుగాని—రండి!' అంటూ దారితీశాడు. నే నతనికి మనసులోనే థ్యాంక్స్ చెప్పుకుని అతని వెనుకే వెళ్ళి ఆ కొట్లో కూచున్నాను.

చుట్టూ పరికించి చూశాను. అదొక హేర్ కటింగ్ సెలూన్. కత్తులూ, కత్తెరలూ, పౌడరుటిన్నూ ఓ బల్లమీద వరసగా పేర్చిఉన్నాయి. మూడువేపులా పెద్ద అద్దాలున్నాయి. కరెంటు లేనట్టుంది. కిరోసిన్ దీపాన్ని ఒత్తి హెచ్చిస్తూ అడిగాడతను: 'గడ్డంచేసేయమంటారేటి బాబూ?' నాకు నవ్వొచ్చింది. అదతని వృత్తిధర్మం, మరి! గడ్డం తడుముకుని చూశాను. గరుగ్గానే ఉంది. 'ఇప్పుడొద్దులేవోయ్' అన్నాను.

'ఏ వీధి వెళ్లాలి బాబూ! ఇయాల ఎదవనాయాలలు, యీ వర్షానికి వొక్క రిక్షా వాడూ కనిపించలేదు_'

"ఏ వీధీ కాదోయ్_ఈ ఊర్లో మంచి హోటలేదోయ్?"

తడుముకోకుండా జవాబిచ్చాడతను: 'శాంతి భవనమేనండి... అల్లద...ఆ పచ్చలైటు ఎలుగుతోందా? దాని పక్కనే దాన్నిమించిన ఓటేలు యీజీనగరంలో కూడా నేదు!"

వర్షం తగ్గిపోయింది పూర్తిగా. నేనెంత వారించినా వినకుండా అతను దుకాణం కట్టేసి, నా సామాన్లు పట్టుకుని నా వెనుకనే బయలుదేరాడు. వాడు చూపిస్తున్న ఈ అకారణ గౌరవానికి నా కాశ్చర్యంవేసింది. కారణం నా వేషం కావచ్చును.

హోటలు చేరాక వాడు శలవు తీసుకొని వెళ్ళిపోయాడు. భోజనం చేసి మంచమెక్కాను. మర్నాడు ఉదయాన్నే తలుపులెవరో తడుతూఉంటే మెళకువ వచ్చింది. నిద్రమత్తు యింకా వదలలేదు. కళ్లు బరువుగా ఉన్నాయి. విసుక్కుంటూ వెళ్ళి తలుపు తీశాను. రాత్రి నాకు సహాయంచేసిన మంగలి. నన్ను చూస్తూనే నవ్వుతూ 'గడ్డం చేయడాని కొచ్చాను బాబయ్యా... ఈ ఒటేల్లో పెరిమినెంటుగా సేసేవాడు యేరే ఉన్నాడు...ఆడికి వారంరోజులై జొరం, నెగనేదు... పొప్పరైటరు బాబు నన్ను కేకేసి...'ఒరే పోలిగా...ఆవార్తినేసురా.. కావాలంటే నువ్వు నేసుకుపోరా... అన్నారు... నాను షాపొగ్గి యిలా ఎప్పుడూరాను...ఏన్నాళ్ళెయిన్నా అందుకే రానేదు... ఇయ్యాల మీరొచ్చారు గదా అని...'

అప్పుడు తెలిసింది, వాడి పేరు పోలిగాడన్నమాట. రాత్రి అడగనేలేదు.

వాడు నా కోసమే పనిగట్టుకుని వచ్చినట్టు మాట్లాడేసరికి మాత్రం చిరాకేసింది. తైరుకొంటున్నాడనిపించింది. ఇంకా చనువిస్తే మంచిదికాదేమో. అది నాహోదాకే భంగకరం అనేభయం నాలో ఓమూలనుంచి బెదరకొడుతుంది. వాడిదీ నౌకరీవే_నాది నౌకరీవే. ఒక విధంగా వాడే నాకన్నా స్వతంత్రుడు. కాని వాడిలో ఉండే అణకువలో నూరో వంతయినా నాలో లేదు.

బ్రష్ చేసుకుని వచ్చేసరికి వాడు వరండాలో బిచానా పరచి సిద్ధంగా కూర్చున్నాడు. నేను వాడిముందు కూర్చుంటూ అద్దం అందుకున్నాను. గడ్డం గీస్తూ కబుర్లు ప్రారంభించాడు. వాడు చెప్పేదంతా నేను సావధానంగా వినకపోయినా, నా బుర్రలోకి వెళ్ళగలిగిన నాలుగు ముక్కలనీ పోగుచేస్తే దాని సారాంశం యిది: వాడికి ఆరుగురు పిల్లలు. తనే ఆరోగ్యం బాగులేక పెద్దవాడ్ని చదువు మానిపించి పనిలో పెట్టాడు. వాడికిప్పుడు

పని బాగా అలవాటయింది. తన ఆరోగ్యం కూడా బాగుపడింది... భార్య రోగిష్టిది...

వా డీసోది అంతా నాతో కారణ ముండి చెబుతున్నాడని నే ననుకోను. ఎందుకంటే కొంతమంది కది అలవాటు, ఉన్నవీ—లేనివీ కూడా— చెప్పుకోవ టంలో వారికి ఓ విధమయిన రిలీఫ్ లభిస్తుంది. మా అవ్వకి యిలాగే తన అనారోగ్యం గురించి నలుగుర్ని పోగేసి, నీరసంగా మూలుగుతూ చెప్పుకోవట మంటే యిష్టం. అదేం మనస్తత్వమో నాకర్థంకాదు.

షేవింగ్ పూర్తయాక డబ్బులు తీసుకుని వెళ్ళిపోయాడు. నేను స్నానం ముగించి ఆఫీసుకి బయలుదేరాను.

ఆ తరువాత నేను ఓ వారంరోజులలో నలభై రూపాయలకు ఓ యిల్లు చూసుకుని కుటుంబాన్ని తీసుకొచ్చాను. పోలిగాడు మా యింటి మంగలయిపోయాడు. రెండు రోజుల కొకసారి వాడు ఉదయాన్నే పొది పట్టుకుని మా యింటికి హాజరు. నాకు స్వంతంగా షేవ్ చేసుకునే అల వాటు తొలినుంచీ యేర్పడలేదు.

నిజానికి వాడు నాకు అందించిన సహకారం గొప్పదేనని చెప్పాలి. నాకు శ్రమలేకుండా, యీ యిల్లు ఖాళీగాఉన్న వార్త మోసుకొచ్చింది వాడే. మొదట్లో, గుడ్డలన్నీ మాసిపోయి కంపు కొడుతున్నా యన్న అసహ్యంలో ఎవడినో చాకలివాడ్ని పిలుచుకొచ్చి అన్ని గుడ్డలూ వాడికి పడేశాడు మా పెద్దవాడు. వాడు నెల రోజులైనా పత్తా దొరకలేదు. మాకు గంగ వెర్రులెత్తింది. అలాంటి పరిస్థితిలో పోలిగాడే మా వాడ్ని తోడ్చుకుని వెళ్ళి గాలించి వాడ్ని పట్టుకున్నాడు. వా దేవోసాకులు చెప్పి బట్టలిచ్చేశాడు. ఆ తరువాత పోలిగాడే ఓ నమ్మకస్థుడైన చాకలిని మా యిల్లు చేసుకుందుకు కుదిర్చాడు.

మొదట్లో నేను బెట్టుగా ప్రవర్తించినా, రోజులు గడిచినకొద్దీ వాడికి నా దగ్గర చనువు ఎక్కువయింది. మా ఆవిడ కూడా వాడికి అడపాదడపా ఏవో నంజుకుందుకి యిస్తూ ఉంటుంది...

వాడు షేవ్‌చేస్తూ తెగ కబుర్లు చెప్పేవాడు. వాడి సందేహాలన్నీ నా దగ్గర వెళ్ళగ్రక్కేవాడు : 'అయితే బాబూ ! ఈ ఎలక్షన్లలో కాంగిరేసోళ్లు రాకపోతే...చైనావోళ్ళు మన దేశాన్ని లాక్కుంటారా ?" లాంటి ప్రశ్నలడిగే వాడు. నవ్వుతూ సమాధానాలు చెప్పే వాడిని.

ఒకసారి వరసగా వారం రోజులు వాడు కనిపించలేదు. నాకేమీ తోచలేదు. వాడేమైనా బంధువా మనసు యిలా అవ టానికి ? అని తర్కించుకున్నాను. సమాధానం చిక్కలేదు.

నిజానికి వాడికొస్థితిలోకన్నా ఎక్కువ విలువ నివ్వటం నాకు నచ్చని విషయం. కాని... నాకు తెలియకుండానే వాడు




నా దైనందిన జీవితంలో కొంతచోటు చేసుకున్నాడు!

వారంరోజుల అనంతరం ఓ ఉదయం వచ్చాడు. ముఖం ప్రసన్నంగా లేదు. ఏదో యింట్లో గొడవలు చెప్పాడు. భార్య అస్సలు లేవలేక పోయిందట. పిల్లలకు తానే గంజికాచి పోశాట్ట. పెద్దవాడు వేరుపడిపోయాట్ట తననుంచి. రెండోవాడ్ని చదువు మానిపించి పనిలో పెడదామనుకుంటే — వాడు ససేమిరా అంటున్నాడట. "అసలాడ్ని యింత వరకూ చదివించటమే పాపమైపోనాది!" అంటాడు.

"ఏం చదువుతున్నాడేమిటి?" అనడిగాను.

"ఏడో తరగతి బాబూ!"

ఇటీవల కొంతకాలం నుంచీ నాకు పోలిగాడి కుటుంబాన్ని సంస్కరిద్దామని మహా కోరికగా ఉంది. వాడి అజ్ఞానం వల్లనే వాడిన్ని కష్టనష్టాలకు గురి అవుతున్నాడని నా అభిప్రాయం. "వాడ్ని కొంచెం మార్చాలి" అనుకున్నాను.

ఆ ఉద్దేశంతోనే చదువుకు వున్న విలువ చెప్పి — ఆ అబ్బాయిని చదువు మానిపించవద్దని సలహా యిచ్చాను. కుల వృత్తి చేసుకోవటం అవసరమే కాని— కుటుంబంలో అందరూ దాని పేరిట అన్యాయంగా ఒక స్థితినిదాటి బయటకి రాలేకపోవటం నాకు కష్టమనిపించింది: వాడి కొక ఆశ కూడా చూపించాను.

"వాడ్ని యింటరయినా చదివించరా... తర్వాత యిబ్బందే సనుకో...కాని... మన కష్టం, వాళ్ల ఉద్యోగాలుచేసి గడస్తున్నప్పుడు కలిగే తృప్తిలో కనిపించదు...నా మాట విని వాడ్ని చదివించు... ఇంటరవగానే, నేనే మా ఆఫీసులో యేదేనా ఉద్యోగం వేయించగలను—"

నా మాటలు విని ఆశగా నా ముఖంలోకి చూశాడు. అప్పుడు వాడి కళ్లలో వెలిగిన వెలుగు నా కింకా గుర్తుంది. "అలాగే బాబూ! అడ్ని చదివిస్తాను... ఈ ఎదవ యిబ్బందులు తెల్లారి నెగిస్తే ఎలాగూ వుండేవే..." అన్నాడు

* * *

నన్ను ఉన్నట్టుండి అనకాపల్లి బదిలీ చేశారు. ఉద్యోగరీత్యా నాలుగు ఊళ్లు తిరగటానికి అలవాటు పడిపోవటంచేత నాకేమీ కష్ట మనిపించలేదు. ఎక్కడ పరిచయమయిన వాళ్లు అక్కడే ఆత్మీయులు! పోలిగాడు మాత్రం నేను బొబ్బిలి వదిలేస్తున్నందుకు చాలా బాధ పడిపోయాడు.

సామాన్లు పేక్ చెయ్యటంలో వాడు చాలా సహాయం చేశాడు. సామానంతా లారీలో వేశాక మేం జీపు ఎక్కబోతూ ఉంటే యిలా అన్నాడు: "బాబూ! సదువు యిలవ సెప్పి, నా కన్ను తెరిపించారు...నేదంటే ఆ డీపాటికి కత్తెర పుచ్చుకుని కొట్లో పడి యేడుద్దుడు... మీ సలవ అదంతా...అడు మళ్ళీ యేదు యీ పాటికి యింటరు చేసేస్తాడు... ఆపైన మీ దయ... ఏ నౌకరి యిప్పిస్తారో..."

వాడి కళ్లలో సన్నగా నీళ్లు తిరగటం గమనించి నాకూ కష్టమనిపించింది. "అలాగే" నని చెప్పి జీపెక్కాను.

* * *

అనకాపల్లి వెళ్లాక, కొద్ది కాలంలోనే వాడ్ని నేను మరిచిపోయాను. మొదట్లో కొడుకుచేత నా ఆఫీసు అడ్రసుకి నా క్షేమాలని అడుగుతూ ఉత్తరం వ్రాయించాడు. నేను గాభరాపడి, ఇంటి అడ్రసు యిస్తూ ఓ కార్డుముక్క రాసి పడేశాను. ఆ కార్డు పోస్టు చేసేముందు నా మనసెంత పీకిందో నాకు తెలుసు. నా స్టేటస్‌ని నేనే అవమానపరచు కుంటున్నట్టు బాధ పడ్డాను.

చాలా రోజుల తరవాత మళ్లీ వాడి నుంచి ఉత్తరం వచ్చింది. రెండోకొడుకు యింటరు పాసయాట్ట...ఏదేనా ఉద్యోగం వెయ్యమని!

వాడి కొడుక్కేకాదు; ఎవరికీ కూడా ఉద్యోగం యిప్పించ గలిగే స్థితిలో లేనన్న నిజం... పాపం, వాడికెలా తెలుస్తుంది? అప్పట్లో చదివించమని సలహా అయితే యివ్వగలిగాను కాని— నిరుద్యోగ సమస్య దారుణంగా మారిపోయిన యీ స్థితిలో—ఆఫ్టరాల్—నాలాంటి వాడు యింకొకడికి ఉద్యోగం

చూపించ గలగటం కూడానా! ఉన్న నౌకరీ నిలుపుకోగలిగితే అదే పదివేలు!

నేను వాడి ఉత్తరానికి ఏం జవాబు రాస్తాను! అభిమానం అడ్డొచ్చింది. వెక్కిరించిన దంటే బాగుంటుందేమో. ఆ తరవాత నాలుగు నెలల్లో ఆరుత్తరాలొచ్చాయి. వాటని యింట్లో ఎవరికంటా పడకుండా దక్కించుకో గలిగాను. ఇలాగే రాస్తూంటే ఎవరయినా చూస్తారేమోనని భయం పట్టుకుంది నాకు. వాడిలా డైరెక్టుగా ఉత్తరాలు వ్రాయటం నాకు చిరాకు కలిగించింది.

ఆ తరువాత ఉత్తరాలు తగ్గిపోయాయి. నా మనసు తేలిక పడటం నాకే అసహజంగా తోచింది.

ఇక్కడొక ముఖ్యమయిన విషయం చెప్పాలి...

ఈ మధ్యకాలంలో నాకు ఒకటి రెండు పర్యాయాలు బొబ్బిలి ఆఫీసుపని తగిలినా—పోలిగాడి ఎదుట పడటం యిష్టం లేక తప్పించుకున్నాను నేను వాడి ఎదుట పడటానికి జంకుతున్నానా? ఒప్పుకోవటానికి మనస్సుకి చిన్నతనం! "ఏం బాబూ! కొడుకుని చదివించు... ఉద్యోగం వేయిస్తానన్నావు... యింతేనా?" అని వాడడిగితే నేనేం సమాధానం చెప్పగలను?" అనే అభిప్రాయం నాకు లోపల్లోపల పీచు పీచు మంటోంది.

ఈ పర్యాయం వెళ్లటం తప్పని సరయింది.

* * *

బస్సు ఒక్క కుదుపుతో ఆగింది. ఇంతవరకూ ఆలోచిస్తూ కూర్చున్న నేను ఆలోచనలనుంచి తేరుకున్నాను. చీకటి పడిపోతుంది. వర్షం ఉండుండి జోరుగా కురుస్తోంది. వర్షం తగ్గేవరకూ బస్సులోనే కూర్చుని, తగ్గేక బస్సుదిగి కాంపు భవనంవేపు నడిచాను.

నా కీఊరు వచ్చిన తొలి రోజు గుర్తొచ్చింది... అప్పుడూ వాతావరణం యిలాగే ఉంది.

నా ఆలోచనలలో పోలిగాడు మళ్లీ ప్రవేశించాడు. వాడు నన్నెంత తిట్టుకుంటున్నాడో? అయినా తన పిచ్చిగాని—వాడి కొడుక్కి యీపాటికి ఏదో ఉద్యోగం దొరికి ఉండదూ? అయినా—యిల్లు మారటంవలన వాడి ఉత్తరా లేమి నా కంద లేదని అనేస్తే ఏంపోయింది!

మోసం చెయ్యటానికి ఓ కిటుకు లభించటంతో నా మనసు తేలిక పడింది!

వర్షం మళ్లీ హెచ్చయింది. తడిసి పోతున్నాను. ఎవరో వ్యక్తి గొడుగు వేసుకుంటూ నా వేపు వడివడిగా వచ్చాడు. "గొడుగులోకి రండి బాబూ! తడిసి ముద్దయి పోతున్నారు" అంటూ. వాడు నాకు గొడుగు పడుతూ తను తడిసిపోతున్నాడు. నాకు కష్టమనిపించింది. ఎలక్ట్రిక్ లైటు వెలుగులోకొచ్చేసరికి అతను నన్ను గుర్తించాడు. "మీరా బాబూ!" అని పలకరించాడు ఆశ్చర్యంగా.

నే నతని ముఖంలోనికి చూశాను. పోలిగాడు! ఎంత మారిపోయాడు! ఆ కళ్లు ఎంత పీక్కుపోయాయో? మనిషి ఎంత వల్చబడి పోయాడో!

వాడి గురించి అడగకుండా ఉండలేక పోయాను: 'ఏమోయ్...బాగున్నావా?' ఇంకా యీ ఔక్కు నాకెందుకో అర్థం కాదు.

వాడి కళ్లలో సన్నగా నీళ్లు తిరిగాయి. ఏం బాగు బాబూ! యింటిది పోయి ఆర్నెళ్లయింది. మూడో పిల్లకూడా జబ్బు చేసి పోయింది..."

"మరి...రెండోవాడు?..." అత్రుతని అణచుకోలేకపోయాను.

"ఆడా! ఇంటరు పేసయినాడు బాబూ! సేనారోజులు ఉద్యోగంకోసం చూసాడు. దొరకనేదు... పోనీ పని చేసుకోరా— కులంపని ఎట్టాగా ఉంది కదా? అంటే అందుకు ఆడికి సిన్నతనమైపోనాది..."

వాడు నామీద నిష్ఠూరం వెయ్యలేదు. అందుకే ఎక్కువగా బాధ కలిగింది.

"నీ ఉత్తరా లందాయిరా...కాని ఏం చెయ్యటం? ఇదివరలో అయితే మేనేజరు మన చేతుల్లో ఉండేవాడు... నిమిషాలమీద పని యేది...ఇప్పుడలా కుదర్దు... అయినా చూస్తున్నానులే... ఎక్కడ వేకెన్సీ దొరికినా వాడ్ని దూర్చేద్దాం ఇంకా అబద్ధం చెప్పకుండా వుండలేని నా మానసిక బలహీనత మీద నాకే అసహ్యం వేస్తోంది.

నిర్లిప్తంగా నిట్టూర్చి అన్నాడు: "అంత అదురుష్టమా బాబూ, మాకు! ఇక ఉద్యోగం దొరకదని చెప్పి ఆడు కొంపనోంచి ఎటో పారిపోనాడు...ఇటు ఉద్యోగమా నేదు — అటు కులం పనికి సెడ్డాడు... ఏం బతుకులో యేమో" వాడి గొంతు వొణుకుతోంది సన్నగా. నేను మాట్లాడలేకపోయాను.

హోటలు మెట్లెక్కుతూ, వర్షంలో నన్నిలా పొడిగా చేర్చినందుకు కనీసం కృతజ్ఞతలయినా చెప్పకుండా మనిపించింది "రక్షించావురా, పోలీ! సమయానికి నువ్వు రాకపోతే—ఇవాళ సాంతం తడిసి ముద్దయి పోయేవాణ్ని" అంటూ వాడివేపు చూసాను—

అయ్యో!

అంత ముద్దగా తడిసి పొయ్యాడేం? గొడుగంతా నాకే పట్టినట్టున్నాడు! అరె! పాపం...

నీళ్లోడుతూ,—

చలికి సన్నగా వణుకుతూ.—

నన్ను పొడిగా చేర్చగలిగినందుకు తృప్తి నిండిన చూపులతో —

పోలిగాడు!

బలవంతంగా దృష్టి మరల్చుకొని హోటల్లోకి దారితీసాను






"ఏమిటో అంత దీర్ఘంగా చదివేస్తున్నావు!..." అప్పుడే క్రికెట్ ఆట ముగించుకొని, హాస్టలు గదిలో అడుగు పెడుతూ విజయకుమార్ ప్రశ్నించాడు.

"ఏంలేదు... వరంగల్ నుంచి ఉత్తరంవచ్చింది. ఏం తోచక తిరగేస్తున్నాను. ఉత్తరం లోంచి తలయెత్తి, దరహాసంతో జవాబిచ్చాడు రవి.

"వరంగల్ నుంచా. ఎవరు వ్రాశారేమిటి?"

"అక్క వ్రాసిందిరా! 'ఎన్నిసార్లు చెప్పినా వరంగల్ రావేమిటి'—అని మా అక్కకు కోపం...మనకేమో టైమ్ దొరకదాయె... ఏం చేద్దాం"

"ఐతే వాడివిరా! అంత ఆప్యాయతతో పిలిచే అక్కను చూడ్డానికి టైము

లేదా ? అంత చేటు తీరిక లేదా నాయనా నీకు? ఊఁ చెప్పు. ఎప్పుడు బయల్దేరడం?

'బాగుందిరోయ్ అక్కయితే సంక్రాంతి సెలవుల దాకా టైమిచ్చింది నీకేమో ఇప్పుడే టిక్కెట్లు కట్టుకుని వాలమంటున్నావు...నీలాంటి వాడుండాలిరా వకాల్తాకి!"

'అమ్మా...అక్కా—ఇద్దరి ప్రేమ పంచుకొనే నువ్వు నిజంగా చాలా అదృష్టవంతుడివిరా :" అతని కంఠంలో ఆవేదన ధ్వనించింది.

"అదేమిట్రా ?! నీకో ? అక్కా—చెల్లీ ఎవరూ లేరా ?..." ఆశ్చర్యంగా ప్రశ్నించాడు రవి.

"ఉహుఁ...మా నాన్నకి నేనొక్కణ్ణే కొడుకుని...అమ్మ లేదు ... ఇంకెవరూ లేరు..." బట్టలు మార్చుకోటం పూర్తి అయి. బరువుగా కూర్చుంటూ అన్నాడు విజ్జి.

"అయితే మరి మీ నాన్నగారు..."

"ఉన్నారు...ఊహ తెలియని చిన్న తనం లోనే మా అమ్మ పోయింది. నాన్నే నన్ను పెంచాడు...మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు...నా భవితవ్యం కోసం... అతని కంఠం స్పందించింది.

రవి మనస్సు ఆర్ద్రమైపోయింది. తను చిన్నప్పటి నుంచి అక్కా, అమ్మల అనురాగంలోనూ, నాన్న అప్యాయత లోనూ పెరిగాడు. ఏలోటూ లేకుండా గారాబంగా!పాపం విజ్జికి ఇవి ఏవీ లేవన్న మాట! ఆ మమతల విలువేమిటో రవికి ఇప్పుడు అర్ధమవసాగింది. పర్యాలోచనలో మునిగిన విజ్జి వైపు సానుభూతితో చూస్తూ అన్నాడు. "సరే. విజ్జీ! ఈసారి సంక్రాంతి సెలవులకి అక్కావాళ్ళ ఊరు వెళ్దాం... నువ్వుకూడా రావాలి..."

"నేనా ?! మధ్య నేనెందుకురా... బాధాంలే..." అన్నాడు విజ్జి పరధ్యానంగా "ఇంతకూ ఉత్తరంలో విశేషాలేమీ చెప్పావు కావు ?... అభ్యంతరం లేకపోతే..."

"అభ్యంతర మేమిట్రా నీ మొహం ...ఇదిగో చదువు." అంటూ జాబు చేతి కందించాడు రవి.

"చిరంజీవి చిన్నారి తమ్ముడికి, ఆశీస్సులు.

ఏరా రవీ! అక్కను మరచి పోయావా ఏం? బొత్తిగా ఉత్తరాలే మానేశావు. నువ్విలా చెయ్యడం నాకేమీ బాగాలేదు. మీ బావగారు కూడా ముద్దుల మరిదిని చూడాలని ఒకటే గోల. అంత తీరిక లేకుండా ఉన్నవా నాయనా!

వచ్చే సంక్రాంతికి నువ్వు ఇక్కడికి రావాల్సిందే. అమ్మకు కూడా ఉత్తరం వ్రాసేశాను, తమ్ముడు ఇంటికి రాడనీ, సెలవు అంతా మా దగ్గరే ఉంటాడనీ.

వస్తావు కదూ! నీకోసం ఎదురు చూస్తూంటాను మరి.

నిన్ననే నాన్న దగ్గర్నించి ఉత్తరం వచ్చింది; ఇంటి దగ్గర అమ్మా, నాన్న

తమ్ముళ్ళూ చెల్లాయిలూ అంతా బాగున్నారు.

జామ కాయలూ, సీతా ఫలాలు తగ్గించావా లేదా? అంత పిచ్చి ఇష్టం ఏవిట్రా నీకు? ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోవద్దూ? అమ్మకూడా ఈసంగతే వ్రాసింది.

మర్చి పోయను, మీ హాస్టలు తెరిచారా ఇంకా హోటల్ భోజనమేనా? నీ రూమ్ మేట్ ని గూర్చి చాలా వ్రాశావు. మనిషికి మంచి స్నేహితుడుండాలి, అండగా. మనసుకు తగిన మమత ఉండాలి నిండుగా, సంతోషం.

ఇంకేన్నో సంగతులున్నాయి. వ్రాయటం ఎందుకనా? నువ్వే వస్తున్నావు గదా!

మనసారా దీవిస్తూ,

నీ అక్క,

మంజీర"

ఆ లేఖలోని అనురాగం, ఆప్యాయత, చనువు, విజ్జి మనసులో వెన్నెలలు నింపాయి చదివినంత సేపూ ఏదో తెలియని ఆనందానుభూతిలో ఓలలాడిపోయాడు.

"మీ ఊరు తప్పకుండా వస్తాను రవీ!... అక్కను చూడాలనిఉంది..." హఠాత్తుగా అన్నాడు విజయ.

రవి ముఖం ఒక్కసారి వికసించింది. "పోదామా! వెరీగుడ్!... నువ్వెంత మంచి వాడవురా విజ్జీ. అయితే ఈసారి సెలవులు వరంగల్ లో గడిపేద్దాం ఇవ్వాళెంతరా తారీకు? ..." ఇద్దరి దృష్టులు కేలెండరు వైపు పరుగెత్తాయి.

* * *

రవి, విజ్జి కొత్త స్నేహితులు. ఇద్దరూ ఈ ఏడే హైదరాబాదులో బి.యస్.సి లో చేరారు. మొదటి సారి హోటల్లో కలుసుకున్నారు ఓ మూల భోంచేస్తున్న రవినిచూసి విజ్జికి ఎందుకో సానుభూతి కలిగింది. ఎవరో పాపం, తనలాగా హోటల్ భోజనం అలవాటు లేనట్లే ఉంది. అనుకున్నాడు. ఆ తరువాత అప్పుడప్పుడూ అదే భోజనశాలలో కలిసే వాళ్ళు విజ్జికి అతన్ని మాట్లాడించాలని ఉండేది కాని ఎలా కల్పించుకుని మాట్లాడటం?

ఆరోజు ఆట మైదానంలో విజ్జికి పార్కర్ పెన్ దొరికింది. 'అయ్యో! ఎవరు పోగొట్టుకున్నారో పాపం'. అనుకుంటూ వెంటనే తీసుకుపోయి గేమ్స్ డిపార్టుమెంటులో అప్పగించాడు.

మర్నాడు క్లాసు కాగానే, పెన్ పోగొట్టుకున్న విద్యార్థి అమాంతం విజ్జి దగ్గరికి వచ్చి "చాలా థాంక్సండీ! మా అక్క ఆప్యాయంగా నా పుట్టిన రోజు నాడు ఇచ్చిన పెన్ను ఇది... ఇంతకూ ...గేమ్స్ మాస్టారు చెప్పారు, ...మీ పేరే కదూ విజయకుమార్?" అంటూ చెయ్యి కలిపేశాడు, హాయిగా నవ్వుతూ.

"మీరా!..." ఆశ్చర్యంగా చూస్తూ

ఆనందం పెనవేసుకున్నట్టుగా అన్నాడు విజ్జి; మళ్ళీ తేరుకొని అన్నాడు, "ఫరవా లేదండీ. అంత విలువైన పెన్ను మళ్ళీ మీకు దొరకటం చాలా సంతోషంగా ఉంది... మిమ్మల్ని హోటల్లో చూస్తుంటాను. మీపేరు..."

నా పేరు రవి...వి. బి. రవి... పూర్తిగా చెప్పాలంటే వేదం భారవి.

"బలేచమత్కారమే...భారవి పేరు. అంతగా భారం కాదు గాని, రవి మాత్రం రమ్యమైన పేరండి..." నవ్వుతూ అన్నాడు విజ్జి... "ఇంతకూ మీకు నా పెన్ను దొరికింది; నాకు మీ స్నేహం దొరికింది."

"పెన్ను లాగా ఈ స్నేహం మాత్రం పోగొట్టుకోనులెండి."

ఈ సంభాషణే వాళ్ళిద్దరినీ విడిపోని సన్నిహితులుగా కలిపింది. ఒకరొకరిని 'మీరు',— 'అండి'... అంటూ లాంఛన ప్రయోగాలతో మాట్లాడుకోటం కూడ అదే తొలిసారి, తుదిసారి కూడా అయింది.

* * *

ఆ రోజున సెలవేమో, విజయ్ కిటికీ దగ్గర కూర్చొని, ఏదో చిత్రానికి రంగులు వేస్తున్నాడు బయటి నుంచి అప్పుడే వచ్చిన రవి చూపు ఆకస్మికంగా ఆ చిత్రంపై ప్రసరించింది. ఆశ్చర్యపడుతూ అన్నాడు, "అరె! ఎంత బావుంది. 'చా చా నెహ్రూ'... ఇదంతా నువ్వే వేశావా?"

తలయెత్తి నవ్వుతూ అన్నాడు విజ్జి. "అవును రవీ! బాలల దినోత్సవ సందర్భంగా మన కాలేజీపోటీల కని తయారు చేస్తున్నాను. ఎలావుంది?..."

"అద్భుతంగా వుంది. నువ్వింత మంచి చిత్రకారుడవని నాకు ఇప్పటి దాకా తెలియదు. కవిత్వం ఒక్కటే నీ హాబీ అనుకున్నాను! ఈ మూడు నెలల్నించీ ఎప్పుడూ నువ్వు చిత్రంగీయగా చూడలేదు..."

"చిత్రకళ నాకెంతో ఇష్టంరా రవీ! నా రచనలు చాలా చిత్రాలున్నాయి. చూస్తావా? నాకు కూడా తృప్తిగా ఉంటుంది నువ్వు చూస్తే..."

"ఓయ్యెస్! ఏవీ తీసుకురా! ఈ పుస్తకాలతో బోర్ కొడుతుంది. ఒక మంచి ఛేంజ్..." కుతూహలంతో అన్నాడు రవి.

చిత్రాల ఆల్బమ్‌కు చెరోవేపు కూర్చున్నారు. అందాకా గంభీరంగాఉన్న వాతావరణం ఇప్పుడు ప్రఫుల్లితమైంది.

"అబ్బ! ఎంత నైపుణ్యం..." ఒక్కొక్క చిత్రం చూస్తూ రవి ఆశ్చర్య చకితుడై పోతున్నాడు

'ప్రకృతి కన్య'— "ఓహో!" ఇన్ని సోయగాలతో ఇంత అందంగా ఉంటుందా ప్రకృతి, అనుకున్నాడు రవి.

'బడలిక,' 'బాధ్యత'. 'మాతృ




మూర్తి,' 'నిరీక్షణ,' 'పుష్పవిలాసం'– అందాలు చిందుతూ, కన్నుల విందుగా, మూగ భావాలు ఒలకబోస్తూ ఒక్కొక్క చిత్రం అతనిలో వినూత్న ఉత్తేజం వెలార్చింది.

"ఇంత గొప్ప చిత్రకారుడు నా స్నేహితుడు కావడం అంటే–నాకెంతో గర్వంగా ఉందిరా!" మిత్రుని యెడ అభిమానం నిండిన స్వరంతో అన్నాడు రవి, చూడడం ముగిస్తూ.

"సరేలే! నీ మాటల్లో నా గొప్పకంటే నీ అభిమానమే వినిపిస్తోంది రవీ! కాని నాకు క్రొత్త బలం వస్తోంది. ఇంతకూ ఇవన్నీ నీకు నచ్చిన చిత్రాలు కదూ?...మరి నాకు నచ్చిన చిత్రం చూస్తావా?...అది నా అభిమాన చిత్రం తెలుసా?..."

పట్టరాని ఉత్సాహంతో రవి అన్నాడు, "అలాగా! ఏదీ? అది ఈ ఆల్బంలో ఎందుకు చేర్చ లేదింకా?..."

విజయ్ తన సూట్‌కేసు తెరచి, ఒక కవర్లోంచి తీస్తూ ఆ చిత్రం తీసుకు వచ్చాడు.

చిత్రం చూస్తూనే స్తబ్ధుడైపోయాడు రవి. "ఇదా? నువ్వెలా గీశావు? చిత్రాన్ని తేరిపార చూస్తూ, కొంచెం

తమాయించుకొని మళ్ళీ అన్నాడు, "ఈమె...ఎవరీమె?......?"

"ఏమని చెప్పను ? మామూలుగా చెప్పాలంటే ఈమె ఎవరో నాకు తెలియదు. కాని జన్మ జన్మాల చిర పరిచిత సంబంధం ఉన్నట్లనిపిస్తుంది. నా హృదయం కూడా ఇదే ప్రశ్నిస్తూ ఉంటుంది ...ఎవరీమె ?...ఏమో...నా ఆరాధ్య దేవత అనుకుంటాను..."

రవి కేమీ అర్థం కాలేదు. ఆ చిత్రం పైన ఉన్న 'మమత' అనే అక్షరాలు చదువుతున్నై అతని పెదవులు, నిశ్శబ్దంగా.

విజ్జి చెప్పకుంటూ పోతున్నాడు, "ఎందుకు చిత్రించానో తెలియకుండానే, ఎవరో తెలియకుండానే, చిత్రిస్తూ పోయాను. నెలల కొద్దీ మెరుగులు దిద్దాను. ఇంకా దిద్దుతూనే ఉన్నాను. ఎదలో నింపిన మమతల్ని, చిరకాలం నేను కోరిన మమతల్ని అన్నింటినీ కలబోసి రూపుదిద్దాలని నే చేసినయత్నం ఇది. అప్పుడప్పుడు నా కనిపిస్తుంది— అక్క, అమ్మల అనురాగం ఎరుగని నా హృదయంలో శూన్యాన్ని ఈ రూపంలో నింపుకుంటున్నానా అని. మా అమ్మ ఎలా ఉండేదో... నాకు గుర్తు లేదు...'ఏదోలోకంలో ఉన్నట్లు చెప్పుకు పోతున్నాడు. హఠాత్తుగా ఆగిపోయాడు.

మధ్యలోనే ప్రశ్నించాడు రవి, "ఒక వేళ ఈమె నీకీ లోకంలో కనిపిస్తే!..."

విజ్జి ముఖంలో ఉత్తేజం తాండవించింది, "అవును రవీ!...తప్పకుండా ఎవరో వ్యక్తి—ఇలాంటి వ్యక్తి ఈ లోకంలో ఉండాలి. ఉండి తీరాలి. నువ్వు నమ్ముతావు కదూ ?"

"ఈమె నీకు కనిపిస్తే ఏం చేస్తావు?..."

"ఇన్ని ఏండ్ల నిరీక్షణ, నా అన్వేషణ సఫలం చేసిన ఈ స్త్రీ మూర్తికి మనసా నమస్కరిస్తాను. ఆమె ఒడిలో పడుకొని తృప్తిగా కన్నులు మూస్తాను... నా హృదయంలో అంతులేక కొనసాగే శూన్యానికి ఆ ఘడియ ఎప్పుడా అని ఆవేదన పడుతున్నాను, రవీ!... ఏదో చెప్పుకు పోతున్నాను...పిచ్చి వాడను కుంటున్నావా ?..."

"నేనలా అనుకోను...సరేకాని, ఒక వేళ ఈమె నీకు తటస్థ పడితే, నీవు ఊహించినంత అమృత మూర్తి కాకపోతే..."

"నా ఉహల మీద నాకు నమ్మకం ఉంది రవీ!" దృఢంగా ఉందతని స్వరం.

"ఒకవేళ ఇలాంటి స్త్రీని నీకు నేను చూపిస్తాననుకో... నా కేమిస్తావ్ ?"

"నిజంగానా ? ఇలాంటి వ్యక్తిని నీ వెక్కడైనా చూశావా ? లేక వేళాకోళం చేస్తున్నావా రవీ!" విస్ఫారిత నేత్రాలతో, ఆత్రంగా అన్నాడు విజయ్.

"లేదు విజయ్... త్వరలోనే నీకీమె

కనిపిస్తుందని నాకెందుకో అనిపిస్తున్నది."

ఆ రోజంతా కులాసాగా గడచిపోయింది. నవనీతం కన్నా కోమలమై, మమతా పూర్ణమై కూడా మమత కోసం ఆవేదన పడే విజ్జి ప్రవృత్తికి రవి ఆశ్చర్య పడసాగాడు. ఏ స్త్రీ అను రాగం ఎరుగని ఈతని మనుజా శూన్య హృదయం ఎంతో కఠోరంగా మారిపోవలసింది; పెడ దారులు పట్టలేదు. కవిగా, చిత్రకారుడుగా, భావుకుడు కావడమే, అందుకుకారణమై ఉండాలి. ఈ దారుల్లో అతని హృదయం మగ్నమై ఆర్ద్రమై ఉండకపోతే... ఏదో ఆలోచిస్తూ, టేబుల్‌లైట్ ముందు కూర్చొని లెటర్ ప్యాడ్ తెరిచాడు రవి. సంక్రాంతి సెలవుల్లో స్నేహితునితో సహా వరంగల్ వస్తున్నట్లు ఉత్తరం వ్రాసేశాడు.

* * *

తెలుగు నాట, ఇంటింటా వింత కాంతి వెలయిస్తూ, సంక్రాంతి సమీపిస్తోంది. ఉత్సాహంతో ఉరుకులు తీసే రైలు పెట్టెలో కాలమంతా సల్లాపంలో గడిచిపోయింది, స్నేహితు లిద్దరికీ. 'అక్కను చూసి చాలా కాలమైంది. ఇంకా వరంగల్ రాదేమా' అనిపిస్తోంది రవికి. కమ్మని కబుర్లలో, ప్రకృతి దర్శనంలో వరంగల్ స్టేషన్ ఇట్టే వచ్చేసింది. ఇద్దరూ రిక్షాలో కూర్చున్నారు.

దారిలో విజ్జి అన్నాడు, "నేను నెల్లూరి వాడను. వరంగల్ మొదటిసారి వస్తున్నాను. నెల్లూరికీ, వరంగల్‌కూ చుట్టరికం కలిపిన మహానుభావుడు, తిక్కన సోమయాజి గుర్తుకువస్తున్నాడు రవీ!.

"అవును విజ్జీ! తెలుగు వాళ్ళ చరిత్రలో అదొక మధుర ఘట్టం. ఒక అద్భుత సన్నివేశం..."

కొంత సేపు మౌనంగా పయనించారు. ఇల్లు దగ్గరకు వస్తోంది. రవి ప్రస్తావించాడు, "అనుకోకుండా ఒక అద్భుత సన్నివేశం ఎదురైతే, ఆ అనుభూతి ఎలా వుంటుంది విజ్జీ..."

"భాషాశక్తికి అతీతంగా ఉంటుందనుకుంటాను. అయినా నా కలాంటి అనుభూతి ఎదురుపడలేదెప్పుడూ!..."

సంధ్యా సమయం. చిరు చలిగా పిల్లగాలి వీస్తోంది. విశాలమైన వరంగల్ రాజమార్గం మీద రిక్షా పరుగెత్తుతోంది. కాకతీయ కళా ప్రాభవనిలయంగా, ప్రాచీనాంధ్ర నగరంగా, ఆ వినూత్న వాతావరణంలో విజయ్ మనస్సులో ఉత్సాహం ఉరకలు పెడుతోంది. ఆనందం వెల్లివిరుస్తోంది.

మరో పదినిమిషాల తరువాత ఒక ఇంటిముందు నిల్చొని ఉన్నారు, ఇద్దరూ. తలుపుతట్టి "అక్కా" అని పిల్చాడు రవి.

ఒక నిమిషంలో జవాబు వచ్చింది.

చందమామ లాంటి ముఖం మీద వెన్నె ల్లాంటి చిరునవ్వుతో, అచ్చుపోసిన ఆప్యాయత లాంటి రూపంతో, తలుపు తీసింది అక్క. విజ్జి ఉన్నచోటే దిగ్భ్రాంతుడై నిల్చుండిపోయాడు, ఆ మూర్తిని తిలకిస్తూ.

"ఈమె ?...తన ఊహా చిత్రం! ...కలా, నిజమా? తను చిత్రించుకున్న "మమత," ఎదురుగా సజీవంగా నిలబడి చిరునవ్వుతో ఆహ్వానిస్తుంటే కల ఎట్లా అవుతుంది ?..."

"అలా నిలబడి పోయావేం విజ్జీ! పద లోపలికి. ఈమె మా అక్క..." విజయ్‌ని హెచ్చరిస్తూ, చిన్నగానవ్వుకుని మంజీర వైపు చూశాడు రవి.

"మీ స్నేహితుడికి మొహమాటం ఎక్కువల్లే ఉందే, లోపలికి రాబాబూ! ...నీ పేరు విజయ్ కదూ ?... నువ్వు కూడా తమ్ముడివే." ఆమె కంఠంనుంచి వెలువడ్తున్న ప్రతి పలుకూ తేనె సోనలా వుంది విజయ్‌కి. ఏదో స్వప్నలోకం లోలా మౌనంగా లోపలికి నడిచాడతను.

మంజీర భర్త ఆనంద్ చాలా ఆద రంతో, అభిమానంతో పల్కరించాడు విజ్జిని కూడా...ఎంతో పరిచితుడు లాగే. ఆ యిద్దరి ఆప్యాయతలో కరిగి పోయాడు విజయ్.

"మీ యిద్దరి ఆదరానికీ చాలా కృతజ్ఞతలండీ..." అన్నాడు, మాటలు వెతుక్కుంటూ విజయ్. ఆమె నవ్వింది, కోయిలలు కూసినట్లు, మల్లెలు వికసించి నట్లు అనిపించింది విజయ్‌కి. "అండి, గిండీ ఏమిటి బాబూ! చెప్పాను గదా! నాకు, నువ్వూ రవీ ఒకటే. నీకూ నేను అక్కనే..."

"కాదమ్మా!...అమ్మవు..." అను కున్నాడు పెదవులతో విజ్జి.

"ఇంతకీ తమ్ముడూ! నువ్వేసిన చిత్రమేది? నాకు చూపించవూ?" అంది మంజీర, పొంగి వచ్చే అనురాగంతో.

తను సృష్టించిన ఆ మూగ మమత చిత్రం చేతిలో పట్టుకొని, సజీవంగా కూర్చున్న మమతా మూర్తిని చూస్తూ, తన నిరంతర అన్వేషణ ముగిసిన సంతృప్తితో, ఉద్విగ్నుడైనాడు విజయ్.

చిత్రం చూడడంలో మునిగిపోయింది మంజీర. విజ్జి మనస్సు ఎక్కడో తిరు గాడుతోంది. "నన్ను అంత చిన్న పాపగా ఎందుకు వదలిపెట్టి పోయా వమ్మా!...మళ్ళీ ఇన్నాళ్ళకా నీదర్శనం ...నేనేం చేశానని ?"... అంటున్న దతని మనస్సు. మాటల రూపంలో ఆ భావం బహిర్గతం కాలేదు... కానట్లు అతనికి తెలియదు.

"ఏమిటి బాబూ! అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" అతని మొహంలోకి చూస్తూ ఉలిక్కిపడింది మంజీర. "అరె! ఎందుకు కన్నీరు పెడ్తున్నావు ?"

"కన్నీరు కాదక్కా! పన్నీరే! అను కోని అదృష్టం రవి రూపంలో నన్ను




వెతుక్కుంటూ వచ్చి, సంవత్సరాల నా అన్వేషణ ఫలింపచేసి, చల్లని నీ సన్నిధి లోకి చేర్చింది..."

మంజీర హృదయం అనురాగంతో పొంగింది, "బాబూ! ఈ జన్మలో మనది రక్తసంబంధం కాక పోవచ్చు, కానీ ఆప్యాయతలు జన్మ సిద్ధమే కావుకదా!" విజయ్‌ని దగ్గరికి తీసుకొని తల నిమురుతూ అంది. రెండు వెచ్చని బాష్ప బిందువు లామె పాదాలపై పడ్డాయి. ఆమె ఆశీర్వదిస్తూ అంది, "పది కాలాలు పచ్చ పచ్చగా వర్ధిల్లాలి విజ్జీ!"

బాగా ప్రొద్దెక్కింది, "అమ్మ బడి చదువుల బడి, మా అమ్మ ఒడి నాకొక గుడి," కూనిరాగం తీస్తూ, స్నానం ముగించుకొని వస్తున్నాడు విజయ్.

"ఏరా విజయ్... మా అక్కను చూసి నన్ను మర్చి పోయినావు కదూ!..." అంటూ వంటింట్లోకి దారి తీశాడురవి.

"నిన్నెలా మర్చిపోతాన్రా. నీవే లేక పోతే అంతా చీకటే రవివికదూ!"

"మంజూ! ఇక వడించెయ్, నీ తమ్ముళ్ళిద్దరూ వచ్చేశారు .." అన్నాడు ఆనంద్ అప్పుడే ఇంట్లో అడుగుపెడ్తూ. అంతా భోజనాల దగ్గర కూర్చున్నారు. అక్క చేసిన మిఠాయిలు తింటూ రవి అన్నాడు, "వి! ఈ అనుభూతి ఎలా వుందిరా?...'

"దీనికి సమాధానం నీ కిదివరకే చెప్పినట్లు జ్ఞాపకం...ఈ అనుభూతీ.... ఈ అనుభూతి లాగే వుంది..."

పండుగ మూడు రోజులూ మూడు క్షణాల్లా గడచిపోయినై. సెలవుల అనంతరం బాధాకరమైన వీడ్కోలుదినం వచ్చింది. అనుబంధాలెంత విచిత్రమైనవి? అనుకున్నారు అందరు.

* * *

అది మార్చినెల. పట్టణంలో కలరా వ్యాపించడం వలన ఓ వారం రోజులు కాలేజీలు మూసేశారు. విజయ్ తండ్రిని చూడాలని ఇంటికి వెళ్ళాడు. రవి కూడా తన ఊరు బయలుదేరి వెళ్ళాడు. ఎలాగో వారం రోజులు గడచిపోయినై.

రవి అప్పుడే బండి దిగి టైమవుతుందని సరాసరి కాలేజీకే వెళ్ళాడు. క్లాసులో చూస్తే విజయ్ లేడు. ఇంకా ఊరి నుండి రాలేదేమో అనుకుంటూ రీడింగ్ రూమ్‌కి నడిచాడు రవి. అక్కడ బల్లమీద తన పేరున రెండుత్తరాలు ఎదురుచూస్తూ కనపడినై. ఒక ఉత్తరం మీద నెల్లూరు ముద్రఉంది.

"ఓహో! విజయ్ దగ్గర్నుంచా" అనుకుంటూ కవరు ఆత్రంగా తెరిచాడు రవి. అది చదువుతూనే కుప్ప కూలిపోయాడు. 'కలరా వచ్చి విజయ్ చనిపోయాడ'ని అతని తండ్రి వ్రాసిన ఉత్తరమది. క్షణంసేపు స్తంభించిపోయి దుఃఖమాపుకోలేక బయటికి వచ్చేశాడు రవి. అతని పాదాలు హాస్టలు గదివైపు నడుస్తున్నాయి. దారిలో రెండవ ఉత్తరం చింపి చూశాడు. వరంగల్ నుంచి బావ వ్రాసిన లేఖ : అక్క ప్రసవించిందనీ, బాబు పుట్టాడనీ వ్రాసివుంది.

హాస్టల్ గది తాళం తెరవాలంటే బాధ, భయం ఆవరించాయి. గదంతా ఏదో వేదనతో శూన్యంగా కనిపిస్తోంది. హఠాత్తుగా అతని దృష్టి క్రింద పడిఉన్న మరో ఉత్తరం మీద పడింది. "అరె! విజయ్ వ్రాత... విజయ్ బ్రతికే ఉన్నాడా?" ఉత్తరం చేతిలోకి తీసుకున్నాడు. నాలుగు రోజుల క్రిందట వ్రాసిన లేఖ అది.

బావ ప్రక్కన కూర్చొని రవి, విజయ్ భోజనం చేస్తుంటే, అన్నం వడ్డిస్తున్న 'మమత' చిత్రం—దానితో పాటు ఒక లేఖ ఉన్నై కవర్లో.

సజల నేత్రాలతో సూట్‌కేస్ సర్దుకుని గదికి తాళం సివే, గబగబా స్టేషన్ వైపు బయల్దేరాడు రవి. రైలు వరంగల్ వైపు ఉరకలు పెడ్తోంది. మళ్ళీ ఉత్తరాలు తీసి చూశాడు. అతని హృదయంలో అద్భుతం ఆవరించింది. ఆ రెండు సంఘటనలు ఒక రోజే జరిగాయి! "విజయ్ చనిపోలేదు; మళ్ళీ పుట్టాడు, అతని అన్వేషణ ముగిసింది." కాగితాలు మడత పెట్టేస్తూంటే, అప్రయత్నంగా అతని నోటి నుండి ఈ మాటలు వెలువడినై. కంటి నుండి రెండు జల బిందువులు రాలినై.



# కాలభైరవుడు

కొడవటిగంటి కుటుంబరావు

శ్రీనివాసరావు మాటనమ్మి స్కూలుకు సెలవుపెట్టి వెళ్లాలా వద్దా అని నేను చాలా సేపు మథనపడ్డాను. అసలే మా స్కూలుపరిస్థితులు అమిత దుర్భరంగా ఉన్నై. మాష్టర్లమందరమూ ఒక్కసారిగా ఎనిమిదిమంది కమిటీమెంబర్లను తృప్తిపరచవలసి వచ్చేటప్పటికి మా తల ప్రాణం తోకకు వస్తున్నది. ఏ క్షణాన ఏ మెంబరు ఏ పార్టీలో ఉంటాడో, ఎవరిచ్చిన శలవు ఎవరు రద్దుచేస్తారో తెలియని స్థితిలో నేనుంటే మా శ్రీనివాసుడు, "నీకు పునర్జన్మలో నమ్మకం ఉందా? ఉన్నా లేకపోయినా నీకు ఒక చిత్రం చూపిస్తాను. ఈ రహస్యం ఇంకా ఎవరికీ బయట పెట్టలేదు. నువ్వూ నేనూ కలిసి కొంత రహస్యశోధన చెయ్యటానికి ఇది మంచి అవకాశం. కాబట్టి ఈ వుత్తరం అందిన వెంటనే గురు శుక్రవారాలు శలవుపెట్టి రా, సోమవారందాకా ఉండవచ్చు. ఒక్కసారి ఈ రహస్యం నీ కళ్ళతో నువు చూశావంటే నీకే నమ్మకం కలుగుతుంది" అంటూ రాస్తాడు. గురు శుక్రవారాలు మాత్రమే శలవు పెట్టానంటే శని ఆదివారాలు

రెండురోజులూ కమిటీ మెంబర్లు యావ న్మందీ, నాకోసం అర్జంటు పనిమీద మా యింటి చుట్టూ తిరిగిపోతారు! అది శ్రీనివాసు కేంతెలుసు? తీరాపోతే ఏమీ ఉండదేమో!

కాని బయలుదేరాను, నిరుత్సాహం తోనే. నేను మాష్టరునయి సిగరెట్టు కాల్చటం మానుకొన్నప్పటినించీ,నిరర్ధక మైనపనులు చెయ్యటమంటే, నాకొక విధ మైన భయం పట్టుకుంది. ఏదైనా పని ఉంటేనే ఎక్కడికయినా వెళ్ళటమూ, అదికూడా ఎంతో ఆలోచించి మరీ వెళ్ళ టమూ, నాకు ఉద్యోగంతో కలిగిన కొత్త అలవాటు.

తీరా రైలెక్కిన తరవాత తట్టింది శ్రీనివాసరావుకు కొంచెం మతిభ్రమ ఏమయినా ప్రారంభమయిందేమోనని. ఆ అనుమానం ఇంటిదగ్గిరే కలిగితే, అసలు బయలుదేరకనే పోదును. శ్రీనివాసరావుకు మతిభ్రమ కలిగిందను కోటానికి చాలా అవకాశం ఉంది___ నాకు ఈమాత్రం ఇంటి దగ్గిరే తట్ట లేదు కాని, వాడు తండ్రి చచ్చిపోయిన అయిదు సంవత్సరాల కాలంలో జూదం లోనూ, గుర్రపు పందాల్లోనూ, స్నేహి తులమీదా, తాగుడుకూ, వేశ్యలకూ పాతిక వేలయినా తగలవేశాడు. వాణ్ణి చిన్నప్పటినించీ ఎరిగిన వాళ్ళంకూడా వాడిట్లా అవుతాడని అనుకోలేదు. వాడి పరివర్తనలన్నీ దురూహ్యాలుగానే ఉంటూ ఉండేవి. ఇంకా ఒక కొంపా నాలుగెక రాల భూమీ ఉందనగా శ్రీనివాసరావు మరొక పరివర్తనం కలిగి వెనకటి జీవి తమంతా ఒక్క క్షణంలో చినిగిన చొక్కాను విసర్జించినట్టు విసర్జించి రైలుకు ఆమడదూరాన, ఆ బ్రాహ్మణ కోడూరు గ్రామంచేరి,వాడి స్వగృహంలో ఉంటూ సేద్యం ప్రారంభించాడు. అంతా సంతోషించాం అప్పట్లో. తీరా రైలె క్కిన క్షణాన నాకు సందేహం ప్రారంభ మయింది___ఈ పల్లెటూరి జీవనమూ, స్వయంకృషీ వాడి నెత్తి ఆడించిందేమో నని, ఒకటి చేతామనుకున్నాను. చెప్పిన ప్రకారం వాడు చుండూరు స్టేషను దగ్గిర నాకోసం హాజరు కాకపోతే నాతోవను నేను ఇంటికి తిరిగి వచ్చేద్దామనుకున్నాను. ఆబండికి నన్ను రమ్మనీ తను నాకోసం కనిపెట్టుకుని స్టేషనుదగ్గిర ఉంటాడనీ రాశాడు స్పష్టంగా,

వా డెందుకు రాకుండా ఉంటాడూ? ప్లాటుఫారంమీద వాణ్ణి కలుసుకుని వాడి వాలకం జాగ్రత్తగా గమనించాను. వాడి కళ్ళలో వెర్రిచూపు లేకపోలేదు. వాడి జుట్టుకూడా రేగి చిందరవందరగా ఉంది. అయినా తొందరపడకూడ దనుకున్నాను.

మాకోసం స్టేషను బయట గుర్రపు బండి సిద్ధంగానే ఉంది.

"నేను నీకోసం స్టేషనుకు రావటంలో ముఖ్యమైన ఉద్దేశం ఒకటి ఉంది. కాబట్టి నీ వెధవ పరధ్యానంమాని నే

చెప్పేది జాగ్రత్తగా విను," అన్నాడు శ్రీనివాసరావు, బండి సాగగానే. "ఒక మనిషి ఆరునెల్లకిందట చచ్చిపోయి మళ్ళా మూడు నెలలకిందట కుక్కఅయి పుట్టాడు!" అని శ్రీనివాసరావు ఆగాడు.

నా అనుమానం దృఢమయింది. నే ననుకున్నంత అయింది కదా అను కున్నాను. ఈ పిచ్చివాడితో నేను ఆరు మైళ్ళు ప్రయాణం చెయ్యాలి. వాణ్ణి బండివాడికీ, నాకూ మధ్య కూర్చో బెట్టటంకూడా మంచిదే ఐంది. ఈరకం పిచ్చి అంటే ప్రమాదకరమయినదని కాదు—ఏళ్ళ పర్యంతమూ బయటపడ కుండా మనిషిని లోలోపల తొలిచే ఉన్మాదం ఇది. చూశారో లేదో, పిచ్చి వాణ్ణి రెచ్చగొట్టటం అమిత అపాయ కరం. అందుకని నేను వాడు చెప్పిన దానికల్లా ఊకొట్టసాగాను.

వాడు ఎరుగుదువు కాదూ!" అన్నాడు శ్రీనివాసరావు. ఆ భాగోతుల పెద్దమనిషి ఎవరో, నేను బుద్ధితక్కువగా స్కూలుకు శలవుపెట్టి బ్రాహ్మణకోడూరు అగ్ర హారం వెళ్ళుతుండటానికీ, ఆ పెద్ద మనిషికీ ఏమి సంబంధమో ఊహించ లేకుండానే, "అవును, అత నిప్పుడు కోడూరులో ఉంటున్నాడా?" అన్నాను.

నే నామాట అనగానే శ్రీనివాస రావులో కలిగిన వికారం వర్ణనాతీతం. వాడి కళ్ళు మరింత ఉన్మాదంగా మెరి సినై. వాడు లేవటానికి కూడా ప్రయత్నం చేశాడు. వాడితలకు బండికప్పు తగిలింది. ఆ తరవాత వాడి ఉద్రేకం కొంచెం ఉపశమించింది కాని పూర్తిగా రహితం కాలేదు.

"చూశావా? ఇదే క్లోరోఫాయు స్పంటే!" అన్నాడు వాడు.

"ఏది?" అన్నాను బండిలోనించి బయటికి తొంగిచూసి.

"ఆదినారాయణ చచ్చిపోయి ఆరు నెల్లయింది. వాడెప్పుడు తిరిగి కుక్కగా పుట్టి మాయింటో ఉన్నాడు! వాణ్ణి చూపించటానికే నిన్ను తీసుకు పోతు న్నాను!"

వాణ్ణి ఈ స్థితిలో మీరు ఊహించు కోవాలే కాని నేను వర్ణించలేను. వాడి రేగిన జుట్టూ, పాలిపోయిన కోల మొహమూ, హాస్యంతో కాక కేవలమూ ఉద్రేకంతో నవ్వుతూ వణుకుతున్న వాడి పెదిమలూ, అన్నిటినీ మించి వెర్రి చూపుతో నిండిన వాడికళ్ళూ—సము ద్రానికి అవతలి మేరకని పెట్టిన కొలంబసు, ఇట్లాగే కనపడి ఉంటాడని ఊహించు కున్నాను. పరీక్ష పాసయిన విద్యార్థులూ, లాటరీలో డబ్బు సంపాదించిన దరి ద్రులూ, ఎదయిన ఆవులూ మొదలైన వస్తువులలో ఉండదగిన లక్షణాలు వాడిలో కనిపించినై. వాడికి పిచ్చిపట్టిం దను కోవటం నాదే పొరపాటు—వాడి

మాదిరిగా ప్రవర్తించే పిచ్చివాళ్ళను నే నెక్కడా చూడలేదు.

"ఇది—ఈ కుక్క—ఆ ఆదినారాయణే నని నీ కెట్లా తెలుసు?" అన్నాను.

శ్రీనివాసరావు కొంచెం తికమక పడ్డాడు.

"అది నేను రుజువు చెయ్యలేను. కాని ఈ కుక్క ఆదినారాయణేనని నాకు తెలుసు." అన్నాడు వాడు చివరకు.

"నీ నమ్మకానికైనా కారణం చెప్పు. ఏదో కారణం ఉండాలిగా!"

"చెబితే నవ్వుతావేమో!" అన్నాడు శ్రీనివాసరావు, నిష్కారణంగా సిగ్గుపడుతూ.

"నీకు తెలిసిందంతా నాకు తెలియక పోతే నేను వచ్చినందుకు ప్రయోజనం ఏముందీ? ఏదో కుక్కను చూపించి 'ఇది ఆదినారాయణ అని నమ్ము' అంటే, 'ఓహో! ఇదా పునర్జన్మ అంటే' అని నే నెట్లా అనగలనూ?"

"ఒకసారి నేను ఈ ఆదినారాయణ శాస్త్రికి పన్నెండువందలు బదులిచ్చాను. వాడడబ్బు తీసుకుంటూ; 'నీ వాకిట్లో కుక్కఅయి పడిఉండి అయినా నీ రుణం తీర్చుకుంటాను, ఖాయి!' అన్నాడు. వాడాబాకీ తీర్చనేలేదు..."

నా కిదంతా చాలా చాదస్తంగా కనపడ్డది.

"ఈ కుక్కవల్ల పునర్జన్మ అనే దాన్ని గురించి శోధన చెయ్యాలంటే మనం ఇంతకంటే కొంచెం శాస్త్రీయమైన మార్గం తొక్కాలేమో!" అన్నాను.

శ్రీనివాసరావు నొచ్చుకున్న వాడల్లే, "నే నందుకే చెప్పనన్నాను...... అసలు నీకు ఈ కుక్క ఆదినారాయణ అయినా ఆకాశరామన్న అయినా ఒకటే. దానికి మనిషికున్న జ్ఞానం ఉంది. దానికి మనం మాట్లాడేది స్పష్టంగా అర్థమవుతుంది. అది కిందటి జన్మలో మనిషి. అవి జ్ఞాపకం పెట్టుకుని మరీ ప్రవర్తించు. దాన్ని ఒకసారయినా చూడందే నీకు నే నెంత చెప్పినా నీ తల కెక్కదు. ఇదంతా ఇప్పుడెందుకు చెబుతున్నానంటే, నువ్వు మా యిల్లుచేరిన తరవాత ఆ కుక్క వింటుండగా దాన్ని గురించి "అదీ, ఇదీ" అనటంగాని, ఇంకేవిధంగా నన్నా అవమానించటంగాని చేస్తే దానికి అర్థమవుతుంది—వ్యవహారం మొదట్లోనే బెడుస్తుంది. అందుకని ఇదంతా చెబుతున్నాను. కావాలంటే జాగర్తగా నువుకూడా గమనించి, నే చెప్పినదంతా నిజం ఔనో కాదో తణిఖీ చెయ్యి!"

ఆ తరవాత బండి వాళ్ళ ఇంటిముందు ఆగేవరకు వాడు కుక్కను గురించి ఏమీమాట్లాడలేదు. బండి కుదుపు జాస్తిగా ఉండటంవల్ల క్రమంగా సంభాషించాలనే ఇచ్ఛకూడా పోయింది నాకు.

"ఆదినారాయణ — అదే, ఈ కుక్కను గురించి నా భార్య దగ్గిరకూడా ఏమీ ప్రస్తావన తీసుకురాకు. ఆవిడకు




"ఆ కుక్క అంటే చెప్పతరంకాని మంట!" అన్నాడు శ్రీనివాసరావు మేమిద్దరమూ ఇంట్లోకి పోతుండగా.

"ఏం? ఆవిడకు పునర్జన్మ విషయమై నమ్మకంలేదా?"

"అదికాదు. ఆవిడకింకా ఆవిషయం తెలియదు. తెలిస్తే దాన్ని చంపేస్తుంది కూడానూ! అది తనవంక మనిషి చూసినట్టు చూస్తుందని ఆవిడికు కోపం. అందుచేత కుక్కను నేను దొడ్లో పాకలో ఉంచుతున్నాను."

తరవాత అయిదు నిమిషాలకు చూశాను కుక్కను. ఆ ప్రథమ దర్శనం నాకు చాలా నిరుత్సాహకరంగా ఉంది. ఎందువల్లనో నేను, ఈ కుక్క అన్ని కుక్కలల్లేనూ ఉండదని భావించాను. బాగా ఆలోచిస్తే అటువంటి భావనకు ఏ మాత్రమూ ఆధారం కనపడదు. అయినా ఇది సామాన్యమైన ఆడకుక్క కడుపున పుట్టిన కుక్కపిల్ల అనిమాత్రం నేను ఊహించలేదు.

అది మొత్తంమీద నల్లనికుక్క, మెడమీదినుంచి ముందు ఎడమకాలిసగం వరకూ వ్యాపించి ఒకటీ, ఎడమకన్ను ప్రాంతాల ఒకటీ తెల్ల మచ్చలున్నై. వెనకకాళ్ళు, కిందిభాగాలు మళ్ళా తెల్లగా ఉన్నై. చూడటానికా కుక్కపిల్ల అంత పుష్టిగానైనాలేదు. దాని శరీరంమీద బొచ్చుకూడా పొట్టిగానూ, అనారోగ్యంగానూఉంది. ఏ మాత్రమూ నిగనిగ

లాడటంలేదు. ఇక అది మామూలు కుక్క కాదనుకోటానికి ఆధారం ఏమైనా ఉంటే దానికళ్ళే. ఆకళ్ళూ ఆచూపూ నేను ఏ కుక్కలోనూ చూడలేదు. నేను దాన్ని సమీపించగానే అది నా వంక "ఎవడు వీడు?" అన్నట్టు ఒక విచిత్రమైనచూపు చూసింది. దాని మొహంమీద కళ్ళ పైభాగంలో మధ్యగా ఉండే చర్మం—మన కనుబొమలు కలుసుకునే నుదుటి భాగానికి సరిపొయ్యేచోట ... ముడతలు పడ్డది. అంతా మనిషి కనుబొమలు ముడేసినట్టే!

"ఇది ఆటే ఆరోగ్యంగా ఉన్నట్టు కనపడదేంరా?" అన్నాను.

శ్రీనివాసరావు నా చెయిగిల్లి రహస్యంగా "ఇది, అనకు!" అన్నాడు. నాకు మండిపోయింది. ఈ వెధవ కుక్క—కిందటి జన్మలో మనిషి అవుగాక! ఎన్ని కుక్కలు కిందటి జన్మలో రాజాధిరాజులో!—దీనికోసం నేను మర్యాదగా ప్రవర్తించాలా?

నేను కోపంగానే దానివంక తిరిగి, "నా మాటలు నీకు అర్థం అవుతున్నాయా?" అన్నాను. అది ముక్కులోనించి చప్పుడయ్యేటట్టు గాలి వదిలి పెదిమలు చప్పరించింది.

"నీ పేరు సుబ్బారావా?" అన్నాను. కుక్క గుర్రుమన్నది.

"ఆదినారాయణ?" అన్నాను, దాని మొహం జాగ్రత్తగా గమనిస్తూ. నమ్మండి. నమ్మకపోండి ఆ కుక్కమనిషి ఆడించినట్టు తల పైకీ కిందికీ ఆడించింది!

ప్రథమ దర్శనంలోనే దాన్ని చూస్తే నాకు దురభిప్రాయం కొంత కలిగి ఉండకపోతే ఆ తల ఆడించడం నాకు పూర్తి నమ్మకం కలిగించి ఉండవలసిందే. అప్పటికీ నా ఆశ్చర్యానికి మేరలేదు. నేను శ్రీనివాసరావు వంక చూశాను. వాడు నవ్వి కుక్కవంక తిరిగి, "వాడింకా నమ్మలేకుండా ఉన్నాడు!" అన్నాడు. వాడామాట అనగానే కుక్క నన్ను చూడటంమాని వాడి దగ్గిరికి వెళ్ళి వెనక కాళ్ళమీద కూర్చుని నాలిక బయటికి చాచి, రొజుతూ నవ్వుతున్న దానల్లే వాడివంక చూడటం మొదలుపెట్టింది.

ఇంకొకడికైతే అప్పటికైనా నమ్మకం దృఢపడేదేమో కాని, అది నా ప్రారబ్ధమే అనండి, అది నాలిక బయటపెట్టి రొజటం మొదలు పెట్టగానే దానిమీద నాకు కలుగుతున్న విశ్వాసం కాస్తా పోయింది. తరవాత క్రమంగా నేనుకూడా నమ్మటం ప్రారంభించానసుకోండి! నమ్మకుండా ఉండటం సులభంకాదు. తెలుగులో ఏ పని చెప్పినా చేస్తుంది—కనీసం చెయ్యగలదు. కాని దానికి ఇష్టంలేని పనులు చెబితే చచ్చినా చెయ్యదు. పైగా గుర్రుమంటుంది. అంత కోపిష్టి ప్రాణిని నే నెక్కడా చూడలేదు. దాన్ని పరీక్ష చెయ్యటానికి ప్రయత్నిస్తున్నామని

తెలిసినా మొండికెత్తుతుంది. దాని పెడ ప్రవర్తనంవల్ల నాకు దానియందు గురి కుదరటం మొదట్లో కొంచెం కష్టమయింది. కాని ఇప్పుడు నమ్మాను. అది ఆదినారాయణ పేర పిలిస్తేనే వినిపించుకుంటుంది. అంతవరకు నేను రుజువివ్వగలను — అయినా ఏ ఆదినారాయణో చెప్పలేం. పైగా ఆదినారాయణ అనే పేరు దానికి మావాడే అలవాటు చేసి ఉండినా ఆశ్చర్యంలేదు. అది నిజంగా కిందటి జన్మలో మనిషే అయిఉంటుందా లేక ఏమనిషి ఆత్మ అయినావచ్చి ఈకుక్క శరీరాన్ని ఆవేశించిందా అన్న సూక్ష్మ విచారణ కూడా నాకు అవసరం లేదు. నా ప్రాణానికి రెండూ ఒకటే. దానికి మనిషికున్నంత జ్ఞానముంది. ఆ జ్ఞానం దీనికి పుట్టిన తరవాత కలిగిఉండటం అసంభవం. అది రెండు మూడు నెలలు దాటని పిల్ల!

కాని నేను చెప్పదగినదీ, మీరు వినదగినదీ ఏమిటంటే నాకా కుక్కమీద నమ్మకం కుదిరినా మా శ్రీనివాసరావుకు కుదిరినట్టు భక్తి కుదరలేదు. అది సామాన్యపుకుక్క కాకపోవచ్చు కాని, సామాన్యపు మనిషికంటే ఎక్కువమాత్రం కాదు. కిందటి జన్మలో అది ఎవరోకాని, ఆమనిషితో నాకు పరిచయం అయిఉంటే అతనికీ నాకూ స్నేహం అయిఉండదు. ఈ కుక్కకూ నాకూ ఒక్క రవ్వయినా మనస్సులు కలవలేదు. ఆ కుక్క అతిశయమూ అహంకారమూ నే సహించలేక పొయ్యేవాణ్ణి. దానికి మనిషి కున్న జ్ఞానం ఉందని నాకు తెలుసునని దానికి తెలుసును. తన్ను మెచ్చుకరమూ నెత్తిన పెట్టుకు ఊరేగించకపోతే దానికి కోపం. దాని "వానిటీ" మావాడు తృప్తిపరిచేవాడు. నేను దాన్ని నిర్లక్ష్యంగా చూసేవాణ్ణి. పైగా దాని "ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు" నేను అసలే సహించలేక పొయ్యేవాణ్ణి. దాన్ని గౌరవించినప్పుడల్లా అగౌరవంగా చూస్తున్నావనే; నేను మా సంభాషణలో దాన్నికూడా చేర్చకపోతే మండిపడేది — తనమంట అనేక విధాల చూపించేది.

మావాడికికూడా నా ప్రవర్తన రుచించలేదు. "ఏమిట్రా నీకీ కుక్కలో ఇంకా నమ్మకం కుదరలేదా — లేకపోతే ఏమిటి? దీన్ని డిస్కవరు చేసినప్పటినించీ నాకు పెన్నిధి దొరికినట్టుంది. ఇటువంటి ఫినామినన్ — ఇంత విచిత్రం! — కళ్ళారా చూసికూడా చలించవే! నీకేమీ ఆశ్చర్యంగా లేదా?" అన్నాడు వాడు.

"ఆశ్చర్యం! విపరీతమైన ఆశ్చర్యంగాఉంది. ఇది చూసినప్పటినుంచీ. ఇటువంటి చిత్రాలన్నిటికీ కారణభూతమయిన శక్తిని గురించి నా అభిప్రాయం మరింత భక్తితో కూడుకున్నదయింది. ఆ భక్తి ఈ బీదకుక్కమీద చూపించమంటే నా చాతకాదు. కావాలంటే ఇతర కుక్కలను దీనియందు భక్తితో సంచరించమను.

నాకేమిటి? మనిషిగా మెచ్చుకోలేని వ్యక్తిని కుక్కగా ఎట్లా మెచ్చుకోమంటావు ?" అన్నాను.

"నీలో నిజమైన శోధనోద్రేకం—రిసెర్చి స్పిరిటు—లేదుపో !" అన్నాడు మావాడు. నేను అప్పుడే చూపించిన నిర్లక్ష్యత తరవాత క్రమంగా లోకమంతా చూపించిన సంగతి మావాడు గుర్తించే ఉంటాడనుకుంటాను !...

అవును, తరవాత కొద్దిరోజులకే ఈ కుక్క మావాడి సొత్తుకావటంమాని లోకం సొత్తయింది...

నేను ఆ నాలుగురోజులూ కోడూరులో ఉండి, సోమవారం చీకటితో లేచి స్కూలుకు అందుకున్నాను. మళ్లీ శుక్రవారం సాయంకాలం రమ్మని శ్రీనివాసరావు నన్ను మరీ మరీ అడిగాడు. ఈ లోపల కొంత "మెమొరాండా" కూడా తయారుచేస్తానన్నాడు "ఆదినారాయణ" ను గురించి.

శ్రీనివాసరావు ఒకటి తలిస్తే లోకం ఇంకొకటి తలిచింది. గురువారం నాడే కోడూరు వితంతువులు ఇద్దరు ముగ్గురూ, ఒక తరంగాలు పాడే ఆయనా కలిసి "ఆదినారాయణ" కాలభైరవుడని కని పెట్టారు !...

ఆ వూళ్లో ఒకచోట రోజూ సాయంకాలంపూట భజన జరుగుతూ ఉంటుంది. ఒకనాడు "ఆదినారాయణ" అక్కడికి వెళ్ళి భజన వింటున్నది. భజనచేసే వాళ్ళలో కొందరు కొట్టబోతే గుర్రుమన్నది. ఆ తరంగాలు పాడే ఆయన—తన కొంపలో రోజూ కుర్రవాళ్లను కొడుతూనే ఉంటాడు— ఆ కుక్కకు చేతులెత్తి నమస్కారంచేసి "ఆ శ్రీమన్నారాయణమూర్తే ఇట్లావచ్చి వింటున్నాడు మనస్తోత్రాన్ని ! ఉండనివ్వండి " అన్నాడు.

మరుక్షణమే "ఆదినారాయణ" మంచి ఉపాయం ఆలోచించింది. అది వెంటనే వెళ్ళి దేవుడిపటం ముందు కూర్చుని భజనచేసే వాళ్లవంక "ఇక మీ పని మీరు చెయ్యండి" అన్నట్టు చూచింది.

చిత్రం ఏమిటంటే అందులో ఒక వితంతువుకు ఆ కిందటి రాత్రే శ్రీమన్నారాయణుడు కుక్కస్వరూపంతో కనిపించి "నేనువస్తున్నాను, మీభజన మందిరం పావనం చేస్తున్నాను" అన్నాడట. ఆవిడ ఒక్కత్తెకే అటువంటి కల వచ్చివుంటే అదే నమ్మదగిన విషయంగా ఉండిఉండేది కాదేమో కాని, ఇంకో వితంతువుకు కూడా అటువంటి కలే రావటంవల్ల మొదటి ఆవిడ కల అబద్ధం అయిఉండటం అసంభవమయింది... అయితే రెండో విధవకు కలలో కనిపించింది, శ్రీమన్నారాయణుడుకాడు. వెంకటేశ్వరస్వామి—నామాలూ, కాళ్ళదాకా ఉత్తరీయమూ, బారెడు రేకు చెప్పులూ! నల్లటి విగ్రహం; ఆ తెల్లటి నామం కాస ఎడమ కంటిమీదికి



ఉన్నట్టూ. తెల్లటి ఉత్తరీయం కుడిభుజం మీద స్పష్టంగా కనిపించినట్టూ, పాదాలు వెండి పాదాలయినట్టూ ఆ రెండో విధపకు స్పష్టంగా కళ్ళకు కట్టినట్టుంది !...

తరవాత కథ నేను చెప్పనక్కర్లేదు మా ప్రాంతాల అందరికీ తెలుసు, ఈ కాలభైరవస్వామి రాకతో కోడూరు పుర వాసులు నాగుమయ్యను కూడా మరిచారు. ఆ రోజు కా రోజు గడిచినకొద్దీ అనేక వేలమందికి కలలో సాక్షాత్కరించి, కోరిన కోరికలు తీర్చసాగారు, అనేక వేలమంది సంతానం లేనివారు స్వామి వారి అనుగ్రహంవల్ల సంతానం కన్నారు అట్లా కన్న స్త్రీని ఒకామెను నేను స్వయంగా ఎరుగుదును. ఆవిడకు సంతు లేని మాటా తరవాత కలిగిన మాటా నిజమేకాని, ఆవిడ స్వామివారిని దర్శించి వచ్చిన తరువాత ఏడునెలలకే కలిగాడు శిశువు !...

భజనమందిరం పూజామందిరంగా మారింది. రోజూ స్వామివారి సాన్నిధ్యంలో వేదపఠనమూ, స్వామికి షోడశ పూజలూ, ఇంకా ఏమిటో ఏమిటో !

చక్కని నుంచం మీద బూరుగదూది పరుపు పరచి, తెల్లని ఇస్త్రీ మడతలు పరిస్తేనేకాని స్వామివారు పడుకోరు. అచ్చ శాకాహారం తప్ప ముట్టరు. ఉదయంపూట కాఫీ ఉప్మాలు సేవిస్తారు.

ఈవిధంగా ఆరునెలలు జయప్రదంగా వెళ్ళింది అకస్మాత్తుగా కాలభైరవుడి ప్రశంస అందరూ మానేశారు....

భగవంతుడైనాసరే మనిషిజన్మఎత్తితే మనిషియొక్క శరీరతత్వమూ గుర్తించి తీరాలి. అక్కడ ప్రకృతికి భిన్నంగా వెళ్ళితే ప్రమాదంవుంది ఈ కుక్కకు అంత వివేకం లేకపోయింది. తనకు అందుబాటులో ఉండేనియమాలు అవ లంభించక అది ఆశకుపోయి, మనిషి మెప్పుకోరి, మనిషి నియమాలు అవ లంబించటంవల్ల దానికి ఒక విధమైన రుగ్మత ప్రారంభమయింది, దాని శరీర తత్వానికి అనుగుణ్యమైన ఆహారం పడలేదు.

దానిలో ఉన్నమనిషి బుద్ధిని కుక్క శరీరం చివరకు జయించనే జయించింది. అది చాటుగావెళ్ళి దానికి కావలసిన ఆహారం దొంగిలించి తినసాగింది. ఒక సారి తనసహజమైన ఆహారాన్ని రుచి చూచినతరవాత దానికీపూజలూ, పున స్కారాలూ, లోకం తనకు ఆరోపించిన కాలభైరవత్వమూ మొదలైన వాటిమీద విముఖత్వం బయలుదేరింది. చేజేతులా ఈ పీడ తెచ్చిపెట్టుకున్నందుకు దానికి చాలా పశ్చాత్తాపం కలిగిఉండాలి తనను పరివేష్టించుకుని ఉండే భక్తసముదాయం మీద దానికి ఆగ్రహం జాస్తి అయింది. వాళ్ళు తన్ను ఒకక్షణం ఏమరిఉండరు. అర్ధరాత్రివేళ తను చడీ చప్పుడూ లేకుండా బయటికి పోతున్నా ఎవడో ఒకభక్తుడు, హాయిగా నిద్రపోతూ ఉండ వలసిన వెధవ, తల ఎత్తి "స్వామీ. ఎక్కడికి?" అని తోడు వస్తాడు.

తను చేతులారా ఇదంతా తెచ్చి పెట్టుకున్న మాటకూడా మరచిపోయి, తనను భక్తులంతా నిర్బంధిస్తున్నారన్న భావం కూడా దానికి కలగటం, నేను సుల భంగా ఊహించగలను. ఆఖరుకు అది ప్రతివాళ్ళమీదా గుర్రుమనసాగింది.

కాలభైరవుడి మనసు సరిగాలేదని అందరూ గ్రహించారు. స్వామికి ఆగ్రహం వచ్చిందన్నారు. దానిచుట్టూ ఇరవైనాలుగు గంటలూ భజనలూ, ఊరంతా సంతర్పణలూ ప్రారంభించారు. ఆకుక్కకు పూర్తిగా వెర్రెత్తిపోయింది. కాలభైరవుకు తన అత్యంత ప్రియ శిష్యుడైన తరంగాలుపాడే పెద్దమనిషి పిక్కపట్టుకుని కండ ఊడేదట్టు పీకిం దన్న వార్త దశదిశలా వ్యాపించింది.

మర్నాడే కాలభైరవుడు అదృశ్యు డైనాడు. కొంతకాలంనుంచీ స్వామి వారు భక్తులపైన ఆగ్రహంగా ఉండ టమూ, ఆఖరుకు అదృశ్యుడు కావటమూ చూసి ఏదో మహాపచారం జరిగిందని

గ్రహించి, భక్తులంతా ఒకరినొకరు అనుమానించసాగారు భక్తులలో అంత కలహాలు బయలుదేరి బహిఃకలహాలూ, తిట్టుకోటాలూ,కొట్టుకోటాలూగా పరిణమించినై.

తరవాత కొన్నిరోజులకు చేబోర్లు గ్రామంలో ఒక బలిసిన, నల్లగా నిగనిగలాడే కుక్క, మరొక ఆడకుక్క వెంటపోతూండటం చూసి, ఒక పెద్ద మనిషి నిర్ఘాంతపోయి నిలబడ్డాడు. కొంత కాలం కిందట ఆయన కోడూరువెళ్ళి కాలభైరవుణ్ణి సందర్శించివచ్చాడు. ఈ కుక్క అచ్చంగా ఆ కాలభైరవుడికి అన్నో తమ్ముడో అన్నట్టుంది. కాలభైరవుడు అదృశ్యమై అప్పటికి వారం రోజులయిందని అయన భార్య చెప్పి ఉండకపోతే, ఆయనకు ఈ కుక్కే కాలభైరవుడా అన్న సందేహం కలిగి ఉండవలసిందే?...

తరవాత తరవాత క్రమంగా చాలా విషయాలు బయటపడినై. మధ్య మధ్య ఈ కుక్క ఎంగిలి విస్తరాకులు నాకటమూ, బొమికలు కొరికి చూడడమూ చూసినవాళ్ళున్నారు. తన వంటయింటో ప్రవేశించి అన్నపు కుండు ఎత్తుకుపోతుంటే ఒక ఇల్లాలు చేతిలోఉన్న కట్టె పేడు విసిరివేసిన తరవాత కాలభైరవుణ్ణి గుర్తించి,అపరాధమని చెంపలు వాయించుకుని ఇదంతా రహస్యంగా దాచిపెట్టింది. కాలభైరవుడు అంతర్ధానం అయిన తరవాత క్రమంగా ఈ కథలన్నీ ప్రవాహంలోకి వచ్చినై....

మొన్న ఈ మధ్యనే శ్రీనివాసరావు మళ్లా నాకు కనిపించాడు. వాడిఎదుట ఈ సంగతి తెస్తే, "ఛా! ఆ వెధవకుక్క సంగతి యెత్తకు! దీనికోసం ఒకరాత్రల్లా వెతికి, మర్నాడు ఉదయం భజనమందిరంలో ఉందని విని చూడపోయినాను. నన్ను చూడగానే బొంయిమని మీదికి వచ్చింది. ఆ తరంగాలు పాడే పీనుగవాడికీ నాకు పడదు, అదంతా చాలా కథ ఉందిలే!— నేను వినేట్టు "స్వామివారికి భక్తులెవరో పతితులెవరో తెలుసూ!" అన్నాడు...

"మొత్తానికి మంచి ఎత్తేవేసింది. దాని బతుకు నాకు తెలుసునని దానికి తెలుసు— వెధవకు!"

దానికి భగవంతుడు ప్రసాదించిన శక్తిని అది వృధా చెయ్యకుండా, ఆ శక్తిని కుక్కల జాతియొక్క మేలుకే ఉపయోగించితే ఆజాతికి చాలా మేలు చేసిన దయ్యే అనుకుంటాను ఈ "ఆదినారాయణ!"



జూలై నెల

# భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి.

వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులో పంపినవి అంగీకరింపబడవు.

మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమానమివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం, ఉత్తరప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు జూన్ 5వ తేదీలోగా చేరాలి. యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చును. ప్రవేశరుసుము లేదు.




ఆఫీసునుండి వస్తూనే, పాంటు జేబులో నుండి ఒక కవరు తీసి పద్మ చేతిలో పెట్టాడు వెంకట్రావు. "ఎక్కడిది?", అన్నట్లు భర్తవేపు ప్రశ్నార్థకంగా చూసింది పద్మ, "చదువు, నీకే తెలుస్తుంది" అంటూ టవలు తీసికొని స్నానానికి వెళ్ళిపోయాడు. "ఎవరు రాసారమ్మా? తాతయ్యగారా?" అంటూ పదేండ్ల గిరిజ పద్మవేపు ఆసక్తిగా చూసింది. "ఏమో! చదవనీ" అంటూ ఉత్తరం విప్పింది పద్మ.

ప్రియమైన అన్నయ్యకి,

ఇక్కడ మేమందరం క్షేమం. అక్కడ మీరందరు క్షేమమనుకుంటాను. చి॥ శైలు ఈ మధ్యనే ఫ్లూ జ్వరంతో బాధపడింది. ఇప్పుడు కులాసాగానేవుంది. అక్కడ చిరంజీవులు గిరిజ, జలజ, రాము కులాసా అనుకుంటాను.

మరి ఒక ముఖ్యమైన విషయం అన్నయ్యా, మీ బావగారిని ఆఫీసువాళ్ళు ట్రెయినింగ్‌కి బొంబే పంపిస్తున్నారు. రెండు నెలలు వుంటారు. ఫామిలీ ప్లానింగ్ ట్రెయినింగ్ కొరకు నేనుకూడ వెళ్ళవలెనని వున్నాను. శైలుతోటే మాకు చిక్కు వచ్చిపడింది. శైలుని ఈ రెండు నెలలు మీ దగ్గరే వుంచుదామని వుంది. అమ్మ దగ్గర అయితే దానికి కంపెనీ వుండదు. అందులో అది మరీ ఫల్లెటూరు. దీనికి అస్తమానం ఏదో ఒక సుస్తీ చేస్తూ వుంటుందాయె. నేను, శైలు ఆదివారం బయలుదేరి అక్కడికి వస్తున్నాము. వదినను అడిగినట్లు చెప్పేది. ఇంతే,

ఇట్లు
మంజుల.

ఉత్తరం చదవడం అవగానే దాన్ని టేబిల్‌మీద పెట్టి, పద్మ భర్తకి కాఫీ తీసుకు రావడానికి లోపలికి వెళ్ళింది. ఉత్సుక తను చంపుకోలేని గిరిజ ఉత్తరం చదవ సాగింది. వెంకట్రావు గదిలోకి రాగానే "నాన్నా! శైలు, అత్తయ్య వస్తారట కదా! శైలు మనింట్లో నే వుండిపో తుందా?" అంటూ ఎంతో అమాయ కంగా, సంతోషంగా అడిగింది. "ఏమో నమ్మా! హోమ్ మినిష్టర్ పర్మిషన్ కావాలిగా ముందు" అంటూ భార్య చేతి లోని గ్లాసు అందుకున్నాడు. "పాపం! అప్పటికి నా మాట జవదాటనట్లు!" పద్మ కొంచెం నిష్ఠురంగానే అంది. ఈ మంజులే తననీ, తన సంసారాన్నీ ఎన్నో తప్పులు పట్టింది. పిల్లలకి క్రమశిక్షణ నేర్పటం తెలీదు అంది. పిల్లలకి సరయిన ఆహారం ఇవ్వడంలేదని చెప్పింది. ఎంతయిన డాక్టరు కదా! ఆవిడలాగ పెంచడం తనకెలా చాతనవు తుంది. అని సరిపెట్టుకుంది పద్మ. కాని ఆ ఎత్తిపొడుపులు, హేళనా పూరిత వాక్కులు పద్మమర్చిపోలేదు. ఒక్కనాడు తన పిల్లలను పిలిచి తన యింట్లో వుంచుకోలేదు. తను వచ్చినా, పట్టుమని పదిరోజులు వుండకుండ తు్రుమనేది. ఇప్పుడు అవసరం తనది కదూ! ఎంతో వినయంగా ఉత్తరం వ్రాసింది "మీరే మంటారు రాణీగారూ!" అన్నాడు వెంకట్రావు పేపరు అందుకుంటూ. "అదేంటండీ! నన్నడుగుతారు? అన్న గారాయె, చెల్లెమ్మాయె! నే నెవర్ని మధ్యన? నేను వద్దంటే మాత్రం ఆవిడ రాకుండా వుంటుందా? మీరు రమ్మన కుండా వుంటారా?". పద్మ జలజని కేకేసి, దాని జడలు విప్పడం మొద లెట్టింది.

"పద్మా! మంజుల పరిస్థితి కూడా కొంచెం ఆలోచించు. అసలే దానికి పిల్ల మీద మమకారం ఒక పాలు ఎక్కువ" "ఆ మాటే అనొద్దంటాను! ఎవరి పిల్లలు ఎవరికి ఎక్కువకాదు.!" "ఆవేశ పడకు మరి! ఒక్కగానొక్క పిల్ల. అందులో

దాని ఆరోగ్యం కూడ అంత మంచిది కాదు ఎటూ వీలుకాని పరిస్థితి. ఒక రెండు నెలలే కదా! మనింట్లో వుండనీ" "ఇప్పుడు నేను కాదన్నానటండీ! ఎటొచ్చీ డాక్టరు మంజులలాగ పిల్లల్ని పెంచడంమాత్రం నాకురాదన్నదిమీరిద్దరు మర్చిపోకండి" జలజ జడకి రిబ్బను బిగిస్తూ అంది పద్మ "ఊ...సరేలే... ఎప్పటి మాటలో పట్టుకుని ఇప్పుడు చెప్పుతున్నావు! అయినా మంజుకి ఎవరున్నారు! మనం తప్ప. మన మీద ఆపేక్షవల్లకాని లేకుంటే దాని కూతుర్ని లక్షవరహాలు పోసినా మనింట్లో వుంచుతుందా?" "సరే! ఆ లక్షవరహాలేవో మీరే ఏరుకుందురుగాని నాకు పనుంది" అంటూ లోపలికి వెళ్ళిపోయింది పద్మ.

తన చెల్లెలు మంజులకి, పద్మకి చాలా విషయాల్లో అభిప్రాయ భేదాలు వున్నవి అన్న విషయం వెంకట్రావుకి తెలియక పోలేదు. కాని ఇంటికొచ్చిన అతిధిని అవమానించేంత కుత్సిత బుద్ధి మాత్రంకాదు పద్మది అన్న నమ్మకమే వెంకట్రావుకి ధైర్యాన్నిచ్చింది.

శైలు వచ్చినందుకు పిల్లలు గంతులేశారు. కలిసిపోయి ఆడుకున్నారు. ఎప్పుడూ హాస్పిటల్ అనే చెల్లెలు, సావకాశంగా ఇంట్లో కూచుని కబుర్లు చెబుతూంటే వెంకట్రావుకి ముచ్చటేసింది. పద్మ కూడ ఆడబడుచుకి ఏలోటు లేకుండ అన్నీ చేసిపెట్టింది. మూడు రోజులు మూడు నిమిషాల్లో కరిగిపోయాయి.

ఆ రోజే మంజుల వెళ్ళేరోజు. శైలు, తీరా తను వెళ్ళేటప్పుడు గోల చేస్తుందేమో అని అన్నయ్యతో పార్కుకి పంపేసింది. ముందుగానే అన్నయ్య దగ్గర వీడ్కోలు తీసుకుంది. పద్మ, మంజుల ఇద్దరు కలిసి స్టేషన్‌కి వచ్చారు. దారిపొడుగునా అప్పగింతలు పెడుతూనే వుంది మంజుల. "వదినా! శైలుకి రోజూ కోడిగ్రుడ్డు. పాలు ఇవ్వు. ప్రొద్దుట టిఫిన్‌కి దానికి బ్రెడ్ అలవాటు. కొద్దిగ టోస్ట్ చేసి ఇవ్వు. నెయ్యి ఎక్కువగా వాడకు" అన్నిటికీ వూకొట్టింది పద్మ. "దానికి అస్తమానం జలుబు చేస్తుంది వదినా! దాని పెట్టెలో స్వెట్టరు, మేజోళ్ళు పెట్టాను, రాత్రిళ్ళు వేసి పడుకోబెట్టు" తనొక్కతే పిల్లను పెంచుతున్నది. చెప్పే కబుర్లు వింటూంటే పద్మకి చిర్రెత్తుకొచ్చింది కాని అనవసరంగా, గొడవెందుకని మౌనంగా వుండిపోయింది. ఆకలికి ఒక టానిక్కు. తిన్నది అరగటానికి ఒక మందు. జ్వరానికి ఒకటి. దగ్గుకొకటి ఇలా ఎన్నోమందుల పేర్లు వ్రాసి ఇచ్చింది మంజుల. మళ్లీ ఏదో గుర్తు పెడుతూంది. పద్మకి చిరాకేసి ప్రయాణీకులకేసి దృష్టి సారించింది. "వదినా! పండ్లరసం, పాలు రెగ్యులర్‌గా ఇవ్వండి. దాని ఖర్చుకి నెలనెలా నేను వంద రూపాయలు పంపుతాను" అంటున్న

మంజుల మాటలకి వులిక్కిపడి ఇటు తిరిగింది పద్మ. కోపంగా తనకేసి చూస్తున్న వదిన చూపులలోని వేడిని గమనించే స్థితిలో లేదు ఆతల్లి ఆతురత. ఇక మాటలు చాలించండి, అంటూ శైలు ముందుకు సాగిపోయింది. వికలమైన మనస్సుతో ఇంటికి వచ్చింది పద్మ.

భర్త వచ్చీ రావడంతోటే అతని మీద విరుచుక పడింది. "ఏమిటి మీ అన్నా చెల్లెంద్ర వుద్దేశం? డబ్బు పంపు తుండట గదా! మీ ముద్దుల చెల్లెలు. ఇదేమైనా పూటకూళ్ళ ఇల్లు అనుకుందా? ఆ సంగతి ముందే తెలిసివుంటే శుభ్రంగా ఏ బోర్డింగ్‌లోనే చేర్పించ మనేదాన్ని" పద్మ కోపంతో, అవమానంతో వుడికి పోతూంది. వెంకట్రావుకి భార్యని చూస్తే జాలేసింది "ఛా..."ఎందుకలా అపార్థం చేసుకుంటావు? పిల్లలు కల వాళ్ళం కదా అని..." "అందుకని ఆవిడ దానంచేస్తే మీరు భిక్ష పట్టారా?" "మంజుల బాధ స్తంగా ఏదో అన్నది నువ్వేం పట్టించు కోకు. అవసరం అయితే వాడుకుందాం. లేదంటే తిప్పిఇద్దాము. భార్యని అనున యిస్తూ అన్నాడు వెంకట్రావు. నా పిల్లలతో బాటు అనుకున్నాను. కాని ఆపిల్లని పేయింగ్‌గెస్టుగా నేను గ్రహించ లేదు. అది మీరూ, మీ చెల్లి గుర్తుంచు కోండి" అంటూ ఆ ప్రసంగాన్ని అంతటితో ఆపేసింది పద్మ.

కాలండర్‌లోని కాయితాలు రెండిటిని తన చిన్నారి చేతుల్తో చింపేసింది నాలు గేండ్ల శైలు. మూడవ కాయితం కేసి చూస్తున్న శైలుతోపద్మ "శైలూ! ఇంక నాలుగైదు రోజుల్లో మీ అమ్మ వచ్చే స్తుంది. అమ్మతో వెళ్ళి అత్తయ్యను మర్చిపోతావు కదూ!" అంది ఊహూ, మమ్మీని కూడ ఇక్కడే వుండ మంటాను" అంది ముద్దుగ శైలు. "నా తల్లే" అంటూ ఎతుకుని ముద్దాడింది పద్మ. "ఏమిటో అత్తాకోడండ్లిద్దరూ మురిసి పోతున్నారు" అంటూ టెలిగ్రాం చేతపట్టుక వచ్చాడు వెంకట్రావు. "మీ కోడలు ఇక్కడే వుండిపోతుందటండీ! అంది పద్మ మళ్ళీ శైలును ముద్దు పెట్టు కుంటూ. "ఇంకెన్నాళ్ళులే ఆ మురిపం! మంజుల రేపు సాయంత్రం వస్తానని టెలిగ్రాం ఇచ్చింది "మమ్మీ వస్తుందా మామయ్యా" అంటూ గంతులేసింది శైలు.

ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్‌లో వస్తున్న మంజుల మనస్సు మహా త్వరితగతి పరుగులు తీస్తూంది. ఈ రెండు నెలలు ఎలా వుందో కాని ఈ రెండు గంట లుండటం కష్టమైపోతూంది మంజులకి. తనకే రెక్కలుంటేనా! శైలు దగ్గర ఈ క్షణం వాలిపోనూ. అనుకుంది మంజుల. ఏం బెంగెట్టుకోలేదు, కులాసా గానే వుంది, అంటూ అన్నయ్య ఉత్త రాలు వ్రాస్తూనే వున్నాడు. కాని మంజుల హృదయం మాత్రం కూతురి కోసరం




కొట్టుకపోయింది. మంజుల భర్త కూడ ప్రయాణమయ్యాడు. కాని లాస్ట్‌మినిట్‌లో మినిష్టర్ ప్రోగ్రాం రావడంతో ఆగి పొయ్యాడు.

స్టేషన్‌లో ఆగీ ఆగకముందే బయట కురికింది మంజుల. కళ్ళు ప్లాట్‌ఫారమ్‌ని అన్వేషిస్తున్నాయి. ఇంతలో "మమ్మీ" అంటూ శైలు పరుగున వచ్చి మంజులని వాటేసుకుంది. వెనకాలే వెంకట్రావు చిరునవ్వుతో వచ్చాడు. వంగి కూతుర్ని అమాంతం ఎత్తుకొని హృదయానికి అదుముకుంది మంజుల. బొద్దుగా, ఆరోగ్యంగా, కళగా వున్న కూతుర్ని ఆప్యాయంగ చూసుకుంది మంజుల. "శైలు వెయిట్‌ని కళ్ళతోనే వే చేస్తున్నట్లున్నావ్" అంటూ దగ్గరగా వచ్చాడు వెంకట్రావు.

"ఓ అన్నయ్యా" అంటూ కూతుర్ని మరింత గట్టిగా హృదయానికి అదుముకుంది.

మంజుల రాకతో ఇంట్లో చెప్పలేనంత హడావిడి. "మమ్మీ. మమ్మీ" అంటూ శైలు నోరు మూత వేయకుండ కబుర్లు చెబుతూంది. ఎప్పుడూ తనవెంట తిరిగే శైలు, అమ్మ కూతురయి పోయింది అని నవ్వుకుంది పద్మ. అందరితోబాటు శైలు కూడ ఇడ్లీలు, రొట్టెలు ఇష్టంగా తింటూంది, ఆకలి అత్తయ్యా! అన్నంపెట్టు అని అడిగి భోంచేస్తూంది. ఆఖరికి చారుఅన్నం అయినా సరే ఎంతో రెలిష్ చేసి కూతురు తినడం మంజులకి ఆశ్చర్యం కలిగించింది. ఇంటి దగ్గర రకరకాల డిష్‌స్‌తో తినమని

బలవంతంచేసినా తినక పోయేది, ఆఖరికి పండ్లరసం. పాలు అయినా బ్రతిమాలి, బెదిరించి ఇవ్వవలసి వచ్చేది కాని ఇక్కడో! అన్నయ్య పిల్లలతోపాటు ఆబగ అన్నము తినేయటం చూస్తే మంజులకి కొంచెం బాధ కూడ అనిపించింది. తానంతగా చెప్పిపోయినా, వీళ్లు తన కూతుర్కి స్పెషల్‌గా ఏమీ ఇవ్వడం లేదు అన్నది స్పష్టమయింది. ఏదయితేనేం తన కూతురు ముందుకన్న కూడ ఆరోగ్యంగావుంది, అని మనసును సరిపెట్టుకో ప్రయత్నించింది. కాని హృదయంలో ఎక్కడో కలుక్కుమంటూనేవుంది. శైలుతో సంతోషంతో కబుర్లు చెబుతూంది. కాని అన్నయ్య, వదినతో మాత్రం కాస్త ముభావంగా వుండిపోయింది.

మంజుల ఊరికి ప్రయాణమవుతూంది. పద్మ అవీ, ఇవీ తినుబండారాలు తయారుచేసింది. చక్కిలాలు, సున్ని వుండలు పెడుతూంటే "ఇవన్నీ ఎవరు తింటా రొదినా!" అంది విసుగ్గా మంజుల. "అదేంటి మంజూ! సున్ని వుండలంటే శైలుకి ప్రాణం" అంది పద్మ. "ఔను, మమ్మీ. భలేగా వుంటాయి. అత్తయ్య రోజూ నాకు నెయ్యివేసి మధ్యాహ్నం పెడుతుంది" అంటూ ఒకటి తీసి నోటిలో వేసుకుంది శైలు. మంజుల మరేమీ మాట్లాడక పెట్టె సర్దుకోసాగింది. శైలుకి పెందలాడే భోజనం పెట్టాను" అంటూ పద్మ దాన్ని చంక నేసుక వెళ్ళింది. జలజ, గిరిజలు శైలు వెంబడే తిరుగుతున్నారు

"మంజూ!" అంటూ వెంకట్రావు చెల్లెలి దగ్గరి కొచ్చాడు. "ఏమిటి?" అన్నట్లు లేచి నించుంది మంజుల. "ఇదిగో నమ్మా! నువ్వు ఈ రెండు నెలలు పంపిన డబ్బు" అంటూ రెండు వంద రూపాయల నోట్లు చెల్లెలి చేతిలో పెట్టాడు. పరధ్యానంగా నడుస్తున్న పాంథునికి పెద్ద ఎదురు దెబ్బ తగిలినట్లయి, మంజుల చివ్వున తలెత్తి చూసింది. చిరునవ్వుతో వెంకట్రావు చెల్లి చేతిలో పెట్టాడు "అన్నయ్యా" అంటూ ఏదో అనబోతున్న మంజులను వారిస్తూ మంజుల చేతిని మూసేశాడు. "అయితే! మీరు నా కోసరం అనవసరంగా అప్పులయినా చేస్తారు కాని నా డబ్బు వాడుకో రన్నమాట" మంజుల కొంచం వుక్రోషంగా అంది. "మంజూ! ఎవరు చెప్పారు నీకు మేము అప్పుల్లో బ్రతుకు తున్నామని. పెద్ద డాక్టరువయితే అయ్యావు కాని నీ చిన్నప్పటి తొందరతనం, అవివేకం ఏమీ పోలేదు. నీ కూతురి పోషణ కోసరం అప్పులు చేసేంత దుస్థితికి ఈ అన్నయ్య ఇంకా రాలేదు. నాతో అంటే అన్నావు కాని మీ వదినతో ఈ మాట అనేవ్, చాలా బాధపడుతుంది" అంటూ వచ్చినంత నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు వెంకట్రావు.




చేతిలో డబ్బుతో నిలబడ్డ మంజులకి చెప్పలేనంత బాధ కలుగసాగింది. ఛీ...ఛీ...తానెంత అహంభావి! ఎంత మూఢురాలు! తన డబ్బు వాళ్ళేదో స్వంతానికి వాడేసుకున్నారని ఎంత కుత్సితంగా ఆలోచించింది. ధన మదాంధకారం అంటే ఇదే కాబోలు. మధ్య తరగతి కుటుంబీకుడు అన్నయ్య అన్న చులకన భావమే కదూ, తనని నెల నెలా డబ్బు పంపించేలా చేసింది. ఎంత మెత్తగ గుణపాఠం చెప్పారు తనకి. అన్నయ్య పిలలు తన రక్తసంబంధీకులే అయినా ఏనాడూ వాళ్ళని దగ్గరికి చేరదీయలేదు అత్తయ్యగా ఆప్యాయత చూపలేదు. ఇంతెందుకు? ఇంతదూరం వస్తూ పసి పిల్లలకి ఏమైనా తెద్దామన్న ఆలోచన అయినా రాలేదు. నెల నెలా పంపిస్తున్నాను కదా అన్న ధీమా కదూ తనది! కాని తన వదినో! తన పిల్లలకన్న ఎక్కువ అనురాగంతో చూసుకుంది తన కూతుర్ని" సిగ్గుతో, అవమానంతో. లజ్జతో చితికి పోసాగింది మంజుల,

"అరే! వుండండర్రా! అత్తయ్యకి చూపనీ" అంటూ పద్మ శైలుని మంజుల దగ్గరికి తెచ్చింది. క్రొత్త లంగా, జాకెట్టులో ముద్దొస్తూంది శైలు. వెనకే పాత బట్టలతోనే వున్నా గిరిజ, జలజలు చిరునవ్వులతో వెలిగిపోతున్నారు. వాళ్ళందర్నీ చూస్తూంటే తానెంత ఆల్పురాలో అర్థమవసాగింది. పద్మ శైలుని దింపి

మళ్ళీ లోపలికి వెళ్ళింది. "మమ్మీ! ఎలా వుంది" అంటూ తన దగ్గరికి వచ్చిన శైలుతోబాటు గిరిజ. జలజలను దగ్గరకు తీసుకుంది మంజుల.

పసుపు. కుంకుమతో బాటు చీర. మంజుల చేతిలో పెట్టింది పద్మ. చీరతో బాటు చటుక్కున వంగి వదిన పాదాలని చేతితో తాకింది మంజుల. ఆడబిడ్డ చేష్టకి ముగ్ధురాలైన పద్మ, మంజులని ఆప్యాయంగా లేవనెత్తింది. మంజుల కండ్లు ధారాపాతంగా వర్షిస్తున్నాయి. "ఛా... ఏంటిది? మంజూ! ఏమయింది" అంటూ పద్మ మంజు కళ్ళు తుడిచింది. "వదినా! నా కూతురి పోషణకి విలువకట్టి డబ్బు పంపానే కాని నీ మాతృ ప్రేమామృతానికి విలువ కట్టలేనమ్మా" అంటున్న మంజులని వారించింది పద్మ. మంజుల ఆవేశాన్ని అర్థం చేసుకుంది. "బాగానే వుందమ్మా నువ్వనేది! అది నీకు కూతురే కాని నాకేమీ కాదా! నా ముగ్గురి పిల్లలతో బాటు అది నాలుగో పిల్ల అయింది. దాని కోసం నేనేం ప్రత్యేకం ఖర్చు పెట్టలేదు. నువ్వు అనవసరంగా నాకేదో గొప్పదనం ఆపాదించకు. ఒంటిత్తుగ వున్న పిల్లేమో. నలుగురిలోకీ వచ్చాక కాస్త వుషారుగా వుండి, ఆరోగ్యంగా వుంది" సామాన్యంగా చెప్పుకపోయింది పద్మ. కాని మంజుల తన ఆవేశాన్ని అరికట్టుకోలేక పోయింది. తన చేతిలోని డబ్బుతీసి మేనగోడళ్ళ దరి చేతిలో పెట్టింది. వారించబోతున్న వదిన్ని అవతలకి నెట్టింది "నా ఇష్టం! నా మేనగోడళ్ళకి నే నిచ్చుకుంటాను. నువ్వు అనవసరంగా జోక్యం కలుగజేసుకోకు" అంటూ గోముగా కసిరింది పద్మని. "అలా అన్నావు బాగుంది. ఎన్నాళ్ళనుంచో కలలు కంటున్నారు కదా, కంచిలంగాలో అంటూ, అత్తపేరు చెప్పి కుట్టించుకోండి, పిల్లలూ!" అని అంటున్న భార్య వేపు అనురాగంగా చూస్తూ వచ్చాడు వెంకట్రావు. "అంతా మీ అమ్మాయిలు పంచు కోవడమేనా! నా కొడుక్కి వాటా ఏది? అన్నాడు కొంటెగా! "కొడుక్కి కోడలే బహుమతి" అంది నవ్వుతూ మంజుల. అందరు గొల్లున నవ్వారు. ఎందుకో అర్థం కాక పోయినా శైలుకూడా నవ్వేసింది.



# స్వయంకృతం

## శ్రీ గోపీచంద్

"ఎక్కడికి ప్రయాణం అవుతున్నావు" అని అడిగాడు గోపాలం, పెట్టె సర్దుకుంటున్న భార్య శ్యామలను చూచి.

శ్యామల మాట్లాడలేదు. రుసరుసమంటూ పెట్టె దభాలున మూసింది. తన భార్య చాలా కోపంగా వుందని అతను గ్రహించాడు. ఇటీవల చీటికీమాటికీ తన భార్యకు కోపం రావటం, చాలా స్వల్ప విషయాలమీద కీచులాడటం జరుగుతూ వుంది. అతనికి చాలా కష్టంగా వుంటూ వుందిగాని ఎంత ఆలోచించినా, ఆమె ప్రవర్తనకు తగిన కారణం అగుపించేది కాదు. అందుకని కాలమే అన్నీ చక్క బరుస్తుందనే విశ్వాసంతో మెదలకుండా ఊరుకుంటున్నాడు.

"మాట్లాడవేం?" అన్నాడు గోపాలం.

"నాకు ఎవరితో మాట్లాడవలసిన అవసరంలేదు. నేను మా అన్నయ్య దగ్గరకు వెళ్ళిపోతున్నాను" అన్నది శ్యామల. అని పెట్టె తీసుకొని బయటకు బయలుదేరింది.

గోపాలం కొరడాదెబ్బ తిన్నట్టు వులిక్కిపడ్డాడు. అతనికి ఒక్క క్షణం ఏమీ అర్థంకాలేదు. కళ్ళయెదుట జరుగుతున్నది నమ్మలేకపోయాడు. తన భార్య, తన శ్యామల తన్ను విడిచి వెళ్ళటమా? ఎందుకు? తనేంచేశాడు! తనతో కాపరం చెయ్యటంకంటే, వీధుల్లో నిరాధరంగా తిరగటమేనయం, అనుకునే బాధ ఆమెకు తనేం కలిగించాడు? ఈ ఆలోచనలన్నీ అతని మనోవీధిలో ఒక్కసారి విరిసినై.

అప్రయత్నంగా "మళ్ళీ ఎప్పుడొస్తావు శ్యామలా?" అని అడిగాడు. అతని కంఠం వొణికింది. రుద్ధమయింది.

ఆ కంఠధ్వనికి రివ్వున వెనక్కి తిరిగింది శ్యామల. కోపంతో ఆమె ముఖం యెర్రబడింది. కట్టలు తెంచుకోటానికి ప్రయత్నిస్తున్న ఆమె ఉద్రేకంతో ఉక్కిరిబిక్కిరి అవుతూవుంది. హృదయం దడదడలాడింది.

"ఇంకా సిగ్గులేక అడుగుతున్నారా? నేను రాను. నా గొంతులో ఊపిరి వుండగా మీ మొహం చూడను. అడుక్కొని అయినా బతుకుతాను గానీ [illegible] వస్తాను......" ఇక వాక్యం పూర్తి చెయ్యలేకపోయింది.

"ఎందుకు నేనేం చేశాను!" అన్నాడు గోపాలం ఆమె నిష్ఠురోక్తులనుంచి తప్పించుకోటానికి, మొహానికి చెయ్యి అడ్డంపెట్టుకొని అడిగాడు. అడగలేదు. తన్ను తానే తిట్టుకున్నాడు. తిట్టుకోవటం కాదు. తన్ను తానే శిక్షించుకున్నాడు.

శ్యామల అతని మానసికస్థితిని అర్థం చేసుకునే స్థితిలో లేదు. తోకతొక్కిన పాములా లేచింది. "ఇంకా ఏం చేశానంటున్నారా? నన్నింట్లో కట్టిపడేసి, దాసీదానికంటే కనాకష్టంగా చూస్తూ, రాత్రింబగళ్లు ఇష్టంవొచ్చినట్టు తిరిగి వొస్తూ...నే నేం మనిషిననుకున్నారా! పశువుననుకున్నారా? చీరెలూ జాకెట్లూ ఇన్ని నా మొహాన వేసి, రోజుకి యింత అన్నం వడ్డిస్తే చాలు అనుకున్నారా, ఇష్టం వొచ్చినట్టు ఆడవొచ్చు అనుకున్నారా? మీవంటి స్వార్థపరులకు, మోసగాళ్ళకు భార్యగా ఉన్నదానికంటే, నాలుగు ఇళ్ళల్లో అంట్లుతోముకొని బ్రతకటం మేలు" అన్నది.

శ్యామల ఇంత దీర్ఘంగా ఇంత ఉద్రేకంగా మాట్లాడినా గోపాలానికి అసలు సంగతి అర్థంకాలేదు. సంభ్రమాశ్చర్యాలతో కళ్ల అప్పగించి వింటున్నాడు. చివరికి గుక్కతిప్పుకొని, "ఏ కెందుకంత కోపం? నేనేం చేశానని? ముందు కారణం చెప్పు" అన్నాడు.

"పిల్లి కళ్ళుమూసుకొని పాలు తాగుతూ, ఎవ్వరూ తన్ను చూట్టంలేదు అనుకుంటుందట? ఈనాలుగు నెలల్నించీ మీ ప్రవర్తన నేను గమనించడంలేదు అనుకున్నారేం? — దాన్దేముంది మొద్దు, అంతగా అనుమానిస్తే 'ఒక జాకెట్టు గుడ్డ కొనిపెడితే అదే సంతోషిస్తుంది' అనుకున్నారే... ఈ నాలుగు నెలల్నించీ మీరు వొక్కపూట ఇంటికి వేళకు వచ్చారూ...రాత్రిళ్లు పన్నెండు గంటల ముందు ఎప్పుడన్నా వొచ్చారూ...?"

శ్యామల గుక్కతిరక్కుండా అతను చేసిన నేరాలు ఏకరువుపెడుతూవుంది. అతడు వినలేక ఇలా అన్నాడు. "నువ్వు లేనిపోనివన్నీ ఊహించుకొని బాధపడుతున్నావు. నాకు ఎన్నిపనులున్నవీ నీకు తెలుసు. కోడూరు గ్రామంలో వరదల వల్ల పంటలన్నీ నష్టపడ్డాయ్. బీదవాళ్లు తలదాచుకోటానికి ఇళ్లూ వాకిళ్లూ లేక, తింటానికి తిండిలేక అల్లాడిపోతున్నారు. వాళ్ళకోసం చందాలు పోగుచేస్తున్నారు. అది నీకు తెలిసివుండికూడా ఇల్లా అనుమానిస్తే నేనేం చెయ్యను. దేశసేవ చెయ్యటంకూడా తప్పే అయిపోయిందా? నువ్వు తెలిసినదానివి..."

"ఇక ఆపండి" అంది శ్యామల. ఈ మాయమాటలు చెప్పే స్థితికి తీసుకు వచ్చారు. దేశసేవ, ఉద్యమాలు అని నన్ను నమ్మించి మీరు యశోదతో తిర గటం యెవ్వరికీ తెలియదు..."

"శ్యామలా !" అని కోపంతో తన్ను తాను మరచిపోయి, రెండడుగులు ముందుకు వేశాడు గోపాలం.

"మీరు చేస్తున్న పనులన్నీ నాకు తెలుసు. ఆ మాటా ఈ మాటా చెప్పి నన్ను ఇంటిలో పెట్టి, ఇష్టంవచ్చినట్లు తిరిగివచ్చి నాకు బూటకం మాటలు చెబు తున్నారు. నేను ఎంత తెలివితక్కువ దాన్నయితేమాత్రం, ఈమాత్రంతెలుసు కోలేను అనుకున్నారా? నన్ను వంటకత్తె కంటే కనాకష్టం చేశారు. మీకు అహో రాత్రులు చాకిరీ జేస్తున్నందుకు కట్టుకో టానికి గుడ్డా, తింటానికి ఇన్ని మెతు కులూ వేస్తున్నారు. ఈ అవమానం నేను భరించలేను. మీ యశోదతో ఇక మీ ఇష్టంవొచ్చినట్లు ఊరేగండి. పార్కులూ, కాఫీహోటళ్లూ, మీటింగులూ అన్నీ వెంటవేసుకొని తిప్పండి" అని పెట్టె తీసుకొని చరచరా వెళ్ళిపోయింది.

గోపాలం తల తిరిగింది. నోట మాట లేదు. అలాగే చతికిలబడ్డాడు గతించిన తమ జీవితం ఒక్కసారి తలలో తిరిగింది.

వివాహానికి ముందునుంచీ తాను రాజ కీయాలలో పని చేస్తున్నాడు. తమ వివాహం ప్రేమ వివాహం. తను పని మీద వెళ్ళినా, ఎంత ఆలస్యం అయినా ఓపిగ్గా కనిపెట్టుకు కూర్చునేది శ్యామల. బయట తన కెన్ని ఆశా భంగాలు కలిగినా, ఎన్ని కష్టాలు వచ్చినా ఇంటికొచ్చాక ఎంతసేపూ శ్యామల పరిచర్యలవల్ల మనస్సు ప్రశాంతంగా ఉండేది. ఆమె తన భార్య అవటంవల్ల అనుకున్నాడు...

ఆమెను గృహానికి రాణిని చెయ్యా లనుకున్నాడు. గృహాన్ని అలంకరించటం మొదలుకొని కూరలు చెయ్యటం వరకు ఆమెకే విడిచిపెట్టాడు. ఏమీ జోక్యం కలిగించుకొనే వాడుకాదు. ఆమె యింటి విషయం ఏదన్నా అడిగితే, 'నీ యిష్టం, ఇంటి విషయాలలో నీకు సర్వ స్వాతంత్ర్యం ఇచ్చాను' అన్నాడు. బైట విషయాలలో తను సర్వస్వతంత్రుడు. బయట విషయాలలో స్త్రీ జోక్యం కలి గించుకోవటం తప్పని అతని దృఢ విశ్వాసం. ఆ భేదం ప్రకృతి భేదం. ఇలా జరుగుతుండగా, ఒకనాడు తన బావమరిది వొచ్చాడు. అతడు మరొక రాజకీయపార్టీకి చెందినవాడు. తన కుటుంబ జీవితం చూచి ఇలా అన్నాడు :

"నీతోపాటు శ్యామలనుకూడా రాజ కీయాల్లో ప్రవేశపెట్టు బావా?"

అప్పుడు తన ఉద్దేశాలన్నీ బావ మరదితో చెప్పాడు.



గ్యు వ

'స్త్రీ స్వాతంత్ర్యం' అంటే స్త్రీ పురుషుడితో పోటీ చెయ్యటం కాదు. జన్మతః స్త్రీకి పురుషుడికి భేదాలున్నాయి. తమ తమ స్వభావాలవల్ల పురుషుడు ప్రజాహిత జీవితానికి, స్త్రీ సంసార జీవితం సరిదిద్దటానికి అర్హులు. కాబట్టి స్త్రీ సంసార జీవితాన్ని, పురుషుడు ప్రజాహిత జీవితాన్ని నడపాలి. అటువంటి దాంపత్యమే ఆదర్శ దాంపత్యం అవుతుంది. లేకపోతే సామరస్యం వుండదు. భార్యాభర్తల మధ్య ద్వేషం ప్రబలిపోతుంది. జీవితం దుర్భరం అవుతుంది. స్త్రీకి జ్ఞానం సంపాదించాలని వుంటే, ఇంట్లోవుండే వార్తాపత్రికలు తెప్పించుకొని చదువుకోవచ్చు. అంతేగాని ప్రజోద్యమాల్లోకి స్త్రీ దిగడం మంచిది కాదు.

ఈ మాటలు విని తన బావమరది, "బావా ఈ నాటికి మీ జీవితం బాగానే వుంది. కానీ క్రమేణా ప్రజోద్యమంలో పాల్గొంటున్న నీవు ఒక రకం సంస్కారాన్నీ, కుటుంబ జీవితానికి ముడిపెట్టుకొని కూర్చున్న శ్యామల మరొక సంస్కారాన్నీ అలవరచుకుంటారు. అప్పుడు సంఘర్షణ తప్పదు. మీజీవితం మామూలు స్త్రీ పురుషుల దాంపత్య జీవితాలకంటే అధోగతిపాలవుతుంది. నా మాట విను. నీ అనుభవంలోకి వచ్చే సాంఘిక జీవనం శ్యామలకు అందుబాటులో వుండేటట్లు చెయ్యి. లేకపోతే ఏనాటికైనా పశ్చాత్తాపంతో మనస్సుని దగ్ధం చేసుకోవలసివొస్తుంది" అన్నాడు.

అప్పుడతని మాటలకు మనస్సులో నవ్వుకున్నాడు. తన బావమరది, స్త్రీ పురుష భేదం లేకుండా రాజకీయాల్లో అందరూ పాల్గొనాలి అని చెప్పే పార్టీకి చెందినవాడు అవటంవల్ల అలా చెబుతున్నాడు అనుకున్నాడు. అలా ప్రవర్తించటంవల్ల ఆ పార్టీమీద మోపబడిన నిందలు, నేరాలూ అప్పుడే ఎలా మరచిపోయాడూ? అని ఆశ్చర్యపడ్డాడు. పాశ్చాత్య నాగరికతను అనుకరించి చెడిపోయారని తేల్చుకున్నాడు.

కాని తను జీవితాన్ని తిరగవేసి చూసుకుంటే తన బావమరది చెప్పినట్లే జరిగింది.

తాను ప్రజోద్యమంలోతిరగటంవల్ల, అనేక అనుభవాలు కలిగినై. అనేక రకాల వ్యక్తులతో పరిచయం ఏర్పడింది. అనేకభావాలు అనుభవంలోకి వొచ్చినై. పర్యవసానం దేశసేవే తనకు సర్వస్వం అయింది. తన సర్వస్వం దేశసేవకు ధారపొయ్యాలనే నిశ్చయం కలిగింది. విశాల హృదయం ఏర్పడింది. అటు కుటుంబజీవితపుహద్దులుదాటనిశ్యామలకు, రోజులు గడిచినకొద్దీ స్వభావం సంకుచితం అవటం మొదలుపెట్టింది. ఆమెకు కుటుంబమే సర్వస్వం. ఆ హద్దుల అవతల అంధకారం, తనకు తను, తన భర్తా; తమ సుఖమే సుఖం అయింది.

ఒకటి రెండుసార్లు ఖర్చు డబ్బు ఎక్కువ ఖర్చు పెడుతున్నాడని తన అయిష్టం తెలియజేసింది.

"దేశం కోసం" అన్నాడు తను. కాని ఆమెకు ఈ జవాబు ఏమాత్రం తృప్తినీ ఇవ్వలేదు. కుటుంబపు సంగతి చూచుకోవాలన్నది. ముందు కుటుంబం, తరువాత దేశం అన్నది. రోజులు గడచినకొద్దీ ఆమె ఇంకా మారిపోయింది. నగలు చేయించమని అడగటం మొదలు పెట్టింది. మొండిచేతులతో, మొండి మెడతో ఉండలేకుండా వున్నానన్నది. పదిమందీ నవ్వుతున్నారన్నది. అయ్యేది యెట్లాగూ సర్వమంగళం అవుతూంది; కట్నంకింద పెళ్ళినాడిచ్చిన పదిఎకరాలు తనపేర పెట్టమన్నది. అదైనా జీవనాధారం అవుతుంది అన్నది.

ఆమె మారుతుందనే ధైర్యంతో తను అన్నీ సహించాడు. తను మారతాడనే నమ్మకంతో ఆమె అతని పనులు కొంత వరకు సహించింది.

కాని ఎవరూ మారలేదు. కుటుంబంలో కీచులాటలు బయలుదేరినై. తను ఖర్చు పెట్టే ప్రతిరూపాయకు పేచీపెట్టటం మొదలుపెట్టింది. కష్టపెట్టటమే ఆమెకు ఆనందాన్నిచ్చేస్థితికి వొచ్చింది.

ఇప్పుడు పులిమీదపుట్ర. తనూ యశోదా కలిసి చందాలు పోగుచేస్తున్న మాట నిజమే! కలిసి పనిచేస్తున్నమాటా నిజమే. కాని—అనఘా—శ్యామల—లిసను గురించి ఇంత నీచంగా ఆలోచిస్తుంది అని కలలోకూడా అనుకోలేదు. ఆమె మారింది. ఆమె జీవితం, ఆమె స్నేహాలూ, ఆమెను పూర్తిగా మార్చినై. ఇప్పుడేం చెయ్యాలి? తనేం చెప్పినా ఆమె నమ్మదు. స్త్రీ పురుషులిద్దరూ నిష్కల్మష హృదయాలతో కలిసి పనిచెయ్యటానికి వీలుందనే విషయం నమ్మటానికి అవసరమైన ఔదార్యం ఇప్పుడామెకు లేదు.

ఏం చెయ్యాలి? తనకూ తన శ్యామలకూ ఋణం తీరినట్టేనా? తను బ్రతికి నన్నాళ్ళూ ఈ కళంకాన్ని మోస్తూ బ్రతకవలసిందేనా?

అతనిలో తృటిలో ఇవన్నీ జ్ఞాపకం వొచ్చినై. దుఃఖంలో వివశుడయ్యాడు. వెంటనే తన బావమరది చెప్పినమాటలు జ్ఞాపకం వొచ్చినై. క్రమేణా ప్రజోద్యమములో పాల్గొంటున్న నీవు వొకరకం సంస్కారాన్ని అలవరచుకుంటావు... అప్పుడు సంఘర్షణ తప్పదు. మీ జీవితం మామూలు స్త్రీ పురుషుల జీవితాలకంటే అధోగతిపాలవుతుంది. నా మాట విను."

ఈ మాటలను జ్ఞాపకం తెచ్చుకొని తప్పంతా తనదే అనుకున్నాడు గోపాలం. కన్నీరు పెట్టుకుంటూ 'స్వయంకృతం' 'స్వయంకృతం' అనుకున్నాడు, గద్గదిక స్వరంతో.

